# విషయానుక్రమణిక


| | |
|---|---|
| పుష్పాంజలి (ఉదయనోదయము)—మానవల్లి రామకృష్ణకవిగారు ... | ౧-౬ |
| అతిథిపూజ—శ్రీ శేషాద్రిరమణ కవులు ... ... ... | ౬-౮ |
| ప్రాచీనాంధ్రకవిత్వలక్షణము—తేకుమళ్ల రాజగోపాలరావు పంతులుగారు ... | ౯-౧౬ |
| ఆంధ్రారణ్యపర్వశేషప్రశంస—కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు ... | ౧౭-౨౫ |
| అభీప్సితము—చెదలవాడ సీతారామాంజనేయులుగారు ... ... | ౨౫ |
| వనకుమారి—గరిగిపాటి రామమూర్తిగారు ... ... ... | ౨౬-౨౮ |
| చూపు—కవికొండల వెంకటరావుగారు ... ... ... ... | ౨౮ |
| భాగవతములోని కొన్నియప్రశస్తములు—'నేలనయ్య' ... ... | ౨౯-౩౨ |
| నవరసంబులు నీవెకా నళిననయన!—మల్లాది చంద్రశేఖరరావుగారు ... | ౩౩ |
| పారిజాతాపహరణ రచనాకాలము—కుందూరి ఈశ్వరదత్తుగారు ... | ౩౪-౩౭ |
| ఉపలాలనము—శ్రీ శివశంకరశాస్త్రిగారు ... ... ... ... | ౩౭ |
| ఋగ్వేదము—అయ్యగారి జోగిసోమయాజిశాస్త్రిగారు ... ... | ౩౮-౩౯ |
| మృతి యన భయపడనేల?—సెట్టి లక్ష్మీనరసింహముగారు ... ... | ౩౯ |
| ఆంధ్రభారతమందలి రాజ్యపద్ధతి—తనికెళ్ల లక్ష్మీనరసింహముగారు ... | ౪౦-౪౮ |
| కవిస్తుతి—గార్లదిన్నె సుబ్బారావుగారు ... ... ... ... | ౪౯ |
| కృష్ణదేవరాయల యాస్థానిలోని కన్నడకవులు—ఆ. రంగస్వామి సరస్వతిగారు | ౫౦-౫౬ |
| పార్వతి యనుతాపము—రాయసం వెంకటశివుడుగారు ... ... | ౫౭-౬౪ |
| కాకతీయాంధ్రలక్ష్మి—సముద్రాల వెంకటరాఘవాచార్యులుగారు ... | ౬౫-౬౬ |
| జైనుల మతకథలు—పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు ... ... | ౬౭-౭౧ |
| కోకిల - ఖద్యోతము—నాదెళ్ల వెంకట్రావుగారు ... ... | ౭౨ |
| ఇంక కావలసినదేమి?—మాడపాటి హనుమంతరావుగారు ... ... | ౭౩-౮౦ |
| ఆశాభంగము—దువ్వూరి సాంబమూర్తిగారు ... ... ... | ౮౦ |
| దివ్యయాత్ర—పెనుమర్తి వెంకటరత్నముగారు ... ... ... | ౮౧-౮౪ |
| తృష్ణాగీతము—విశ్వనాథ సత్యనారాయణగారు ... ... ... | ౮౪ |
| ఒకరోమనుని దేశభక్తి—చిల్లరిగె శ్రీనివాసరావుగారు ... ... | ౮౫-౮౬ |
| ప్రణయగీతములు—భండారు వీరరాజేశ్వరరావుగారు ... ... | ౮౭ |
| ఇరుగుపొరుగు పోరు—పాలపర్తి ఆంజనేయులుగారు ... ... ... | ౮౮-౯౫ |
| బాల—సీరిపి ఆంజనేయులుగారు ... ... ... ... | ౯౬-౯౭ |
| ఆంగ్లసామ్రాజ్యములోని స్త్రీల రాజకీయహక్కులు—దే. ల. నరసింహముగారు | ౯౮-౧౦౩ |
| మాయమ్మమాకిత్తువా—కొ. వెంకటసుబ్బారావు, కా. శివయోగానందరావుగార్లు | ౧౦౩-౧౦౪ |
| వేంగీచాళుక్యులు—మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ... ... ... | ౧౦౫-౧౦౬ |
| అధిక్షేపము—వెలగపూడి దానయ్యచౌదరిగారు ... ... ... | ౧౦౭ |

ప్రాచీనాంధ్రులెవ్వరు? ఆర్యులు కారా?—చిలుకూరి వీరభద్రరావుగారు ... ౧౧౮-౧౨౮
ప్రేమాంజలి—ఎల్లాప్రగడ లక్ష్మీనారాయణగారు ... ... ... ౧౨౯-౧౩౦
రిపువుమను యవ్వనము—యస్. జి. ఆచార్యగారు ... ... ... ౧౩౦
హిందూదేశమున గ్రహారాధనము—నిడుమోలు కనకసుందరంగారు ... ౧౩౧-౧౪౦
కుసుమరత్నమాల—సో. సూర్యనారాయణశర్మగారు ... ... ౧౪౧
మహాసతి సీత—క. రంగనాథశాస్త్రిగారు ... ... ... ౧౪౧
చీనాయందు భారతనాగరికత—శ. రామస్వామి చౌదరిగారు ... ౧౪౨-౧౪౬
ఆస్తికత—మంత్రిప్రెగడ వెంకట హనుమంతరావుగారు ... ... ౧౪౬
నారాయణతీర్థులు—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు .. ... ౧౪౭-౧౪౮
శ్రీ డాక్టరు జయంతి చినకామేశ్వరరావు పంతులుగారు— ... ... ౧౪౯
కీ॥ శే. చిత్తరంజనదాసు (కవితసంగ్రహము)— ... ... ౧౫౦-౧౫౪
,, ,, (పద్యము) శ్రీరాజా వా. దుర్గా సదాశివేశ్వర ప్రసాదబహద్దరుగారు౧౫౪
దేశబంధు చిత్తరంజనదాసు నిర్యాణము—తు. సీతారామమూర్తి చౌదరిగారు,
జనమంచి సీతారామస్వామిగారు,నం. శివరావుగారు, రాజా యం. భుజంగ
రావుగారు, చ. కృష్ణమూర్తిగారు, వే. వెంకటకృష్ణ శర్మగారు ... ౧౫౫-౧౫౮
జైనసిద్ధచక్రము—గన్నవరపు సుబ్బరామయ్య ... ... ౧౫౯-౧౬౪
పడవపయనము—బు. తి. నరసింహాచార్యులుగారు ... ... ౧౬౪
గ్రంథవిమర్శనము ... ... ... ... ... ౧౬౫
సాభిప్రాయవిశేషములు ... ... ... ... ... ౧౬౬-౧౭౦

# చిత్రములు

వర్ణచిత్రములు :—[1]పార్వతితపస్సు—చిత్రకారుడు: శ్రీయుత సి. హెచ్. సత్యనారాయణగారు; కీ॥ శే॥ రావుబహాదరు కందుకూరి వీరేశలింగం పంతులుగారు—చిత్రకారుడు: యస్. బాలసుందరంగారు; [2]కీ॥ శే॥ దేశబంధు చిత్తరంజనదాసు.

సాధారణచిత్రములు :—(౧) ధ్వంసమయిన తాడేపల్లి రైల్వేస్టేషను, (౨) కృష్ణాకెనాలు రైల్వేస్టేషను దగ్గర తలక్రిందయిన సామాను రైలుబండి; (3) భగ్నములైన సోడా షాపులు మొదలయినవి—బందరు, (౪) తాడేపల్లిగూడెమునొద్ద తలక్రిందైన రైలుబండ్లు; (౫) ధ్వంసమయిన సీతానగరమందలి వీథియొకటి, (౬) ధ్వంసమయిన నూలు, నేత మిల్లులు—సీతానగరము; (౮-౧౦)ఆంధ్రజాతీయకళాశాలలోధ్వంసమయినభాగములచిత్రములు—ఆంధ్రదేశము—గాలివాన; (16-5-25);[3](౧) కళ్లేపల్లి దేవాలయము,(౨)కళ్లేపల్లి దేవాలయగోపురము; (3) శ్రీకాకుళ దేవాలయగోపురము, (౪) శివగంగ దేవాలయము—బందరు; (౫) చల్లపల్లిలో గల శ్రీ దేవరకోటసంస్థానాధీశ్వరులసౌధము ;(౬)శ్రీకాకుళ దేవాలయము; ఇతరచిత్రములును.

---

౧. సాధారణ చిత్రమునుండి తయారుచేసిన త్రివర్ణచిత్రఫలకములతో నీచిత్రము ముద్రింపబడినది.

౨. సాధారణ ఫోటోనుండి తయారుచేసిన త్రివర్ణచిత్రఫలకములతో నీచిత్రము ముద్రింపబడినది.

3. బందరునివాసులు శ్రీయుత శ్రీరామవీరబ్రహ్మముగారు యీయాయీ చిత్రములను ప్రకటనార్థమంపిరి.—సంపాదకుడు.




చెన్నపట్టణము జూలై ౧౯౨౫

సంపుటము ౨. క్రోధన సంవత్సరము, ఆషాఢమాసము సంఖ్య ౭

# పుష్పాంజలి

మానవల్లి రామకృష్ణకవి గారు

(ఉదయనోదయము)

ఈ గ్రంథము నారనమంత్రి కుమారుఁడగు సూరనచే రచియింపఁబడెను. ఇతనిగురించి "యాంధ్రకవిచరిత్ర పరిశిష్టభాగము"న విస్తరముగాఁ జర్చించియుంటిని. ఇరువదియేడ్గురు కవులచరిత్రము వ్రాసి ముగింపక యుండినభాగమును కం. వీరేశలింగము పంతులవారు చాలవేఁడి పుచ్చుకొనిపోయియు వారి కవులచరిత్రము రెండవ భాగములోఁ జేర్చుకొనుటకుఁ బూర్వమే వారు లోకాంతరగతులగుటచే నాపత్రములేమయ్యెనో తెలియరాదు. కావునఁ జర్వితచర్వణమైనను నారనసూరనగూర్చి మరలఁగొంత ప్రసంగించుచున్నాఁడను. ఈకవి వనమాలివిలాసమును గూడ విరచించెను. అది కొండూరి యక్కయ్యామంత్రి కంకితమీఁబడెను. అది సరసకవితావిలాసితమై, సరళరచనాబంధురమై యున్నది. దానిలో నాద్యంతములు లేని మూఁడాశ్వాసముల యాదర్శభాగము నాయొద్ద నున్నది. ఆకృతిని గవి తన పూర్వవయస్సులోనే రచించెఁగాఁబోలు.

ఉదయనోదయమై దాశ్వాసముల భాగమే వాసవదత్తా వివాహపర్యంతము లభించుచున్నది. కవి యింక నెంతభాగము రచిం

చెనో యెఱుఁగరాదు. కాని యతని కుమారుఁడు తద్గ్రంథమును ముగింపకయే తనతండ్రి కీర్తిశేషుఁడైనందునఁ దానా గ్రంథమును లోకయమంత్రి కుమారుఁడగు బాచయ కంకితముగ బూర్వపీఠిక రచించెనని చెప్పుకొన్నందునను, ఉదయనోదయ మను నామము ననుసరించి మృగావతీకథయేగాక యుదయనునివివాహ [illegible] మకూడ వర్ణింపఁబడి యుండుటవలనను [illegible] నమంత్రి యంతయే రచించి [illegible] తలంచు చున్నాను.

ఇతని కాలనిర్ణయమును స్మరించుచు వనమాలి విలాసమునుగూర్చి వ్రాసిన వీరేశలింగం పంతులవారు "ఇతఁ డాధునికుఁడని చెప్పుటకుఁ గవికాల నిర్ధారణము చేయుటకుఁ బుస్తకమునం దాధారమేదియుఁ జిక్కలేదు" అని యాధారములు లేనందున నతని నాధునిక కవికోటిలోఁ జేర్చిరి. అదియుఁ జెప్పకుండిన గొంత మేలై యుండునేమో! ఆంధ్ర దేశమునఁ బెక్కండ్రు బాచయలు లేక భాస్కర మంత్రులుండిరి. వారు భిన్నభిన్న శతాబ్దులవారు. వారిలో లోకయ మంత్రికుమారుఁడు బాచయ మాపరిశోధనమునఁ జిక్కినవాఁ డెవ్వఁడును లేఁడు. ఇతఁడు నందవరమున జన్మించిన నియోగి బ్రాహ్మణుఁడు. శ్రీవత్స సగోత్రుఁడు. ముడియము వంశోద్భవుఁడు. ప్రాయశః కొండవీటి సధికారము చెల్లించుచుండిన వాఁడు. వ్యాస మహాయతిరాయల శిష్యుఁడు: బయకార రామచంద్రాధినాథునకుఁ గుడిభుజము వంటివాఁడు- మొదలుగాఁ గృతిపతినిగుఱించి యుదయనోదయమునఁ గలదు.

కవి:—

సీ. కౌండిన్యగోత్ర విఖ్యాతుండు సత్కవి
మాన్యుండు, వారనమంత్రిమణికి
వనితయ [illegible] తనూజుఁడగిప్పా
[illegible] గూననాహ్వయునకు (?)
గారాపుసయిదోడ, నారాయణ పదార
విందసంసేవనా. విమలమతిని,
[illegible] గజరావు [illegible]
[illegible]
[illegible] వక్ర
[illegible]భిరాముండు, బంధులోకాను భావ్య
మానవిభవుండు, నయకళామందిరుండు,
సూరనాఖ్యుండు సత్యసంశోభితుండు.

అని కవియే తన్నుఁగూర్చి పూర్వకృతులలోఁ జెప్పుచున్నట్లు కుమారుఁడు చెప్పుచున్నాఁడు. ఈగ్రంథ మాతృక యబద్ధ పాఠమయ మైనందున యథాశక్తిఁ జరిత్రాంశ భంగము లేకుండునట్లు మే ముదాహరించు చున్నాము.

కృతిపతియగు ముడియముభాస్కరుండు వ్యాసమహాయతిరాయల శిష్యుఁడఁట. ఆ యతివర్యుఁడు కృష్ణరాయలచే నిత్య సమ్మానితుండగుచుండె నని "వ్యాసయోగి చరిత్ర" మను సంస్కృతకావ్యమున నున్నది. రాజుచే రత్నసింహాసనమున యతిరాయలు కనక రత్నాభిషేకగౌరవ మందెనని తెలియుచున్నది. కావునఁ గృతిపతియుఁ గవియును గృష్ణరాయలకాలమువారని చెప్పవచ్చును. వ్యాసరాయలకుఁ దరువాతివారు పెక్కండ్రు తత్పీఠము నెక్కినవారెల్లరును వ్యాసరాయ బిరుదమువహించినందునఁ గాలనిర్ణయమున విప

ర్యాసము కలుగునేమో! ముడియము భాస్కరుని ప్రభువతంసము కొండవీటిని గర్ణాటరాజులయొద్ద సమ్మానముగాఁ బొందిన బయకార రామదండాధినాథుఁడు "కర్ణాట సింహాసన సామ్రాజ్యలక్ష్మీ సార్వభౌమ కారుణ్య లబ్ధ కొండవీటీ ప్రముఖనిఖిల దుర్గాధి పత్యభిరామ బయకారరామప్రధానసుత్రామ సర్వసర్వం సహాభార భరణసంధుక్షణ దక్ష దక్షిణ భుజా స్తంభుండును," "అతఁడు బయకార రామదండాధినాథ! రాజ్యలక్ష్మీ శుకీపద్మరాగ రత్న పంజరాయిత ఘనసార్వభౌమ దీర్ఘ బాహుపీఠుండు లోకేంద్ర భాస్కరుండు", "క. సారతర కొండవీటి మహారాజ్యప్రాజ్యవైభవైశ్వర్యకళాధౌరంధర్యనిరూఢ। శ్రీరామప్రభు కృపావిశేషోన్నతికిన్" అని కృతిపతిని గూర్చి చెప్పఁబడుటచే బయకార రామప్ప కర్ణాటరాజుల సేనానియని తోఁచును.

బయకారశబ్దము వాగ్గేయకార శబ్దార్థమునకు వికృతిరూపమని నేను దలఁచుచున్నాను. వాగ్గేయకార బయకార శబ్దముల నిర్వచించుచుఁ దంజాపురరఘునాథుఁడు తనసంగీత సుధలోఁ బ్రకీర్ణకాధ్యాయ ప్రారంభమున—

"సంగీతశాస్త్రే ప్రథమాధికారీ వాగ్గేయకారః ప్రతిపాద్యతే ప్రాక్, వాచంచ గేయంచ కరోతి యస్మాత్ వాగ్గేయకారః కథితస్తథాఽసౌ, వాక్ఛబ్దపర్యాయతయైవ మాతుః శబ్దః ప్రయుక్తః కిల గీతివిజ్ఞైః, గేయస్యపర్యాయతయాతు ధాతుశబ్దం తథా గీతి విదో వదంతి, బంధం పదానాం ప్రవదంతి మాతుం స్వరేషు సంపర్కముశంతి ధాతుమ్, మాతుం చ ధాతుం చ ద్వయం కరోతి యస్తం విదుశ్చోభయకార సంజ్ఞమ్ తమేవలోకా బయకారనామ్నా వదంత్యపభ్రంశపదేన సర్వే."

అని వాగ్గేయకార శబ్దార్థమే యపభ్రంశమున బయకారశబ్దరూపము దాల్చెనని చెప్పుచున్నాఁడు.

బయకార రామప్పయే వాగ్గేయకార తోడరమల్ల తిమ్మామాత్యనందన రామామాత్యుఁడనియు, స్వరమేళ కళానిధి యను గ్రంథమునకుఁ గర్తయనియు నూహింపవచ్చును. స్వరమేళ కళానిధిలో రామామాత్యుఁడళియ రామరాయలకు మేడ గట్టించి యతనికి గుడిభజమై కొండవీడు మొదలగు దుర్గములయాధిపత్యము సంపాదించెనని చెప్పుకొనియె.

"ఆదాయ తామారచితానుమోదో విచారయామాస స రామ మంత్రీ, స ఏవ పూర్వాధిక కొండవీటి ప్రధానదుర్గ ప్రతిపాదనేన, పూర్వార్ణవేనైవ పవిత్రమూర్తేః ప్రభుత్వ ముర్వ్యాం వితతార మహ్యమ్."

ఈ గ్రంథము క్రీ.శ. ౧౫౫౦లో రచింపబడియె.

గాంధర్వశాస్త్రనేత్తయగు నితఁడు సేనానియై మధురరూకు రసానుభూతిచేవీరశృంగార రసాధిదేవతల స్పర్ధలేక యేలుట యాశ్చర్యమే. కాకతీయగణపతిదేవుని గజసైన్యాధిపతియగు జాయదండాధినాథుఁడును భరత విద్యా నిపుణుఁడనుట ప్రమోదాశ్చర్యములు గొలుపుచుండును.

బయకార రామప్ప తిమ్మయ కుమారుఁడు.

"శ్రీమహిమాస్పద తిమ్మయ రామామాత్య ప్రతిష్ఠ రాజ్యాంగ భరా, క్రామితనిజభుజవిభవోద్దామ శ్రీకేళ (?) బాదసంరాధీశా. (ఉద-II. 1)

స్వరమేళకళానిధికారుఁడగు రామామాత్యుఁడును దిమ్మయనందనుఁడు.

ఇదియునుంగాక బళ్లారి మండలమున జిక్కతిమ్మాపుర, కామసముద్ర తటాక నిర్మాతయగు నొక రామయామాత్యునిశాసనములు రెండుగలవు. తిమ్మాపురము తండ్రి పేరిటను, గామసముద్రము కామమ్మ యను కొమార్తె పేరిటను బుణ్యముగా నొక బయకార రామప్పయ్య కట్టించినట్లు వానిలోఁ గలవు. పరాశరగోత్రజుఁడగు భావయమంత్రికి రామయ్యమంత్రియు, నతనికిఁ బెదతిమ్మయ్యయు, చిన్నతిమ్మమంత్రియు, భాస్కరచమూపతియు, బాచయయుఁ గలిగిరి. బాచయమంత్రి యచ్యుతరాయలవలనఁ గొండవీటి పరిపాలనముఁ బొందెనఁట. రామయభాస్కరుఁడు కొండవీటిలో గోపినాథస్వామికి గోపురముగట్టి యాంధ్రదేశము పరిపాలించెనఁట. పెద్దతిమ్మయ్యకును లక్కాంబకును రామయ్యమంత్రి జనించి ఖ్యాతివడసి యచ్యుతరాయల యనుగ్రహమునఁ గొండవీ డేలుచుండినట్లు ననేకాగ్రహారనిర్మాతయనియు, శా. శకము ౧౪౬౧ కాలమున నచ్యుతరాయలచే నొంటిగోడు, కీడుహళ్లి మొదలగుపురములు వడసినట్లు నాశాసనములలోఁ గలవు. రామయ మంత్రి తిమ్మాపురసమీపమునఁ బదునాఱు చెఱువులు గట్టించెనఁట. వీనివలన రామయమంత్రి భాస్కరునకు నన్నకుమారుఁడే బయకార రామప్పయని తెలుచున్నది. రావిపాటి తిప్పరాజు చాటుధార యని "సరిబేసై రిపుడేల భాస్కరులు" అనుపద్యము నప్పకవి యుదాహరించుట చూడఁగా నది తిప్పరాజు రచించినది కాదో లేక మఱియొక రామయ భాస్కరునిగుఱించి తెలుపునో యెఱుఁగము. ఏలయనఁగా రావిపాటి తిప్పరాజు క్రీడాభిరామమున స్మరింపఁబడియె. కొండవీటి గోపీనాథదేవాలయద్వారప్రాంతమున లిఖింపఁబడిన

"సీ. నిర్మించె నేమంత్రి నిరుపమప్రాకార
నవకంబుగా గోపినాథపురము
గెలిచినా డేమంత్రి లలిత విక్రమమునఁ
బ్రబలుఁడై యవనుల బలము నెల్ల
నిలిపినాఁ డేమంత్రి నియతవైభవమున
గోపికావల్లభు గూర్మివెలయ
బాలించె నేమంత్రి ప్రకటసర్వఖ్యాతి
మహిమమీఱఁగ నాంధ్ర మండలంబు
నతఁడు భూపాలమంత్రీంద్ర సతత వినుత
ధీవిశారదుఁ డచ్యుతదేవరాయ
మాన్యహితవర్తనుఁడు శౌర్యమహిత యశుఁడు
భానుతేజుండు రామయ భాస్కరుండు

బయకార రామప్పకుఁ బినతండ్రి యని తెలుచున్నది.

ఇట్టి ప్రఖ్యాత పురుషసంబంధియగు నీకావ్యము మధ్యకవుల కాలములో రచింపబడినను నించుక ప్రాచీనశైలిఁ జూపట్టుచున్నది. రచనాధోరణి యెఱ్ఱప్రగడ శ్రీనాథుల కాలము స్మరింపఁజేయును. దీనిలోనుండి కొన్ని పద్యము లుదాహరించెదను.

మ. విరహిగ్లానికరంబు భూజనసుఖావేశంబు నానావనీ
తరువల్లీతనుసిద్ధి షట్పదసముత్సాహంబు నిర్జీవిత
స్మరసంజీవన సిద్ధవిద్య పికవాఙ్మౌనవ్రతోద్యాపనం
బరుదెంచెన్ మధుమాస మంచితలతాంతామోదితా
శాంతమై.

సీ. మొకరితుమ్మెద మూతిముట్టని నవకంపుఁ
గ్రొవ్విరుల్ మేలేర్చి కోసికొనుచు
గండుఁగోయిల నోరఁగమిచి త్రుంచని మంచి
చెలునంపు లేఁజొరల్ చిదిమికొనుచుఁ

సముదకీరములు నాసలఁ గ్రుచ్చి మూఁడని
తనికమ్మపండ్లు విదల్చికొనుచు
నొలసి తెమ్మెరలు తావులఁ గ్రుమ్మరింపని
వఱలుపూఁదేనియల్ వడిచికొనుచు
భానుకిరణంబుచే నంటుపడని పుట్టు
కేసరంబుల పుప్పొడి కిసలయంపుఁ
బుట్టిగలఁ బట్టికొనుచు నింపులు సరోర్ప
సమదగజగామినులు కేళి సల్పిరంత.

సీ. చిన్నారిముత్యాల చేరుతోడ లలామ
కంబు నెన్నొసలిపైఁ గదలియాడ
మీఁటినవసకల్చ మెఱుఁగుబుగ్గల మీఁద
మకరకుండల రుచుల్ మలసియాడ
పులిగోటివజ్రాల తళుకుల క్రొమ్మెఱుం
గులు చిన్ని యురముపైఁ గునిసియాడ
పెసరకాయలఁబోలు నెసకంపు నునుఁ బ్రేళ్ల
నుంగరంబుల చాయ లొలసియాడఁ
గటితటంబున మొలనూలి గంటలొలయఁ
నడుగుఁదమ్ముల మువ్వలు నందియలును
జప్పు డొప్పంగ ముంజెఱ తప్పటడుగు
లిడు తనూభవుఁ గనువేడ్క కేదిసాటి

సీ. అంతట నొక్కనాఁ డయ్యిందుముఖిమాత
మకరసంప్రాప్తి యనుమంచి జఱభి
విటులెంపఁ జేఁగోసి విడిచిన ముక్కును
జెవులును భీకరస్థితి ఘటింపఁ
గాముకాహత కళాఘాతజాతములైన
కాయ లంగంబునఁ గలయ మెఱయఁ
గలఁ వేళల సారెఁ గమిచి త్రెంచఁగఁ జీకి
చివికిఁబోయిన తల సీఁదురేఁగఁ
బొలుచు చెలువు శాంత భూతంబు నాసగ్గు
రక్కసనఁగఁ గాళరాత్రి నాఁగ
వివిధవిటుల పేర వేరువిత్తన లెట్టి
కుక్కనాఁగనున్న పక్కరాలు.

ఆ నరనాథపుత్రి యసమాయుధకేతన యష్టి యిందిరా
సూనుని భాగ్యదేవత ప్రసూనశిలీముఖురాజ్యలక్ష్మి శో
భానిధి భాగినేయమతి భావజమోహన బాణశక్తి నాఁ
దానతి కెక్కె సద్గుణనిధానము వాసవదత్త యిమ్మహిన్.

ఈకృతిరత్నము ముద్రితమైనచో నెల్లరకు నుల్లాసకారియగుట నిక్కమయ్యె నాకు మాత్రము ప్రథమదర్శనము ననంత సంతోషమును క్షణకాల పశ్చాత్తాపంబును జనియింప జేసె. బాల్యచాపలంబునను యతిగణ ప్రాస సంవేశన దర్పంబునను మృగావతి యను కావ్యంబు బాల్యంబున రచియించి ముద్రింపించి యుంటి నిమ్మహాకావ్య పఠనంబున మత్కావ్యంబు ముద్రితంబయ్యె మృతనష్ట కల్పంబయ్యును దానికిఁ బునర్మరణంబు కలిగె ననియు నట్లుంగాకున్నను, సమాసన్న మరణ భీతుఁడైన సూరనయర్పించు ప్రౌఢసారస్వతసర్వస్వముకుటాయ మానంబగు నుదయనోదయముతోఁ బాలజల్పిత కలంకితంబును బహుదోషదూషితగహనకంటక లతా కల్పంబును నగు మత్కావ్యంబును బోల్పఁజాలు విమర్శకుల విస్మయకోప సంతాపావధీరణబీభత్సాది వికృతి సంప్లవంబునకుఁ గారణంబయ్యెననియుఁ బలుమఱు సంతపించియుఁ గావ్యరచనా చాపలంబు క్షణభంగురంబగు కీర్తి కాసించినను నిరవధికమగు దుష్కీర్తి నాపాదింపఁజాలె ననియు బహుభంగుల నాకు శోకింపవలసె. ఏలయన మృగావతికథయు నుదయనోదయ కథయు నొక్కటియె. పూర్వకృతి వాసవదత్తావివాహ పర్యంతము కలదు. మత్కృతి యుదయన జననముతో నిలుచుచున్నది. కాని విద్యా సంస్కారమునను, రచనాభ్యాస పాటవమునను, భావనాచమత్కృతి యందును, బహు రసాస్వాద సంపాదిత హృదయవాసనా పరిపాక ముద్రిత భావనాప్రపంచ సహస్రరేఖా

విజృంభణంబునను మిన్నయగు తత్కృతియు నేగుణంబును నించుకయేని లేక యనాస్వాదితానావిష్టవిద్యాలోక ధర్మంబగు మత్కృతియు నేకతులారోపణంబు సేయుటయె విమర్శకులకుఁగుల ప్రతిభంగ కారణంబని యూహింపవలయు. కావ్యనిర్మాణ చపలులకుఁ గలుగు వైషమ్యమును బరిహాసభాజనత్వమును గేవల ముత్తమకావ్య రసాబ్ధిని మజ్జనోన్మజ్జన సుభగులకుఁ బొరయవని యూహించినను దారతమ్యజ్ఞాన సంపాదనంబునకును సహృదయహృదయ సంవదనాపాదనంబునకును వికృతి లేకున్న నిర్ద్వైతమగు ప్రకృతికి సౌందర్యద్యోతనం బెట్లు గలుగనేర్చు ననియు సమాశ్వాసము చేసికొనవలసె.



# అతిథిపూజ

## శ్రీ శేషాద్రి రమణకవులు

అయ్యది రెడ్డిపల్లె యదియే తిలకింపుము కొండవీడు నీ
వెయ్యెడ కేగనెంచితివొ యెల్లి చనందగుఁ బ్రొద్దుగ్రుంకె రా
వయ్య నిశావసానమున నాంధ్రధరావిభుదర్శనంబు నీ
కయ్యెడుఁగాకఁ జేకొనఁగదయ్య దయామతి నాతిథేయముల్. ౧

చ. బడలితి వీవు నీదుముఖపద్మము పూర్తిగ వాడిపోయెఁ గా
రడవులలోన నొంటిగఁ బ్రయాణముఁ జేసినరీతిగాఁ గనం
బడియెడి నీదువేసము కుమారధరామర! నేఁటిరాత్రి మా
గుడిసెను విశ్రమించి యెనగూర్పుము నాకుఁ గృతార్థభావముల్. ౨

ఉ. విచ్చినమల్లెలం దఱిపి వెన్నెలసోనలు జాలువారి పా
టచ్చరభృంగరాజవికటశ్రుతిదూరముగాఁగ నున్నయా
పచ్చికపట్టుచెంతఁ గనుపట్టునదేసుమి నాగృహంబు రా
వచ్చు, వసింపవచ్చు, వినవచ్చును నా 'సొద'లం గుమారకా! 3

క. కల వెన్నొ కొండవాగులు, తలమునుక జలంబుతోడ దరుల నొరయుచుం
గెలకులయి పాఱుచున్నవి, తెలియదు తెలవారుదనుకఁ దీరము నీకున్. ౪

తే. గీ. ఎఱుఁగవే శాస్త్రసూక్తి భూసురకుమార, ఒంటిగా బాటసారి పోనొప్ప నయ్య
చీలుబాటలు పొదలు కంచెలును గలవు, స్వస్తిఁ జెప్పుమి నేఁటిప్రయాణమునకు.

సీ. కట్టనిచ్చెద రెడ్డికన్నియల్ వడికిన, వలిపెంపుఁ దెల్లనివస్త్రములను
భుజియింపనొసఁగెదఁ బుటుకతేనియతోడఁ, బండిన కదళికాఫలచయంబు
శయనింప నొసఁగెద సహజసుందరతావి,రాజితంబగు నాఁపజాతియరుగు
త్రావ నర్పించెద తరుణీసముత్తప్త, చిరకదుష్ణాకరక్షీరధార
తే. గీ. పగటిబడలిక పూర్తిగాఁ బాయువఱకు, మఱల నడువంగఁ దేకువ పొరయువఱకు
విశ్రమింపుము మాకొండవీటియందు, అరుగఁదగు వీలువెంట భూసురకుమార. ౬

చ. చదువుల నారతేరిన యశస్వి అరాతుల బాహుగర్వసం
పద దిగఁద్రావు నేరుపరి **మా**పెదకోమటివేమభూవిభుం
డదను గ్రహించి త్రోవరులకై నెలకొల్పిన సత్రమందో మా
ఒదుకులపాకయందో దయసేయుము గైకొను మాతిథేయమున్. ౭

మ. తల నాడించువిధంబు సారెకును మేధాశక్తి వెచ్చించులీ
లలు నాసాగ్రసమాహితంబయిన దృగ్లక్ష్యంబు వీక్షింపఁగాఁ
బలుకుంబొందిక లుల్లసిల్లఁ గవితాప్రజ్ఞాప్రభావంబులన్
వెలయింపంగలవంచుఁ దోఁచె నిజమున్నే దీనఁ బాంథాగ్రణీ. ౮

తే. గీ. కవివె యగుదేని మారాజు కనికరించుఁ, బండితుండవె యైనచో భాగ్య మిచ్చుఁ
బెద్దకోమటి వేమభూవిభుని వదలి, తప్పదారిని నెచటకుఁ దరలెదోయి. ౯

సీ. కల్పించినాఁ డాంధ్రకవితాలతాంగికి, నాస్థానమంద యుద్యానవనము
గావించినాఁడు వ్యాఖ్యానరూపంబుగా, నమరుకంబునకు రసార్ద్రభిక్ష
చేయించినాఁ డాత్మజీవితంబును భట్ట,బాణునిచే రసబంధురముగ
వెలయించినాఁడు మావిడిసింగరాజును, నిజసభాస్థలిని మంత్రిత్వమందు
తే. గీ. నీవు కవివేని యిచ్చోట నిలువవచ్చుఁ, బండితాగ్రణివైన నిప్పట్టనమున
నెలవు లభియింపవచ్చును నిలువు మిందు, మాట వినిపించుకొమ్ము కుమారవిప్ర.

మ. కఱకుంజాపులపొంకమున్ వ్రణకిణాంకచ్ఛన్నదోర్దండవి
స్ఫురణంబున్ భువనైకమోహనమహాస్ఫూర్తిన్ విడంబించు సుం
దరరూపంబును గల్గి చెల్వెసఁగు నిన్నన్నార వీక్షించుచో
గరడీ నేర్చితివంచుఁ దోఁచె; నిజమే? క్షాత్రప్రభాభాసురా! ౧౧

తే. గీ. అఱుతఁ దెల్లనిజందెంబు హస్తమందు, వంపుగలవేణుదండంబు, వలువలోని[మున.
పదనుగంటంబుఁ గనుగొన్న బ్రాహ్మ్యతేజ,మగుపడఁగదయ్యా! క్షాత్రతేజోఽంతర

ఉ. సాధువు ఘోడెరాయబుధచంద్రునకుం బ్రియశిష్యుఁడైన శ్రీ
నాథుని సత్కవిత్వకలనంబునకున్ ముదమంది తత్కళా
రాధనఁ జేయఁ బిల్చుకొని రమ్మనె వేమవిభుండు నన్ను వి
ద్యాధిపతీ వచింపఁగలవా భవదీయమనోజ్ఞనామమున్. ౧౩

సీ. మొలకమీసంబుల ఝొలుపుచే మోము కళంకసంకలితశశాంకుఁ బోలె
పైఁడిగంటపుటార పదనుకత్తివితాన, గాసెకుఁ జెంగటఁ గానవచ్చె
నిడువాలుగన్నులు నిఖిలాంధ్రసుకవితా, సార్వభౌమత్వంబు సాటుచుండె
శాలివాహనసప్తశతివిధంబునఁ దోఁచె, ముంగేలఁ గనవచ్చు పుస్తకంబు
తే. గీ. మేనిచాయయు బంగారుమిసిమితోడ, నీడుజోడుగ నుండెఁ బెక్కేలనయ్య!
నీవు శ్రీనాథకవివేని నిజముఁ జెప్పి, సత్వరము రమ్ము రెడ్డిసంస్థానమునకు. ౧౪

మ. అనవద్యాత్ముఁడు సంస్కృతాంధ్రకవితావ్యాఖ్యానసంధాన సం
జనితస్వచ్ఛయశోవిశాలుఁడు మహారాజఃపూతకళ్యాణమూ
ర్తి, నితాంతవ్రతుఁడై తనర్చు ఘనునిన్ శ్రీనాథవిద్వత్కవీం
ద్రుని దర్శింపఁగ వేమభూవిభుఁడు జేతోవీథి నాశించెడిన్. ౧౫

క. సంతానసాగరమునకుఁ, జెంత శిలాశాసనము రచింపఁ దలఁచి వా
క్కాంతుని శ్రీనాథుని భూ, కాంతుఁడు గొనితేరఁ బంపెఁ గావ్యరసజ్ఞా. ౧౬

మ. అని యీరీతిని రెడ్డిఱేఁడొకఁడు సౌహార్దంబు దీపింప నె
వ్వనినో గాంచి వచించుచుండె, నపు డప్పర్యంతభూభాగమం
దున 'శ్రీనాథ నమోస్తుతే' యనుమృదూక్తుల్ వెల్వడెన్; బాటసా
రి నను బిల్చెద రెవ్వ రిందనుచుఁ దార్చెం జూపు లాశాతతిన్. ౧౭

తే. గీ. చెంత యాలయముననున్న చిగురుబోఁడి, బెదరుచూపులతోఁ జూచె విప్రవరుని
ఆత్మవృత్తంబు బహిరంగమయ్యె నంచుఁ, దలఁచి శ్రీనాథుఁ డించుక తలఁ గదల్చె.

ఉ. కట్టినకావివస్త్రమునఁ గాసెను జక్కఁగ దిద్ది, రెడ్డిఱేఁ
డట్టెఁ గవీంద్రుఁ గౌఁగిటఁ బ్రియంబలరం బిగియించె బౌసకున్
బట్టముఁ గట్టుకోఁదగిన ప్రాజ్ఞుఁడ వీవనె; వేమభూపుఁడున్
బట్టపుటేన్గునెక్కి కవివర్యుని గన్గొన వచ్చె నల్లనన్. ౧౮






తేకుమళ్ల రాజగోపాలరావు పంతులుగారు బి. ఏ., యల్. టి., యం. ఆర్. ఏ. యస్.

బందరుపట్టణమునుండి ప్రకటింపఁబడు శ్రీ శారదకు కొన్ని మాసములకు మునుపు "సీసపద్యములు వాని వలనఁ దెలియఁదగు ఛందోవిషయములు" అను శీర్షికతో నేనొక వ్యాసమును వ్రాసియుంటిని. ఆవ్యాసమును నా మిత్రులు కొందఱు ఆదరించి గౌరవించి యీ విషయమున మఱియొకవ్యాసమునుగూడ వ్రాయుటకు నన్నుఁ గోరి కొల్పుటచే నిప్పు డీద్వితీయవ్యాసమునకు నేను గడంగితిని. శారదలోని వ్యాసమునందు ఆంధ్రభాషలో సీసపద్యచ్ఛాయగల యితరపద్యము లనేకములు కలవని నిర్ణయింపఁబడినది. ఈరీతిగా

| | | |
|---|---|---|
| 7 ఇంద్రగణములును | 1 | సూర్యగణమును |
| 7 ,, | 1 | యక్షరమును |
| 6 ,, | 1 | చిన్నగణమును |
| 6 ,, | 1 | యక్షరమును |
| 5 ,, | 1 | చిన్నగణమును |
| 5 ,, | 1 | యక్షరమును |
| 4 ,, | 1 | చిన్నగణమును |
| 4 ,, | 1 | యక్షరమును |
| 4 నే ,, | | కలపద్యములను |

అనేకములను ఆంధ్రభాషయందుఁ జూపుచు వానికి నేనందు లక్ష్యముల నుదాహరించితిని. మఱియు ప్రాచీనాంధ్రమున రెండేసియక్షరముల గణముల కూర్పుతోఁగూడఁ బద్యములు కలవని నిరూపించుచు మనపూర్వకవిత్వముయొక్క స్వభావము నెఱుఁగఁ గోరువారు చంపకోత్పలాదులచే నింపఁబడి, నవీనసంస్కృత సంప్రదాయసిద్ధములై వెలసిన కవిత్వములను దఱచుటవలన నన్నయకుఁ బూర్వ మందుండిన యాంధ్రగ్రంథముల స్వరూపము నెఱుఁగఁజాలరని నుడివితిని.

## సంగీతము

సనాతనాంధ్రచ్ఛందోసంప్రదాయములకును సంగీతమునకును నొక్కవిషయమున నత్యంతసంబంధము కలదు. సంగీతమునందు చరణములు అక్షరపూర్ణములై యుండ నక్కఱలేదు. రాగధోరణిననుసరించి గాయకుఁడు కొన్ని తావులలో నొక యక్షరమునకు దీర్ఘరాగము తీసి సాగదీయును, కొన్నియెడల రెండేసి మూఁడేసి యక్షరములను మెలివెట్టి యుచ్చరించి కాలము సరిపుచ్చియు వలసిన మాత్రలను చేకూర్చుకొనుచుండును. ఆంధ్రచ్ఛందస్సును నిట్టి సంప్రదాయము కలదే. వేదములందును నిట్టి నియమము కలదు. ఆంధ్రమునుండి యొక్క యుదాహరణమును దీసికొందము.

శ్రీరామ । భూపాలుఁ। డు
పట్టాభి
షేకుఁడై। కొలువుండ। గా.

ఇందు మూఁడవగణము "డు" యను నక్షరము. సంస్కృతలక్షణములను బట్టి యిది యేకమాత్ర. కావున నిదిలఘువు. కాని పైచరణమునందు ఈయక్షరమునకు దీర్ఘమీయనిచో రాగధోరణి సరిగా నుండదు. కాఁబట్టి ఆకారమున లఘువయ్యును, స్థానవిశేషముచే నిది గురువగుచున్నది. ఒక్క గురువేకాదు. సాంకేతికములైన పదములు ఛందస్సున దీనికి లేవుగాని యీ డు కారము ఉచ్చారణననుసరించి ప్లుతమును అంతకధికమునుగూడ నగుచున్నది.

ఈక్రింది యుదాహరణమున రెండక్షరములు చేరి యేకమాత్ర యగుచున్నవి.

అప్పడాల। గుజ్జం। ఆముకో। బోతే

ఇందు అప్పడాల అనుదానిని అప్డాల్ అను ధోరణిని చదువవలసి యుండును.

### గణములు

కాఁబట్టి సంస్కృతమునందలి యక్షర గణములు సనాతనాంధ్రచ్ఛందస్సులకుఁ బనికిరావు. సంస్కృతమున

1 గురువునకు ఒక్కటే యక్షరము.

2 లఘువునకు ఒక్కటే యక్షరము.

3 కాని వీనిలక్షణములు వేఱు.

ప్రాచీనకాలపు తెనుఁగున

1 గురువునకు ఒక్కటేయక్షర ముండవచ్చును.

2. లఘువునకు రెండేసియక్షరము లుండవచ్చును.

3. కాని వీనిలక్షణములు వేఱు.

అందువలన గురువులు లఘువులునను సంకేతము ఆంధ్రగణములపట్ల సరియైనయర్థము నీయదు. కాఁబట్టి సనాతనాంధ్రభాషయందలి గురులఘువులకు నూతన పరిభాషను మనము సృష్టింపవలసియున్నది.

సాంస్కృతికులు కన్నడమునందలి కొన్ని గణములకు బ్రహ్మవిష్ణురుద్రసంజ్ఞలను, తెలుఁగునందలి యిట్టి గణములకు సూర్యేంద్రచంద్రసంజ్ఞలను నిడియున్నారు. ఈరీతిగణములను గల్పించు నక్షరములకుఁ దెలుఁగున గో, ఘనశబ్దములను నన్ను వాడనిండు.

### గోఘనలక్షణము

1. ఆ, ఈ, ఊ, ౠ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, ఈ యచ్చులతోఁగూడిన యక్షరములు దీర్ఘములు.

ఉదా:—కా, కీ, కూ, కౄ.

2. అ, ఇ, ఉ, ఋ, ఎ, ఒ— ఈ యచ్చులతోఁ గూడిన యక్షరములు హ్రస్వములు ఉదా-క, కి, కు, కృ.

3. పూర్ణబిందువు, విసర్గము, క్, మ్, న్ మున్నగు అచ్చులేనిపొల్లులు—ఇవి యర్థమాత్ర లనఁబడును.

ఉదా:-ం, ః, క్, న్, ప్, ట్.

4. సంయుక్త పూర్వాక్షరములు అర్థమాత్రతోఁ గూడినవి.

ఉదా:- యుక్త యనునది యుక్, త యగును. అందు యుక్ అనునది అర్థమాత్రతోఁ గూడినది. ప్రాచీనాంధ్ర ఛ్ఛందోనుసారముగా దీనిని యుక్తఅని వ్రాసికొని గణవిభజనము చేయవలెను.

| | |
|---|---|
| సూత్ర—సూత్-ర<br>వర్ణ—వర్-ణ<br>ఆజ్ఞ—ఆజ్-ఞ | తెలుఁగున గీఁటుంచినరీతిని విభజింపవలెను. |

5. అందు గోవు నాలుగురూపములు కలది.

(అ) దీర్ఘాక్షరము గోస్వరూపము—ఉదా: గో, ధీ, భూ

(ఆ) దీర్ఘాక్షరమునుపిదప నొకయర్థమాత్రయును గలది గోస్వరూపము ఉదా: వాక్, భాక్, కాన్

(ఇ) ప్రత్యేకముగా లెక్కింపవలసిన హ్రస్వాక్షరము గోవు. ఉదా: అ, క, మ.

(ఈ) హ్రస్వాక్షరముపిదప నొక యర్థమాత్ర గలది గోవు. ఉదా: భుక్, దృక్, స్పృక్.

ఈనాలుగును గోలక్షణములు.

6. ఘనము నాలుగు రూపములు కలది.

(అ) రెండు హ్రస్వాక్షరములకూటమి ఘనము. ఉదా—ఘన, మన, యతి.

(ఆ) రెండు హ్రస్వాక్షరములును పిదప నొక యర్థమాత్రయుఁ గలది ఘనము. ఉదా—అనన్, కడున్, ఘనమ్.

(ఇ) ఒక హ్రస్వాక్షరమును పిదప నొక దీర్ఘాక్షరమును గలది ఘనము. ఉదా—అదే, వినా, కదా.

(ఈ) ఒక హ్రస్వాక్షరము, నొక దీర్ఘాక్షరము నొక యర్థమాత్రయుఁగలది ఘనము.—సుఖాత్, విశాం, గుణాః.

7. సంస్కృతమునందలి గురువునకుఁ బ్రతిగా తెలుగున గోవును, లఘువునకు బ్రతిగా తెలుఁగున ఘనమును సాంకేతికములు.

8. గోవెప్పుడును ఒకటే యక్షరముకలది. అది గురువో లఘువోయై యుండును. ఘనమునకు రెండేసి యక్షరములుండును. అవి లలమో లగమోయైయుండును.

పూర్వకాలమున గోధనమే ప్రధాన మగుటచే, ఆంధ్రగురువున కుదాహరణమగు గోశబ్దమును, నాంధ్ర లఘువున కుదాహరణమగు ధనశబ్దమును సంప్రదాయవిరుద్ధములు కాఁజాలవు. ఇంతకును వీని కేదేని నూతన సంకేతము నొకదానిని మనము సృష్టింపక తీఱదు. గోధనశబ్దము లిట్లుపయోగింపఁ బడుచున్నవి.

## గణములు

సంస్కృతగణములకు గురులఘువు లాధారములైనట్లే ఆంధ్రగణములకు గోధనము లాధారమై యున్నవి. ఈక్రిందిపట్టికవలన వానివిశేషముల నెఱుఁగ వచ్చును.-

| సంస్కృతగణములు | | తెలుఁగు గణములు | |
|---|---|---|---|
| U=గురువు. | \|=లఘువు. | U=గోవు | \|=ధనము |
| U U U | మగణము | U U U | మగణి |
| \| U U | యగణము | \| U U | యగణి |
| U \| U | రగణము | U \| U | రగణి |
| \| \| U | సగణము | \| \| U | సగణి |
| U U \| | తగణము | U U \| | తగణి |
| \| U \| | జగణము | \| U \| | జగణి |
| U \| \| | భగణము | U \| \| | భగణి |
| \| \| \| | నగణము | \| \| \| | నగణి. |

తెలుఁగు గణములకు క్రొత్తపేరులను గల్పించుట కంటె సంస్కృతనామముల నొసఁగుటయే మేలగుటచే గోధనములకు సంబంధించిన గణములకు ఇత్వసంకేతమును మాత్ర మిచ్చి భేదమును సూచించితిని.

## 9. తెలుఁగుగణమునకు గణియని పేరు

### గణములు, గణులు

గోధనమూలకమై గణి యనుపేర విలసిల్లు ప్రాచీనాంధ్రగణములకును, నూతనముగా మనభాషలోనికి వచ్చిన సంస్కృత సంప్రదాయసిద్ధములైన గణములకును గల సంబంధమును నిచ్చట వివరింపవలసియున్నది.

## 10. సంస్కృతమున

1. దీర్ఘాక్షరములును—ఉదా. శ్రీ, భూ.
2. విసర్గాంతములును—ఉదా. యః, భూః.
3. పూర్ణానుస్వారయుక్తములును—ఉదా. అం,కం,గం.
4. సంయుక్తవర్ణమునకుఁ బూర్వమందున్న యక్షరములును—ఉదా. యుక్త, సిద్ధి, గురువులు తక్కినవి లఘువులు.

11. ఈ సంకేతమున గోధనములను గురులఘువులకు మార్చు క్రమము నారయుదము.

### గోధనములను గురులఘువులకు మార్చుపట్టికలు

| | లక్షణము | గురువు లేక లఘువులా? | సంస్కృతఫక్కిని దీనిస్వరూపము |
|---|---|---|---|
| గోవు | (అ) దీర్ఘాక్షరము | U | U |
| | (ఆ) దీర్ఘాక్షరమును అర్ధమాత్రయు | U | U |
| | (ఇ) ప్రత్యేకముగా లెక్కించు హ్రస్వము | \| | \| |
| | (ఈ) ప్రత్యేకహ్రస్వమును అర్ధమాత్రయు | U | U |

| | లక్షణము | గురువగునా లఘువగునా? | సంస్కృత స్వరూపము |
|---|---|---|---|
| ధనము | 1. రెండుహ్రస్వాక్షరములు | 2 లఘువులు | \| \| |
| ,, | 2. రెండుహ్రస్వములునొక యర్ధమాత్రయు | 1 లఘువు 1 గురువు | \| U |
| ,, | 3. ఒకహ్రస్వము నొకదీర్ఘము | 1 లఘువు 1 గురువు | \| U |
| ,, | 4. 1 హ్రస్వము, 1 దీర్ఘము 1 అర్ధమాత్ర | 1 లఘువు 1 గురువు | \| U |

కాఁబట్టి గోలక్షణమున గోవునకు

1. ∪

2. ∪

3. |

4. ∪

ఇవి ఏర్పడవచ్చును.

గోవు, సంస్కృతఫక్కిని ఇట్లు గురువో, లఘువో యగును.

ఇట్లే ధనలక్షణమున ధనమునకు

1. | |

2. | ∪

3. | ∪

4. | ∪

ఏర్పడవచ్చును.

ధనము, సంస్కృతఫక్కిని ఇట్లు లలమో, లగమో యగును.

ఈ నియమము ననుసరించి గోధనములు ఏరీతి సంస్కృతగణము లగునో ఈక్రిందిపట్టికవలన దెలియనగును

## శుద్ధాంధ్రఫక్కిని రెండక్షరముల గణములు

| సంస్కృతమున | | శుద్ధాంధ్రమున | | |
|---|---|---|---|---|
| గణము | లక్షణము | గణనామము | లక్షణము | గణిని గురులఘువులకు మార్చుటవలన వచ్చు సంస్కృత గణములు |
| గగము | 2 గురువులు | గగి | 2 గోవులు | ∪∪  ∪ \| |
| లగము | 1 లఘువు 1 గురువు | లగి | 1 ధన 1 గో | \| \| ∪  \| \|−\|  \| ∪∪  \| ∪−\| |
| గలము | 1 గురువు 1 లఘువు | గలి | 1 గో 1 ధన | ∪ \| \|  ∪ \| ∪ |
| లలము | 1 లఘువు 1 గురువు | లలి | 2 ధన | \| \| \| \|  \| ∪ \| \|  \| ∪ \| ∪  \| \| \| |

12. అచ్చతెలుఁగున

గగికి రెండుగోవులు

లగికి 1 ధనమును 1 గోవును

గలికి 1 గోవును 1 ధనమును

లలికి 2 ధనములు.

సంస్కృతసంప్రదాయానుసారముగా

గగి యనునది గగమో లగమోయగుగు.

లగి సగణమో, నగణమో, యగణమో, జగణమో, యగును.

గలికి భగణమో రగణమో యగును

లలి నలమో, జలఘువో, జగురువువో,సగమోయగును.

13. అచ్చ తెలుఁగున

మగణికి మూఁడుగోవులు

యగణికి 1 ధనమును 2 గోవులును

రగణికి 1 గోవును 1 ధనమును 1 గోవును

తగణికి 2 గోవులును 1 ధనమును

సగణికి 2 ధనములును 1 గోవును

జగణికి 1 ధనమును 1 గోవును 1 ధనమును

భగణికి 1 గోవును 2 ధనములును

నగణికి 3 ధనములు

పూర్వపురీతిని వీనినిఁగూడ సంస్కృతమునకు సరిపడునట్లు మార్చవచ్చును.

14. గణముయొక్క అంతమున నుండు గోవు మాత్రమే హ్రస్వాక్షరముగా నుండవచ్చును. గణము యొక్క ఆదిమధ్యమములనుండు గోవెప్పుడును గురువుగానే యుండును.

కఠినతరమైన గోధననిర్ణయము ప్రాచీన సంప్రదాయవిశిష్టమైనది. కాని యిది సాంస్కృతికులకు తేలికగా నుండనందున వారు గోధనములకు సంబంధించిన గణములలోఁ గొన్నింటినిమాత్రమే దీసికొని వానికి బ్రహ్మవిష్ణురుద్రసంజ్ఞలను, సూర్యేంద్రచంద్ర సంజ్ఞలను నొసంగి, ఎట్లో కొన్ని ప్రాచీనపద్యములను తాఱుమాఱుగా తమ వ్రాసిన కర్ణాటాంధ్రచ్ఛందోగ్రంథములందుఁ జేర్చుకొన్నారు.

గోధన సంప్రదాయమునసే గణవిభజన మందఁగల సనాతనాంధ్రపద్యములను గొన్నింటిని ఈదిగువ నుదహరించుచున్నాను.

## పద్యము

డిబ్బా డిబ్బా దీవెలపండగ
నడుమవచ్చు నాగులచవితి.

## గణవిభజనము

| గోవు గోవు | గోవు గోవు | గోవు ఘనము |
|---|---|---|
| డిబ్ బ్బా | డిబ్ బ్బా | దీ వెల |

| గోవు | ఘనము |
|---|---|
| పం | డగ |

| ఘనము గోవు | గోవు గోవు | గోవు ఘనము |
|---|---|---|
| నడు మ | వచ్ చు | నా గుల |

| ఘనము | గోవు |
|---|---|
| చవి | తి |

గోవునకు ౮ ను, ఘనమునకు । యను వాడినచో దీని గణములు

| | | | | |
|---|---|---|---|---|
| ౮౮ | ౮౮ | ౮। | ౮। | గగ, గగ, గల, గల |
| ।౮ | ౮౮ | ౮। | ।౮ | లగ, గగ, గల, లగ |

## మఱియొకపద్యము

ఆలం కాలం కోయ్
చంద్ర ఫాలం కోయ్.

## గణవిభజనము

| గోవు గోవు | గోవు గోవు | గోవు |
|---|---|---|
| ఆ లం | కా లం | కోయ్ |
| గోవు గోవు | గోవు గోవు | గోవు |
| చం ద్ర | ఫా లం | కోయ్ |

## మఱియొకపద్యము

| ఘనము | ఘనము | గోవు | గోవు | గోవు | గోవు | గోవు | గోవు |
|---|---|---|---|---|---|---|---|
| గుడు | గుడు | కుం | చం | గుం | డే | రా | గం |

| గోవు ఘనము | గోవు గోవు | ఘనము గోవు |
|---|---|---|
| పా ములు | పట్ టం | పడగా |

| గోవు గోవు |
|---|
| రా గం |

గోధన నియమము ననుసరించి కొన్ని సనాతనాంధ్రపద్యములకు గణవిభజన మొనర్తము.

1

డిబ్బా। డిబ్బా। దీవెల। పండగ
నడుమ। వచ్చే। నాగుల। చవితీ.

2

అరువుల। సొమ్ముా। బరువుల। చేటూ
తీయా। పెట్టా। తీపుల। చేటూ
అందుల। ఒకటిపోతే। అప్పుల। చేటూ.

3

ఆలం। కాలం। కోయ్
చంద్ర। ఫాలం। కోయ్.

4

గుడుగుడు। కుంచమ్। గుండే। రాగమ్
పాముల। పట్టమ్। పడగా। రాగమ్
అప్పడాల। గుఱ్ఱమ్। ఆడుకోఁ। బోతే
పేపే। గుఱ్ఱమ్। పెండ్లికి। పోతే
నడ్డి। గుఱ్ఱమ్। నాకి। కొస్తే
నీ—। గుఱ్ఱమ్। నీళ్లకు। పోతే
నా—। గుఱ్ఱమ్। పాలకు। పోతే
కత్తెయనా। బద్దెయనా।
వేణ్ణీళ్లా। చన్నీళ్లా.

5

చమ్మ। చక్క—। చారెడేసి। మొగ్గ
అట్లుపో। య్యంగ। ఆలకిం। చంగ
ముత్యాల చమ్మచక్క—మొగ్గలెయ్యంగ
రత్నాల చమ్మచక్క— రంగులెయ్యంగ
పగడాల చమ్మచక్క— పందిరెయ్యంగ
పందిట్లో మాయన్న పెండ్లిసెయ్యంగ

6

ఒప్పుల। కొప్పా। ఒయ్యారి। భామా
పీల। కుచ్చు। వేల। మొగ్గ।
విస్త। రంట। వీన। పుల్ల

సన్న। బియ్యం। చాయ। పప్పు
గూట్లో। రూపాయ్। నీమొగుడు। సిపాయ్.

7

బావా । బావా । బన్నీరు
బావను । పట్టుకు । తన్నేరు
మూల । మంచం । వేశేరు
మూడు । గుద్దులు । గుద్దేరు
పందిరి । మంచం । వేశేరు
పన్దీ । గుద్దులు । గుద్దేరు
నులకా । మంచం । వేశేరు
నూరు । గుద్దులు । గుద్దేరు

8

చందమామరావే జాబిల్లిరావే
కొండెక్కిరావే కోటివేలుతేవే
తేరుమీదరావే తేనెపట్టుతేవే
వెండిగిన్నెలో వెన్నపెట్టుకొని
పసిడిగిన్నెలో పాలుపోసుకొని
(రావే చందమామా మా అబ్బాయితోను నాతోను ఆడు
కొందువు గాని)

9

చిట్లపొట్లకాయ – సీమనెల్లికాయ
............. – గోడమీదపిల్లి
తాతగుజ్జం తన్నుకుపోయె
అవ్వగుజ్జం అడుసులోపోయె
కలుచుకో కామాక్షి

10

తాతా త్తై బొమ్మ లాట
నీవుంది సామాల కోట
కోట చుట్టూ బొమ్మ లాట
కూచుంది కుర్చీల పీట
పీటకిందున్నదీ వరహాలమూట
ఆమూట నాకిస్తె మా దొడ్డమాట

11

నూత్లోనిపాము నున్నన్నిపాము
చాఱచార్లపాము చక్కన్నిపాము

12

ఆ।కాశ్।మం।తా।అల్।లుకు।రా।గా
అడ్।డెత్తు।బియ్।యం।అటి।కకు।రా।గా
కడ।నెడు।బియ్।యం।కా।లుకు।రా।గా
చా।లెడు।బియ్।యం।చక్।కకు।రా।గా
అంద్లో ఓరాజు * ఆడుతూన్తె వుల్నాడ్

13

అట్లో తద్ దోయ్ ఆఱట్ లోయ్
ముద్ద్ పప్ పోయ్ మూడట్ లోయ్
పీటా కిందా పిడికెడు బియ్యం
పిల్ల లాలా జల్ల లాలా కూయ్

14

వానావానా వో*లప్ప వాకిలితిరుగూ వో*లప్ప
కొండమీద కొక్కిరాజు గుండు విఱ్ఱిగిపడె
దానికేం మందు
వేపాకుచేదు వెల్లుల్లిగడ్డ
నూనాయబొడ్డు నూటొక్కధార.

15

కొక్కోలంకా కొడవల్లంకా
లంకాతీసి లామున్ని కొట్టు
ఏకు చెక్క ఎలకిమొగ్గ

16

వెన్నెల కుప్పలు ఘుళ్ళుఘుళ్ళు
పచ్చిబియ్యం పేలాలు.

17

ఉచ్చింత । ఉరితాడు । జానకితాడు ।
జవ్వచ్చి।దాన్నిలో । గవ్వచ్చి

---

* –గీటుంచిన యక్షరములు తేలంబకికి వెనుకటియక్షరముతో కలసిపోవునట్లు చదువవలెను. =రెండు గీతలను సాడిగించి చదువవలెను.

* దీని యుచ్చారణము ఆ ఓలకు మధ్యనుండును.

### 18

చింతాకు చిగురాకు
పన్నిండుకొమ్మల బాలాకు

### * 19

కాళ్లా గజ్జా కంకాళమ్మా
వేగులచుక్కా వెలగామొగ్గా
మొగ్గాకాదు మోదుగనీరూ
నీరూకాదు నిమ్మలవాయ
వాయాకాదు కమ్మరమెట్టు
మెట్టూకాదు మేదరిజబ్బా
జబ్బాకాదు జలారికట్టా
ముత్యంపెట్టి-బైటికిరాదే పందిగొక్కా

### 20

దాసుడుమూతా దంటాకోర్
పిల్లివచ్చే ఎల్లకాచోర్

### 21

ఊయేల జంపాల
మల్లన్న మసిబొగ్గు
కొండమీద కోతి
కోతి...లోమా...అబ్బాయి మూతి

### 22

ఇల్ లరికి ముగ్ గెట్టి
ఆకేసి పీటేసి
పప్ పెట్టి బువ్ వెట్టి
పాలోసి పెరుగోసి
అత్తారింటికి దోవేదం టే
కితకిత కితకితకితకిత

### 23

కాపూ కరణం నావాడైతే
ఎట్లా కొడ్తావ్ కొట్రా మొగడా.

### 24

బిబదిబలాడేవి రెండు దిబ్బెక్కిచూశేవి రెండు.
అందిపుచ్చుకునేవి రెండు ఆల | కించేవిరెండు

### 25 (నవీనము)

బుజబుజరేకులపిల్లుందా బుజ్జారేకులపిల్లుందా
సామీదండలపిల్లుందా సౌభాగ్యమిచ్చిన పిల్లుందా
బుజబుజరేకుల పిల్లుంది బుజ్జారేకులపిల్లుంది
సామీదండల పిల్లుంది సౌభాగ్యమిచ్చిన పిల్లుంది.
బుజరేకులకేం నగలూ బుజ్జారేకుల కేంనగలూ
సామీదండల కేంనగలూ సౌభాగ్య మిచ్చుట కేం నగలూ
బుజబెజరేకులకు రాగిడీ బుడ్డారేకులకు రాగిడీ
సామీదండలకు రాగిడీ సౌభాగ్యమిచ్చిన రాగిడీ
బుజబుజరేకులపిల్లు...(ఇట్లే పెక్కునగలతో ఆట.)

### 26 నవీనము

అనగనగనగనగో రాజూ
ఆరాజు కేడుగురు పెళ్లాలు
కడసారి పెళ్లాం మాయమ్మ
కంది చేలో కన్నాది
ఉలవచేలో ఉగ్గోసి పత్తిచేలో పాలోసి
పాటిమీది గద్దొచ్చి నన్ను పెంచింది
భవతిభిక్షాం దేహి.

### 27

ఆవులు పెయ్యల్ జొచ్చెంబో ఆకిదొడ్డి చొచ్చెంబో
ముత్యాలపందిరికింద మాలింగడిదొడ్డి చొచ్చెంబో
పితకర పితకర మాలింగానీ పిల్లంగోల్లు కదలేనీ
పాలుతాగరా బసవన్నానీ భమిడిమురుగులు కదలేనీ
వెన్నతినరా వెంకన్నానీ వెండిమురుగులు కదలేనీ
అందిపుచ్చుకోవే గౌరమ్మానీ అందెలుమువ్వలు కదలేనీ
పాలుపెట్టె గౌరమ్మానీ పాపిటచేర్లు కదలేసే
తోడుపెట్టె గౌరమ్మానీ థోరి యాలుకదలేనీ

---

* ఈక్రిందివానిని పాఠకులే గణవిభజనమున కనుకూలముగా వ్రాసికొనవచ్చును.

అదుమంద్రిపూత్త మాలింగా ఇదుమంద్రిపూత్త గడపన్నా
అబ్బరివోం దరికొట్టు ఇబ్బరివోం దరికొట్టు
రామన్న లక్ష్మన్న లెక్కమాడు తిద్దారు

28

తప్పట్లోయ్ తాళాలోయ్
దేవుడిగుళ్లో బాజాలోయ్

29

చిన్నిచెన్నెంత్రగద్దు సింగరగారెంత్రగద్దు
తాళ్ళపెళెంత్రగద్దు తామరమొగ్గల్లో.

30

గోడమీదబొమ్మగొలుసులబొమ్మ
వచ్చిపోయేవార్లకి వడ్డించేబొమ్మ.

31

తోడుపాయసంతోడు-తోడితేనీచేయి వేడి
వేడివేడిపాయసంజుఱ్ఱు.జుఱ్ఱితే నీనోరుచుఱ్ఱు
అన్నల్లబంతిక్కతోడు అక్కల్లబంతిక్కతోడు
తోడితే నీ చేయివేడి.

32

చింతకాయ బొంతకాయ చిగురు మామిడికాయ
కొల్లేటివంకాయ కొమ్మ నిమ్మకాయ
జీలుగెలగుంటలో వాలుగులు మేయగా
నరిపూవుపూయగా వక్కపైరాలగా
తాటాకుదబ్బలము కోటవెలుగు
కోటలోనున్నది కుంకుడేనుగుపిల్ల
తరిమితరిమి పొడిచింది తాబేటిపిల్ల.

33

వల్లచెంయ్ గొల్లభామా
ముడ్డితిప్పే ముసలి భామా

34

దిబ్బాలమ్మకి దీపం పెడితే
పన్నిమాగడొచ్చిపడదోసి పోయె

35

గిద్దాగిద్దాగిటుక్కు
గంగాగంగా గటుక్కు
కొడుకలకన్నమ్మకి బుడిగీసులు
తెల్లారినస్తే నీపని లబ్బీసులు

36

పిండిబొమ్మనితెచ్చి పీటపై పెట్టితే
ఆడుబిడ్డతనాన అదిరదిరిపడ్డది

37

ఒక్కాయ్ ఒక్క రెక్కాయిరెట్టి
మూకాయమువ్వ నాక్కాయనంద్తి
అయిదుంబండు ఆరింకతాళ్ళ
ఏడిసబొద్దు ఎనమాకన్ను
తొంబాపరక తొట్టికిలిక్కి
జుట్టుకుతాడు దూలాని కెగదీస్తి






## కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి గారు

(సంపుటము ౨, సంచిక ౬ తరువాయి)

### మెడయతుకు

ఒకచిత్రకారుఁ డొక సుందరస్త్రీ ప్రతిమమును వ్రాయనెంచి ముఖమును మాత్రము వ్రాసి గతింపఁగా దానిని బూర్తిచేయనెంచు మఱియొకచిత్రకారుఁడు ఇది వఱకున్న ముఖముతో కలిపి తుదివఱకు గర చరణాద్యవయవ విశిష్టమైన ప్రతిమను పూర్తిచేయును గాని నడుమ కంఠమును విడచి మిగిలినదానిని పూర్తిచేయునా? అని మనపంతులవారు శంకించిరి. న్యాయముచే నట్లు చేయఁగూడదు కాని కారణాంతరములచేనట్లు చేయవలసివచ్చినది. వాగనుశాసనుఁ డాదినుండి యరణ్యపర్వములో గొంతవఱ కాంధ్రీకరించి హఠాన్మరణము నొందె. అతని హఠాన్మరణము కవిపండితలోకమున భీతిని పుట్టించినది. కాన మిగిలిన వనపర్వశేషమును ముట్టి, భంగము పాలగుటకంటె, దానిని ముట్టకవిడిచి తరువాతిభాగము దెనిగించుట మంచిదనియెంచి, తిక్కనార్యుడు విరాటపర్వము మొదలు మిగిలిన పదునేను పర్వములను దెనిఁగించె. అరణ్యపర్వోత్తరభాగముమాత్రము తెనుంగు కాలేదు. అతుకుకలసినది కాదు. మెడలేని బొమ్మవలెనున్నది. ఈవలనున్న నన్నపార్యుని భాగమును, నావలనున్న తిక్కనార్యునిభాగమునుఁగూడ నడిమిభాగము లేకపోవుటచే నంతగా శోభించుటలేదు. కావుననే యెఱ్ఱనార్యుఁడు తన నృసింహపురాణములో నిట్లు వ్రాసియున్నాఁడు:

ఉ॥ ఉన్నతసంస్కృతాది చతురోక్తి.........
మాంధ్రభాష సుజనోత్సవమొప్పగ నిర్వహించితౌ నన్నయ
భట్ట తిక్క కవినాథులకెక్కిన భక్తి.........

ఈవల నున్న నన్నయ భట్టారకునియందును, నావలనున్న తిక్క కవినాథునందునుగల భక్తిచే నరణ్యపర్వశేషాన్నయమాంధ్రభాష నొనరించితినని జెప్పినాఁడు. ఉభయుల కవిత్వమునకును సంబంధము కలిపి యుభయులయుద్యమమును సార్థకముఁజేయుటకై తానీభాగము వ్రాసినాడు. మఱియును తానరణ్యపర్వశేషమునుపూరించి ప్రబంధపరమేశ్వరబిరుదముకలవాఁడైనట్లుకూడ నిందు లిఖించుకొనినాఁడు. కావున నిది క్రిమికులదష్టపురాణము మాత్రముగాదు. స్వతంత్రకవిత్వముతో కూడిన యొకభాగ విరచనమే.

### ప్రబంధపరమేశ్వర బిరుదముం గూర్చి

శంభుదాసుఁడు చేసిన వనపర్వశేషము చతురోక్తి సమంచితమగు స్వతంత్రకవితోపేతము గావుననే యద్ది యొనరించినందులకాతనికిఁ ప్రబంధపరమేశ్వర బిరుదము వచ్చినది. ఈతని కారణ్యపర్వశేషము వ్రాయుటచేతనే యాబిరుదము వచ్చినదని పెద్దలు చెప్పుచున్నారు. ఇట్లు వీరేశలింగము పంతులవారు చెప్పిరనియు, నయ్యది తప్పనియు మనవీరరాజుపంతులవారు వ్రాసిరి. ఈ బిరుద మరణ్యపర్వశేష మొనరించుటచేతగాక మఱియొకలాగున వచ్చియున్నయెడల నాహేతువేదియో తేలవలెనుకదా! దానిని మనపంతులవారు తేల్చియుండలేదు. వీరేశలింగము పంతులవారు చెప్పినదికాదని మాత్రము నొక్కి వక్కాణించిరి. ప్రబంధశైలిచే నేదియోయొక్క ఘనగ్రంథవిరచన మొనరించినంగదా యాబిరుదము వచ్చును. ఆగ్రంథమేది? పరికించిచూడ నెఱ్ఱనార్యుఁ డొనరించిన గ్రంథములు నాల్గు గాన్పించుచున్నవి. (1) ఆరణ్యపర్వశేషము. (2) నృసింహపురాణము. (3) రామాయణము. (4) హరివంశము. ఈ నాల్గింటిలో నృసింహపురాణమొనరించు నాఁటి కొక్కయరణ్యపర్వ

శేషమును మాత్రమే విరచించినట్లా పురాణ పీఠికవలనఁ దెలియవచ్చుచున్నది. కావున శంభుదాసుని వ్రాఁతలం బట్టియె యీతని గ్రంథములలో నారణ్యపర్వశేషము మొదటిదని తేలుచున్నది. ఈయారణ్యపర్వశేష మొనరించునాఁటికే యీతనికిఁ బ్రబంధపరమేశ్వరబిరుద మున్నదను నెడల నంతకుఁబూర్వ మెదియో ప్రబంధ పరమేశ్వర బిరుదము రాఁదగిన గ్రంథము వ్రాసియుండవలెను గదా! అట్టి గ్రంథ మేదియును గాన్పించుటలేదు. ఈతని కవిత్వమునకు నారణ్యపర్వ శేష భాగపూరణమే ప్రథమ ప్రయత్నమని మన పంతులవారును నిట్లు వ్రాసిరి. "శిథిల భాగ పూరణముతోఁ దనగంటమునకుఁ బదనుగల్గించు కొన్నాఁడు. తరువాత స్వతంత్రగ్రంథరచనమునకుఁ బూనుకొన్నాఁడు." దీనింబట్టి చూడ స్వతంత్రగ్రంథరచనమునకుఁ బూర్వమే గంటమునకుఁ బదనైనపెట్టుకొనక మున్నె యీతనికిఁ "బ్రబంధపరమేశ్వరుఁడ"ను పెద్దబిరుదము వచ్చినదని చెప్పుకొనవలయును. ఇది యుచితమా? ప్రబంధపరమేశ్వరుఁడనునది బిరుదమే కాదందురేమో యన పంతులవారి వ్యాసమది బిరుదమేయని యంగీకరించుచున్నది. ఇంతబిరుదము స్వతంత్రగ్రంథము వ్రాయుటకు పూర్వము చిన్నచిన్న శిథిలభాగ పూరణములైనఁ జేయుటకు మున్నే వచ్చినదనుట యుచితముకాదు. కావున వీరేశలింగము పంతులుగారు తలంచినట్లుగా నరణ్యపర్వశేష మొనరించుటచేతనే ప్రబంధపరమేశ్వరుఁడను బిరుదము వచ్చినదనుట ధర్మము. అట్లుకాదేని యీబిరుదమునకు గతియే కాన్పించుటలేదు. కావున పంతులవారు వ్రాసినది సరికాదు. "నన్నయ తిక్కనలకంటె నెక్కుడు ప్రబంధధోరణియు, నెక్కుడు చమత్కారబంధురతయు నెఱ్ఱనకు లేవు." అని పంతులవారు వ్రాసిరి. ఇది యెందులకు వ్రాసిరో తెలియవచ్చుటలేదు. అరణ్యపర్వశేష మొనరించుటచే నెఱ్ఱనార్యునకుఁ బ్రబంధ పరమేశ్వర బిరుదము వచ్చిన నయ్యది నన్నప తిక్కనలకంటె నెక్కువవాఁడని తెలుపునా? వాగనుశాసనుఁడై నన్నయయును, కవిబ్రహ్మయై తిక్కనయును, ప్రబంధపరమేశ్వరుఁడై యెఱ్ఱనయును భారతరచనముచే విరాజిల్లిరి. వాగనుశాసన బిరుదముకంటెను, కవిబ్రహ్మ బిరుదముకంటెను బ్రబంధపరమేశ్వర బిరుదమెక్కువదికాదు. కావున పంతులవారి యాక్షేపణము సరికాదు. ఏది యెట్లున్నను భారతకవిత్రయములో శంభుదాసుఁడు ప్రబంధపరమేశ్వర బిరుదము కలవాఁడైనాఁడనక తప్పదు. జక్కన మహాకవి— "ఈత్రయిఁ దా ప్రబంధపరమేశ్వరుఁడై నాఁడ"నుటచే భారతశేష విరచనముచేతనే యీబిరుదము వచ్చినట్లు జక్కనాది పూర్వకవులును దలంచినట్లు తేలుచున్నది కాఁబట్టి ప్రబంధ పరమేశ్వరుఁడను ఘనబిరుదము రాఁదగినంత స్వతంత్రకవితాపటుత్వము భారతమున బ్రబంధపరమేశ్వరుఁడు చూపియున్నాఁడని మనము భావింపక తప్పదు.

## కవితా విశేషము

కవితావిశేషముం బరికించిచూడ నారణ్యపర్వమునందలి నన్నయ దనఁబడు పూర్వభాగమునకును నెఱ్ఱన దనఁబడు పరభాగమునకును భేదము కాన్పించుచునే యున్నది. ఈభాగమును విద్వత్కవివరేణ్యు లనేకులు తేల్చియున్నారు. రాజమహేంద్రపురస్థ రాజకీయ కళాశాలా ప్రధానాంధ్రోపాధ్యాయులు విమర్శకాగ్రగణ్యులు నగు శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిలవారు తమ మహాభారతపీఠికలో "ఎట్లయిననేమి? 'శారదరాత్రు'లన్న పద్యము తరువాత నన్నయకవిత్వము కనఁబడదు. కావున నంతవఱకే యితఁడు భారత మాంధ్రీకరించి యుండునని నిర్వివాద పద్ధతి నవలంబింపనగును" అని లిఖించిరి. వీరికి ద్వితీయభాగములో నన్నయకవిత్వము కాన్పించుటలేదు. ఇట్లే విమర్శకశేఖరులగు మ. శతఘంటము వేంకటరంగశాస్త్రిగారు మున్నగువారు సోమయాజి వ్రాఁతంబట్టి నన్నప మూఁడుపర్వములఁ బూర్తిగ విరచించెనను భావముకలవారైనను "స్ఫురదరుణాంశురాగరుచి" మొదలుగాఁగల ద్వితీయభాగము ఎఱ్ఱనకవిత్వమేయనియు నచ్చటినుండి నన్నయకవిత్వ ముత్సన్నమై పోయినదనియుఁ దలంచువారుగ నున్నారు. వీరికా భాగము వాగనుశాసనుని కవిత్వముకంటె భిన్నమై శంభుదాసుని కవిత్వముగ విస్పష్టముగఁ గాన్పించినది.

## పదములకూర్పు

కవిత్వమందలి భేదమారయుటకై మొదటఁజూడఁదగినది పదములకూర్పు. ఈకూర్పులో రెండుభాగములకును భేదము విస్పష్టముగాఁ గాన్పించుచునే యున్నది.

కవులచరిత్రములు వ్రాసినవారును, నాయాకవుల గ్రంథముల ముద్రించి ప్రచురించి వానికిఁ బీఠికల వ్రాసినవారును గూడ నన్నయభాగమునందు మూడువంతులు సంస్కృతపదములును, నొకవంతాంధ్రపదములును గాన్పించుచున్నవనియు, నెఱ్ఱాప్రగడ భాగములో రెండువంతులు సంస్కృతపదములు రెండువంతు లాంధ్రపదములును బొడకట్టుచున్నవనియు, దిక్కనభాగములో మూడువంతులాంధ్రపదములును, నొకవంతు సంస్కృతపదములును నగపడుచున్నవనియుఁ గవిత్రయము వారి కవితాభేదముల వివరించి తెలిపియున్నారు. అరణ్యపర్వములోని పూర్వభాగమందలి పదరచనమునకును పరభాగమునందలి పదరచనమునకును బై విధముగు భేదము పండితలోకమునకుఁ గాన్పించుచున్నది.

## పాకభేదము

మఱియు నన్నపార్యునిది ద్రాక్షాపాకమనియు, *నెఱ్ఱన్నది కదళీపాకమనియు విమర్శకులు భేదము చూపుచున్నారు.

కావున నెఱ్ఱాప్రగడచేసినది స్వతంత్రకవిత్వముతోఁ గూడిన శేషపూరణమే కాని శిథిలాక్షర పూరణము గాదు.

## ఛందోవిషయము

ఛందోవిషయముం బట్టికూడ నీ రెండు భాగములను వేఱువేఱుగ స్వతంత్రముగ వ్రాయఁబడినవని తేలుచున్నది. నన్నయభట్టారకుఁడు మధ్యాక్కరము న్నగు నక్కరల వ్రాయు స్వభావము కలవాఁడు. ఎఱ్ఱనార్యుఁడట్టివాఁడు కాఁడు. ఈమధ్యాక్కరలం గూర్చిన భేదమా యాభాగములలో విస్పష్టముగా గాన్పించుచున్నది. వాగనుశాసనుండు వ్రాసిన యాదిపర్వములో పదునొకండు మధ్యాక్కరలు గాన్పించుచున్నవి. సభాపర్వములో రెండు గాన్పించుచున్నవి. అరణ్య పర్వ ప్రథమభాగములో నిరువదిరెండు గనబడుచున్నవి. మొత్తము మీద 35 కలవు. మ. రా. శ్రీ. గిడుగు సీతాపతిగారు నన్నయకృత భారత-భాగములో 39 మధ్యాక్కరలు కలవని వ్రాసిరి. అచ్చుప్రతుల నొకటి రెంటి నారసి చూడ 35 మాత్రమే గాన్పించుచున్నవి. తక్కినవి నాల్గు ను వ్రాఁత ప్రతులలోనున్నవేమో? కాని యెఱ్ఱాప్రగడదనఁబడు ద్వితీయభాగములో నొక్కటియు గాన్పించుటలేదు. అక్కర లీభాగములో లేనే లేవు. మిక్కిలి చిన్నదియగు సభాపర్వమునఁ గూడ మధ్యాక్కరలఁ జెప్పినట్టియు, వనపర్వపూర్వభాగమున నిరువదిరెండు మధ్యాక్కరలఁ జెప్పినట్టియు శబ్దశాసన మహాశయుఁడే యరణ్యపర్వమందలి ద్వితీయ భాగమునుగూడ వ్రాసినవాఁడగుచో నంత పెద్దభాగమునం దొక్క యక్కరయైనఁ గాన్పింపకుండునా? కాన్పింపకుండదు. ఆతఁడే యరణ్యపర్వద్వితీయ భాగమును వ్రాసియుండిన యెడల ప్రథమభాగములోఁ జెప్పినట్లె దీనియందును మధ్యాక్కరలు వాడియే యుండును. అట్లు లేవు. కావున ద్వితీయ భాగము నన్నయమహాశయునిచే వ్రాయఁబడినది కాదు.

## ద్వితీయభాగమందలి మధ్యాక్కర

శంభుదాసుని దనఁబడు ద్వితీయభాగములో మధ్యాక్కరలు బొత్తుగ లేకపోలేదనియు, నొక్కటి కలదనియుఁ జెప్పుదురా? అయ్యది యుండుట ద్వితీయ భాగకర్త వేఱని ఋజువు చేయుటకే యక్కఱకు వచ్చుచున్నది. నన్నయభట్టారకుని మధ్యాక్కరలకును దీనికిని భేదము కలదు. ఆ మహాశయుఁడు తన ముప్పదియైదు (39) మధ్యాక్కరలయందును నాల్గింటిపై యతి పెట్టియుండఁగా నీద్వితీయ భాగమునందలి మధ్యాక్కరయందు మూఁడింటిపై యతి కాన్పించుచున్నది. కాన ప్రథమభాగమందలి మధ్యాక్కర కర్త వేఱు, ద్వితీయ భాగమందలి మధ్యాక్కర కర్త వేఱునని దీనివలననే రూఢిపడుచున్నది. ప్రథమభాగమునందువలె ద్వితీయ భాగమునందు మధ్యాక్కరలు లేవు కావునను, నున్నదొక్కటియు భిన్నముగా గాన్పించుచున్నది కావునను ద్వితీయ భాగమును వ్రాసిన కవి వేఱని తేలుచున్నది. ప్రబంధపరమేశ్వరుఁడు వనపర్వములోఁ జేసినపని క్రిమిదష్టములై నష్టములైన స్వల్పదోషములను బూరించుటయే యగుచో నుత్తరభాగమునందును నచ్చటచ్చట నన్నయభట్టోపాధ్యాయుని మధ్యాక్కరలు కలిసియే యుండును. అట్లులేవు కావున ద్వితీయభాగమంతయును నెఱ్ఱాప్రెగడచేతనే స్వతంత్రముగ వ్రాయఁబడినదని యెంచుటయే ధర్మము.

## గీతములు

గీతములసంఖ్యనుబట్టికూడ నుభయకవిత్వముల భేదమును దెలిసికొనవచ్చును. నన్నపార్యుఁడు తేటగీతలకంటె నాటవెలదుల వ్రాయుటయం దభిలాష హెచ్చుగ గలవాఁడనియు నాతని గ్రంథములో నాటవెలదులు (సీసముల చివరఁజేర్చిన వానితోఁగూడ) 419 కలవనియు, తేటగీతలు (సీసముల కతికినవానితోఁగూడ) 208 కలవనియు మహారాజశ్రీ గిడుగు వెంకటసీతాపతిగారు వ్రాసియుండిరి. ఎఱ్ఱనవనబడు నరణ్యపర్వశేషమునందన్నో తేటగీతలు (సీసములతో కలసినవానితోఁగూడ) 148 కలవు. ఆటవెలదులు (సీసముతో కలసి) 152 కలవు. ఇంచుమించు సమానముగ నున్నవి. ప్రత్యేకగీతములు 108 కలవు. ఆటవెలదులు 90 మాత్రమే కలవు. వనపర్వమునందలి రెండు భాగములలో నీభేదమెట్లున్నదో కనుగొందము. నన్నయ దగు ప్రథమభాగములో నాటవెలదులు (సీసములతో కలసి) 148; తేటగీతలు (సీసములతో కలసి) 77; ఎఱ్ఱన భాగములో బైన సూచింపఁబడిన ట్లాటవెలదులు తేటగీతలును నించుమించుగ సమానముగా నున్నవి. కావున నారణ్యపర్వశేషము నన్నపార్యునికంటె భిన్నుఁడగుకవిచేననగా నెఱ్ఱనార్యునిచే విరచింపఁబడినదని తలంచుటయే యుచితమని బాలుఁడైన గ్రహింపగలడు.

## ఆశ్వాసాద్యంత పద్యములు

నన్నయభాగములోని యాశ్వాసాద్యంత పద్యములు రాజనరేంద్రుని లక్షణము లనేకముల వివరించునవిగా నున్నవి. వానింజదివిన నామహారాజుచారిత్రము క్రమక్రమముగా కొంతబోధలోనికి వచ్చును. ద్వితీయభాగము నందలి పద్యము లట్లు లేవు. ఇందు గ్రొత్తవిశేష మొక్కటియును లేదు. నన్నయజెప్పినవానినే పదాంతరములచే నిందు చెప్పినట్లు కాన్పించుచున్నది. కాని నన్నయ వ్రాసినట్లు లేవు. కావున నీభాగము రాజనరేంద్రచరిత్రములోని విశేషము లెఱుంగని శంభుదాసునిచే వ్రాయఁబడినట్లు కాన్పించుచున్నది.

## లోక ప్రతీతి

శబ్దశాసనమహాశయుఁడు వనపర్వములో శారదరాత్రులను పద్యమువఱకే వ్రాసెననియు, "స్ఫురదరుణాంశురాగరుచి" యనునది మొదలు నెఱ్ఱాప్రగడ వ్రాసినదనియుఁ గవిపండితలోకమున బరంపరగవచ్చువాడుకయై యున్నది. ఇంతవఱ కిట్లేర్పడెను? ఏనాఁ డేర్పడినది? అనని య్యది నవీనముగా నేర్పడినదనియు, నచ్చుప్రతులందు మాత్రమే కాన్పించుచున్నదనియు పంతులవారు వ్రాసిరిగాని అది సరియగు పరిశీలన మొనరించి వ్రాసిన వ్రాఁత కాదు. "స్ఫురదరుణాంశురాగరుచి"అనుపద్యము మొదలే యెఱ్ఱాప్రగడ కవిత్వమని యచ్చుమనదేశమునకు వచ్చుటకు పూర్వమే ప్రాచీనకాలమందే మనలక్షణకారులు వ్రాసియున్నారు. అప్పకవీయాది లక్షణగ్రంథము లీపద్యము నుండి యెఱ్ఱనార్యుని కవిత్వమని దెల్పుచున్నవి. లక్షణకారులెల్లరును నుత్తరభాగములోని పద్యముల నుదాహరించినప్పు డెత్తిన నెఱ్ఱాప్రగడ పేరెత్తిరిగాని నన్నయ భట్టారకుని పేరెత్తియుండలేదు. కావున నిది యచ్చువేసిన వా రూహలపైఁ గల్పించినదికాదు; అనాదిసిద్ధమగు వాడుకయే.

సర్వసాధారణముగా వ్రాఁతప్రతులన్నియు "స్ఫురదరుణాంశురాగరుచి" యనుపద్యము మొదలుకొని యెఱ్ఱనభాగమని చెప్పుచున్నవి. మరికొన్నిప్రతులలో శారదరాత్రులను పద్యాంతమున "నన్నయభట్టు కవిత్వము సంపూర్ణము" అని వ్రాయఁబడియున్నది. ఇది యచ్చుప్రతులలోమాత్రమే యున్నదని శ్రీ వీరరాజు పంతులవారు వ్రాసిరిగాని యదిసత్యముకాదు. పూర్వపువ్రాఁతప్రతుల నేకములం దిది కలదు. మొన్నటి పరిషత్పత్రికలో నారణ్య పర్వప్రతులంగూర్చి వ్రాయఁబడిన వ్యాసములో 127 పుటలో 10 వ సంఖ్యగల యారణ్యపర్వప్రతిలోను, 128 పుటలో 11 వ సంఖ్యగల ప్రతిలోను, 129 వ పుటలో 14 వ సంఖ్యగల ప్రతిలోను, 131 పుటలో 16 సంఖ్యగల ప్రతిలోను నన్నయభట్టు కవిత్వము సంపూర్ణమని వ్రాయబడియున్నట్లు బ్రహ్మశ్రీ కొత్తపల్లి సూర్యారావుగారిచే లిఖింపఁబడినది. కావున వీరరాజు పంతులవారు వ్రాసినది యసత్యము. "శారదరాత్రు" లను పద్యమువఱకును నన్నయకవిత్వమనియు "స్ఫురదరుణాంశు రాగరుచి" యనుపద్యము మొదలుకొని యెఱ్ఱనకవిత్వమనియు విభాగము విస్పష్టముగా బహుప్రాచీన ప్రతులవలనఁగూడఁ దెలియవచ్చుచున్నది. ఈవిభాగ మెట్లు వచ్చినదను శంకకు సమాధా

నము చెప్పబోయి యెఱ్ఱన నృసింహపురాణములో ప్రథమాశ్వాసములో 113 వ పద్యమున "స్ఫురదరుణాంశురాగరుచి" యను పదములుండుటచే నిందును నాపదములుగల చోటునుండి యెఱ్ఱాప్రగడ కవిత్వమని ప్రాచీనులూహించి చెప్పిరని మనపంతులవారు నుడివిరి. ఈవ్రాఁత సరియైనదికాదు. ఏమనఁ బ్రాచీనులెంతవఱకెవరి కవిత్వమో పరంపరగావచ్చు వాడుకంబట్టి కాక తా ముభయకవుల గ్రంథముల బరిశీలించి రచనమునందు గలిగిన పోలికంబట్టియె యెవరికవిత్వ మెంతవఱకో నిర్ణయించిరనునెడల "స్ఫురదరుణాంశురాగరుచి" అను పద్యము మొదలుకొని యెఱ్ఱనకవిత్వమని యూహించుటకు దగు నిరాతంకావకాశము కాన్పించుటలేదు. "స్ఫురదరుణాంశురాగరుచి" యను పదియక్షరముల సంబంధము నృసింహపురాణమునకును, భారతారణ్యపర్వమునకును గలిగినంతమాత్రమున నంతటనుండి యెఱ్ఱనకవిత్వమని యూహింపదలచువారికి తరువాతపద్యము లనేకములు నన్నయరచనమువంటి సంపూర్ణరచనము కలిగియున్నవుడవి మరల నన్నయరచనములోనివని యూహింపవలసి యుండునుగదా?

## నన్నయపద్యముల పోలిక ద్వితీయభాగమున నుండుట

ఆపోలిక లనేకములుగలవు గాని గ్రంథవిస్తరభీతిచే నొక్క యుదాహరణమిచ్చెద.

"చ. రయవిచలత్తురంగమతరంగముల న్మదనాగనక్ర సం
చయములఁ జంచలచ్చటుల సైనికమత్స్యములన్ భ
బయి...*　　[యంకరం

ఇది నన్నపార్యుని సభాపర్వములోనున్నది. ఈభాగమే యారణ్యపర్వములోని ద్వితీయభాగమున ననగా "స్ఫురదరుణాంశురాగరుచి" యను పద్యము మొదలుకొనియున్న భాగము బూర్తిగగాన్పించుచున్నది. దీనిం గాంచినప్పుడు నన్నయభాగములోని నలుబదినాల్గక్షరముల పద్యభాగము "స్ఫురదరుణాంశురాగరుచి" యనుపద్యము తరువాతఁ గాన్పించుచున్నది గాన నంతటితో నన్నయకవిత్వము సమాప్తికాలేదనియు తరువాతకూడ నున్నదనియు బూర్వులగు విమర్శకు లూహింపవలసియుండునుకదా? వారేల యట్లూహింపలేదు? ఈపోలికంబట్టి మనవీరరాజు పంతులవా రట్టి యూహకేవచ్చిరే? మనపూర్వులేల యాయూహకు రాలేదన మనపంతులవా రేమి చెప్పగలరు? విషయమంతయు నిట్టిసందిగ్ధస్థితిలోఁ బడునుగాన "స్ఫురదరుణాంశురాగరుచి"యను పదియక్షరముల పోలికలంబట్టి నన్నపయెఱ్ఱనల కవిత్వమునకుఁ బూర్వులు హద్దేర్పఱచిరనుటలో సారస్యమెంతమాత్రమును లేదు. వారీహద్దులేర్పఱచిరనిన, ననాదిసిద్ధముగ బరంపరగా వచ్చుచున్న వాడుకనుబట్టి యేర్పఱచిరనియె చెప్పుకొనవలెను. కొన్ని యరణ్యపర్వప్రతులు "శారదరాత్రు"లను పద్యమువఱకే యుండుటకూడ నన్నయకవిత్వ మంతవఱకేయని రూఢియగుచున్నది. కావున పంతులవారి వాద మసంగతము.

## గ్రంథదృష్టాంతము

ఇంతయేల? ఆరణ్యపర్వమునందలి ద్వితీయభాగమెఱ్ఱాప్రగడవిరచితమని శ్రీమదాంధ్ర మహాభారతారణ్యపర్వాంతమునందలి యీక్రిందిపద్యములే ప్రబలసాక్ష్యము నిచ్చుచున్నవి.

"సీ. భవ్యచరిత్రుఁడు...ఇలబాకనాటిలో నీలకంఠేశ్వరస్థానమై యెసకమెసగు గుడ్లూరు నెలవుగా......
నొప్పు......ఎఱ్ఱనార్యుండు"

"క. ధీరవిచారుఁడు తత్కవితారీతియుఁ గొంతదోపఁ దద్రచనయకా నారణ్యపర్వశేషము పూరించెఁ గవీంద్రకర్ణపుటపేయముగన్" అనుపద్యములు శంభుదాసుని యారణ్యపర్వోత్తర భాగాంతమునఁ గాన్పించుచున్నవి. ఉత్తరభాగ మాతండు వ్రాసెననుట కింతకంటె ఋజువేదికావలెను? భారతారణ్యపర్వాంతమే యరణ్యపర్వశేషము చెప్పినవాఁడు శంభుదాసుఁడని ఘోషించుచుండఁగా మనముసందేహింపవలసిన యవసరము కాన్పించుటలేదే? కటకటా! ఈప్రబలప్రమాణమును గొట్టివేయుటకై రెండుదుర్బలసందేహములను మనపంతులవారు తెచ్చిపెట్టిరి.

---

* ఆరణ్యపర్వమునందు పద్యములో "భయంకరం బయి" అనుటకు బదులుగా "మనోహరంబయి" యున్నది. అంతియ భేదము.

1. ఈపద్యద్వయము అరవదేశమందలి ప్రతులలో గాన్పించుటలేదని కీర్తిశేషులైన తేపప్పెరుమాళ్లయ్యగారు వ్రాసిరట. అందుమూలముచే నివి యిటీవలి వారెవరో చేసి భారతములో గ్రుక్కిరని మనపంతుల వారు తలంతురట. ఇది యుచితముకాదు.

ఏమన:—ఎఱ్ఱాప్రగడ యాంధ్రుడు. ఆంధ్రదేశమున పుట్టిపెరిగి, యిందు గ్రంథములు వ్రాసినవాఁడు ఆతనిదేశమునందుఁగల యనఁగా నాంధ్రదేశమునంగల ప్రతులు పద్యద్వయమును గలిగియున్నట్లు మనపంతులవా రంగీకరించిరి. చదువరుల యుపయోగార్థమై వారివాక్యములనే నీక్రింద నిచ్చుచున్నాను. "శ్రీ తేపప్పెరుమాళ్లయ్యగారు పరీక్షించిన దాక్షిణాత్యకోశములు కొన్నిటియందు పైపద్యములు లేకున్నను, ఈ దేశములోని కొన్నిప్రతులలో నివి కానవచ్చుచున్నవి. ఈపద్యము లెఱ్ఱనవే యై యుండెనేని కొన్నిటియం దవి యుండుటయుఁ గొన్నిట లేకుండుటయు సంభవింపదు" ఆంధ్రదేశప్రతులలో నివి గాన్పించుచున్నప్పుడు వీనినిద్యజించుట న్యాయముకాదు.

## అరవదేశమునంగల ప్రతులలోనివి లేవా?

అదిగాక యరవదేశమునంగల ప్రతులలో నివిలేవని తేపప్పెరుమాళ్లయ్యగారు చెప్పినది సత్యముకాదు. ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారములో దక్షిణదేశమునుండివచ్చిన యారణ్యపర్వప్రతి యొకటి గలదు. దానింగూర్చి మొన్నటి పరిషత్పత్రికలో నిట్లు వ్రాయబడియున్నది:—

"ఇది దక్షిణదేశప్రతి. సత్తెం వేంకటేశయ్యగారిచ్చినది. దక్షిణదేశమున బ్రచారము చేసిన హరి సేతురామయ్యగారు సంపాదించినది......... సప్తమాశ్వాసము కడపట భవ్యచరిత్రుఁ డాపస్తంబ సూత్రుండను దానిలో బోతమాంబిక, పాకనాటిలో గండ్లూరు నెలవున గుణగరిష్ఠత పూరించె కవీంద్రకర్ణపుటముగానూ అని పాఠభేదములు కలవు."

దీనింబట్టి దక్షిణదేశప్రతులందుకూడ నీపద్యములున్నట్లు స్పష్టమగుచున్నది. కొన్నిప్రతులలోనుండి మఱికొన్నిప్రతులలో లేకుండుటచే వీనినెఱ్ఱనార్య కృతములుగా నంగీకరింపమని పంతులవారు లిఖించిరి. ఇది యుచితముకాదు. ప్రాచీనమహాకవులు వ్రాసినగ్రంథములప్రతులలో కొన్నిటియందు కొన్నిపద్యములుండుటయు మఱికొన్నిటియందు లేకుండుటయు సర్వసాధారణముగా దటస్థించుచున్నది. అందుమూలముచే నాయాపద్యములాయా కవులువ్రాసినవి కావని త్రోసివేయబడుచున్నవా? లేదు. అట్లే యీపద్యములవిషయమునను మనము ధారాళమగు నూహలు కలిగియుండవలెను. కొన్నిట లేనంతమాత్రమున గొట్టివేయరాదు- ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములో బ్రౌనుదొరగారిచే వ్రాయింపబడిన భారతప్రతి యొకటి కలదు. అది యేడుప్రతులుచూచి పాఠభేదములతో వ్రాయబడినది దానిసంఖ్య గ్రంథవివరణపట్టికలో (Descriptive Catalogue) 167— (13-1.22) 168 (13-2-25) యను నదియైయున్నది. ఈప్రతిలో "137 పద్యం యీనాంప్రతిలో లేదు" అని వ్రాయబడి యున్నది. అంతమాత్రముచేత 137 వ పద్యమునకు సున్నచుట్టవలసి యుండునా? ఈపద్యములు శంభుదాసుఁడు నృసింహ పురాణములోఁ జెప్పకొనిన దాని కనుగుణముగ నున్నవి. పరంపరాగతమై లోకమున వచ్చు వాడుకకు ననుకూలముగా నున్నవి. అరణ్యపర్వభాగద్వయమునందలి కవితాభేదము దీనికి నూత నిచ్చుచున్నది. ప్రాచీనకవులువ్రాసినవ్రాతలు దీనిని రూఢిచేయుచున్నవి. ఇట్లు ప్రబలమైన యాధారముగల యీపద్యద్వయమును స్వకల్పిత నూత్న మతోద్ధారణమునకై యెవ్వరో యిటీవల గల్పించినవనుట ధర్మముగాదు. పంతులవారి యూహలవంటి యూహలు కలవారెవ్వరో యీ పద్యద్వయమును గొన్నిటిలో దీసివేసి యుండవచ్చును. అట్లుగాక ప్రమాదముచే నొక లేఖకుఁడు దీనిని విడిచియుండగా దానినిబట్టి వ్రాయఁబడిన ప్రతులయందు లేకపోవచ్చును. కాన ప్రబలాధారములపై నిలచియున్న యీపద్యద్వయముగలప్రతులే సత్యములైనప్రతులనియు నవిలేనిప్రతులే యసత్యప్రతులనియు నేల నమ్మరాదు? ఇవి యెఱ్ఱనార్యకృతములు కావనుటకు మన పంతులవా రొక హేత్వాభాసమును తీసికొనివచ్చిరి.

## ఎఱ్ఱనార్యుని నివాసస్థలము

పైపద్యద్వయములో గుడ్లూరని కలదఁట. ఇటీవల బయలువెడలిన చేదలువాడమల్లయ్య తనగ్రంథములో

ఎఱ్ఱనార్యుఁడు చెదలువాడనిలయుఁడని వ్రాసియున్నకతమున నా భారతపద్యమునందలి గుడ్లూరుపురనివాసిత్వ మసత్యమై పోవునఁట. ఇది వింతవ్రాఁత! ఈ చెదలవాడ మల్లయ్య శంభుదాసునివంశమువాఁడనుటకు నాధార మేమియు లేదు. ఎఱ్ఱాప్రగడ తనగ్రంథములలో నెచ్చటను తనయింటిపేరు చెదలవాడవారనిగాని, తన నివాసస్థలము చెదలవాడయనిగాని చెప్పుకొని యుండలేదు. ఎఱ్ఱన కేడు తరములతరువాతపుట్టిన చెదలవాడమల్లయ్య తన వంశము నందెవ్వరో యెఱ్ఱనయుండుటచే నాయెఱ్ఱనయే ఈయెఱ్ఱన యనుకొని తప్పువ్రాత వ్రాసియుండవచ్చును. ఎఱ్ఱన తన తాత వేగినాట, కరాపర్తి వృత్తిమంతుఁడని వ్రాసికొన్నాఁడు తా నద్దంకిరాజధానిగాఁ గల ప్రోలయ వేమారెడ్డికడ నాస్థాన కవి యైనట్లు లిఖించుకొనినాఁడు. కావున నీతని నివాసస్థలము తాను పేర్కొనినవి గాక తదన్యమగు చెదల్వాడయని యనుట కవకాశము కాన్పించుటలేదు. ఈమహాకవి ప్రోలయ వేమారెడ్డి కాలములోనే మృతిపొందినట్లు కవులచరిత్రము దెల్పుచున్నది. మన వీరరాజుపంతులవారు దాని నీక్రింది వాక్యములలో నంగీకరించిరి. "నృసింహపురాణమున వేగి నాటఁగరాపర్తి వృత్తిమంతుఁడని తన తాతను వర్ణించినాఁడు. పిమ్మట, ప్రోలయవేముని తమ్ముఁడు మల్లారెడ్డి తన్ను దీసికొని రాఁగా నద్దంకిరాజధానియందుఁ దదాస్థానకవిగా శంభుదాసుఁ డుండినట్లు హరివంశము తెలుపుచున్నది. పిమ్మట నాతఁడు చెదలువాడ నివాసియైనట్లు విప్రనారాయణ చరిత్రము బోధించుచున్నది. వేమారెడ్డి జీవించియుండఁగానే యెఱ్ఱన పరమపదము నొందినట్లు కవి చరిత్రము దెల్పుచున్నది. కావున నవసానదశయందు అద్దంకినుండి యాతఁడు చెదలువాడఁ జేరెనని భావింపవచ్చును!" ఇట్లు పంతులవారు వ్రాసినది సంగతముగాఁ గాన్పించుటలేదు. ఏమన ఎఱ్ఱనార్యుని తాత దండ్రులు కరాపర్తి వృత్తిమంతులు. తాను వేమారెడ్డికడ నాస్థానకవియై యద్దంకి యందు నివసించినాఁడు. ఈయంశము లెఱ్ఱన వ్రాఁతలవలననే తెలియవచ్చుచున్నవి అని పంతులవా రంగీకరించిరి. కదా! ప్రోలయ వేముఁ డద్దంకిలోఁ బరిపాలించుచున్న కాలమునందే మన యెఱ్ఱన మృతి నొందినట్లు కవులచరిత్రము దెల్పుచున్నది. కావున శంభుదాసుఁ డద్దంకి యందు మృతినొందెనని తలంపవలసి యున్నది. కాని యవసాన దశలో నేసంబంధమును లేని చెదల్వాడ చేరెననుటకు నవకాశము గాన్పించుటలేదు. తన్ను గౌరవించి పోషించుచున్న వేమారెడ్డి జీవించియున్నకాలముననే తాను సంబంధము లేని చెదల్వాడ చేరవలసిన యవసర ముండబోదుకదా? ఎఱ్ఱనది గుడ్లూరు నివాసమనుటకు భారతమునందలి పద్యము తప్ప మఱి యేయితరాధారములు లేవని మన పంతులవారు వ్రాసిరి. ఈమహాకవినివాసస్థలము చెదల్వాడయనుట కీమాత్రపు టాధారమును గాన్పించుటలేదు. ఎఱ్ఱనయనంతరమున బహుశతసంవత్సరములు గడచిన తరువాత మన యాంధ్రదేశమున జన్మించిన చెదల్వాడ మల్లయ్య, యేయాధారము లేకయే వ్రాసిన పద్యము వీరికిఁ బ్రమాణమఁట! భారతమున నెఱ్ఱన పేరితో నున్న పద్యము వీరికి నప్రమాణముగాఁ గాన్పించుచున్నదఁట! దీని కితరాధారములు కావలెనంట! మల్లనపద్యమునకు నవియక్కఱలేదఁట! వాద మిట్లుండవచ్చునా? ఎఱ్ఱనార్యుని వంశము వాఁడని మన పంతులవారు తీసికొనివచ్చి గౌరవించుచున్న యీ చెదల్వాడ మల్లయ్య ప్రధాన విషయములోఁ దుదకు మన పంతులవారికి వ్యతిరేకముగా సాక్ష్యమిచ్చుచున్నాఁడు. ఈతఁ డెఱ్ఱన మహాశయుఁడు వనపర్వశేషము విరచించెనని నొక్కి వక్కాణించి యున్నాఁడు. ఆవ్రాఁతనుండి తప్పించుకొనుటకై మన పంతులవారీక్రింది వాక్యరత్నముల వ్రాసిరి. చెదలువాడ మల్లయ్య తన విప్రనారాయణ చరిత్రమున "ప్రతిభమై నారణ్య పర్వశేషముఁ జెప్పె"నని యెఱ్ఱనను బొగడియున్నాఁడు. ఎఱ్ఱనకు మల్లయ్య 7,8 తరముల వాఁడు. (పీఠికా కారుల కాలనిర్ణయము సరియైనను తరముల సంఖ్య పొరబాటు) ఆతఁడు తనకాలము నాటికిఁ బ్రబలిన వాఁడుకనుబట్టి యట్లు వ్రాసియుండునని పైన వ్రాయఁబడిన కారణములవలన నూహింపవచ్చును." చెదల్వాడ మల్లయ్య శంభుదాసుఁ డారణ్యపర్వముఁ జెప్పెనను వాక్యముల నాతఁ డేడెనిమిదితరములవాఁడగుటవలనను తనకాలపు వాడుకలనుబట్టి వ్రాసినవాఁ డగుటవల్లను ద్రోసిరా జనవలెనఁట! మఱియు నిట్టి వాఁడు చెప్పిన చెదల్వాడనిలయము మాత్రము నిలుపవలెనఁట. దీని కితరాధారమున్న దేమోయనిన లేదు. ఇఁక నిదిమాత్రమునిలుచు టెట్లు? ఇటీవలికవులు పల్వురుపూర్వకవుల నామసామ్యమును బట్టియో, గోత్రసామ్యమును బట్టియో, గృహనా

మసామ్యమును బట్టియో, భ్రమపడి తమవంశస్థులుగాఁ జెప్పుకొనుటకలదని మనమెఱుంగుదుము. అట్లే చెదల్వాడ మల్లయ్యచెప్పినదియు భ్రమాక్రాంతముగాని యాధారకలితముగాదు ఎఱ్ఱనార్యుఁడు చెదలువాడ చేరెననుటకేవిధమగు నాధారమును లేదు. అతఁడు కొంతకాలము గుడ్లూరు నివాసియైనఁ గావచ్చును. ఈయరణ్య పర్వశేషము చెప్పునప్పటికి గుడ్లూరునివాసి; పిమ్మట వేమారెడ్డి కడ జేరి యద్దంకివాసి యైనాఁడు. చెదల్వాడ నివాసము సందర్భ శూన్యముకావున నారణ్య పర్వాంతమునఁగల రెండుపద్యములు నెఱ్ఱనవికావనుటకు తగిన యాధారము లేవియును లేవు. అట్టి ఋజువులేనప్పు డాపద్యము లెఱ్ఱనవనుటయే ధర్మము. ఇఁక నొక విశేషము. వాదము నిమిత్త మెఱ్ఱనచేసినవి కావందము. ఎవరో యిట్లే వలఁజేసి పెట్టిరందము. వారైనను సందర్భములేని గుడ్లూరు నివాసమనియేల వ్రాయుదురు? గుడ్లూరు నివాసమనుటలో వారికేవిధమైన ప్రయోజనములేదే? వారొకవేళ నివాస స్థలముంగూర్చి గ్రంథపరిశోధన మొనరించి యీయంశము వ్రాయఁదలంచి గందుమనిన నెఱ్ఱనవ్రాసిన గ్రంథములనారసి యీతఁ డేప్రభువుకడనున్నాఁడో, యాప్రభువేపురవాసియో తెలిసికొని యాపురమును బేర్కొందురేకాని యేసందర్భమునులేని విష్ణుపురాణము నారయుటయెట్లు సంభవించును? వేమారెడ్డి రాజధానింగూర్చి మన యెఱ్ఱన మహాశయుండేమియు వ్రాయనప్పుడుగదా లేఖకమహాశయు లన్యగ్రంథపరిశీలన మొనరించుట. ఎఱ్ఱన తన గ్రంథములలో తనకృతిపతిది యద్దంకియేయని చెప్పియే యున్నాఁడు. కావున లేఖకమహాశయునియందు సందర్భములేని దోషారోపణముచేసి యాపద్యద్వయమును నెఱ్ఱనదిగాదనుటకంటె నితరాతంకము లేవియును లేవు; గావున లేఖకమహాశయునియందు గౌరవముంచి యీపద్యములాతనివని గౌరవించుటయే ధర్మము. ఎఱ్ఱనార్యుని తాత కరాపర్తి వృత్తిమంతుఁడు. తరువాత తండ్రియో దాతో గుడ్లూరు వచ్చియుండవచ్చును. గుడ్లూరునందుండి యీతండారణ్య పర్వశేషమను నుత్తమ గ్రంథము వ్రాసియుండుటచేఁ బ్రఖ్యాతి నల్దిక్కులవ్యాపింప వేమారెడ్డి తనతమ్ముఁడైన మల్లారెడ్డి ద్వారముగా మనమహాకవిని తన రాజధానియగు నద్దంకికి రప్పించికొనియుండవచ్చును. కావున నెఱ్ఱనార్యుఁడు భారతారణ్యపర్వాంతమున తనది గుడ్లూరునివాసమని వ్రాసుకొనవచ్చును. ఇందసంభవమేదియును లేదు. పంతులవారు వ్రాసినదసంగతము. తాను బ్రతికియుండఁగా తనకాశ్రయుఁడగు వేమఁడు మృతినొందినయెడల శంభుదాసుఁ డవసానదశయందు చెదల్వాడఁ జేరియుండుననిన నేమైన సందర్భముండునేమో కాని, తన్ను గౌరవించి పోషించుచున్న యద్దంకి ప్రభువు జీవించియుండఁగానే మధ్యకాలములోనే యీతఁడు చెదల్వాడఁజేరెననుటలో సందర్భములేదు. కావున వనపర్వాంతమున నున్న పద్యములు శంభుదాసవిరచితములు కావనుట యుచితముకాదు. ఈపద్యద్వయములో మొదటిదగు "భవ్యచరిత్రుఁడ"ను సీసపద్యము నన్నయపద్ధతి ననుసరించిన యతులు గలదైయున్నది. ఆరణ్యపర్వశేషమున నెఱ్ఱనార్యుఁడు నన్నయపద్ధతి ననుసరించెనని మన మెఱుంగుదుము గావున నీయది యెఱ్ఱనకృతమేకాని యిట్లేవల నన్యులచే రచియింపఁబడినది కాదనుకొనుటయే యుచితము.

## ప్రాచీన ప్రతులు

ప్రాచీనములగు వ్రాఁతప్రతుల నారసిచూడఁగాఁ గొన్నిటియందు వనపర్వశేషము లేక "శారదరాత్రు"లను పద్యమువఱకే యుండుటకూడ గాన్పించుచున్నదని వీరేశలింగముగారు వ్రాసిరి. అట్టిప్రతు లుండిన నుండవచ్చునని మన పంతులవారును నంగీకరించుచు మఱల లేఖకు లెవ్వరో యారణ్యపర్వ భీతిచే నంతవఱకే వ్రాసియుందురని మనస్సమాధానముఁ జేసికొనఁ జొచ్చిరి. ఇది సరియగు నూహకాదు. ఏమన, వాడుకనుబట్టి యరణ్యపర్వ పూర్వభాగము వ్రాయుచు మృతిబొందినవాడు నన్నయ. శేషమును వ్రాసిన యెఱ్ఱన మృతి బొందలేదు. నన్నయభాగమును దానిని లిఖించుటకు లేఖకులు జంకవలెనుగాని, యెఱ్ఱనభాగమునుదానిని వ్రాయుటకు జంక నవసరములేదు. కావున భీతిదమగు నన్నపార్యుని పూర్వభాగమును లేఖకులువ్రాసి భీతిరహితమగు ద్వితీయభాగమును వ్రాయక విడచియుందురని మనపంతులువారు చెప్పుట యుక్తిరహితమై, నిస్సారమైపోవుచున్నది కావున, నేవిధమునఁజూచినను శబ్దశాసనమహాశయుండు వనపర్వములో "శారదరాత్రు"లను వఱకే విరచించెననియు, మిగిలినభాగము నెఱ్ఱన మహాశయుండు

ఆంధ్ర దేశము-గాలివాన, 16-5-1925



ధ్వంసమయిన తాడేపల్లి రైల్వే స్టేషను



కృష్ణాకెనాలు రైల్వేస్టేషనుదగ్గర తలక్రిందయినసామానురైలుబండి. రైళ్లరాకపోకలకు వీలులేకుండ మార్గమునబడియున్నది

లిఖించెననియుఁ భావించుటకే తగు ప్రబలనిదర్శనములు కాన్పించుచున్నవి. గ్రంథశేషము నిటీవల బహుకాల మైన తరువాతఁ బూర్తిచేయుట తటస్థించుచో నా శేష భాగము లేకయే పూర్వభాగముమాత్రముగల ప్రతులు లోకముననుండుట వాడుకయైయ్యే యున్నది. తిక్కన మహాకవియుఁ ఉత్తరకాండములో దుదిభాగమును వదలి వేసె. దాని నిటీవల జయంతి రామభట్టు పూర్తిచేసె. అయినను రామభట్టమహాకవియుఁడు పూర్తిచేసినభాగము కొనట్టియుఁ దిక్కన మహాకవియుఁడు వ్రాసినభాగము వఱకే యున్నట్టియుఁ బ్రతులనేకములు గలవు. అట్లే పూర్వపారస్వతప్రియులు తెలుఁగుభారతము నన్నయ చెప్పిన "శారదరాత్రులను" పద్యమువఱకే వ్రాసికొనుచు వచ్చుట తటస్థించుటచేఁ గొన్నిప్రతు లంతవఱకే యుండు ట సంభవమైయుండనచ్చును. కాన కొన్నిప్రతులు "శారదరాత్రులను" పద్యమువఱకే యుండుటంజూడ నన్నయ్య యింతవఱకే వ్రాసెనని యూహించుట ధర్మమై యున్నది. కాన నెఱ్ఱనార్యుని వ్రాంతలనుబట్టియు, ప్రాచీన కవిపండితులయొక్క లేఖనములను బట్టియు, ననాది సిద్ధముగావచ్చుచున్న లోకవ్యవహారమును బట్టియు నారణ్య పర్వశేషము పూర్ణముగా శంభుదాసవిరచిత మనుటయే ధర్మము.



# అ భీ ప్సి త ము

చెదలవాడ సీతారామాంజనేయులు గారు

నవనవోన్మేష యౌవనానందజలధి
వీచికల దోఁగు మమ్ముల విడచి మధుర
కేళిగదోయి! కృష్ణ! త్వదీయచరణ
విమలరాజీవముల నెట్లు విడువగలము?

త్రిభువనానంద మగు భవదీయదివ్య
మోహనాంచితవిగ్రహమ్మును సతంబు
మాహృదయఫలకముల నెట్లు మార్పసేయ
గలము? నీమధురాధరచలితదివ్య
మురళిగీతామృతం బెట్లు మరువగలము?
మంజులలతావితాన సుమాళిచేత
సంతతమధువ్రతాళిఝుంకృతులచేత
భాసురరసాలపల్లవ గ్రాసపరభృ
తాంగనాగాన విమలగీతాళిచేతఁ
జెవులపండువుసేయు బృందావనమ్ము,
నీవులేకొంటిమై నెట్టు లేగగలము?

అరయ దినమణిలేని వాసరమువోలె
శారికాంగనలేని పంజరముకరణి
శీతకిరణుడులేని యామారాతిరివలె
నేఁడు గన్పట్టుచుండెను నీవియోగ
దుస్సహదవాగ్నిశిఖల దోదూయమాన
మానసులమైన మమ్మసమానమైన
నీదుకరుణామృతసువృష్టిచే దనిపియు
నీమహాద్భుత విశ్వరూపమున మమ్ము
నైక్యముగఁ జేసికొని వేగ నరుగుమయ్య!




గరిగిపాటి రామమూర్తి గారు

వనకుమారి యను నిర్వచన కావ్యము శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారిచే రచింపఁబడి శ్రీవిజయనగరాధీశుల సన్మానము వడసినది. చరిత్ర చర్వణముగాఁ బూర్వులు వ్రాసిన గాథలనే వ్రాయక యీకవి నూతన మార్గములఁ ద్రొక్కెను. పెక్కుపట్టుల నయ్యవి సమంజసములుగా నున్నవి వర్ణనలయందును భావములయందును పాశ్చాత్య మర్యాదలు బొడకట్టెడిని

వనకుమారి యందలి యితివృత్తము (Plot) బహుస్వల్పము. ఒకానొకరాజు మంత్రులచే మోసగింపఁబడి, శత్రువులచే విజితుఁడై కానన సీమల నొక్క యనుంగు కుమారితను బెంచుచు కాలము గడుపుకొనుచుండెను అక్కుమారి గొఱ్ఱెలను మేపుచు ప్రకృతి చిత్రముల నరయుచు వింతపడుచుండెడిది. ఒకనాడు 'వనకుమారి' గొఱ్ఱెలన్నియు నెచ్చటికో పారిపోయినవి. ఏమియుఁ దోచక యిట్టట్టు తిరుగాడుచుండ నామె కొక వీరుఁడు కన్పడెను.

మున్నెన్నడును తండ్రిని తప్ప యన్య పురుషులను జూడని దగుటచేత నామె నిశ్చేష్టితయయి, వీరుని శైత్యోపచారముల వలన గొంతవడికి తెలివిగాంచెను. ప్రథమావలోకనముననే వీరుఁడు వనకుమారిని మోహించి, ప్రేమయననేమో యామెకు బోధపరచి వనకుమారికి గూడ తనయందు వలపు బుట్టించెను. కొంత సేపటికి బెదరిపోయిన గొఱ్ఱెలన్నిటిని జేర్చుకొని వారిరువురును బయలుదేరి పర్ణకుటీరమునకుఁ బోవుచుండిరి.

వన కుమారి తండ్రి వృద్ధుఁడు తన తనయ రాత్రియైనను రామి చింతించి, యొక దివ్వె వెలిగించుకొని యామెను వెదకుటకు బయలుదేరెను. దారి ప్రక్కన నప్పుడే ప్రసవించిన యడవిపంది బెదరి వృద్ధుని హృదయస్థలమున గాయముచేసెను. అతఁడును నార్త నాదములఁ జేయుచుఁ గ్రిందికొఱగెను. వీరుని చెవికి వృద్ధుని దీనాలాపములు సోకగా నాఁడా దిశకుఁజని పడియున్న వృద్ధుఁడు వనకుమారి తండ్రియేయని యతనివలననే తెలిసికొని, యాతనిని భుజమున నెక్కించుకొని వనకుమారింగూడి పర్ణగృహమున కేగెను. అచ్చట వృద్ధుఁడు తన పూర్వవృత్తాంతముం జెప్పుకొని మరణించెను.

వీరుఁడు వనకుమారికి వృత్తాంత మెల్లెట్లో చెప్పి యామెకు ధైర్యము బోధించెను

వీరుఁడు వనకుమారిని వదలిపోఁజాలకున్నను, నత్యవసరములగు రాజకార్యములను గురించి మంత్రులతోఁ మాట్లాడుటకు నగరమునకుఁ బోవలసి వచ్చెను. వన కుమారి యతనితోఁ బోవుట కంగీకరింపనందున నాతఁ డొక్కఁడే పోయెను.

వనకుమారి యొకదిన మోపిక పట్టియుండెను గాని తరువాత ప్రియాన్వేషణము మొదలిడెను. వీరుఁడును వచ్చి పర్ణగృహములో వనకుమారిం గనక వనమున నిటు నటు దిరుగాడుచు నొక తరుమూలమున బడియున్న వనకుమారింగాంచి యామెను లేవదీసి నగరమునకు రమ్మని ప్రార్థింప నామె యంగీకరింపలేదు. వీరుఁడామెకు పూర్వవృత్తాంత మంతయుఁ దెలియఁజేసి తగు బోధల వలన నామెను నగరమునకు వచ్చునట్లొడబరిచెను. నగరమునకుఁ జనిన కొలఁదిదినములకే వీరునకును వనకుమారికిని బరిణయమయ్యెను. ఇట్టి స్వల్పేతివృత్తముతోఁ గవి ప్రకృతి వర్ణనముల హెచ్చుగ మేళగించి యష్టమంజరులుగల గ్రంథమును వ్రాసెను. ఇట్టిది ఆంగ్లభాషలో ప్యాస్టొరల్ పొయిట్రి (Pastoral poetry) అని చెప్పుదురు. ఇట్టివి బోమంటు అండు ఫ్లెచ్చరు (Beaumont and Fletcher)ను తరువాత (Romantic Poets) మఱికొందఱుకవులును వ్రాసియుండిరి.

ఇంతియ కాక కొన్ని కొన్ని భావములును నాంగ్లగ్రంథములలో నుండి కైకొనబడినట్లు కానుపించుచున్నవి. చూడుడు:—

చ. లలితరసార్ద్రవేణురవలాలితలైన కురంగకాంతలు
జ్జ్వలకిసలంబుల న్మెసవజాలక వీనులు నిక్కపెట్టి క
న్నుల బ్రాయాపలోకములు నాల్గొనగం బచరించి యల్లనన్
గళికచరించుమార్గమును గాంచుచునుండెనిముగ్ధచిత్తలై.

దీనికిని టెన్నిసన్ (Tennyson) యొక్క 'ఈనోసీ' (Oenone) లోని భావములకును గల సమత్వము

Methinks I must be fair for yesterday
When I past by, a wild and wanton pard
Eyed like an evening star with playful tail
Crouched fawning in the weeds.

మఱియు మిల్టనుయొక్క 'ఇల్పెన్సరోసో'లోని

And looks commercing with the skies
Thy rapt soul sitting in thy eyes.

యను దానికిని వనకుమారిలోని '...చూపులను నభోంతరాళమున బూర్ణపు మైక్యము నల్పి భావ నిశ్చలత వహించి యుండ'

నను దానికిని భాషభేదము తప్ప మఱేదియు లేదు. ఇంకను నిట్టివి కొన్నికలవు. కవి యాంగ్లభావముల ననుసరించెననుట పైయుదాహరణల వలన దేలుచున్నది.

ప్రకృతి వర్ణనలలో మాత్రము శ్రీరామిరెడ్డిగారు రసమానులయినందులకు చాల సంతసముగా నున్నది. ప్రకృతి చిత్రములఁ జిత్రించుటలో వీరు చూపిన నైపుణ్య మపారము. అలంకార యుతమగు నీక్రిందిపద్యము వలన వారికిఁ బ్రకృతిని వర్ణించుటయందుఁగల సామర్థ్యము తెల్లమగును.

చ. సమయపుమాలికం బ్రకృతి
సాంఖ్యసువర్ణముఁ గూర్చి యభ్రప
త్రమున వలాహకావృత
ధరాధరశృంగములన్ నికుంజపుం
జములను శాద్వలంబుల
విశంకట నిర్ఝరులన్ ఖగంబులన్
రమదోలకం లిఖించె నన
రాజిలు నయ్యపరాశి యర్యొడన్.

రామిరెడ్డిగారీకావ్యమున నుపయోగించిన శైలిని (Style) గూర్చి యొకమాట చెప్పవలసియున్నది. క్లిష్టముకాక మనోహరముగను, మృదువుగను బంగారు తీగవలె వనకుమారి యందలి శైలి ప్రశస్తముగా నున్నది.

అచ్చటచ్చట మాత్రము సంస్కృత శబ్ద పాండిత్యము వెల్లడియగునట్లు వీరుదీర్ఘ సంస్కృతసమాసములఁ బద్యములలోఁ జొనిపియున్నారు. ఇష్టానుసారము ఱ, ర లకు ప్రాసవేసినారు. ఆంద్రీకృతాంగ్ల భావము లొకొక్కచో దేశాను గుణముగ నుండుటలేదు.

మొత్తముమీద నీకావ్యము మనయాంధ్ర భాషాదేవి కంఠమాలలో నొక పుష్పమై యొప్పుచున్నదని చెప్పవచ్చును. ఈగ్రంథమున శృంగారరసము ప్రధానము. అయ్యది యు నుచితపోషణము నందినది. పాత్రౌచిత్యము ప్రశంసనీయముగు రీతిగ నున్నది.



# చూపు

క. వెంకటరావు గారు, బి. ఎ., బి. ఎల్.

ఏ వైపు నీచూపు ?
ఎందాఁక నీతూపు
ఏమిలే నవకాశ
మందేమి నీప్రాపు ?
"""ఒట్టి" తట్టను చేత—"ఒదులోదులె" "జాతేసి"
అట్టెయేమిటోధాత-కంటెనెక్కుడుఁదలఁతు!"
"తలఁప నేఁ మున్నాది'
లతకూన చిగురాకు
చూడ నేఁ మున్నాది'

జోడెడ్ల బండాకు
జోడెడ్ల 'కళ్లల్లో'
చిగురాకు సిందాడ'
మదిఁదోఁచునదియేమొ
మాపటికి-కూరాకు. ఏవైపునీచూపు.
కూరాకు వండి - ఆ
కూటిపైఁ బెట్టినీ
'కోసాము' 'కూకుంటె'
తోఁచక తోఁ'చేటి'
రాచపడుచు పోకు. ఏవైపు నీచూపు.



# భాగవతములోని కొన్ని యప్రశస్తములు

సేలనయ్యా

ఆంధ్రమున పేరెన్నికఁ బడసిన గ్రంథములలో భాగవతం బొకటయ్యు, కొన్ని సందర్భములలో రసభంగములును, భావలోపములును గలిగియున్నదని నాస్వల్పానుభవమునుబట్టి చెప్పనున్న ఈ క్రిందివిషయములను పండితు లాదరణబుద్ధితోఁ జదువఁ బ్రార్థితులు.

కేవలము భాగవతము నొకకావ్యమనుకొని ఉపాఖ్యానములను, పురాణకథలను చరిత్రములను విమర్శింతుమేని కావ్యలోపములు కొన్ని యాయా భాగములలోఁ గలవు. ఇందుకుఁ జాలవరకు మాతృకగాక, పోతరాజే బాధ్యుఁడని చెప్పవచ్చును. అంత్యనియమములు, సమాసములు, దుష్కరప్రాసము కాపాడదలంచి కొన్నిచోట్ల పోతరాజు రసపోషణమునకు భంగపాటొనరించెను. మఱియు వర్ణనాంశమున బడి కావ్యముఖమును మరచి, విషయోల్లంఘన మాచరించినచోటులుఁ గొన్ని కలవు. ఉద్రేకకరములగు కథాంశములను సమయోచితముగఁ బెంచి తగ్గించి వ్రాయవలసిన సందర్భములలో రస స్వరూపమును గాపాడగలిగినవారిలో నతిసమర్థుఁడయ్యు, గొన్ని సందర్భములలో రసస్వరూపము నదృశ్యముచేసి, యే యమకమునో, యే యంత్య నియమమునో — యాధారము చేసికొని కథాకుక్షినించినచోటులు కొన్ని కలవు. వీని నన్నిటిని గ్రంథవిస్తరభీతిచే ప్రత్యేకించి తెలుపక, స్థాలీపులాకన్యాయముగాఁ గొన్నికొన్నిమాత్రము కొలఁదిలో విమర్శించితిని.

(1) శ్రీకృష్ణనిర్యాణమునుగూర్చి విచారమునొందుచు నర్జును డన్నను సమీపించినపుడు ధర్మరాజు సోదరుని యాదవులసేమము వేరువేరుగ నడుగుటవరకు పోతన రసపోషణముగావించి తర్వాత కొంత ప్రాసపోషణము చేసెను.

కం. ఓడితివో శత్రువులకు
నాడితివో సాధుదూషణాలాపములన్
గూడితివో పరసతులను
వీడితివో మానధనము వీరుల నడుమన్.

కం. తప్పితివో యిచ్చెదనని
చెప్పితివో కపటసాక్షి చేసినమేలుం
దప్పితివో శరణార్థుల
రొప్పితివో ద్విజుల బసుల రోగుల సతులన్.

కం. అడిచితివో భూసురులను
గుడిచితివో బాలవృద్ధగురువులు వెలిగా
విడిచితివో యాశ్రితులను
ముడిచితివో పరులవిత్తములు లోభమునన్.

ఇందేదయిన నొక్కపద్యమునుమాత్రమే నిలిపిన ననౌచిత్యముగ నుండకుండెడిది గాని ప్రస్తుతముమాత్రము వెగటుతోచుచున్నది.

ఇట్టి త్రిప్రాస చతుష్ప్రాసములు గల పద్యములు వ్రాసిన కథాజీవము తీసిపోవును.

ఇట్టివి కథామధ్యమున చేర్చినచో రసవశంవదమైన హృదయమున కుద్రేక మొక్కమారు తగ్గిపోవును.

దుష్కరప్రాస బాధానివారణార్థము మఱి జీవజంతువులతోఁ బాటు చిమటలను (ఝిల్లులను) గూడఁ జెప్పవలసిన యవస్థ పోతనకుఁ దటస్థించినది. చూడుడు.

కం. భిల్లీ భల్లులులాయక
భల్లుకఫణిఖడ్గగవయ వలిముఖచమరీ

ఝిల్లీహారశరభకకిటి
మల్లాద్భుత కాకఘూక మయమగు నడవిన్.

(2) మున్నువర్ణించిన కథాంశములలోని పద్యభావముల నితరకథాభాగములఁ జేర్చుటయుఁ గొన్నిచోటుల గలదు. ఒకేగ్రంథమునఁ జెప్పినభావమును మఱల మఱల జెప్పుటయు ననౌచిత్యమె.

(అ) "సప్తాంభోనిధి మేఖలావృత మహాసర్వంసహాకన్యకా, ప్రాప్తోద్యద్వరదక్ష దక్షిణకరప్రాలంబు"—(నవ 527) "పారావారపరీతోదార ధారాభార దక్షదక్షిణహస్త శ్రీరాజిల్ల" (నవ 595)

(ఆ) క. "గండక కంఠీరవభే
రుండ శశవ్యాళకోలరోహిషరురువే
దండ వ్యాఘ్రమృగాదన
చండ శరభశల్య భల్లచమరాటవులన్." (నవ 596)

క. "భిల్లీ భల్లులులాయక
భల్లుకఫణి ఖడ్గగవయ బలిముఖ చమరీ
ఝిల్లీహరి శరభకకిటి
మల్లాద్భుతకాక ఘూకమయమగునడవిన్

(ఇ) ఉ "అందు దమాలసాలవకుళార్జున నింబ కదంబ పాటలీ
చందన నారికేళ-ఘనసార శిరీషలవంగలుంగమా
కందకుచందనక్రముక కాంచన బిల్వ కపిత్థ మల్లికా
కుందమధూకమంజుల నికుంజములన్ దనరారివెండి
యున్." (తృ)

"మాతులుంగ లవంగలుంగ చూతకేతకీభల్లాతకా
మాతవే సరళపనస బదరీ వకుళవంజుళవట
కుటజకుందకురువక కురంటకోవిదారఖర్జూర
నారికేళసిందువార......

ఇట్టి పోలికలు కొన్ని కొన్ని చోటులలోఁగాన వచ్చును. వీనిని భావాంతరములచే సందర్భ శుద్ధిగ వేఱు మార్గముతోఁ బూర్తిచేయవలసియుండ నొకేరీతిగా వ్రాయుట కవిప్రగల్భమునకు లోపము. ఇట్టిలోపములు మొత్తము మీద భాగవతములో వనాదివర్ణనాంశము లలోఁ గానవచ్చుచున్నవి.

(3) వనాదివర్ణనములు చేయుతఱి పోతనవృక్షనామములను, మృగ నామములను పఠించుట తెలుచుగాఁ గలదు. ఇది కవితా శిల్పమున గొప్పకొఱఁత. వనస్వరూపమునఁ జిత్రించుట యెంతయుక్తమో యెఱింగినపోతరాజువంటి రౌచిక కవులు నిఘంటువు నేకరువు పెట్టుట రసస్వరూపమును రూపుమాపుటయే. ఇట్టి లోపములు భారతాదులయందుగానరావు. ఒక యష్టమస్కంధము లోని గజేంద్రమోక్షగాథ నిందులకు దృష్టాంతముగ దీసికొందము. త్రికూటపర్వతమునఁ బోతరాజు వర్ణించుచు 54 వృక్షముల పేరులు, 8 పక్షుల పేర్లు, 8 రత్నముల పేర్లు, 17 జీవజంతువుల నామములు పఠించి యున్నాడు. అంతతోఁ దృప్తినొందక పక్షులను, మృగములను గలిపి యిక పదునారింటిని వేఱుపద్యములలో వర్ణించియున్నాడు. ఇందు వనస్వరూపము ద్యోతకమగుటకు మారు, నిఘంటువులు జ్ఞాపకములోనికి వచ్చును. ఇంతియగాక మదగజమదజలము నతిగా వర్ణించియున్నాడు

"...మద్దానాంభఃపరిపుష్టచందనలతాంతచ్ఛాయలందుండలే, కీ నీరాసనికేల వచ్చితి భయం బెట్లోకదే యీశ్వరా" యని విలపించుచో, వృక్షశాస్త్రవిషయముల నాగజము జ్ఞాపకమునకు దెచ్చుకొను టాశ్చర్యముగా నున్నది.

(4) పోతన కొన్నిచోటుల శృంగార రసము నతిగా వర్ణించినాడు. ఈవర్ణనమునఁ బోతరాజు కొండొకచో ప్రబంధకవులను సైతము మించిపోయెనని చెప్ప సాహసింపవలసి వచ్చుచున్నది.

వామనమూర్తికి బలిదానము నీయ నిర్ణయించుకొనినప్పుడు శుక్రాచార్యుఁడు దానము నిచ్చిన నపాయము వచ్చునని ఖండితముగఁ దెల్పెను. కాని బలిచక్రవర్తి మాత్ర మా పలుకు లంగీకరింపక,

శా. ఆదిన్ శ్రీసతికొప్పుపై దనువుపై
నంసోత్తరీయంబుపై
పాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ
బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట
మీదై నాకరంబుంట మేల్
గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే
కాయం బనాపాయమే.

ఇట్లు దానము పరిగ్రహించు విష్ణువుకరమును శృంగార రసానుకూలముగ బలి వర్ణించుట రసాస్పదము కాదు. బలి విష్ణుహస్తము నందుమాహాత్మ్యము నారోపింపవలసిన దానికిమాఱు, శృంగారరసములోనికిఁ బోయినాఁడు. భగవంతుని మాహాత్మ్యము స్థాపింపదలంచినను, హస్తము ప్రాశస్త్యము వెల్లడింపఁదలచినను, నీ శృంగార ప్రపంచములోనికిఁ బోరాదు. శ్రీసతిపద్ద నుపయోగించిన హస్తములనే వర్ణింపవలసినంత యవసరము కాసరాదు. పరపురుషుఁడగు దానవుడు లచ్చి పాలిండ్లఁ దలంచుటయు నౌచితీ భంజనముకాదని చెప్ప వీలులేదు. ఇట్టి యౌచితీలోపములు మనవారి యాచారముగా నున్నట్లు క్రింది పద్యములే సాక్ష్యములు.

"సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబును జీర డభ్రగపతిం బన్నింప డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై."

(భక్తాళిరక్షణార్థమై యెట్టితరుణమునందైనను సిద్ధముగా భగవంతు డుండునని బోధించు నుద్దేశమున్నను, శ్రీకుచములను చేర్కొను నవసర మేమి కలిగినదో తెలియదు.)

[ఇట్లే-భాస్కరరామాయణమందు హనుమంతుడు

"యిద్దేవి రాసువేంద్రుదేవియని కృతనిశ్చయుండై మఱియును బోలంగనుంగొనుచు దనమనంబున

కం. నరపతి సెప్పినగతి నీ
యురుకుచ కొప్పారు నూరుయుగము మొగము భా
సురతరపదములు రదములుఁ
గరము లురముఁగౌను మేను గన్నులుఁజన్నుల్.

సీ. సరసిజ సౌందర్యసదనంబు వదనంబు
చారు సుధారస స్రావిమోవి
పరిభూత బిసపద్మ భాగులు చేతులు
కదళీకాయుగళంబు గడలు దొడలు
మహురుదంచిత కాంతిముచములు గుచములు
భూరిసువర్ణ విస్ఫూర్తిమూర్తి
చతరనిలోక నాసాధ్యంబు మధ్యంబు
తీపారుకందర్పు తూపుమాపు,
లోలభావసూచనములు లోచనములు
గర్మవతి మతి యభిమానఘనము మనము
కాన యీసతికెనయగు మానవతులు
సారిది మూఁడుజగంబులఁ జూడగలరె."

ప్రబంధకవుల పచ్చిబూతు లప్రస్తుతములగుటచే వదలితిని. అయిన మొల్లయట్టియబలకుఁగూడ శృంగారము స్మరించునంతటి యవస్థ పట్టినందులకు మాత్రము విచారము పోడమక పోదు.

హైందవేతరులకు నీతిబాహ్యముగఁదోచు భాగవతభాగము దశమస్కంధము. మూలగ్రంథమును సంస్కరింపవలసిన బాధ్యత కవిత్రయము వలెఁ బోతరాజు తనపై నుంచికొనక శృంగారరసపోషణమున, మూలకర్త వాక్యముల ననుసరించుటతోఁ దృప్తిపొందక మాతృకలోని యంశములఁ బెంచి పెంచి కథామాహాత్మ్యమునకుఁ గళంకము దెచ్చియున్నాఁడు. ప్రపంచమునంతయు దైవస్వరూపముగ దర్శించు పోతనామాత్యునివంటి మహాత్ముల కాయా భాగములు నచ్చినను, కవితావిమర్శకులగు రసికులకు మాత్ర మాయా భాగములు మిగుల హేయ్యముగ నుండును. గూఢార్థములు గూఢ మతాచార్యులకే వదలుటుచితము. విష్ణుపురాణములో శ్రీకృష్ణుని బాల్యము మృదువుగ ననుకూల శృంగారముగ వర్ణింపఁబడెను. భారతములోఁ గృష్ణుడు రాజనీతివేత్తగఁ దెలుపఁబడెను. వ్యాఖ్యాతలు తలలు విఱిచి మూలగ్రంథములోని శ్రీకృష్ణుని శృంగారలీలలకు నర్థాంతరములఁ గల్పించి తమశక్తిసామర్థ్యములు వెల్లడించిరి కాని, పోతరా జాపక్షమున బోక మూలగ్రంథములోని శృంగారబాహ్యమునకే మెరుగుఁ బెట్టుటతోఁ గాలమును గడిపెను. ఎంతమూలానుసారియైనను యుక్తాయుక్తములు యోజింపకపోవుట, మాతృకతో వ్యతిరేకింపవలసిన స్వాతంత్ర్యము జంపుకొనుట, పోతనామాత్యుని జీవితమునకుఁ గళంకములె.

కం. "చంచత్పల్లవ కోమల
కాంచన నవరత్న ఘటిత కంకణరుచిరో
దంచిత కరసంఛాదిత
పంచాయుధగేహలగుమ బడతులువరుసన్." ద.1.837

"మిథునకోటికి రతి మెండుదోచె"

"తరుణిగాముకేళి దనిపినా డొక్కఁడు"

"..........కృష్ణుఁడు
నాతోడ మన్మథనటన మాడె"

కం. కొడుకులు లేరని యొకసతి
గడువగ నంగ దన్ను మగనిగా గైకొనినం
గొడుకులు గలిగెదరని పై
పడినాడిది వినుము శిశువు పసులే తల్లీ.

కం. మగువా నీ కొమరుడు మా
మగవా రటు పోవ జూచి మంతనమునకుం
దగజేరి పొందనడిగెను
జగముల మున్నిట్టిశిశువు సదువం బడెనే.

కం. నాకొడుకు నాదుకోడలు
నేకతముగ బెనగఁగఁ బాము నీతడు దైవం
గోక లెఱుంగక పాజెన
గూకలిడెఁ నీసుతుండు గుణమె గుణాఢ్యా.

ఆ. వె. తరుణియొకతె పెరుగుద్రచ్చుచోఁ దుదివంగి
వెన్న దీయనొదిగి వెనుకగదిసి
మగువనీసుతుండు మగపోడుములు సేయ
సాగినాడు తగదె చక్కజేయ.

లోనగుచోటుల శ్రీకృష్ణప్రభావము వెల్లడించుటకు మారు మన్మథక్రీడావర్ణనమునె పలుమారు చేయుట పోతనవంటి భక్తశిఖామణికి తగదని నాయూహ. [రాసక్రీడ, వేణుగానవర్ణనము, గోవర్ధనధారణము, గోపికాగీతలు, కాళీయమర్దనము లోనగు పవిత్రకథలలోఁ గానవచ్చు కృష్ణునకు, గోపికావస్త్రాపహరణము, జలక్రీడలు, భ్రమరగీతలు, కుబ్జావినోదము లోనగు కథాంశములలో గానవచ్చు కృష్ణునకు స్వరూపస్వభావములలో వ్యత్యాసముకలదు. కృష్ణపాత్రము భోగపరాయణము గావించినదిమొదలు పోతరాజు భక్తిపరవశుడై కొన్నిచోటుల యుక్తము నయుక్తముమఱచి శృంగారప్రపంచములోనికి బోయి తన్మయుడై యౌచితినుల్లంఘించెనని నేనూహించెదను. [ముందు భోగపరాయణలయివచ్చిన గోపికలకు సద్బుద్ధులు గఱపిపంపుటయుఁ, బిదప నాకులకాంతః తోనే భోగించుటయుఁ కృష్ణునిజీవితమునకుఁ గళంకము. ఇట్టి ఈరచనలే హిందూదేశమున గోపాలవల్లభాచార్యాది మతములు కంచుకోత్సవాదులు బయలువెడలుటకు, ప్రజలలోదుర్నీతివ్యాపించుటకు సైతము కారణమైనది. అందు బోతరాజుకవిత అమృతమువంటిదియు, బరులఁ ద్వరలో నాకర్షించునదియు నగుటచే వామాచారులు, గూఢమతాచారులుచెప్పు అంతరార్థముల వినుటకైనను దాళలేక సందుగల్పించుకొని చెడుత్రోవను బోవుట కీశృంగారభాగములు కొంతవఱకు కారణము లగుచున్నవని చెప్పుటయందసత్యమంతగా లేదు.] కొంద ఱుబుసుపోకకు శృంగారరసమునుజూడనెంచి, దశమస్కంధము విప్పి పోతనకవితతో వ్యామోహము సవరించుకొనుట జూచుచున్నారము.

పైనవ్రాసినదంతయు దోషారోపణబుద్ధితోఁజేసినవిమర్శనము కాదు. వాఙ్మయమున భాగవత మలంకరించుస్థాన ముత్తమమైనది. అయిన పోతనవంటి యాంధ్రకవుల కెట్టి [illegible]యాచారము లుండెడివో చూపుటకు మాత్రమే యిందుప్రయత్నించితిని. కావ్యవిమర్శనమందు గుణగ్రహణమే ప్రశస్తమని నేనెఱుగుదును. కాని ప్రస్తావనరీతిగా వ్రాసిననాయూహలతో నేకీభవించువా రన్నితెగలలోఁ గొందఱైన యుండకపోరని నా నమ్మకము.

కేవలము పురాణగ్రంథమగుటచే భాగవతము సాహిత్యవిమర్శనమున కంతగా నలవిగాదు. అయిన భక్తచింతామణియగు శ్రీకృష్ణభగవానుని జీవితమునందప్రశస్తకార్యములను జూపుట భక్తశిఖామణియగు పోతనవంటి రౌచికకవులకు తగదు. ఇట్టి వ్రాతలకు శృంగారాభిలాషయో, లేక భక్తిపారవశ్యమో కారణమగును. అయిన పోతనవంటి మహానుభావునికే కుశృంగార మవిలంఘనీయమైన యెడల ప్రబంధకవులగతి యూహింపనగు.



# నవరసంబులు నీవెకా, నళిన నయన!

మల్లాది చంద్రశేఖరరావు గారు, బి. ఏ.

బాల్యమందు నావంతేని భయములేక,
స్నానమాడుచుఁ, గాళింది జలములందుఁ
గాంచినట్టి యా ఫణిఫణాగ్రముల, లీల,
జగము దీపించు మందహాసంబుతోడ
నద్భుతంబుగఁ దాండవమాడినట్టి
అద్భుతరసమూర్తివి కావె! అనఘ, నీవు.

పొలఁతి, రుక్మిణినిం గొనిపోవువేళ,
నువిద తల్లియుఁ దండ్రియు నూరకున్న,
పిరికి పందవిధాన నాపరుగుదేల!
ఆగుమంచును నిన్ను వెంటాడ, బావ
మఱదియంచు రుక్మిశిరము గొరిగినట్టి,
హాస్యరసమూర్తివీవెకా అబ్జనాభ!

పారిజాతంబు సవతిపాల్పడెనటంచు,
నీసు జనియించి, నీ సత్య యేడ్చుతరిని,
ఆమె మందిరంబున కేగి, యలుకదీర్చి,
అపుడె పారిజాతంబుదే నరుగలేదె;
వనితసర్వంబు నీకె యర్పణముసేయ,
లలితశృంగారచేష్టల, రమణిఁ దనిపి
ఎలమి నారాధకోర్కె లీడేర్చినట్టి,
వరద! శృగారరసమూర్తివరయనీవు.

స్నేహితుఁడవంచు, సాయంబు చేతువనుచు,
జేరెడటుకులు గొంచుఁ గుచేలు డట్లు
పారభక్తితో నచ్చిన, గౌరవించి,
నీదు హృదయమందునఁ జాల మోదమొంది,
ఎల్లసంపదలు నతనికిచ్చినట్టి,
దానవీరుఁడవీవెకా! ధన్యచరిత !

కొలువులో రాయబారంబు సలుపువేళ,
దొరికెరా కృష్ణుడంచు, సంతోషమొంది,
కౌరవాధములెల్ల నిన్నగట్టనెంచ,
వారి యాశలు బూడిద పాలుజేసి,
విశ్వరూపంబుఁ జూపించి వెలసినట్టి,
ఆభయానకమూర్తివి అనఘ నీవె!

ధర్మమార్గంబు దప్పెడి దైత్యవిభుని,
సురలకుఁ హానిజేయంగఁ జూచువాని,
లోకకంటకుడగువాని రూపుమాప
ఘోరసంగ్రామ మొనరించి వీరవరుని
నరకుని వ్వధియించి యానందమొంది
నట్టి భీభత్సరసమూర్తి వరయ నీవె!

అవ్విధిని కురుక్షేత్రమునందుఁ గడఁగి,
కౌరవులపట్ల భీష్ముండు పోరు సలుప,
పార్ధుడప్పుడు, ధైర్యంబు వదలివేయ,
భీమసేనాది వీరులు బెదరిపోవ,
పాండవులసైన్య మయ్యాది పారనున్న
తరుణమందునె చక్రంబు దాల్చి, వారి
కొఱకు భీష్ముని హతమార్పఁ నురికినట్టి,
రౌద్ర రసమూర్తి వీవెకా! రసికవర్య!

అట్లు, గురుఁడు ద్రోణుండు వ్యూహంబుఁ బన్న
దానిలోసొచ్చి యభిమన్యుతనయుఁ డకట
తిరిగివచ్చెడి మార్గంబుఁ దెలియలేక,
శత్రువులచేతులన్బడి చచ్చినపుడు,
మేనయల్లుడంచును విలపించినట్టి,
కరుణరసమూర్తి వీవెకా! కమలనయన!

నీవు పగ్గంబులం దాల్చి, నిలుచునపుడు,
బంధువర్గంబుఁ జంపంగఁ బాపమనుచు
శరము దించిన గాండీవి పరువునిలుప,
శాంతమున్ బూని, మగిడి శస్త్రముచు బట్ట
నింపుగా గీతల నుపదేశించినట్టి,
శాంతరసమూర్తివీవెకా! జలజనయన!
ఇంతలింతలు చేసితివింత యేల,
నవరసంబులు నీవెకా! నళిననయన!



# పారిజాతాపహరణ రచనాకాలము

కుందూరి ఈశ్వరదత్తు గారు, బి. ఏ.,

ముక్కుతిమ్మనార్యకృత పారిజాతాపహరణమును విమర్శించుచుఁగొందఱు భారతిపత్రికలో వ్యాసములు వ్రాయుచుండుటవల్లను కావ్య రచనాకాలనిర్ణయమాంధ్రసారస్వత పరిశోధకులకు ముఖ్యావసరము కావునను, అదియుఁగాక నట్టి కార్యము రాయల చరిత్రకారులకుఁ గూడ నత్యంత ప్రధానవిషయ మాటను, నిదివఱకు కావ్య నిర్మాణకాలము పండితులు నిర్ణయించక పోవుటచేతను, నేనీకార్యమునకుఁ గడంగి యీక్రిందివిధముగ తత్కాలమును నిర్ణయించుచున్నాను.

గ్రంథరచనాకాలనిర్ణయమునకు తిమ్మనార్యుఁడు పారిజాతాపహరణమునందె శ్రీకృష్ణరాయ విజయములంగూర్చి చెప్పిన యీక్రింది మూఁడుపద్యములును మన కత్యంత సహాయ మొనర్చుచున్నవి.

చం. మునుకొని కొండవీటికడ
మూఢత రుద్రుఁడు కృష్ణనందను
న్ననసిఁగానిం జయించె నది
మానుషమే నరసేంద్రు కృష్ణరా
యనృపతి కొండవీటికడ
నాహవభూమిఁ బ్రతాపరుద్రనం
దనుఁ డగు వీరభద్రుఁ గరు
ణామతిగాచె జగత్ప్రసిద్ధిగన్.

ప్రథమాశ్వాసము

మఱియు,

సీ. ఉదయాద్రి వేగ నత్యుద్ధతి సాధించె
వినుకొండ మాట మాత్రనె హరించె,
గూటము ల్పెకరంగఁ గొండవీ డగలించె
బెల్లముకొండ యచ్చెల్లఁ జేఱిచె
వేలుపుగొండ యుద్వృత్తి భంగముసేసె
జల్లిపల్లె సమగ్రశక్తిఁ గూల్చె
గినుకమీఱ ననంతగిరి క్రిందుపడఁజేసె
గంబంబుమెట్టు గ్రక్కునఁ గదల్చె

గీ. బలనికాయము కాలుమట్టుల నడంచు
గటకమును నింకననుమ నుత్కళమహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు.

ప్రథమాశ్వాసము.

శా. సమ్యద్ధక్షమ ధీనిబంధన విధా
సంక్రందనాచార్య భూ
రమ్యన్యాచలవజ్రబాహా, జగతీ
రక్షాంబుజాక్షాశర
ధ్యమ్యాగ్రస్థ దశాస్యరాజ్యసహాస
న్యా ప్రోద్భవాతీత భా
గుమ్మత్తూరి శివంసముద్రపురవ
ప్రోన్మూల నాడంబరా.

రెండవ యాశ్వాసము.

పై పద్యములంబట్టి పారిజాతాపహరణ రచనా కాలమునాటికి శ్రీకృష్ణరాయలు

౧ ఉదయగిరి ౨ వినుకొండ ౩ కొండవీడు ౪ బెల్లముకొండ ౫ వేలుపుకొండ ౬ జల్లిపల్లి ౭ అనంతగిరి ౮ కంబముమెట్టు ౯ ఉమ్మత్తూరు శివంసముద్రములను వశపఱచుకొనెనని స్పష్టముకదా. అదియుఁగాక యెత్తుగీతవల్ల రాయలు కటకముపై దండెత్తవలయునని తలంచుకొన్నట్లును, కటకాధిపతి రాయలు తన దేశముపై దండెత్తి వచ్చునని భయపడుచున్నట్లును గూడ తిమ్మనార్యుండు సూచించుచున్నాడు.

పైని వివరింపఁబడిన స్థలములలో శివంసముద్రమును క్రీ. శ. ౧౫౧౬ సంవత్సరమున రాయలు జయించినట్లును[1] కొండవీటిని జూన్ ౨౩ తేదిని రాయలు స్వాధీనము జేసికొనినట్లును[2] చరిత్రాధారములు కలవు. కొండవీటిముట్టడికిబూర్వము రాయలు అద్దంకి వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ, తంగేడు, కేతవరము మొదలైన ప్రదేశములను జయించి కొండవీటిపై దండువెడలెను. అదియుఁగాక పైని వివరింపఁబడిన మొదటి పద్యములో ప్రతాపరుద్రనందనుఁ డగు వీరభద్రుని పట్టుకొనెనని చెప్పుటకుఁగూడ చరిత్ర సాక్ష్య మిచ్చుచున్నది. తిరువన్నామలై, కాళహస్తి, అమరావతి శాసనములవల్ల ఆవిషయము స్పష్టముగాఁ దెలియుచున్నది.[3] క్రీ. శ. ౧౫౧౫ సంవత్సరమున కృష్ణరాయలు ధరణికోటయందలి యమరేశ్వరుని సందర్శించి యాదేవునికి దానశాసన మొకటి వ్రాయించెను. ఈ శాసనమును మనకుఁ గావలసినంతవఱకు క్రింద నుదహరించుచున్నాను.[4] ఈశాసనకాలమునాటికి శ్రీకృష్ణరాయలుకొండవీటివిజయానంతరము కృష్ణానదీతీరమం దున్నాడని తెలియుచున్నది. శాసనమునుబట్టి రాయలు తులాపురుషదానమును జేసినట్లు తెలియుచున్నది. తిమ్మనార్యుఁడు కూడ పంచమాశ్వాసమున రాయలను మౌక్తిక తులాభార ప్రదా

1. No. 180 of 1913 Epigraphist s Collections.

2. Page 14 The Yet Remembered Ruler of a Long Forgotten Empire. Kondavidu fell according to Kondavidu and Mangalagiri Records on a day equivalent to the 23rd June1515A.D.

3. A. S. R 1908—1909; Page 178.

4 Nos 266, 272of 1897 Madras Epigraphist's Collection—శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులవారి కవిజీవితములు. 506-507.

ధరణికోట శాసనము:—యువ సం॥ర ఆషాఢబహుళ ౧౨ భానువారము.

స్వస్తి శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయరగండ, అరిరాయ విభాళ,......యవన రాజ్యస్థాపనాచార్య గజపతివిభాళ, శ్రీవీరప్రతాప శ్రీ కృష్ణదేవరాయలు విజయనగరాననుండి పూర్వదిగ్విజయయాత్రకు వేంచేసి ఉదయగిరిదుర్గముసాధించి వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ, తంగేడు, కేతవరము మొదలైన దుర్గాలుఅన్నీ ఏకఘాటింగైకొని కొండవీటిదుర్గము లగ్గలుపుచ్చుకొని ప్రతాపరుద్ర గజపతికుమారుడు వీరభద్రరాయనిన్నీ......మొదలగు పాత్రసామంతులను జీవగ్రాహముగపట్టుకొని వారికి అభయదానమిచ్చి ధరణికోటకు అమరేశ్వరులకై వేంచేసి స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౪౩౭ అగు నేటి యువసంవత్సర ఆషాఢ బహుళ ౧౨ భానువారమునకు శ్రీకృష్ణవేణీనదీతీరమందు అమరేశ్వరుల సన్నిధిని తులాపురుష మహాదానము సేయ నవధరించి—.........................

నోన్నతా అని వర్ణించియున్నాఁడు[1]. కాఁబట్టి తిమ్మనార్యుని వర్ణనలు ధరణికోట శాసనకాలము నాటికి సరిపడుచున్నవి.

పైని వివరింపఁబడినట్లు, ఎత్తుగీతలో రాయలు కటకముపై దండెత్త నిశ్చయించికొనినట్లు తెలియుచున్నది. రాయలు కళింగముపై రెండు మూఁడు సారులు దండెత్తి పోయెనని యూహించుటకీ క్రిందియాధారములవల్ల రూఢమగుచున్నది. సింహాచలమునందు రాయలు శా. శ. ౧౪౩౮ (క్రీ. శ. ౧౫౧౬) ధాత సం. చైత్ర బ ౧౨ దినమున నొక శాసనమును[2], శా. శ. ౧౪౪౧ (క్రీ.శ. ౧౫౧౯) ప్రమాది శ్రావణ శు ౧౩ సోమవారమున వేఱొక శాసనము వ్రాయించెను.[3] అనఁగా రాయలు మొదట సింహాద్రివఱకు దిగ్విజయము చేసెనని తెలియుచున్నది. రాయలు సింహాచల నృసింహుని సేవించినట్లు, కళింగముపై దండెత్తి పోయినట్లు తిమ్మనార్యుఁడు వ్రాయలేదు. కాఁబట్టి యతఁడు తన కావ్యమును ధరణికోట శాసనకాలము మొదలు అనఁగా యువసంవత్సర ఆషాఢ బహుళ ద్వాదశి నాటికిని మొదటి సింహాసన శాసనకాలము ధాత సం. చైత్ర బ ౧౨ నాటికిని నడుమ కాలమున రచించి రాయల కంకితమిచ్చి యుండును. రాయలు కొండవీటి విజయానంతరము ధ ర ణి కో ట మీఁదుగా విజయనగరము చేరియుండి, కొంత కాలము విశ్రమించి మఱల, ఉత్తర దిగ్విజయ యాత్రకు వెడలి యుండును. ధరణికోట శాసనకాలమునకును, మొదటి సింహాచల శాసనమునకును మధ్య కాలము తొమ్మిదిమాసములు. రాయలు యువ సంవత్సరము శ్రావణ పౌర్ణమి ప్రాంతములకు విజయనగరమునకు వచ్చి, మఱల నా సంవత్సరముననే మాఘ ఫాల్గుణములలో, గటకముపై దండెత్తుటకు విజయనగరమును విడిచియుండును. కానిచో మఱుసటి వత్సరారంభమునందె రాయలు సింహాచలమునందు తన ప్రచండ సైనికదళములతో నుండుట పొసగనేరదు. ఈ యూహ కాధారమొకటి కనఁబడుచున్నది.† చామర్లకోట కైఫీయతులో 'కొండవీటికి విచ్చేసి దుర్గము చుట్టువార నడచప్పరములు పెట్టించి, దుర్గము లగ్గలు విడిపించి, అందుమీఁదనున్న పాత్ర సామంతులను, మన్నె వారిని జీవగ్రాహముగా పట్టుకొని, వారికి అభయదాన మిచ్చి, అక్కడినుండి విద్యానగరమునకు విజయముచేసి శా. శ. ౧౪౩౭ అగు నేటి యువనామ సంవత్సరమున కళింగదేశము జయించవలెనని విచ్చేసి కర్ణాటకదేశము విడిచి.................' అని యున్నందున పైని నా యూహలకు బలమిచ్చుచున్నది. కావున తిమ్మనార్యుఁడు తన

---

[1] శా. ఏకచ్ఛత్రితసర్వభూతలనృసింహేంద్రక్షమాభృత్తపః, పాకద్యోతితరూపమూర్తికతులాభారప్రదానోన్నతాకోక స్తన్యసమాస్త్రసన్నిభహరిత్కూలంకషోద్యద్యశః, శ్రీకర్ణాటమహేశవైరికరిరాట్సింహప్రతాపోదయా.

2. Epigraphical Reports. Southern Circle No. 329 of 1892

3. Epi-Rep Nos. 244,245 of 1899 కవి జీవితములు పుటలు 509-511.

† Local Records Vol. XIX Page Nos. 125-188. చామర్లకోటకైఫీయతు—కవిజీవితములు. పుటలు 515-516.

కావ్యమును యువ సంవత్సర శ్రావణ మాసమునకును, మాఘ మాసమునకును మధ్య రచించి దానిని రాయల కంకిత మిచ్చియుండును. కొండవీటి విజయము రాయల పరిపాలనకాలముయొక్క చరిత్రకు నూతన యుగమును కల్పించుచున్నది. అట్టిదిగ్విజయమును సూచించుటకు తిమ్మన తనకావ్యమును రచించి వెంటనే రాయని కంకిత మిచ్చియుండును. కావున పై యాధారముల ననుసరించి యువ సంవత్సర మధ్యమున ననఁగా క్రీ. శ. ౧౫౧౫ సంవత్సరము అక్టోబరునెల ప్రాంతమున తిమ్మనార్యుఁడు పారిజాతాపహరణమును రచించి రాయల కంకిత మిచ్చెనని మన మూహింపవచ్చును.



# ఉపలాలనము

శ్రీ శివశంకర శాస్త్రి గారు, సాహితీసమితి

౧

అనిశము వృథాప్రయాసము నందె దేటి
కకట, కామినికై హృదయంబ నీవు!
స్త్రీ వ్యథాకంద మని నీకు దెలియదొక్కొ;
ఆశ్రయింపుము కృష్ణుపాదాంబుజములు!

౨

ఏటికో మానసంబ, ఆరాట పడెద
వయ్యయో, కాంచనమ్ముకై యనవరతము!
అదియ లోహవిశేషమం చవిదితంబె?
ఆశ్రయింపుము కృష్ణుపాదాంబుజములు!

3

బహువిధంబుల నేటికి బాధపడెదు
వివిధవిద్యలకై అయ్యొ, వెర్రిమనస !
కేవలము విద్యలన్నియు గ్లేశమునకె!
ఆశ్రయింపుము కృష్ణు పాదాంబుజములు !

౪

హృదయమా! యింత యుత్కంఠ యేల నీకు
నైహిక సుఖోపలబ్ధికై అక్కటకట!
సుఖము నశ్వర మనియెడి సూక్తి వినవె?
ఆశ్రయింపుము కృష్ణు పాదాంబుజములు!

౫

ఏల కామిని, కాంచనం బేల నీకు,
విద్య లేటికి, సుఖమేల? విడువు మెల్ల !
అతడు సర్వసంత్రాణ పరాయణుండు:
ఆశ్రయింపుము కృష్ణు పాదాంబుజములు!




కవిరాజ్ అయ్యగారి జోగి సోమయాజిశాస్త్రిగారు యమ్.బి. హెచ్.

మనపూర్వులు వేదమందున్న ప్రతిసూక్తముయొక్క ఋషి, దేవత, ఛందస్సులను వరుసగ అనుక్రమణికలయందు మిక్కిలి జాగ్రత్తతో చెప్పినారు.

వారు చాలకాలముక్రిందనే సూక్తములను, ఋక్కులను, పదములను, అక్షరములను కూడ మిక్కిలి శ్రద్ధతో లెక్కపెట్టిరి. ఋగ్వేదమందు 10,402 ఋక్కులును, 153,826 పదములును, 432,000 అక్షరములును గలవు.

శౌనకానుక్రమణికలో ఋగ్వేదమును గూర్చి యిట్లున్నది:—

| మండలములు | అనువాకములు | | సూక్తములు. |
|---|---|---|---|
| ౧ మండలములో | 24 | ను | 191 నుగలవు. |
| ౨ ,, | 4 | ,, | 43 ,, |
| 3 ,, | 5 | ,, | 62 ,, |
| ౪ ,, | 5 | ,, | 58 ,, |
| ౫ ,, | 6 | ,, | 87 ,, |
| ౬ ,, | 6 | ,, | 75 ,, |
| ౭ ,, | 6 | ,, | 104 ,, |
| ౮ ,, | 10 | ,, | 92(+11 వాలఖిల్యలు) |
| ౯ ,, | 7 | ,, | 114 ,, |
| ౧౦ ,, | 12 | ,, | 191 ,, |

౧౦ మండలములలోను85 అను॥ను 1017+11=1028 ను గలవు

## మండలము ౧

దీనిపేరు శతరుచి మండలము. ఇందున్న 191 సూక్తములలోను 44 ఇంద్రుని, 43 అగ్నిహోత్రుని, 15 అశ్వినీదేవతలను, 11 మరుత్తులను, 9 విశ్వేదేవతలను, 4 ఉషను, 4 రిభును, 3 ద్యావాపృథువులను సంబోధించి చెప్పబడినవి. తక్కిన సూక్తములు ఇంద్రాగ్నులు, మిత్రావరుణులు అనేప్రకారము ఇద్దరేసి దేవతలను ఒకే పర్యాయము సంబోధించి చెప్పబడినవి. మరియు 2 సూక్తములు గుఱ్ఱమును సంబోధించును; ౧ సూక్తము అన్న స్తవముగ నున్నది.

## మండలము ౨

ఇందు కేవలము 43 సూక్తములు మాత్రమే గలవు. అన్నిటికి గృత్సమదుడే ఋషియగుటచే, ఇది గృత్సమద మండల మనంబడు. 14 ఇంద్రుని గూర్చియు, వానిలో 2 కపింజల రూపమును దాల్చిన ఇంద్రుని గూర్చియు, 9 అగ్నిని సంబోధించిచెప్పబడినవి.

## మండలము 3

ఇందు 62 సూక్తములు గలవు. వీనికి ఋషి విశ్వామిత్రుడును, అతనివంశమువారును.

## మండలము ౪

ఇందు 58 సూక్తములుగలవు. మొదటి 41, కడపటి 14 సూక్తములకును ఋషి గౌతమపుత్రుడైన వామదేవుడు. 12 సూక్తములు ఇంద్రుని, 11 అగ్నిని సంబోధించి చెప్పబడినవి.

## మండలము ౫

ఇందు 87 సూక్తములు గలవు. ఇందులో 21 అగ్నిని, 11 మిత్రావరుణులను, 9 ఇంద్రుని, 9 మరుత్తులను, 9 విశ్వేదేవతలను, 6 అశ్వినీదేవతలను సంబోధించి చెప్పబడినవి.

## మండలము ౬.

ఈమండలమునకు ఋషి భరద్వాజుడు. ఇందు 75 సూక్తములు గలవు. 21 సూక్తములు ఇంద్రుని, 13

అగ్నిని, 5 పూషను, 4 విశ్వేదేవతలను సంబోధించి చెప్పబడినవి.

మండలము ౭

ఈమండలమునకు ఋషి వశిష్ఠుడు. ఇందు 104 సూక్తములు గలవు. వీనిలో 14 ఇంద్రుని, 13 అగ్నిని, 8 అశ్వినీదేవతలను, 7 ఉషను, 7 విశ్వేదేవతలను, 4 వరుణదేవుని, ౧ కప్పలను సంబోధించి చెప్పబడినవి.. ఇందు వ్యాపించియున్నది త్రిష్టుప్ ఛందస్సు.

మండలము ౮.

ఈమండలమందు చాల ఋషులు గలరు. ఇందు 92 సూక్తములును, వాలఖిల్యలను 11 అనుబంధ సూక్తములును గలవు. వీనిలో 36 ఇంద్రుని, 11 అగ్నిని, 5 విశ్వేదేవతలను, 3 మరుత్తులను సంబోధించి చెప్పబడినవి.

మండలము ౯.

ఇందు 114 సూక్తములు గలవు. 3 సూక్తములు తప్ప,తక్కినవన్నియు సోముని సంబోధించి చెప్పబడినవి. ఈసూక్తములన్నియు, ఉన్ని బట్టలోనుంచి సోమమును వడపోయునపు డుపయోగింపబడును.

మండలము ౧౦.

ఇందు 191 సూక్తములు గలవు. 34 ఇంద్రుని, 25 అగ్నిని, 22 విశ్వేదేవతలను సంబోధించి చెప్పబడినవి. వ్యాధినివారక సూక్తములు, శత్రునాశక సూక్తములు, గర్భస్రావనివారక సూక్తములు మున్నగు బహుసూక్తములిందుగలవు.



## మృతియన భయపడ నేల? *

సెట్టి లక్ష్మీనరసింహము గారు

మాయురే! లోకమున నాదిమానవుండు
రాత్రిని గుఱించి విన్న మాత్రమున
యాత్రముం బొందెనో?వినీలమై ప్రభాస [నెంత
మేతమైనట్టి గగనంపు మేలుకట్టు
కలిగి, కన్గొనియెకిఁ వింత గొలుపు నీప్ర
పంచ మేమానో యని యెంత భయముపడెనో?

అంతలో వేవెలుఁగుమంట యస్తమింప,
అప్పటి యురు ప్రభా ప్రవాహంబునందుఁ
దడియు నునుమంచు తెరనుండి వెడలి వచ్చి,
నింగి నక్షత్రసమితి వెలుంగఁ దొడఁగె

ఇట్లు వెనుకటి కంటె మఱింత హెచ్చు
గాఁగ సృష్టి దృష్టులకును గానఁబడియె.
ఔర! సూర్యుని కిరణచయంబునందు
నిట్టి చీఁకటి కలదని యెవ్వఁడెఱుఁగు?
మఱి కాద్యల్పవస్తువులఱ్ఱులకుఁ గ
నంబఱచి, కోట్ల కొలఁది పెన్మండలములఁ
గానఁబడకుండఁ జేయు భాస్కరుని రశ్మి.

సవితృకాంతి యీ సరణి మోసం బొనర్ప,
నరుని బ్రదుకెట్లు మోసమ్మొనర్చుచున్న
దేమొ? మృతి యన భయపడ నేల యింక?

* Blanco whik's famous sonnet, "Night and Death."

# ఆంధ్ర భారత మందలి రాజ్యపద్ధతి

తనికెళ్ల లక్ష్మీనరసింహము గారు

శ్రీమంతంబై, సకలకళానిలయమై, ధనధాన్యసమృద్ధమై, తన్ను సేవించు కర్షకుల కర్థపేటికయై, రత్నగర్భయను సార్థకనామము వహించిన భారతభూమియొక్క రాజ్యపద్ధతి యాంధ్రభారతమున నెట్లు నిరూపింపఁబడినది? కేవలము నిరంకుశులై, మదోన్మత్తులై స్వేచ్ఛావిహారులై! సమయము బుచ్చువారల హస్తగతంబయి, మూల్గుచుండెడిదా? లేక ప్రజాయత్తమై, బాధ్యతాయుతమై, ప్రాతినిధ్య సంస్కారయుతమై యున్నదా? నాగరిక ప్రపంచమున నేఁడు వివిధ దేశములు వివిధ రీతులఁ బరిపాలింపఁబడుచున్నవి. రషియా దేశమున సోవియట్ (Soviet) పాలనము నడచుచున్నది. ఫ్రాంసు, అమెరికా దేశములందు రిపబ్లిక్ (Republic) ప్రభుత్వము సాగుచున్నది. ఆంగ్లదేశమున లిమిటెడ్ మోనార్కీ (Limited Monarchy) ప్రబలియున్నది. ఇట్లు భిన్నభిన్నరూపములగు ప్రభుత్వపద్ధతులు సాగుచున్నను ఇవి యన్నియు, ప్రజాప్రభుత్వ పద్ధతులుగనే గణింపఁబడుచున్నవి. ఇందేది ప్రశస్తమను విషయమునఁ బ్రఖ్యాత రాజకీయపరిజ్ఞాతలే యేకాభిప్రాయులు గాకుండిరి.

భారతమందొకానొకవిధ మగు లిమిటెడు మోనార్కీయే యనుసరింపఁబడినటులఁ దేలుచున్నది. తదితరములగుపరిపాలనపద్ధతుల నంగీకరించనటులును, రాజుండితీరవలయునని యును నిశ్చయింపఁబడియున్నది.

తే. లోకములు లోకధర్మంబులును నృపాల
రాజమూలముల్ రాజ విరహితమైన
పుడమిజనులకు నింకిన మడువులోని
జలచరంబులు పడుపాటు సంభవిల్లు.
(శాంతి. ద్వి. 265)

మఱియు భీష్ముఁడు ధర్మరాజునకు రాష్ట్రజనుల కర్తవ్యధర్మంబుల నెఱిఁగించుచు

సీ. రాజు నుత్తమగుణభ్రాజిష్ణు నభిషిక్తుఁ
గావించుకొని యెల్లకార్యములును
దన్ముఖంబునఁ జెల్ల దద్దయు సుఖముండ
బడయుదు రొకఁడు భూపాలనంబు
సేతలేకున్న దుశ్చేష్టితులై జను
లన్యోన్యదారధనాపహరణ
మాచరింతురు మీల యట్టుల బలవంతు
లల్పులఁ దమకు నాహారములుగ
గీ. గొంద్రు భూపతిలేకున్న మంద్రె జనము
లధిప కృషిసేయుటయును జేహారమాడు
టయును గోరక్షగావించుటయును మొదలు
గాఁగ బ్రదికెడు తెరువులు గాసిగావె. (255)

వ. వినుము. (256)

సీ. జను లొక్కతరి తొల్లి సమయంబుఁ దమలోనఁ
జేసి క్రూరతయు, బ్రముచ్చిమియు జంకు
సైపకయట్టి దుర్జనునందఱునుగూడి
శాసించువారు గాజాలి తమకు
నధిపతియుగ నొరు నాసపడకయుండి
నడవడి బహుకారణములఁ జిక్క

పడిన విషణ్ణులై బ్రహ్మఁగానగఁ బోయి
మాకు రక్షకుఁడుగ మహిపుఁ డొకఁడు
గీ. వలయు రూపింపు మాతనిఁ గొలిచి బ్రతుకు
వారమనుటయు నజుఁడును వారివలని
కరుణ మనువు నిరూపించె నరుల సత్య
చరితులని పాలనమునకుఁ జేర డతండు.

(శాంతి ద్వి.257)

కావున పై పద్యములఁబట్టి రాజు లేకుండ పాలనంబు దుర్ఘటంబని నిర్వచింపఁబడుచున్నది. రాజు లేకుండినయెడల శుష్కతటాకంబునందలి మీలయట్టుల దల్లడిలుదురనియు, జనులు దుశ్చరిత్రులై యొకరివిత్తముల నొకరపహరింతురనియు, నొకరి కొకరెగ్గుఁ జేసికొందురనియు, చిన్నచేపలను బెద్దచేపలు తినివేయునటుల దుర్బలులను బలవంతులు హింసింతురనియు, నింక ననేక దుష్కార్యములు ప్రబలుటయేగాక వ్యవసాయము, వర్తకము, గోరక్షణ మొదలగు ముఖ్యకార్యములకే భంగము వాటిల్లుననియు సూచింపఁబడినది. కావున రాజవసర మనియే స్థిరపఱుపఁబడినది. పై పద్యములంబట్టి రాజవసరము లేకుండనే ప్రభుత్వనిర్వహణమునకుఁ గడంగినటులు, విఫలీకృతు లయినటులు, మఱల మనువును రాజుగా నేర్పఱచినటులుగూడ నుదాహరింపఁబడినది. కావున రాజవసరమని గ్రహించి ప్రభుత్వ మతని ముఖముననే సాగించిరి. కాని రాజనగా పాలనావిధానమును సరిగా నడపుటకధికారి యనియే గాని నిరంకుశుఁ డని, స్వేచ్ఛ ననుసరించి పాలించువాఁడని గ్రహింపఁగూడదు. అయ్యది క్రిందినిదర్శనములంబట్టి స్పష్టమగును.

రాజెట్టివాఁడుగా నుండవలయును, రాజును నియమించుకొనుటలో ప్రజల కేవైన హక్కు లున్నవా, లేక యొకానొకరాజు నిరంకుశుఁ డగుచో వాని బాధల కోర్చి ప్రజ లూరకొనవలసినదేనా, నిరంకుశత్వమణచుటకు మార్గము లేవైనఁ గలవా యను విషయము లీక్రింది యంశములంబట్టి స్పష్టమయ్యెడిని. సాధారణముగ నొకానొక వంశీయులే రాజ్యపాలనంబు సేయుచుండెడివారు. ఇచ్చట నొక ప్రశ్న వెలువడుచున్నది. పైపద్ధతి ప్రజానుకూలపాలనసూత్రముల కభిమతమేనా యని. దీనికి ప్రస్తుత మాంగ్లదేశమున నుండు ఆచారము నింతియే యనియు, దానివలన పాలనాసౌకర్యముల కెట్టిభంగమును గలుగలేదనియు గ్రహియించుచో నా సందియము వెలువడదు. కాని గద్దె నెక్కినరాజు మాత్రము ప్రజాభిప్రాయానుకూలుఁడై, వారిమన్ననకుఁ బాత్రుఁడైనవాఁడుగా నుండవలయును. రాజున కుండవలసిన ముఖ్యగుణము లీక్రిందిపద్యములందు వివరింపఁబడినవి.

క. రాజునకుఁ బ్రజశరీరము
రాజుఁ బ్రజకు నాత్మగాన రాజుం బ్రజయుఁ
రాజోత్తమ యన్యోన్య వి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్.

శాంతి. ద్వి. 274

ఇంకను రాజు

క. దాంతియుఁ బ్రియవాదిత్వము
శాంతియు శీలంబుఁ గలుగు జగతీశుఁడు శ్రీ
మంతుండు యశస్వియునై
యెంతయు సౌఖ్యంబు నొందు నిభ పురనాథా!

ఇంకను రాజు సర్వవిద్యలం దారితేరిన వాఁడుగను, విద్యాధికులయెడ గౌరవంబు గల వాఁడుగను, బంధుగులయం దనురాగంబుగల వాఁడుగను, సేవకులయెడ నాదరణము సూపు వాఁడుగను నుండవలయునని నిరూపింపఁ బడినది. అంతకును ముఖ్యమైనది ప్రజాహితుఁడుగ నుండవలయును. ఇదిగాక పై నుదహరింపఁబడిన సీసపద్యమందు "రాజు నుత్తమగుణ భ్రాజిష్ణు నభిషిక్తుఁ గావించుకొని యెల్ల కార్యములును దన్ముఖంబునఁ జెల్లఁ దద్దయు సుఖముండఁబడయుదు"రని యుండుటంజేసి ప్రజలు రాజు నెన్నుకొనవలసినట్లు నట్టిగుణవంతునిమాత్రమే యెన్నుకొనునట్లును నిర్వచింపఁబడుచున్నది. కావున రాజు నెన్నుకొనుటయందు ప్రజలకు చాల బాధ్యతగలదని గుర్తింపఁదగియున్నది. పైన వివరింపఁబడిన గుణవంతుఁడుమాత్రమే రాజ్యపదార్హుఁడని యుండుటఁ జేసి, రాజు నిరంకుశుఁడు గానేరడని తెలుచున్నది.

ఇంకను బరిశీలించుచో, నిరంకుశుఁడగు ప్రభువునకు తావులేదనిగూడ ధృవపడుచున్నది. నహుషుఁడు విద్యావంతులను నిందించినందులకు పదభ్రష్టుఁ డాయెను. వేనుండనువాఁడు ప్రజలకు విరుద్ధుఁడగుట రాజ్యపదభ్రష్టుఁడాయెను. అతఁడు రాజ్యచ్యుతుఁడగుటయు, నాతనిసుతుఁడు తండ్రివలెఁగాక సరిగా పాలనాభారము వహించుటయు, భారతము శాంతిపర్వము ద్వితీయాశ్వాసము 205-208 పద్యములం దుదహరింపఁబడినవి. రాజు భోగపరుఁడై విలాసములఁ దగుల్గొని, రాజ్యాంగ విషయములందు పాల్గొని ప్రజల యిక్కట్టు లరయకపోవుటచే, రాజ్యపదవీ చ్యుతుఁడయ్యె గావున రాజు ప్రజానురాగము గల వాఁడుగను, బ్రజలచే నెన్నుకొనఁబడువాఁడుగను, బ్రజేచ్ఛనుగుర్తించి పాలించువాఁడుగను నుండవలయునని యూహింపఁదగును.

రాజు తన కర్యనిర్వహణమునందు జూపవలసినజాగ్రత, తాను చేయవలసినపనులు, నుద్యోగములనిచ్చునపుడు చూపవలసిన దూరాలోచన, నీక్రింది యుదాహరణములంబట్టి గననగును. ఉద్యోగముల నిచ్చునపుడు ప్రజేచ్ఛను గుర్తింపవలసిన బాధ్యత మెండు. శాంతిపర్వము కాలకవృక్షీయ క్షేమదర్శి సంవాదమునందు

సీ. జ్ఞానపరుఁడు పౌరజానపదాప్తుఁడు
కార్యజ్ఞుఁడును ధైర్యశౌర్యఘనుఁడు
నగ్రహారుఁడును, విశుద్ధాత్ముఁడు పతియెడ
భక్త్యనురాగ సంభ్రమము లెసఁగ
సమసుఖదుఃఖుఁడై చెమరునెత్తురు గాఁగ
దలఁచుచు నరయక తప్పుమీద
బెట్టిన నలుకమై దిట్టినఁ గలకఁ దా
నందక తేర్చుచో బొందు సెడక
గీ. మెలఁగువాఁడును నిజరంధ్రములకు మాటు
సేయ పరరంధ్రములఁ గని చిక్కువఱుపఁ
జాలు నిపుణుండునైన విశాలబుద్ధిఁ
గానలయు మంత్రిముఖ్యుండు గౌరవేంద్ర.
శాంతి. ద్వి. 369.

అన్నియుండుటంజేసి మంత్రి రాజున కిచ్చవచ్చినవాఁడుగాక పౌర, జానపదాప్తుఁడుగా నుండవలయు ననుటచే, బ్రజలచే నెన్నుకొనబడువాఁడుగా నుండవలయునని సూచింపఁబడుచున్నది. ప్రధానమంత్రి సామ్రాజ్యప్రజ

లందఱు యనుమతిపైన తదున్నతస్థాన మలంక రించువాఁడని తెలుచున్నది. ఇంకను ప్రభుత్వ మందు వివిధవ్యవహారములనుఁ జూచుటకు వివిధరాజ్యాంగములమీఁదను వేఱ్ఱేరు మంత్రు లనుగూడ నియమించవలసినటుల శాంతిపర్వ మున ధర్మరాజు పట్టాభిషేకమహోత్సవమునం దీక్రింది విధమున సూచింపఁబడుచున్నది.

"వ.........యువరాజుపదంబున భీమ సేను నిలిపి, కర్తవ్యవిచారంబునకుం దదీయ నిశ్చయంబునకును సంధివిగ్రహాది షాడ్గుణ్య చింతనంబునకును విదురునిఁ బ్రియవచనపూర్వ కముగా నియోగించి, వలయుపనులు వెనుక ముందు లరసి యెఱింగించుటకును సంజయుం జొనిపి, సేనల కొలందులం గనుంగొనుటకు, భృత్యులకు జీవితంబులు వెట్టుటకు కర్మకలాపంబులు సేయించుటకు నకులు నాజ్ఞా పించి, దర్పితుల మర్దించుటకు, పరచక్రంబుల నాక్రమించుటకు నర్జును నిర్దేశించి, బ్రాహ్మణ కార్యంబులకు, శ్రౌతస్మార్తకృత్య సమనుష్ఠా నంబునకు ధౌమ్యుం జాలించి, సహదేవుంజూచి నీవు మదీయగోపన పరుండవయి సర్వావస్థల యందును మత్సమీపంబున నిల్చునది యని పలికి, మఱియుం గరణీయంబులగు నధికారం బులనెల్లనుఁ గల్పించి వారలమీఁదన వెట్టి యు యుత్సుం గనుంగొని విదురసంజయుల నాలో కించి, మీర లనుదినంబును నవధానంబుగలిగి రాచవారి యోగక్షేమంబులే వెల్లెట్లు నిర్వ హింపవలయు, పురజనంబుల భూజనంబుల రాచవారి కెఱింగించి పంచినట్లు నడుపంగల వారలని యప్పగించి........................"

పై వాక్యములంబట్టి కార్యనిర్వహణ భార మామంత్రులపై నున్నటులే దేలుచున్నది. ప్రస్తుతమున ఆంగ్లదేశమునం దెట్టులున్నదో యట్టులే కార్యనిర్వాహకవర్గముగా ప్రధాన మంత్రియగు విదురుఁడు, మిగతవారలగు సంజ యుఁడు, యుయుత్సుఁడు మొదలగువారు గలసియుందురని తెలుచున్నది. వీరే ప్రధాన వర్గము (Cabinet form of government) గా నేర్పడి వ్యవహారములను జక్కజేతురు. రాజునకుమాత్రము వ్యవహారములు చక్కగా నడచుచున్న సంగతిఁ దెలియఁబఱచవలెనని యున్నది. కావున పరిపాలనావిషయమున నేఁడు మహానాగరికత ననుభవించుచున్నదని గర్వించుచున్న యాంగ్లదేశ మెటులఁ బరి పాలింపఁబడు చున్నదో యటులే నిర్వహింపఁ బడెనని తెలుచున్నది. ఇట్లు కార్యనిర్వాహక వర్గమున్నపుడు, శాసనసభలంబోలు ప్రజా ప్రాతినిధ్యము వహించినసభ లేవైనఁగలవా యను ప్రశ్న వెలువడుచున్నది. రాజ్యాంగ విషయనిర్వహణసమయమున, సభలను గావించి, విద్వజ్జనముఖ్యులను, లౌకికతంత్ర వేత్తలగు వయోవృద్ధులను సలహాజేసి వ్యవ హరింపవలసినటుల సూచింపఁబడినది.

సీ. ................ల్ల కార్యములమంత్రి
జనములతోడ విచారించి చేయంగ వలయును
..........................

ఆశ్రమ. ప్ర. 58

ఇంకను శాంతిపర్వము బృహస్పతి సుమ నుండను రాజునకు చెప్పిన రాజనీతియందలి వచనభాగంబునుఁ బరికింపుడు.

"వ. మఱియు రాజునకు రక్షింపవలయునది స్వామ్యమాత్యజనపరకోశసైన్య మిత్ర దుర్గంబులు,గన్నిడి యరయవలయునది సంధివిగ్రహయానాసనద్వైధీభావ సమాశ్రయంబులను షాడ్గుణ్యంబు, నడుపవలయునది ధర్మార్థకామంబులను వర్గత్రితయంబు, బాటింపవలయునది మంత్రి, ప్రభుత్వోత్సాహంబులను శక్తిత్రయంబు, నిజవశవర్తిం జేయవలయునది సత్వరజస్తమంబులను గుణత్రికంబు ......ప్రమాదంబున నర్థకామంబులు హీనంబులైనను, ధర్మనిష్ఠంజేసి ధరణీ పరిపాలనంబు సుస్థిరంబై జెల్లు........దుర్మంత్రుల కుటిలవాక్యంబులకు లోనుగాక నయవిక్రమజ్ఞులైన యమాత్యులతో దైవమానుష చింతనంబుసేయుచు........ప్రజలఁ బాలించు భూపతి యుభయలోక సిద్ధులంబొందు. (శాంతి. ద్వి. 285) వీటింబట్టి ప్రజానద్భావ పాత్రులుగాని మంత్రులను బాటింపఁ గూడదనియు, సన్మంత్రుల సలహాలను దప్పక యంగీకరించవలయుననియు నిశ్చయింపఁబడినది. కావున రాజు నిరంకుశుఁడు గాకుంటయేఁగాక ప్రభుత్వము ప్రజాయత్తమనియు, ప్రాతినిధ్య ప్రభుత్వమనియు నూహింపఁదగినది.

ఇఁక పన్నులు విధించుటయందు ప్రజల నాలోచించి వారి యనుమతి ననుసరించి వసూలుచేయవలయును. పన్నుల రాబడికై యధర్మము పొంతఁ బోవగూడదు.

క. ధనమునకై ధర్మము బెస
ననాదరము సేసెనేని యానృపతికి న
ధనమును జెడు దుర్యశమం
బనుగొను దుది దుర్గతియును బాటిలు ననఘా.
శాంతి. ద్వి. 409.

పై పద్యమునుబట్టి రాజునకు స్వేచ్ఛ ననుసరించి పన్నులు విధించుచో, దుర్గతిగూడ వచ్చుననియున్నది. దుర్గతియను దానియందు పదభ్రష్టత్వముగూడ నిమిడియున్నదని యెఱుంగవలయును.

క. న్యాయంబుతోడ వివిధో
పాయంబుల నర్థముల నుపార్జింపుము భూ
నాయక............

.. .................... (ఆశ్ర. ప్ర. 63)

న్యాయముననుసరించి ప్రజల యామోదమును బడసి పన్నులను వసూలు చేయవలయుట నీపద్యముగూడ బలపఱచుచున్నది. భీష్ముఁడు రాష్ట్రప్రజల కర్తవ్యధర్మంబులు ధర్మతనయునితో ముచ్చటించుచు నీక్రింది విధముగఁ జెప్పియున్నాడు.

"వ. ప్రజలచేతఁ బశువులయందును, బసిండియందును, నేబదియగు నంశంబును, ధాన్యంబున దశమభాగంబును భండారంబుగా బుచ్చికొని ......(శాంతి. ద్వి. 258)

కావున పన్ను వసూలుచేయునపు డిష్టము వచ్చినటులఁగాక యాదాయము ననుసరించి సరియగు పద్ధతిని బుచ్చుకొనునటుల నిర్వచింపబడుచున్నది. ఇంకను భండారంబువృద్ధిసేయు పద్ధతులు భీష్ముఁడు ధర్మరాజున కెఱింగించినట్లు పన్నులు, వేయునపుడు ప్రజల కావిషయము ముందుగా నెఱింగించి, వారియనుమతి బడసి వసూలు సేయునటు లున్నది. ప్రతివస్తువుపైన పన్ను విధింపఁగూడదు. పన్నులు రాబట్టఁగల స్థలములు కొన్నిమాత్రమేగలవు.

క. వినుము కర్షకులును వణిజులు
ననఘా గోరక్షకులు ధరాధీశునకుఁ

ధన మొదవగూడెడి చోటుల
కనేకవిధములకు నెల్ల నాద్యస్థలముల్.
(శాంతి. ద్వి. 391)

దీనింబట్టి పన్ను రాబట్టఁగల స్థలములు వ్యాపారంబు సేయువారలవద్ద నుండియు, వ్యవసాయము సేయువారల వద్దనుండియు, గోరక్షణ సేయువారల వద్దనుండియు నని యూహింపఁదగియున్నది. ఆరోజులందు, భారత దేశమున ప్రధానవృత్తులు, జీవితాధారములు నీమూడే యయి యున్నవి గాన వాటినుండి పన్నులు రాబట్టవలయు నని నిర్వచింపఁబడి యున్నది. ఆవ్యాపారములు వృద్ధి యగుకొలఁది పన్నులు గూడ వృద్ధిసేయవచ్చును. ఎప్పుడు నొకే రీతిని పన్నులు వసూలు సేయుట రాజనీతి గాదని యెఱింగియే యిటుల నిశ్చయించిరి. నేటి రాజనీతిజ్ఞులు పన్నులు వృద్ధిఁబొందుటకు, నవసర సమయములందు తఱుగుట కవకాశ ముండవలె నని (Elastic nature of Taxation) యూహించినటులే యారోజులందుగూడ నూహించిరి.

క. అరయుటఁ బ్రజ వర్ధింపఁగ
నరి యేశేటం బ్రవృద్ధమానట్టులుగా
నరపతికిఁగొనఁగ వచ్చు
న్వెరవులుఁ బెంపంగఁ జాల నెఱయు ధనంబుల్.
శాంతి. ద్వి. 394

దీనింబట్టి యవసర సమయములందు వెరవులు గూడ వృద్ధినొందించుట కవకాశము గలదని యూహింపనగును.

ఇట్లు వసూలుచేసిన పన్నులు వినియోగించుటకుగూడ మార్గములు నిర్ణయింపఁబడి యున్నవి. భీష్ముఁడు ధర్మజునకుం జెప్పిన నీతినిబట్టి ప్రజలవలన రాబట్టిన ధనమును రాజు తనభోగముల ననుభవించుటకు గాక, వ్యవసాయాభివృద్ధికి, సేనలఁ బోషించుటకు, విద్యావంతులఁ బోషించుటకు, రాజ్యకార్యనిర్వాహణమునకు మొదలగువాటికే యుపయోగింపవలయును.

తే. ధనములకు ధాన్యములకు నుత్పత్తి తలకు
లయినవాని కించుకయును హానిగాక
యుండ దనకును భండార మొదవఁదగు ను
పార్జనము సేయవలయు భూపాలకుండు.

కేదారంబులు పండినచో రాజునకు ధనముఁ గూడును. కాటకములు మొదలగు బాధలు తొలఁగును. కాన వాటిని సరిగా జూచుచుండవలయునని హెచ్చరింపఁబడినది.

క. మూలబలము సంతుష్టం
బై లాలితమగుచునున్న యప్పుడ
టాలోకించి నడువభూ
పాలకునకు దండమతిశుభం బొనరించున్.
శాంతి. ద్వి. 413.

క. తనభటులు కలగినప్పుడు
ధనమిచ్చి విరోధి నల్పతరునైనను శాం
తునుచేయవలయు దానను
నన యధికుని దీర్పు టురవు నరపతి కెపుడున్.
(415)

కాన సైన్యమును బోషించుటకు తగినధనమును వ్యయపఱచవలెను. తన్ను నమ్మినవారికిని, రాజ్యమునకు మేలొనగూర్చెడి వారికిని ధనమిచ్చి సంతుష్టపఱుపవలయును. నగర రక్షణముల కుపయోగింపవలయును.

దండనీతియందును, న్యాయాన్యాయ విమర్శనమందును రాజు నడచుకొనవలసిన పద్ధతులుగూడ వివరింపఁబడి యున్నవి.

సీ. వ్యవహారశుద్ధి సర్వప్రజా ప్రియకారి
యదియ భూపతికి ధర్మాతిశయముఁ
గీర్తియుఁ జేయు నక్షీణసత్త్వులు ధర్మ
పరులును నైన భూసురులు నీవు
ద్రాసులంబోని చిత్తంబుల తోడుతఁ
బ్రజలవాదము లెడ పక్షమడిగి
విని ఘనవాంఛమై ధనికులఁదెస ప్రాలి
తీర్పక ధర్మంబు తెరువు దప్ప
గీ. కుండ బాడి దీర్చి దండింపఁదగు నెడ
ననుగణింపు దండ మాచరింపు
మెలుగ బకికి తేని నుండదు ప్రజ డేగఁ
గనిన పులుగుబిండు కరణిఁ జెదరు. (శాంతి. ద్వి. 374)

క. నఱకుట, యర్థముఁ గొనుటయుఁ
జెఱ నునుచుట కట్టి యడఁచి చేట్పా టొంపం
బఱచుటలు మొదలుగ గల పలు
తెఱగులఁ దగవు మెయినడఁచు ధీరవిచారా. (376)

పైపద్యములందు రాజు లనుసరింపనగు దండనీతులు, న్యాయావిమర్శనలందు వారు నడచుకొనవలసిన పద్ధతులు సమగ్రముగ వివరింపఁబడియున్నవి. న్యాయము విక్రయింపఁ బడఁగూడదనియు, ధనాపేక్షచే న్యాయము నరికట్టఁగూడదనియు నున్నది. ధృతరాష్ట్రుఁడు ధర్మరాజునకు బోధించిన నీతియం దీపద్యముఁ గననగును.

సీ. వ్యవహారములు శుచులైన విద్వాంసులఁ
దోడుగఁ గొని తీర్పు దుష్ట జనులఁ
దండించునెడ వారితప్పుల కొలఁదులు
మదిఁ దూచి చూచి తన్మాత్రదండ
మాచరింపుము విను మాయవ్యయములు సం
క్షేపరూపంబున రేపకడలు
దానికి మను దేవతాపూజనము భూసు
రార్చనమును జేయు మమలబుద్ధి.
(ఆశ్రమ, ప్రథ. 61)

ఇంకను దైనిక రాజకీయవ్యవహారములందు రాజు చూపవలసిన శ్రద్ధ వివిధస్థలములయందు వర్ణింపఁబడినది. సర్వకాలములయందును విద్వాంసులతోడను, లౌకికజ్ఞానులతోడను, తదితరులతోడను సంప్రదించి వ్యవహార పరిష్కారము చేయవలసినది రాజునకు విధి. శాసననిర్మాణ మెప్పుడును సభలలో నాలోచించి పౌరజానపదుల యామోదముంబడసి చేయవలసినది రాజునకు విధి. ఇంకను రాజునకు ప్రజలయెడఁగల బాధ్యతలను దెలసికొనుటకు ధర్మరాజునకు భీష్మ ధృతరాష్ట్ర నారదాదు లుపదేశించిన వాక్యములు చూడదగినవి.

తరువాత నేఁడు నాగరిక ప్రపంచమున పట్టణములు పురపాలకసంఘములు మొదలగువాటిచే నెటులఁ బాలింపఁబడుచున్నవో యెటుల తమకు సంబంధించినంతవఱకు స్వాతంత్ర్య మనుభవించుచున్నవో, యెట్టి సంబంధములు పట్టణములకును మొత్తము దేశమునకు నున్నవో, యట్టివిధముననే పూర్వము నుండినటుల భారతమునుబట్టి గ్రహింపనగును. చుట్టును లోతుగల పరిఘ, ఘనమగుకోట, రమ్యగృహములు, నందమగు వీధులు, నన్ని వస్తువులచే నిండిన యంగళ్లు, నానావిధధాన్యములు, ఘృతాదిరసద్రవ్యములు, పరాక్రమవంతులగు యోధులు, పండితులు, దూతముఖ్యపరిజనంబులు మొదలగువానితో పట్టణంబు శోభిల్లుచుండవలయును.

క. స్థలముఖ్యములయ్యెడు పే
ర్కొల యూళ్లల నెల్ల వెరవుగ నెఱిగిన విశ్వా
సులఁ బ్రభుతయిచ్చి భూపతి
నిలుపవలయు వర్ణరక్షణీయత నెయుఁగా.

(శాంతి. ద్వి. 386)

కావున పెద్దపట్టణములను ప్రముఖస్థలములను జూచుటయందే మటుకయుండవలయును. వెరవు గలట్టి విశ్వాసులైనట్టివారిని నియమించి, వారిచే ప్రభుత్వమును సాగింపవలయును. నేఁడు ముఖ్య పట్టణములందు కచ్చేరులనుంచి తన్ముఖంబున ప్రభుత్వ మెటుల సాగింపఁబడుచున్నదో యట్టి పద్ధతియే యాదినములం దుండెడిదని యూహింపఁదగియున్నది. అట్టి ముఖ్యపట్టణములు చోరులచేఁ జెడకుండ, క్రూరుల దాడినుండి, కాపాడుచు పన్నుల ననీకముగా బుచ్చుకొనక, ప్రజలు సంతోషపూర్వకముగ నిచ్చిన యర్పణములను గొనుచుండవలయును.

క. చోరులచే జెడకుండం
క్రూరులచే జావకుండఁ గుజలయజనులన్
జారులచేఁ బడకుండ ధ
రారమణుఁడు నేర్పుఁగలిగి రక్షింపవలెన్.
.....................
.....................

క. అరి మిగులఁ గొనుట గ్రేపులఁ
బొరిమాలంబిదికినట్లు భూవర కదపున్
వెరవునఁ బెనిచినయట్లుగ
నరపతిప్రజచేత నప్పనముఁ దగఁగొనిరన్.
(శాంతి. ద్వి. 382-389)

ప్రతిగ్రామమందును లౌక్యులను, విద్వాంసులను, గలిపి కూటముగఁ జేసి గ్రామములకు గావలసిన సౌఖ్యముల నారయునటులను, నేరస్థులను విచారించునటులు వివాదాంశములఁ బరిష్కరించునటులను, ప్రతిగ్రామమందును దేవాలయము, సత్రము మొదలగు పురమందిరము లుండునటులును, గ్రామనౌకరులు, వివిధ పారిశ్రామికులు మొదలగు సౌకర్యము లన్నియు గలిగియుండునటు లొప్పియుండవలయు నను విషయమునకు నిదర్శనములు పలుతావులం దుండుటయే గాక, యచ్చటచ్చటఁ గావింపఁబడిన పురవర్ణనలను బరికించిన స్పష్టమగును.

కావున భారతమునం దొకవిధమగు బాధ్యతగల ప్రభుత్వమే వర్ణింపఁబడినది. తన సామ్రాజ్యమందలివిద్వచ్ఛిఖామణులతో నాలోచింపవలసిన ప్రభువు, లౌక్యులతో నాలోచింపవలసిన ప్రభువు, ప్రజాహితులకే మంత్రిపదవుల నీయవలసిన ప్రభువు, ప్రజలయామోదమును బడసి పన్నులను విధించి యా పన్నులను ప్రజోపయోగకరము లగు వాణిజ్యము, కృషి, గోరక్షణ మొదలగువాటికే యుపయోగింపవలసిన ప్రభువు, ప్రజేచ్ఛను గుర్తించి తదనుగుణముగనే వర్తింపవలసిన ప్రభువు నిరంకుశుఁడు గానేరఁడు.

కాని యిచ్చట నొకప్రశ్న వెలువడుచున్నది. రాజు నింతగా స్తోత్రవాక్యములచేఁ బొగడి, యతిశయోక్తులకుఁ గడఁగి, ప్రతివ్యవహారమును, ప్రతిసంస్కారమును రాజు చేసినట్లే యేల వరింపఁబడవలె నను ప్రశ్న బయలువెడలుచున్నది. రాజు రాష్ట్రమున కెల్ల ప్రథమపౌరుఁడుగ గ్రహింపఁబడెను. కార్యనిర్వహణమందు గూడ నతనికి ప్రధానస్థానము గలదు. సభాధ్యక్షత వహించిన యాతఁ డెట్టిస్థానము నలంకరించునో, యట్టి స్థానమునే యలంకరించి యుండెను. మింటో మార్లే సంస్కరణములు మాంటేగు చెమ్స్ఫర్డు సంస్కరణములు అనినంతమాత్రమున నా సంస్కరణములకు వా రిరువురే కర్తలు

గారని మనమెట్లూహించుచున్నామో యటులనే రాజు నామ మున్నంతమాత్రమున పొరబడగూడదు. ఆకాలమున రాజు తన యధికార నిర్వహణమును బట్టియేగాక, వ్యక్తిరూపక మగు సుగుణములచేఁ గూడ ప్రజానురాగమును బడసెడివాఁడు. అధికమగు విద్య, పరోపకారచింతనము, గురుభక్తి, నమ్రత, స్వగౌరవపోషణము, వివిధాయుధోపయోగకౌశలము, దేహబలము మొదలగు ననేక గుణములు ప్రజలయం దనురాగమును ప్రబలఁజేసెడివి. కాన ప్రజలు వానియం దట్టి గౌరవముంచి యన్ని కార్యములు నాతనిపరముగనే నిర్వహించుచుండెడివారు. పరంపరగా ప్రభువులందఱును ప్రజానుకూలురును, ప్రజామోదకులునగుటచే నావాడుక సంప్రదాయమయ్యెను. దానింబట్టి మఱియొకతీరునఁ దలఁపఁగూడదు.

రాజునకు ప్రభుత్వ నిర్వహణమునం దెట్టి బాధ్యతగలదో ప్రజలకుఁగూడ ప్రభుత్వము నెడలను, రాష్ట్రమునెడలను, రాజునెడలను పరస్పరముగ గలదని గ్రహింపనగును. తాను జన్మించిన రాష్ట్రముయొక్క యభివృద్ధి కెటుల దోడ్పడవలసినదియు భారతము శాంతిపర్వమునందు, నితరచోటులందును గలదు. రాజ్యపదవి చాల గౌరవమగునది. రాజు ప్రజానురంజకుఁడు గావలసినవాఁడయినంత మాత్రమున, నాస్థానగౌరవమునకెట్టి భంగమును వాటిల్లఁగూడదు. కావుననే ప్రజ రాజునెడభక్త్యనురాగములు గలవారై యుండవలయునని భారతమందంతటను పదేపదే నొక్కివక్కాణింపఁబడినది. రాజు విష్ణ్వంశాసంభూతుఁ డనుటకు నదియే కారణము. కార్యనిర్వహణభారము వహించిన ప్రభువునకు దండనీతి నాచరణలో బెట్టుటయందు నాదాయమును గూర్చుటయందు, న్యాయసూత్రముల ననుసరింపఁజేయుటయందు, పాలనము సక్రమముగ జరిగించుటయందు నెట్టి బాధ్యతగలదో యట్లే ప్రజలకునామర్యాదలను బాటించుట విధియైయున్నది. వెలుతురునకును ఛాయకును గల యట్టి యవినాభావసంబంధమే ప్రభువునకును ప్రజకును గలదని భారతమందు నిర్వచింపఁబడినది.

కావున దీనింబట్టి భారతమం దొకవిధమగు బాధ్యతాయుత ప్రభుత్వ ముండెడిదనియు, రాజు ప్రజలయందును, ప్రజలు రాజునందును, రాష్ట్రమునందును బాధ్యతగలవారై యుండిరనియుఁ దేలుచున్నది.



ఆంధ్రదేశము-గాలివాన, 16-5-1925.



భగ్నములైన సోడాషాపులు, పండ్లదుకాణములు, కూరలమార్కెట్టు—బందరు



తాడేపల్లిగూడెమునొద్ద తలక్రిందైన రైలుబండ్లు



# క వి స్తు తి

గార్లదిన్నె సుబ్బారావు గారు

కవులన్, జిత్రపదార్థనిత్యరచనాకౌశల్యపంకేరుహో
ద్భవులన్, హార్ద్యతమఃప్రభేదనకళాపారీణసుజ్ఞానభా
రవులన్, స్వీయసుకావ్యమూల వివిధార్థప్రాపణామర్త్యధే
నువులన్, సంతతవాక్ప్రపంచభరణానూనప్రభావేందిరా
ధవులన్, భావమహోర్మికాచయసముత్పత్తిక్రియాంభఃసిం
ధువులన్, సర్వదిగంతలేపితయశోద్ధూతప్రపూర్ణామృతాం
శువులన్, విశ్రుతకావ్యనాటకమణిస్తోమోజ్జ్వలద్రత్నసా
నువులన్, మిక్కిలి సన్నుతింపవలదే నోరెత్తి, సామాన్యమా
నవులంబోలె వచింపనెట్లగు? జగన్మాన్యుల్ గదా! బుద్ధివై
భవమొప్పార జగద్ధితార్థముగ నేవ్రాతల్ మహిన్ వ్రాసిరో
యవి యాదర్శములై, శిలాక్షరములై, యామ్నాయతుల్యంబులై
యవనిన్ శాస్త్రములై ప్రకాశిలుటఁ గన్నారన్విలోకింపమే
నవమాధుర్యము చిప్పిలింపఁగను శృంగారంబువర్ణింప, మా
నివరుండైనను స్థైర్యమేది తపమున్ నిష్ఠన్ వెసన్ ద్రోయుచున్
నవలా పేటకుఁ బాఱిపోవ డెటు? విజ్ఞానంబుఁ జెప్పంగ బూ
న, విటుండైనను దుర్ణయుండయిన, "ఛీ! నాబుద్ధి కా"దం చెఱిం
గి, విరక్తుండయి జ్ఞానికాడెటుల? భక్తింగూర్చి బోధింపఁగా
నవివేకుండును నాస్తికుండయినఁ బ్రహ్లాదుండు గానోపడే
యవియట్లుండఁగ, వీరముట్టిపడ సమ్యగ్రీతి వర్ణింప, భీ
రువైయున్న భయమేది ధీరుఁడగుచున్ రుద్రావతారంబుఁ బొం
ది విజృంభింపడె? యిట్లు లోకచయమున్ ద్రిప్పన్ సమర్థుల్ గదా!
కవులంబట్టి యనేకభూధవయశఃకాంతుల్ భువిన్ నేటిదా
క విరాజిల్లుటకాదె? తద్రచిత సద్గ్రంథాళియే సాక్షి, యే
ల విశేషంబుగవ్రాయ, వాక్యములు పల్కంజాల వర్షంబుగాన్.



# కృష్ణదేవరాయల యాస్థానిలోని కన్నడకవులు

ఆ. రంగస్వామి సరస్వతి గారు, బి. యే.

కృష్ణదేవరాయల కీర్తి యాంధ్రవాఙ్మయమం దతిప్రసిద్ధము. అట్లే కర్ణాటక వాఙ్మయమునందును చాల ప్రసిద్ధము. కృష్ణరాయల యాస్థానియందు కర్ణాటక కవిసార్వభౌముఁడను బిరుదు గలిగిన తిమ్మణ్ణయను కవి యుండెను. ఆంధ్రమునందు భారతము నన్నయభట్టారకునిచే మూఁడుపర్వములు తెనిగింపబడి పిదప కొంతకాలమువఱకు నసమగ్రముగానే యుండగా మనుమసిద్ధి నృపాలుని యాస్థానమందు ప్రధానియు కవిరాజునై యుండిన తిక్కన యెట్లు రాజుకోర్కిపై మిగిలియుండిన పదునేనుపర్వముల దెలిగించెనో అట్లే కర్ణాటకమున కుమారవ్యాసుఁడను నామాంతరమును బొందిన నారణప్ప యనుకవి భారతమున పదిపర్వములు కన్నడించి యసంపూర్ణముగా వదలిన పదునొకండవ పర్వము అనగా శాంతి పర్వము మొదలు తుదిదనుక కృష్ణరాయల యాంస్థానములో తిమ్మణ్ణ పూర్తి చేసెను. ఈ విషయమున కృష్ణరాయలు మనుచరిత్ర వ్రాయుసందర్భమున పెద్దనార్యుని సమ్మానించి 'కృతి రచింపుము మాకు శిరీషకుసుమపేశల సుధామయోక్తులఁ బెద్దనార్య' అని యడిగినట్లే రాయలు పేరోలగంబున విద్వత్కవిజనుల సమక్షమున కర్ణాటక కవికుల సార్వభౌముఁడను బిరుదుగల్గిన తిమ్మణ్ణకవినిజూచి తాంబూల వస్త్ర భూషణాదులచే నాతనిసత్కరించి కుమారవ్యాస మహాకవి రచించి యసంపూర్ణముగా వదలిన భారతము పూర్తిచేయుమని యడిగెను. ఈవిషయమును తిమ్మణకవియే తన గ్రంథమునఁ బేర్కొని యున్నాఁడు. కృష్ణరాయలు తన యాముక్తమాల్యదనువలెనే తిమ్మణ్ణయు తనభారతమును వెంకటేశున కంకితమిచ్చుచు ప్రతిసంధి కడపటను కృతిపతిని గూర్చి చెప్పుచో కృష్ణరాయని నుత్తమునిగాఁ జేసిన వెంకటేశుఁడు, కృష్ణరాయనికి చింతితార్థముల నొసగు వెంకటేశుఁడు, కృష్ణరాయని హృదయమందు వసించు వెంకటేశుఁడు అని యనేకవిధముల ప్రశంసించినాఁడు. ఆంధ్రమున కృతిపతిని గ్రంథములలో బేర్కొనువిధమునకు కన్నడమున కృతిపతిని బేర్కొనువిధమునకు కొంతభేదమున్నది. ప్రధానకథతో సంబంధములేకుండినను కృతిపతినామము నేదో మిషచే యాశ్వాసాంతపద్యములలో జొనుపునది కన్నడగ్రంథములవాడుక. ఆంధ్రమున గ్రంథమునకు సంబంధములేకయే కృతిపతినిసంబోధించు వేఱుపద్యములు వ్రాయుటవాడుక. త్యాగరాయకృతులు మువ్వగోపాల పదములు ఇత్యాది గ్రంథములయందు కృతిపతి, కృతికర్తల నామములవలెనే కన్నడగ్రంథములయందును కృతిపతినామము జొన్పఁబడును.

కృష్ణరాయభారతమున శాంతిపర్వము మొదట నిచ్చియుండు రాజవంశావళి నిందు కన్నడపద్యములనే యిచ్చుచున్నాను.

శ్రీలలనె యురుకుచయు గంగళ మేలెసెవకుంకుమవుప త్తివి
శాలవక్షది సంజెవెరసిద రజనియింతెసెయె
లీలెయలి నిజభక్త జనకను| కూలనె నిసువ వెంకటేశను
పాలిసలి నరసేంద్ర నాత్మజ కృష్ణరాయనను. 1

శ్రీమహీ మెయిసూ దక్షిణాంగదివామభాగవనప్పియాత్మ
రామసుఖి యెందెనిప పంపాపతి విరూపాక్ష
కామితార్థవ కొడుత బహుళ| ప్రేమదలి రక్షిసలి నృపసు
త్రామ నరసమహీశనందన కృష్ణరాయనను 2

వరరజతహిమగిరిగళను మొద|లెరడనా నిర్మిసిదెనివు బే
రెరడు జనిసివెయందు వాణీ స్తనగళను నోడి
ఇరదె నలివ విరించ నీయలి | కరుణదలి దీర్ఘాయువను వర
నరస నరపాలక కుమారక కృష్ణరాయనిగే. 3

హరియెదెయదావళిగె హరివి| ష్టరవదెనిసితు సకలలోకో
త్కరగళావళ పొంగపాతది జీవిసుత్తిహుదూ
పరమశక్తియెనుత్త సురముని| వరరు నుతిసువరానవళినా
సిరినృసింహన కృష్ణరాయన మనెయొళోలిదిరలీ. 4

శ్రీరుచిరకటదానపాథో| ధారెగళతన్నీక్షణ దకరు
ణారసవ గెలలోలసెప గంధర్వసంచయదా
చారుగానవ మదకెరగిదళి| నారియర రవ గెలలు రంజిప
వారణాననగణపనిర్విఘ్నతెయనీగమగే. 5

సరసిజోద్భవనెసెవ ముఖపం|కరుహమష్యదిహం సెయంబం
తిరె విరాజిసుతిప్ప వరవాణీనితంబినియా
పరమమూర్తియ మానసదొళా|నిరిసితన్నయకావ్యరచనెగె
వరదెయాగెందధికభక్తియొ ళెరగినుతిసువెనూ. 6

పెసరువడెదెసూ తుళువవంశదొ|ళసమభుజబలతిమ్మనృపనుద
యిసిదనాభూపతియ పుణ్యాద ఫలవిదెం బంతె
కుసుమసాయకరూపనాశ్రిత| విసరరక్షకనబ్ధి వలయిత
వసుధెగధిపతి ఈశ్వరక్షితి నాథ జనియిసిదా. 7

ఆత మాడిదనేక సుకృత, వ్రాతగళనిస్నేన హేళువె
భూతళకె తా కల్ప భూరుహనాగియుపకరిసీ
శ్రీతరుణియురుక్కెపెయలధికఖ్యాతిననఘభాగ్యజితపురు,
హూతనను నరసక్షమాధిప రత్నవను పడెదా.

ఆ నరసభూవరన శౌర్యవ|నేనసెంబెను సకలవసుధా
జానిగళ నిజభృత్యవర్గదొళైదె నిలిసిదనూ
దీనజనదారిద్ర్యఫణికుల వైనతేయను నిశ్చలిత స
మ్మానదలి షోడశమహాదానగళ విరచిసిదా. 9

ఆత కొళ్ళదదుర్గవొంది|ల్లాతనాళద రాజ్యమొంది
ల్లాత మాడదదానధర్మా వళిగళొం దిల్ల
ఆతనరియద విద్యెయొంది ల్లాత సుఖిసద భోగ వొంది
ల్లీతెరది భుజశక్తియిందాళిదను భూతళవా 10

సిరియ పాణిగ్రహణదోషదిహరియొడనె విూనాదనాదొడె
హిరియహద్దదనొద్దుదెంబుదు భూప్రసిద్ధవలే
వరపతివ్రతె నాగమాంబెయ|కరవహిడిదానరస భూపతి
ధరెయనాళ్దను బాళ్దనధికతరప్రమోదదలీ. 11

నవదశైకాదశదసంఖ్యెయధవర నెరె వరి సిద్ధ వాజ్మా
శివెయరెణేయె నాగమాంబా సత్పతివ్రతెగే
సవడిసతియరకాణెవెనుతీ|భువనదలి సత్కీర్తిదుగ్ధా
ర్ణవ విరాజిసుతిర్ప్పదా చంద్రార్కపరియంత. 12

ప్రకృతిపురషనినాద జగదర్భకనొ? భావిసె మేణు గంగా
ప్రకట కాశీశ్వరనినాదతిపుణ్యతానెనలు
సుకృతఫలదలి నరసభూపాలకగె తత్సతియె నిప నాగాం
బికెగె జనిసిద కృష్ణరాయనుదారగుణయుతనూ. 13

లలితనందనదల్లి సురతరు|బెళెవ తెరదలి వీరవితరణ
బెళదుదాతన కూడి బెళదుదు కీర్తిలతెయొడనె
బళికవిద్యానగరి యలి భుజ బలది పట్టవకట్టి కొండొలి
దిళెయనాళిదనఖిళకర్ణాటాధిపతియాగి. 14

సోమసూర్యరు రాజలోక గ్రామణిగళైకె కవత్సర
వామహాత్మరిగరసుతన బళి కొమ్మె సచివత్వ
ఆమహీమెకిడెసస్యధాన్యస్తోమకధిపతి యహరుశౌర్యో
ద్దామన రసయకృష్ణరాయనె నిత్యనృపభాగ్య. 15

మిరుగుతిహ వరసింధువసనద| సెరగ విష్ణుగె హాసి భూవధు
వోరగిదళుభుజదల్లినరసయ కృష్ణభూవరనా
ఎరకవొబ్బర మేలెయిరలద|నరియదే కామినిగె యొలిదవ
నరవరాహనె యప్పుదనె యభినైసిదను చక్రి. 16

జనపనరసయకృష్ణరాయనవనజగృహె నచ్చిరగలు విరహది
ననవరతహరి సిరియహారలెణె యెనుత శంఖవను
ఘునజఘునచక్రక్కె చక్రవ మినుగుతిహపంశక్కె కౌస్తుభ
వను భుజాలింగనకె వనమాలెయను ధరిసి దదూ. 17

అరుణనుదయదమింబెసూర్యనపరమ తేజదమహిమె యంద
నిరదె విద్యుత్ ప్రభెయహిందువ యుసిద పవియంతే [ది
అరిగళెదెజర్ఝరితవాగుత్తిరలు తందెయశౌర్య సమనం
తరదొళొప్పువకృష్ణరాయన మహిమెరంజిసితు. 18

జ్ఞానిగళొళనవరతభక్తి ధ్యానపరరెందెనిప నాధర
శ్రీనివాసనుబిడదెసలహువ తెరదలజనీగా
దానియల్లదధరెయలిరుతిహ మానవరసలహుచరెసృజిసిద
నీన్నృసింహకుమార నెనిసువ కృష్ణరాయననూ. 19

శివను నారీకవచకీడావనుపన్నగ రాజశరవ
భ్రువన దేతక్కెణిసలదు జీవనవబిట్టిహుదు
నవనెనగ దారెనుతలత్యుత్సవ ది నరసయకృష్ణరాయన
నవళకీర్తిసుధాంశు గర్విసుతిర్పుదనవరతా. 20

హెళవనెళెయదె బెళగలాపుదె నళినమిత్రన తేజవనిలను
సుళిదుహెచ్చిసదిద్దరుంటే వహ్ని యాటోప
తిళియె తానసహాయిసూగుచ్ఛళినరసయకృష్ణరాయన
లలితభుజతేజఃకృశాను ప్రభెవిజృంభిసితు. 21

జేరిరలు పోసజాజి తరువిరె సారఫల పరజిరలు పిడివక
తారిమొనెమెరవంతె నళనహుషాదినృపకులవా
ధారుణీశర కీర్తియిరలీ ధీరనరసయకృష్ణరాయను
హీరహారసుకీర చంద్రికె జగదొళొప్పిదుదు 22

నోడి రత్నవబెలెయనిడువరు నాడొళెల్లరు సత్కవీంద్రరు
రూఢిసుతలిహశుక్తిరత్నవ శేళి బెలెయిడువా
ఆడలేకిన్నావ భూభుజకీడు నరసయ కృష్ణరాయన
కూడనుత కొండాడు తిర్పుదు వందిసందోహా. 23

ఇంతు నరసయ కృష్ణరాయన నంతదేశాధిపరు సేవిసె
సంతస దొళరమనెయొళొడ్డోలగదొళొలిదిర్దూ
కంతుసమనురు భారతదకథెయంత హెయ్యదె శేళితన్నదృ
గంతదలి నోడిదను ధరెతుళుకాడె కవిజనవా. 24

పూతభారద్వాజకుల విఖ్యాతపదవాక్యప్రమాణ
జ్ఞాతిశయవిఖ్యాతభానుక వీంద్ర నాత్మజనా
ప్రీతియలి తిమ్మణ్ణన కరదు వినూతనాధికవస్త్ర భూషా
వ్రాతగళ కొట్టెడకె మన్నిసిబళికలింతెందా. 25

తేపెనిసి మొదలాకుమార వ్యాస దళపర్వగళపే ళిద
భాసురవిదెందెనిసి భారతదుళిదపర్వగళా
నీ సకలజగ మెచ్చువంతె విలాసదలిపేళెందెను తలుప
దేశిసిద నరసేంద్ర నాత్మజకృష్ణరాయనృపా. 26

సురనదియ యమునాతరంగిణి బెరసిహరివందదలికవికుం
జరకుమారవ్యాసనురువా గ్లహరి యొడనీగా
సరియెనిసినీ కూడిసైసురు చిరభవత్కవితాప్రవాహవ
పరమపుణ్య నిధానవహుదెను తలి నిరూపిసిదా. 27

ఎనె హసాదవెనుత్తకైకొండనఘుభారతకథెయకడెమెయ
జనపనరసయకృష్ణరాయనిగంకితవ మాడి
మనవొలిదుకవిభాను భట్టన తనుజ తిమ్మణ్ణనఖిల విద్వ
జ్జన నలివవోల్ పేళ్దముందణ వరకథామృతవా. 28

ఈ పై పద్యములవలన కవితండ్రి భానుకవి భారద్వాజకులమునఁ బుట్టిన ట్లును పదవాక్యప్రమాణజ్ఞాతిశయుఁ డనియును తిమ్మణకవికి 'కర్ణాటక కవిసార్వభౌము' డని బిరుదుండినట్లును తెలియును. కవిసార్వభౌమబిరుద మాంధ్ర పాఠకులెఱిగినదే. డింకిమకవిసార్వభౌముఁడును, శ్రీనాథకవిసార్వభౌముఁడును ప్రౌఢదేవరాయల కాలములోనుండిరి. అట్లే యీ తిమ్మణకృష్ణరాయలకాలములో నుండెను. ఈ బిరుదము కర్ణాటకకవిసార్వభౌముఁ డని యుండుటచే నా కాలమందే ఆంధ్రకవి సార్వభౌముఁడు గీర్వాణకవి సార్వభౌముఁడు నను బిరుదులతో నితరకవు లుండియుందురని సందేహము పొడముచున్నది.

తిమ్మణకవిగాక కృష్ణరాయలకాలములో ప్రసిద్ధులైన యితర కర్ణాటకకవులు నుండిరి. వీరిలో ముఖ్యుఁడు వ్యాసతీర్థులు. ఈయన

మధ్వాచార్యు లని ప్రసిద్ధిచెందిన ద్వైతమత స్థాపకుఁడైన యానందతీర్థుల శిష్యపరంపరలోఁ జేరిన సన్న్యాసి. వ్యాసరాయమఠ మను ప్రసిద్ధమాధ్వమఠమునకు స్థాపకుఁడు. ఈయ నకు విద్యాగురువు శ్రీపాదరాయలు. ఈ శ్రీపాదరాయలు మధ్వమఠములలో నొకటి యగు ముళుబాగిలు మఠమున కధిపతి. ఈ యన పేరు లక్ష్మీనారాయణముని యయినను శ్రీపాదరాయ లనియే లోకమున ప్రసిద్ధి. పిదప బ్రహ్మణ్యతీర్థు లను మధ్వసన్న్యాసికి శిష్యుఁడై చాల ప్రసిద్ధి కెక్కెను. వ్యాసరాయ లు సంస్కృతమున తాత్పర్యచంద్రిక, తర్క తాండవము, న్యాయామృతము మున్నగు నుద్గ్రంథముల ననేకముల రచించెను. ఈగురు వులను గూర్చి సంస్కృతమున వ్యాసవిజయ మను నొకగ్రంథము కలదు. కృష్ణరాయల కొకకాలమున కుహూయోగమును చెడ్డయో గము సంభవించుననియు, నది రాజునకు చాల చెడు గొనర్చు ననియు, నాకాలమున రాజు తనరాజ్యమును వదలియుండిన మేలనియు జ్యోతిష్కులు చెప్పఁగా కృష్ణరాయ లీవ్యాస తీర్థులను తన సింహాసనముపై నుంచి యా యోగము ముగిసిన పిదప సింహాసన మెక్కె ననియు నీగ్రంథమం దున్నది. ఈసమయమున రాజసింహాసన మెక్కినందుననే వ్యాసతీర్థులకు వ్యాసరాయ లని పేరువచ్చినట్లును, ఆయన మఠమునకు కొన్ని రాజచిహ్నము లీయబడి నట్లును అవి నేటికిని జరుగుచున్నట్లును జనులు చెప్పుదురు. ఈమఠ మిప్పుడు మైసూరురాజ్య ములో 'సోసలె' యను ప్రదేశమున నున్నది.

కృష్ణదేవరాయ లీ యాచార్యునకు తన రాజధానియగు విజయనగరపట్టణమున తాను క్రొత్తగా కట్టి ప్రతిష్ఠించిన విట్ఠలనాథుని యాలయమునను, తిరుపతి, కంచి మొదలగు కొన్ని ప్రాచీనవిష్ణ్వాలయము లందును కొన్ని మర్యాద లేర్పఱచెను. వానిలోఁ గొన్ని యాయన శిష్యవర్గమువారికి నేడును జరుగు చున్నవి. ఈవ్యాసతీర్థులు కన్నడమందును గొప్పకవి. ఈయన యనేక కీర్తనలు వ్రాసెను. అవి నేటికిని వ్యవహారములో నున్నవి. ఈపాటలు న్నియు కృష్ణునిపేరనున్నవి. కొన్నిటియందు కృష్ణునిపేరువచ్చుచోట కృష్ణరాయయనికూడ గన్పడుచున్నది. తన్నాదరించిన ప్రభువుపై గౌరవము దెల్పుటకై యిట్లు వ్రాసెనని కొంద అందురు.

వ్యాసవిజయ మందలికథ కెంతో పిదప వ్రాయబడుటచేత నది చరిత్రకంత విలువ గలదగునా? వెనుకటికాలమునను లనుకొను కథమాత్రమేకదా యందుండునది? ఈ వ్యాస తీర్థులకును కృష్ణరాయలకును గల సంబం ధము వే తెచ్చటనైన గలదా? ఇటీవల వ్యాసయోగి చరితము అను ప్రాచీన గ్రంథము దొరకినది. ఈగ్రంథము కృష్ణ రాయలచరిత్రమునకును ఆకాలపు మతసాం ఘికస్థితులను దెలుపుటకును ముఖ్యమైనదగు టచే నందలికథ ఇచ్చట యియ్యబడును. మైసూరు రాజ్యములో మైసూరునకు సమీప మునందలి బన్నూరనుగ్రామమున నొకబ్రాహ్మ ణదంపతులు చిరకాలముసంతానములేక పరిత పించుచుండగా నొకనాడు వారి స్వప్నములో

వేదవ్యాసుఁడగపడి వారికొక జ్యోతిచే వెలుగు పణ్ణెము నిచ్చి, యాకాలములో ప్రసిద్ధుఁడైన బ్రహ్మణ్య తీర్థుల సేవచేసినవారికి సంతానము గలుగునని చెప్పెను. అట్లే వారు బ్రహ్మణ్యతీర్థుల శుశ్రూష చేయగా నొకకుమారుఁడు కలిగెను. ఆకుమారునికి వారు వ్యాసుడను నామముంచిరి. ఆ బాలుని వర్చస్సును జూచి యతనిచేత తనసంప్రదాయమునకు చాల యభివృద్ధిగలుగునని తెలిసికొని యతనిని బ్రహ్మణ్యతీర్థులు తలిదండ్రులయొద్దనుండి అడిగితీసికొనెను. కొంత కాలము బ్రహ్మణ్యతీర్థుల యొద్ద విద్యనేర్చి యాబాలుఁడు తీర్థయాత్ర చేసి యనేకపుణ్యస్థలములఁ దర్శించి కంచి నుండి 'ముళుబాగిలు' అను ప్రదేశమున కేగెను. అచ్చటనుండిన శ్రీపాదరాయల యొద్ద సకలశాస్త్రముల నభ్యసించెను. పిదప శ్రీపాదరాయలు ఘనగిరి (పెనుకొండ)లో నప్పుడే రాజ్యమునకువచ్చి పాలించుచుండిన నరసభూపాలుని యాస్థానమునకుఁబో నియమించెను. వ్యాసతీర్థులును రాజుచే సత్కరింపబడి చాలకాలము పెనుకొండయందే యుండెను. కొంతకాలమునకు పిదప నరసరాజు విజయనగరము నాక్రమించుకొని యచ్చటి సింహాసన మధిష్ఠించెను. నరసరాయలు నతని నుచితవిధి సత్కరించెను. అనేకదేశముల విద్వాంసులతో వాదము లొనర్చి అతఁడు జయముగాంచెను. నరసరాయల వెనుక నతని కుమారుఁడు వీరనరసింహరాజును వ్యాసతీర్థుల నుచితరీతి గౌరవించుచుండెను. వీరనరసింహరాయల పిదప కృష్ణరాయలు రాజయ్యెను. కళింగదేశపురాజు ప్రతాపరుద్రుఁడు కృష్ణరాయలకు తనయాస్థానిలోని విద్వాంసు నొకనిచే వ్రాయఁబడిన యొక వేదాంత గ్రంథమునుఁ బంపెను. ఆగ్రంథమును రాయలు పరిశోధార్థము వ్యాసతీర్థుల కొసఁగెను. ఆయన గ్రంథమును వివరించుశక్తికి సభవారందఱు నాశ్చర్యపడిరి.

పిదప కృష్ణరాయలు వ్యాసరాయలఁ దనసింహాసనముపై గూర్చుండఁజేసి కనకరత్నాభిషేకము కావించెను. ఆరత్నములను వ్యాసతీర్థులు విద్వాంసులకు పంచిపెట్టెను. ఈ యభిషేకముచే తన పాపములన్నియుఁ బోగా కృష్ణరాయ డనేకవిజయము లందెను. రాయలు తనకొసఁగిన వ్యాససముద్ర మను గ్రామమున వ్యాసతీర్థులు వ్యాససముద్ర మను గొప్ప చెఱువుఁ ద్రవ్వించెను. కృష్ణరాయల యనంతర మతనితమ్ముఁడు అచ్యుతరాయలు రాజై వ్యాసతీర్థులను యథాపూర్వము గౌరవించుచుండెను. ఈ వ్యాసయోగిచరిత్రమును వ్యాసతీర్థుల సమకాలికుఁడును శిష్యుఁడు నగు సోమనాథుఁడను కవి వ్రాసినాఁడు.

వ్యాసతీర్థుల శిష్యులలో నింకొకడు పురందరదాసుఁ డను ప్రసిద్ధకవి. ఈయన కీర్తన లిప్పటికి ప్రసిద్ధములు. మొట్టమొదట విజయనగరమందే గొప్పయుద్యోగమునందుండి యైశ్వర్య మనుభవించి దైవానుగ్రహముచే విరక్తుఁడై వ్యాసతీర్థులకు శిష్యుఁడై తన ధనమంతయు బీదలకు పంచిపెట్టి తంబుర, తాళముల చేఁబట్టి జన్మమంతయు భగవద్గుణకీర్తన

మందే పురందరదాసుఁడు గడపెను. ఈయనఁ గూర్చి యిప్పటికిని హరికథగా జెప్పబడు కథలు గలవు. అందితనిభక్తి యనేకవిధముల గొనియాడఁబడును. ఈకథయందు కృష్ణరాయలను గూర్చియు వ్యాసతీర్థులనుఁ గూర్చియుఁ గొన్ని యైతిహ్యము లగుపడును. ఈయన కీర్తన లన్నిటియందు 'పురందరవిఠల' యను నీయననామము కడపట చొన్పబడి యుండును.

కనకదాసను నింకొక కన్నడకవియు కృష్ణరాయలకాలములో నుండెనందురు. ఇతఁడును పురంధరదాసుని వలెనే వ్యాసతీర్థుల శిష్యుఁడు; బోయ జాతిలోఁ బుట్టియు నాచార్యానుగ్రహము చే జ్ఞానమంది గొప్పకవి యయ్యెనట. ఈతనికీర్తనలును పురందర దాసు కీర్తనలవలెనే ప్రసిద్ధములు. అయిన నితఁడు కృష్ణరాయల కాలమున నుండెనా? ఇతఁడు వ్యాసతీర్థుల శిష్యులనుకథ వాస్తవమా యని కొందఱు పండితులు సందేహింతురు. కన్నడమందితనిపేర మోహనతరంగిణి, హరిభక్తిసారము, నళచరిత్ర మొదలగు గ్రంథములును కీర్తనలును గలవు. అయిన నీ గ్రంథములకర్త వ్యాసతీర్థుల శిష్యుఁడు కాఁడనుట కతనిగ్రంథములయందుండు రామానుజ గురుస్తుతియు తాతాచార్యుల ప్రశంసయు కారణములు. కీర్తనలను వ్రాసిన కనకదాసుఁడును ప్రబంధకర్తయు భిన్నపురుషులేమో.

కృష్ణరాయల యాస్థానిలో నితరులనేకులు సంగీతవిద్వాంసులుండిరి. వీరిలోఁ గొందఱినిగూర్చి బ్ర. శ్రీ. వే. ప్రభాకరశాస్త్రిగారు భారతిలో చర్చించియున్నారు. ఆవ్యాసమువలన వారియోగ్యతా ప్రాముఖ్యములు తెలియనగును. కృష్ణరాయల కంకితముగా బండారు లక్ష్మీనారాయణుఁడను కవి సంగీత సూర్యోదయమను గ్రంథమును రచించెను. ఈగ్రంథమునుండియు నీ భండారు లక్ష్మీనారాయణుని కంకితమై భానుకవికృతమైన పంచతంత్రినుండియు రాయల యాస్థానమందలి మఱికొందరు పండితకవుల పేర్లు మనకు తెలియుచున్నవి. వీరిలో కొందఱు సంగీతవిద్యా పారంగతులు; వీరుగాక కృష్ణరాయలకు గాంధర్వ కళ నుపదేశించి యతనియొద్ద ఘన మౌక్తిక గుచ్ఛహార పూర్వకముగా బిరుదములను బొందిన కృష్ణనామక పండితుఁడుండెనట. ఇతఁడు బాల్యమునందే సకలశాస్త్రముల నభ్యసించి వైణికవర్ణగాన విద్యలో నారితేరెను. ఈ వంశమువారు విజయనగర రాజధానియందే వసించియుండిరి. ఈకృష్ణపండితుఁడు సుప్రసిద్ధద్వైతమతాచార్యులైన రాఘవేంద్రతీర్థుల మాతామహునితండ్రి. ఈవిషయము రాఘవేంద్ర తీర్థులనుగుఱించి వారి పూర్వాశ్రమ బంధువైన నారాయణకవి రచించిన రాఘవేంద్రవిజయమునీక్రిందిశ్లోకములతోనున్నవి.

జనకోపమకన్యకేన్వయేస్మిన్
నిజతాతాధిక నందనే గుణౌఘైః,
అనుజాతేసమానపూర్వజాతే
భవదేకోభువికృష్ణనామధామా
ఉపదిశ్యసకృష్ణభూపలారే
ర్నిజగాంధర్వకలాంకలామగృహ్ణాత్,
ఘన మౌక్తికహారగుచ్ఛపూర్వాం
బిరుదాళీంగురుదక్షిణాప దేశాత్,

అకృధిత్యసబాల్య ఏవశాస్త్రీ
ణ్యధికం వైణిక వర్ణగాన విద్యామ్,
నగరీం విజయాఖ్యమధ్యతిష్ఠత్
జననీతాత సుహృజ్జనాధివాసమ్.

మధ్వమతమునకు సంబంధించిన ప్రసిద్ధ వ్యాఖ్యాతయగు 'యదుపత్యాచార్యుఁడ'ను నింకొక విద్వాంసుఁడును రాయలకాలములో విజయనగరమందే యుండెను. ఒక కాలమున నీయన రాయలకు రాజ్యపరిపాలనపద్ధతిని గూర్చి సంస్కృతమున వ్రాసిన యుత్తర మొకటి నేటికి నున్నదట. ఈ యుత్తరము కొఱకై ప్రయత్నించుచున్నాను. దొరకిన యెడల నీపత్రికయందే ప్రకటింతును. వ్యాసతీర్థులు కృష్ణరాయలచే మెప్పువడసి యనేక స్థలములలో తనదగు మధ్వమతమునకు ముఖ్యాచార్యుఁడగు హనుమంతుని దేవాలయములను నిర్మించెను. వీనిలో నన్నిటికంటెను ముఖ్యము ప్రప్రథమమున నాయన విజయనగరరాజధానియం దేర్పరచినది. ఇప్పుడు పాడువడియుండు విజయనగరమందలి జీర్ణదేవాలయములలో నింకనుపూజజరుగుచుండు వానిలో నిది యొకటి. ఈ యాలయములోని హనుమంతునకు యంత్రోద్ధారక హనుమన్మూర్తి యని పేరు. ఆ విగ్రహము యంత్రమధ్యమున హనుమంతుఁడు కూర్చుండినట్లు చిత్రించియున్నది. చుట్టుప్రక్కలవారీహనుమంతుని చాల ప్రభావవంతునిగా నెంచి పూజింతురు. ఈ విగ్రహములో నొకవిశేషము కలదు. విగ్రహముయొక్క ముఖము మనుష్యముఖముగా చిత్రించియున్నది. ఈహనుమద్విగ్రహమునే మధ్వమతస్థాపకుఁడైన యానందతీర్థుల యాకృతిగాఁ బూజింతురట. మాధ్వసంప్రదాయమున మధ్వాచార్యుడు హనుమంతునియొక్క యవతారము.

వ్యాసతీర్థు లనేకదేశములలో దిగ్విజయముచేసి సంప్రదాయవృద్ధి యొనర్చి చివరకు విజయనగరరాజధానిఁ జేరి యందుండియే పరమపదించెనట. వీరి బృందావనము విజయనగర సమీపమందు తుంగభద్రలో నొక చిన్నదీవిలో నున్నది. అచ్చట నీవ్యాసతీర్థులే కాక నితరు లెనమండ్రాచార్యులయొక్క బృందావనము లున్నవి. కనుకనే యాప్రదేశమునకు నేటికిని నవబృందావనమని పేరు. మధ్వమతస్థుల కిదిముఖ్యమైనయాత్రాస్థలము.

ఈప్రకారమే కృష్ణరాయల యాస్థానమందుండిన ఓడ్రము, మహారాష్ట్రము, ఘూర్జరము మొదలయినదేశముల కవులయొక్కయు విద్వాంసులయొక్కయు చరిత్రము క్రమేణ తెలుపఁబడును.



* ఈ వ్యాసమునం దుదహరించిన వ్యాసయోగిచరితము క్రొత్తగాఁదొరకిన గ్రంథము. దీనిని వ్యాసరాయమఠ సర్వాధికారియగు ఎమ్. శ్రీనివాసమూర్తిగారు శీఘ్రమున ముద్రింతురు. గ్రంథముయొక్క సారాంశము 'మిథిక్ సొసైటీ' బెంగళూరువారి పత్రికలో బి. వెంకోబరా వనువారు వ్రాసినదానినుండి గైకొనబడినది.




# పార్వతి యనుతాపము

రాయసం వేంకటశివుఁడు గారు

(సంపుటము ౨. సంచిక ౫ తరువాయి)

## ౭. శాంతినికేతనము

సీ. శమదమోన్నతుల కీ చతురుఁడాధారంబు-
దాక్షిణ్యమునకు నీతండు చోటు.
—ఉత్తరరామాయణము.

ఆనాఁటిరాత్రి నేరెడువలసలో భార్యచే నిరసింపఁబడిన విశ్వనాథము, ఆగ్రహోద్రిక్తచిత్తుఁడై గర్వమునకు ప్రాయశ్చిత్తముగ తనభార్యను కలకాలమును సాంసారికసుఖము నందకుండఁ జేయవలయు నని సంకల్పించెను. అట్టిసతి చెట్టపట్టిన పాపమునకుఁ బ్రతీకారముగాఁ దానును గృహస్థజీవితమునకు వెలియయ్యెదనని ప్రతినపట్టెను. రైలుస్టేషను చేరువఱకును, తానెక్కడకుఁ బోవుచున్నదియు విశ్వనాథమునకుఁ దెలియదు. రెయిలుప్రయాణమునందును వాని మనసున కారాటము తగ్గకుండెను. మఱునాఁటి యుదయమునకు వానిమనస్సు కొంతమెత్తపడెను. తానేయిడుమలఁ బడినను, తన యాగ్రహానలమున కబలయగుభార్య జీవితము నాహుతిచేయుట తగదని విశ్వనాథమునకుఁ దోఁచి పార్వతి యనుతాపమునొంది చక్కఁబడినచో దాంపత్యసుఖము తిరిగి తమకు లభింపఁగలదని యామెకు లేఖ వ్రాసి, ఖడ్గపురితపాలపెట్టెలో వైచెను. ఇట్లు మనసు కొంతశాంతిపఱచుకొని, పరిపూర్ణశాంతి నొందు కోరికతో నతఁడు బోల్పూరునందలి శాంతినికేతనము చేరెను.

ఆయాశ్రమమందలి వృక్షరాజముల నీడలను విద్య నేర్చుకొను యువకుల యుత్సాహమును గనిపెట్టుచును, అందలి బోధనపద్ధతులకును సామాన్యవిద్యాలయములందలి వానికిని గలభేదమారయుచును, విశ్వనాథము తన మనోవ్యథ నుపశమించుకొనఁజూచెను. కాని, దుఃఖము వాని మనఃక్షేత్రమున వ్రేళ్లుపాఁతియుండెను. సాధారణ చికిత్సలవలన నసాధారణవ్యాధులు నివారితములు గావని యతఁ డిపుడు గనిపెట్టెను.

విశ్వనాథునికి గత్యంతర మేమి? రవీంద్రుఁడు రవీంద్రునివలెనే సతతము కవిత్వ వియత్పథముననే చరించుచుండును—శిష్యులు నొజ్జలును నియుక్త కార్యములందే రేయింబవళ్లు గడపుచుందురు. విదేశీయులగు వారిచెవులకుఁ దన తెలుఁగుమాటలవలెనే, వారిహృదయములకుఁ దనమనస్తాపము దుర్గ్రాహ్యమని విశ్వనాథము గనిపెట్టెను.

ఒకనాఁడు విశ్వనాథను మనఃక్లేశములబారినుండి తన్ను రక్షింపగలవా రీవిశ్వమున లేకుండుటకు వగచి, పెద్ద సాలవృక్షము క్రిందను దీర్ఘ విచారముతోఁ గూర్చుని యుండెను. వాని మనమునకపుడు ముల్లోకములు శూన్యమైన నటులఁ గానిపించెను. తన కొండవీటిసీమ, బాల్యకాలపు విద్యాపరిశ్రమము, మామగృహవైభవము, గర్వముతో మిడిసిపడెడి గృహిణి, వెతలపాలయిన తలిదండ్రులు, పాడువడిన పైరుపంటలు, సగముసాగిన యుత్తమోద్యమములు,— ఇవియన్నియు వాని మనోనేత్రము నెదుటఁ దాండవింపఁదొడంగెను. ఇన్నికష్టముల కగ్గమైన తన కెవరు శరణమా యని యాయువకుఁడు దైన్యము నొంది, ముఖము వంచుకొనియుండెను. కన్నులనుండి బాష్పజలము బొటబొట రాలుచుండెను.

అపుడొక మనుజుఁడు వెనుకనుండి వచ్చి, వానిభుజముమీఁదఁ జేయియిడి, "భాయీ! నీవిచారమునకుఁ గారణమేమి?" యని యడిగెను. అతఁడాయాశ్రమపరిచారకులలో నొకఁడు. పాలిపోయిన ముఖముతో చింకితట్ట చేతఁబట్టి, అచటి చెత్తచెదారములను వీఁడు చిమ్ముచుండు

వాఁడు. ఇట్టివాఁ డా విశ్వనాథము సంగతి యార్చువాఁడును దీర్చువాఁడును!“నా బాధలు దేవుని కెఱుక, నీదారిని నీవు పొమ్మ”ని విశ్వనాథము హిందీతో వానికిఁ జెప్పి పైచి, తలవంచుకొని తిరిగి తుదలేని తలంపులలో మునిఁగి పోయెను.

కాని యా పరిచారకుఁడు, ఒకకన్ను విశ్వనాథము మీఁదనే యుంచి, వేవేగముగఁ దనపని ముగించుకొని, “మిత్రుఁడా! ఇదిగో వచ్చితిని. నాకిఁక తీఱికయె. నీ సమాచారము చెప్పుము!” అని పలికెను. “ఈ సేవకాధముఁడా నా కాత్మశాంతి చేయువాఁడు! ఆహా, విద్యార్థి కుఁడనగు నా కీగతిపట్టినది!” అని విశ్వనాథము విధినిదూఱుచు, తనయండను గూరుచుండు మనుష్యునితో నిష్టము లేకయె మాటాడ మొదలిడెను. కాని, మాటాడిన కొలఁదిని, వానికి విద్యాపరిచితియు, ఇంగ్లీషుభాషాపరిజ్ఞానము గలిగియుండుటకు విశ్వనాథ మాశ్చర్యపడెను.

విశ్వనాథమున కాశ్చర్యము గలిగించినవి యాపరిచారకుని భాషాప్రవీణతయు, లోకానుభవమును. వాని సంగతి చూడఁగా బ్రాహ్మణునికి బోధచేసిన ధర్మవ్యాధుని పురాణగాథ విశ్వనాథమునకు జ్ఞప్తికివచ్చెను. ఏది యెటులుండినను, ఈజనారణ్యముమధ్య తనసేమ మారయువాఁ డొకఁడైన నునికి విశ్వనాథమునకుఁ గొంత దుఃఖోపశమనము గావించెను.

ఈపరిచారకుఁడెవ్వఁడని విశ్వనాథము పిమ్మట కొందఱినడుగఁగా, “బడేదాదా” అంద్రు “బడేదాదా” యని మందహాసముచేయుచు వంగియులందురె కాని, యా సమాధానము వానికి తృప్తి నొసఁగలేదు. మఱునాఁడు తనకు వర్తమానము రాఁగా, విశ్వనాథము ‘బడేదాదా’ దర్శనమునకు వాని గదిలోనికిఁ బోయెను. అచట ‘బడేదాదా’ శుభ్రమగు వస్త్రములు కట్టుకొని కుర్చీలోఁ గూర్చుండి, స్వాములవారివలె నుండెను! గదిగోడమీఁద “ఆంద్రూసుగారు” అను చిత్రితాక్షరములుగల ఫలకము గట్టఁబడి యుండెను!

ఢిల్లీలో ప్రప్రథమమున సుప్రసిద్ధక్రైస్తవ మతగురువుగనుండి, హిందూదేశీయుల యదృష్టవశమునఁ దన యున్నతపదవిని త్యజించి, భరతఖండమె తన జన్మభూమిగను, భారతీయులె తన యనుంగుసోదరులుగను జేకొని స్వార్థత్యాగముచేసి, హిందూదేశోద్ధరణమునకై పాటుపడుచుండు ఆంద్రూసుమహనీయునిచూచి, విశ్వనాథము వారిపాదములకెరఁగి, తనతప్పుగాచి పాప విముక్తునిగఁ జేయుఁడని వారిని వేడెను. ఆంద్రూసు మహనీయుండు విశ్వనాథమును గౌఁగలించుకొని, తన కాతఁడుగావించిన యపరాధమేమియు లేదనిచెప్పి, పావనమూర్తియగు భగవంతుఁడే ముక్తిప్రదాతగాని తనవంటి పాపిగాఁడనినొక్కిచెప్పెను. సౌరభకోమలత్వములు పుష్పరాజమునందువలె ప్రతిభాపవిత్రతలు ఆంద్రూసుమహనీయునందుఁ గన్పట్టుచుండెను. సాధుత్వసౌభ్రాత్రములు ఆతని పలుకుల నుండియు చూపులనుండియు నలుదెసలకు బ్రసరించుచున్నటు లుండెను. శాంతినికేతనమువారికేకాక, సర్వజనులకును ఇతఁడు వంద్యుఁడగు పెద్దతండ్రియె యని విశ్వనాథ మిపుడు విశ్వసించెను.

మిత్రుఁడు మిత్రునికివలెనే విశ్వనాథము ఆంద్రూసు మహనీయునికిఁ దన రహస్యములను దెలియఁబఱచెను. విశ్వనాథముయొక్క గురువులలో ఆంద్రూసె యుత్తమగురువు. గురూపదేశము సామాన్యముగ నతిగూఢముగను దుర్గ్రాహ్యమగుబీజాక్షరరూపముగను నుండెడిమంత్రము. ఈగురూపదేశమన్ననో, ఎల్లరికిని దేటతెల్లముగఁ దెలియు ప్రేమమంత్రమె! ప్రేమయె యాంద్రూసు తత్త్వబోధన సారము, మహనీయమైన యా యనఘుని ధర్మజీవిత సారము!

వట్టిసిద్ధాంతములు నేర్చుకొనవలెనని విశ్వనాథ మింతదూరము రాలేదు. కళాశాల దినములలోనె వానికి తర్కవేదాంతములు కొట్టిన పిండియ్యయెను. ఉపన్యాసములు నుద్గ్రంథపఠనములు విశ్వనాథుఁడు కాంక్షింపలేదు. వానికిఁ గావలసినది, శాంతిదాయకము పవిత్ర మార్గదర్శకము నగు నుత్కృష్టజీవితమె. వీనిని బ్రసాదింపఁగలయది యీశ్వరకటాక్షముతోపాటు, సద్గురువునొద్ద శుశ్రూష. విశ్వనాథము కన్నుల కట్టి యుత్తమగురువు ఆంద్రూసె. ఆంద్రూసుగారి జీవితము ధర్మజీవితము, ధారాళ జీవితము. ఆయన పలుకులకును పనులకును వీసమంతయేని వ్యత్యాసము లేకుండ వ్యవహరింపఁగల పురుషుఁడు. ప్రేమమూర్తి. నిష్కల్మషహృదయుఁడు. ఋషి పుంగవుఁడు

ఆంధ్రదాసుగారిబోధన తత్త్వమునఁ గొన్నిచిత్రములు విశ్వనాథము కన్నులకుఁగనఁబడెను. ఆయన,ఎట్టి పాపితో నైనను చెలిమిచేసి, వానిపాపములు గనుగొని, పాపితోఁ గలిసి పరితపించి, ప్రార్థించి, పాపబీజములను వానియాత్మ నుండి వెడలిగొట్టి, వానిస్థానమున పవిత్రాదర్శములు నాటింపఁగల తపస్సంపన్నులు. వ్యక్త్యవస్థా భేదముల ననుసరించి మెలఁకువతో నాత్మశాంతి నొసఁగూర్పఁగల సమర్థులు—తమయందుఁగల యొకవిధమగు సూక్ష్మదృష్టి ప్రభావమున నితరులను బీడించు వ్యసనములు గ్రహించి, తగు చికిత్స యొనరింపఁగల ప్రతిభావంతులు—చికిత్సకు వలయు శాంతిప్రేమాదు లపరిమితముగఁ గల మహాత్ములు. ఆత్మోపలబ్ధి గావించు తరుణమున,పాపి నేత్రములకాయన చికిత్సచేయువైద్యునివలెఁగాక, స్తన్యమిచ్చు తల్లివలెను, కలసియాడెడి మిత్రునివలెను గానిపించి, ప్రేమమార్గము ననె తరణోపాయము గలుగఁజేయఁగల మహానిపుణులు. కావుననె విశ్వనాథము, ఆంధ్రదాసుమహనీయుని సహవాస శుశ్రూషలవలన మనసు కలఁకదేఱి,వారివలన ఆత్మపవిత్రతకును,ఆత్మాభివృద్ధికిని వలయుసాధనములు గ్రోలి, వానినిఁ దన యనుభవమున కలవఱచుకొనుచు, ఆంధ్రదాసునే ప్రియజనకునిగను, మిత్రవర్యునిగను, గురూత్తముని గను భావించి, వారియెడల నపార భక్తివిశ్వాసములు గాంచియుండెను.

ఆజ్ఞోల్లంఘనము చేసెనను నలఁతి మిషచే ధర్మపత్నిని విడనాడుట యధర్మమని విశ్వనాథ మిప్పుడు గ్రహించి, జీవితమం దాయబలకుఁ దాను వృథాపరితాపమును గల్పించుట కెంతయు వగచెను. ఒకవేళ తనవిమర్శయం దాలేమ గ్రుంగిన నో, ఆయపయశస్సును దనమెడనే వైచుకొన నతఁడు సిద్ధపడెను. బంధుల నందఱిని యలజడి పాలుచేసిన పాపము తానే మూటఁగట్టుకొనఁ బూనెను. తనకోరికప్రకార మొకవేళ భార్య యసాధారణ ప్రజ్ఞాధైర్యములు పూని కార్యసాధనమున విజయమందినచో సామాన్యస్త్రీ నట్టి యనన్యధైర్యవతిగ మార్పఁగల తన కుశాగ్రబుద్ధి జనులసాగతుల నందఁగలవని యతఁడు సంతసించెను. ఏదియెటులుండినను, శీఘ్రమె స్వదేశమునకుఁ బోయి, తనవారికిఁ దాను గావించిన క్షోభమును తొలగించి, ఆంధ్రదాసు మహిమాతిశయమును బ్రకటీకృతముచేసి, జనులను ధన్యులఁ జేయవలయునని విశ్వనాథు డుద్దేశించెను. గురువు దీనికిసమ్మతించెను. త్వరితకాలములోనె మార్గమధ్యమునను‌న్న కాకినాడలోఁ గూడు దేశీయమహాసభనుజూచి, మఱి యింటికిఁబోవ విశ్వనాథము తలంచియుండెను.

## ౮. విశ్వనాథము

"తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను,
దీనులఁగాఁచెఁ జింతించువాఁడు."

భాగవతము.

దేశీయమహాసభ కొన్నిదినములకుఁ గూడు ననఁగా, విశ్వనాథము కాకినాడపురముచేరెను. అచట సభాప్రయత్నములు చేయఁబడుచుండెను. పాకలు పందిళ్లువేయఁబడుచున్నవి.నీటి కొళాయలు దీపపుస్తంభములు నమర్పఁబడుచున్నవి. ఒకప్రక్క వంటసామగ్రులు గూర్చుచున్నారు. వేఱొకప్రక్క సేవకులను నియమించుచున్నారు. సభ దినములలో గాంధినగరమును గావలికాచుటకై చ్ఛికభటులు చేర్చుకొనఁబడుచుండిరి. ఈసన్నాహము నూరకచూచిపోవుటకు వచ్చువారునైతము, అమితోత్సాహమున నాభటసమూహమునఁ జేరుచున్నారు. లేదా, తమయోపినంత సాహాయ్యమును జేయుచున్నారు.

సామునేర్చుకొనుచున్న యైచ్ఛికభటులు, తమ ముందు సాగిపోవుచున్న విశ్వనాథమును రెండుమూఁడుసారులు పరికించి, అతఁడును దమలోఁజేరిన మేలని తలంచుచువచ్చి వాని నాహ్వానించిరికాని, తనకేదో యితర వ్యాపారమున్నదను మిషతో నాతఁడు తనదారిని దాను బోవుచుండును. ఇతఁడట్లు చేయుటకుఁ గారణమేమి? "దేశసేవకే నేను వేఱుపడియుండెదను. ఐచ్ఛికభటుల సహాయార్థమె నేను వారిని జేరకుందును. ఏదైన నొక సమాజమునఁ గూడినతోడనె, సామాన్యముగ వ్యక్తిస్వతంత్రతలు నశించును. సమాజోద్ధరణమునకు వలయు శక్తిస్వేచ్ఛలు తొలఁగిపోవును. బయటనుండియె దేశసేవోద్యమమునకు నేను జేయూఁత నొసంగెదను!" అని విశ్వనాథము మనమున నిశ్చయించుకొనెను.

ప్రేక్షకులందఱు భోజనాది కార్యములకై విడుదుల విడిచిపోవునప్పుడును, సభలుగూని కరిగినప్పుడును,

వారిసొత్తులను గాపాడవలయువా రైచ్ఛికభటులే. వీరిలోఁబెక్కండ్రుబాలురు. చర్చలువినవలయుననియు, చిత్రములు చూడవలయుననియు నొక్కొకభటుఁడు, తన కార్యభారము దగ్గిఱవానిమీఁద నైచి, పోవుచుండును. ఈమాత్రము సందుకై వేచియుండు చోరున కిది మంచి సమయము. కాని యట్టి సమయమున విశ్వనాథుని యాకార మచటఁబొడకట్టును. పేరున కుద్యోగము లేకున్నను, పరిశ్రమమునకు మాత్ర మాయువకుఁడు ఏయైచ్ఛిక భటునికిని దీసిపోఁడు. అతని సహాయమున నెందఱో తల్లులు దారితప్పిపోయిన తమపిల్లలను దిరిగి కలసికొని, వానికి దీవనలిడిరి. ఏమఱియున్న జవ్వనిమెడలోనినగ సంగ్రహింపనూనిన యేచోరుని నిపుణతయు విశ్వనాథుని కనులఁగప్ప లేకుండును. తొందరతోఁ బారవైచుకొనిన వస్తువులు విశ్వనాథము సాహాయ్యమువలనఁ దమకు లభింపఁగా, జనులు సంతోషమున మిన్నందుచుందురు. కావున నైచ్ఛికభటులు, అనుక్షణమును విశ్వనాథము చేయుచుండు సంఘసేవాకార్యము గన్నులారచూచి, తమవాఁడు కాకున్నను తమవాఁడే యని, వానియెడ నత్యాదరబుద్ధివహించియుందురు.

సభజరిగిన దినములలో గాంధినగర రక్షకత్వమును దొరతనమువా రీయైచ్ఛికభట సమూహమునకె వదలిరి. రేయుంబవళ్లు వంతులువేసికొని యైచ్ఛికభటులె యా ప్రదేశమునుగాచి, మొత్తముమీఁద నెంతో శ్లాఘనీయముగఁ దమ కృత్యములు నెఱవేర్చిరి.

మొదటిదినములలో నొకనాఁటి రాత్రి గాంధినగరము నిశ్శబ్దముగ నుండెను. "ఘారాహుషార్! గాంధీమహారాజ్!" అను చోపుదారికేకలు ఉద్యోగుల చౌకునుండి యారంభమై, యంచలమీఁద నగరమెల్లెడల వ్యాపించుచుండెను. అపుడేదో యొకమూల రొద వినవచ్చెను. 'ఘారాహుషారు' కేక లంతె బిగ్గరగవేయుచును, ఈలలు వేయుచును భటు లధిక జాగరూకత గలిగియుండిరి. చీమ చిటుక్కుమనెనా, ఎవరువారని నలుదెసలనుండి ప్రశ్నలు గురియుచుండును. ఇటులుండ, చోరు నొకనిబట్టుకొని యైచ్ఛికభటులు కొందఱు ఉద్యోగుల చౌకువద్దకుఁ గొని వచ్చిరి. అచ్చటిమైదానమునఁ బాతిన కొయ్య కొకదానికి వాని నంటఁగట్టిరి. వానిని గుర్తించుట కంతదీపములుదెచ్చి భటులు ప్రేక్షకులును చుట్టునుజేరి. "ఓహో! వీఁడే మిఠాయిదొంగ!" యని యొకఁడనగా, "నిన్న ముసలివాని వస్త్రము దొంగలించినవాఁడు వీఁడె!" యని వేఱొకఁడు పలికెను. వయస్సునఁజిన్నయైనను వృత్తికిమాత్రము పెద్దయే యని నలుగురును వానినిగుఱించి చెప్పుకొనసాగిరి. "నా గడియారము నిన్న నపహరించిన దొంగ యిడుగో!" నని యొక్కరును, "ఔను! చేయి చిక్కినను దప్పించుకొని పోయె"నని మఱియొకరును వానిమీఁద నపరాధస్థాపనఁ జేసిరి. చోరబాలుని వారంత పిడికిటఁబొడుచుటకును, బెత్తముతోఁ గొట్టుటకును ఆరంభించిరి. సొమ్ము పోఁగొట్టుకొనిన వేఱొకమనుజుఁడపుడువచ్చి, దొంగనానవాలు పట్టి, చేతిబెత్తముతో వానిముఖముమీఁదఁ గొట్టెను. ఆ దెబ్బతగిలెనా, బాలచోరుఁడు మొగము తిరిగి నేలఁబడవలసినదే! ఎవరికి వారొత్తిగిల్లి యుండిరి. ఐచ్ఛికభటు లూరక చూచుచుండిరి!

అచోరబాలకుని రక్షించుటకై దైవ మంపెనా యనునట్టుగ, కనువ్రాల్చునంతలో నొకయువకుఁడు వచ్చి బెత్తమున కడ్డుపడెను. బెత్తపుదెబ్బ కాతని దేహమునఁ బెద్దబొబ్బ లేచెను! ఐన నతఁడేమియుఁ బలుకక, చోరుని శరీరమున నింకఁ బడనున్న దెబ్బలను దప్పించుటకై తన చేతులు వానిమెడచుట్టును మెలివైచియుండెను. తనపర్ణశాలనుండి యంతె దేశభక్తుఁడు లేచివచ్చి, "మీరు చేయుచున్నది రాక్షసకృత్యము! ఇట్టి క్రూరకృత్యమున కొడిగట్టువారా స్వరాజ్యభాగ్య మనుభవించుట కర్హులు! ఈ దొంగకుఁ జూపిన దౌర్జన్యమునకు మీరు ఉత్తరవాదులు. చూడుఁడేమి జరుగునో!" యని గంభీర వాక్కులతో నాగ్రహాగ్ని వారిమీద నపుడు ప్రయోగింప కుండినచో, ఘోరకృత్య మారాత్రి యచట జరిగెడిదే!

ఇట్లాచోరుని కభయహస్త మిచ్చినది విశ్వనాథము. దేశభక్తుని చేతిసైగచే జను లెవరిదారిని వారు పోఁగా పాపమా చోరబాలకుఁడు కుప్పగూలినట్లు నేలఁగూలెను. ఇది మిషయని యొకరిద్దఱు భటవరు లనినను, వారిమాట లాలకింపక, విశ్వనాథము వానిని దనమూఁపున నుంచుకొని తన విడిదలకుఁగొనిపోయెను. దీపపు వెలుఁగున నా బాలకుని దేహము పరీక్షింపఁగా, చిన్నగాయములు, పెద్దదెబ్బలు ననేకములు గానవచ్చెను. త్రాళ్లకట్టులయొద్దను

పెదవులనుండియు రక్తము స్రవించుచుండెను. మాటాడుటకైన శక్తిలేక వాఁడు శోషిల్లుటచూచి, విశ్వనాథము వానిని దన మంచముమీఁద బండుకొనఁబెట్టి,వానికపుడు వేడికాఫీ చేసియిచ్చెను. శస్త్రవైద్యుని బిలుచుకొనివచ్చి వానిగాయములు కడిగి, మందు పట్టించెను.

ఆ మఱునాఁడు బాలకునిగుఱించి విశ్వనాథము మిక్కిలి యలజడితో నుండెను. భయోద్రేకముచేతను, గట్టిదెబ్బలు తగులుటవలనను, చోరబాలకునికి తీవ్రజ్వరము సోఁకెను. "నాయనా! కొంచెము లాభమునకై నీవీ చెడుపనిచేసి చేటుతెచ్చుకొంటివిగదా! నీకన్నతల్లి యిట నుండిన నీకోస మెంత శోకించునో! పరుషము లగు నా చేతులలోఁబడ్డ నీకేమిసౌకర్యము గలుగును! తండ్రీ! ఈ మందు త్రాగు- ఏడువకు- నీకు వచ్చిన భయము లేదు, నాయనా! నిన్ను నేను గాపాడెదను. ఈసోడా కొంచెమైన త్రాగిన మంచిదని వైద్యుడు చెప్పుచున్నాఁడు. విసనకఱ్ఱతో తిరిగి విసరెదనులే! కాళ్లింకొకసారి పట్టనా? గాయముచోటనే తిరిగి చెయివేసి నీకు నొప్పి కలిగించినాను, నాది మాయమఱుపులే!" అని విశ్వనాథము కన్నతల్లివలె నాబాలకుని మంచము కనిపెట్టుకొని యుపచారములు చేయుచుండెను.

రాత్రి రెండుజాములకు దేశభక్తుఁడు అచటికి వచ్చి క్రిందటిరాత్రి గాయములు తగిలిన బాలునిగుఱించి కుశలప్రశ్న వేసి, "వీనిని చూడవలెనని యీనాఁ డనేక పర్యాయములనుకొంటిని. కాని యిప్పటికిఁ దీఱినది.!" అని పిల్లవానియొంటిమీఁదఁ జేయివైచి, "అయ్యో! తీవ్రజ్వరము వచ్చినదే! మందిచ్చినారా? మీకు సహాయము లేదే! భోజనము చేసినారా?" యని గ్రుచ్చిగ్రుచ్చియడిగి ఆదినము విశ్వనాథము నిరాహారుఁడగుట తెలిసికొని, తానింకను భుజింపకున్నను, విశ్వనాథము భోజనము చేసిన పిమ్మటనే తానచటనుండి కదలెదనని పట్టుపట్టి, విశ్వనాథముచే నన్నము దినిపించెను.

## ౯. ఉంగరము దొరకుట

క. మానుగ నీముద్రికగని
మానసమున సంతసించి మారుతసుత! ని
న్నేనటఁ బుత్తెంచితినని
జానకి సత్కృతులు నీకు సమ్మతిఁ జేయున్.

భాస్కరరామాయణము.

విశ్వనాథ మిపుడీబాలకుని సేవయందు విశ్వమంతయు మఱచినటు లుండెను. వానిని బుజ్జగించుచును మేల మాడుచును, ప్రోత్సహించుచును, ఎట్టులో వాని కౌషధ మిప్పించి, పథ్యపానములు నడపెను. విశ్వనాథము పరిచర్యలచేఁ బునర్జీవితుఁడైన యాపిన్నవానికి, కనుల కగపడని తలిదండ్రులు కల్లగాను, కాచుచుండెడి యీతఁడె తల్లియుఁ దండ్రియు నగుట సత్యముగాను జూపట్టెను. ఆ బాలకుని కంటి కిపుడు విశ్వనాథమొక నిమేషము గానరాకుండెనా, అతఁడు విశ్రాంతి విహీనుఁడగును. విశ్వనాథమె వానికి ప్రాణము. వాని చిఱునగవె బాలునికి స్వర్గము; వానికోపమె ఘోరరౌరవము.

ఇప్పు డాబాలునికిఁ గొంతస్వాస్థ్యము గలిగినను ఇంకను బలహీనముగాఁ నేయుండెను. ఒకనాఁడు విశ్వనాథమును వాఁడు "నాన్నా!" యని చేరఁబిలిచి,ఆయన చేతిని దన చిన్నిచేతులతోఁ దాఁకి, తనజుట్టులో దాఁచియుంచిన యొకయుంగరమునుదీసి, వానిచిటికెనవ్రేలి కది పెట్టెను. దీని కాశ్చర్యమంది విశ్వనాథము,"ఈయుంగరమెక్కడిది? ఈదొంగసొమ్ము నాకెందునకు?" అనిదానిని దీసివేయఁగా, బాలకుఁడు కంటనీరుపెట్టుకొని, విశ్వనాథ మీయుంగరము పెట్టుకొనినఁగాని తానేడుపు మాననని చెప్పివేసెను! బాలకుని యారోగ్య ప్రాప్తియె ప్రధానముగఁ జూచుకొనుచున్న విశ్వనాథ మపుడు "సరే!"యని చెప్పి, అది పరిశీలించిచూచెను.

అది తాఁ బూర్వమెపుడో చూచినదానివలెఁ దోఁచి విశ్వనాథమింకను శ్రద్ధతోఁ దానిని బరీక్షింపఁగా, పూర్వము తాను చెన్నపురియందుండు కాలములో, ఒకనాఁడు మిత్రులతో వీకంసీ దుకాణముదగ్గఱకుఁబోయి, సన్నకెంపుల నగిషీతో నక్షరములు బంగరుంగరమునఁ గూర్పఁబడుట వీక్షించి, తనభార్యయగు పార్వతిపేరట్లు మిద్దెటుంగరమునఁ గెంపులతోఁ జేయించుట వానిస్ఫురణకు వచ్చెను. ఉంగరము మీఁద "పార్వతి" యనుపేరు ఆనాఁడు కెంపులతోఁ గూర్పఁబడినది వాని కిపుడు గానఁబడెను. ఈయుంగరమిచటికి రాఁగతమేమి? పార్వతి యీ

మహాసభకువచ్చి యుంగరమును గోలుపోయెనా? యని విశ్వనాథ మాలోచింపఁ జొచ్చెను.

ఉంగరపు సమాచారమేమని విశ్వనాథమడుగఁగా తానారాత్రి జరిగించిన చౌర్యవృత్తాంతమును జెప్పి అపుడా స్త్రీ వ్రేలినుండి గ్రహించిన నగయే యిదియని బాలకుఁడు వచించెను. ఈయుంగరము మూలమున తనసతి జాడలు గనుగొనవచ్చునని పెద్దయాశతో విశ్వనాథము దానిని భద్రముగదాచి యుంచెను.

ఒకనాఁడు ప్రొద్దుననె స్త్రీప్రతినిధుల శిబిరమున కొక బాలుఁడువచ్చి, అచటి ముందువెనుకనున్న ద్వారములఁ బరిశీలించుచు నడయాడుచుండెను. ఆప్రాతఃకాలమున జరుగనున్న సభలకుఁ బోవు సన్నాహముమీఁద నక్కడివా రుండిరి. బాలకునిచర్యలు గనుగొని యనుమానపడుచున్న కొందఱుస్త్రీలు, వానిని, "నీవిచటికేల వచ్చితివి? ఎవరు కావలయును?" అని ప్రశ్నించిరి. "పార్వతమ్మగారున్నారా?"యని బాలకుఁ డడుగఁగా, "ఏపార్వతమ్మగారు?" అని వానిని బ్రశ్నించిరి. వారిమాటలయందు లక్ష్యము లేనివానివలెవాఁడు "మాపార్వతమ్మగారె!"యని చెప్పఁగా, కొందఱు స్త్రీలు నవ్విరి. "పార్వతమ్మగారెచటివారు? వారిదేదేశము?"అని యాయంగన లడిగినపుడు, "వారిచటివారె—తూర్పుపుట్టిల్లు, పడమట అత్తిల్లు!" అని బాలకుఁడు మాఱుపలికెను. "నీవామెను చూపింపఁగలవా?" యని వారడుగఁగా, "మీరావిడను జూపించిన నేనును జూపించెదను" అని వాఁడనెను. "నీకామె యేమగును? నీవెప్పుడు ఆవిడను జూచినట్టు కనిపించదే!"యని వారనఁగా,"ఆవిడ మాఅమ్మ. నేనుమాత్రము చూడలేదు!" అని పిల్లవాఁడు ప్రత్యుత్తరమిచ్చెను—ఈప్రసంగమునుబట్టి వాఁడు కొంటెవాఁడో పిచ్చివాఁడో యైయుండునని యాముదితలు స్థిరపఱుచుకొని, చోరబాలకులిట్లై నటింతురని వినియున్నారు కావున, వానిని రక్షకభటుల కప్పగింపవలెనని తలంచుచుండిరి.

ఈ సంభాషణము చెవులు సోకుచున్నను తాఁజదువు పత్రికమీఁదనే ధ్యానముంచుకొని దూరముననున్న యొకజవరాలు వలదని తక్కినవారిని వారించి, తన యొద్దకుఁబిల్లవానిని రమ్మనెను. వాఁడపు డాస్త్రీనిసమీపింపఁగా,"నిన్నెవరు పంపిరి? ఎందుకు వచ్చినావు?"అని వానినామె మెల్లఁగనడిగెను. "నన్ను మానాన్న పంపినాఁడు—పార్వతమ్మగారికొఱకు" అని వాఁడుచెప్పిన సమాధానము మఱియొక స్త్రీ కింకను పిల్లవానిమీఁద సందియములు పుట్టించియుండును కాని, పార్వతీభాయిమాత్రము, ప్రియవియోగము మొదలు శాంతమునే పరమధర్మముగ గ్రహించి యుండుటచేత, పిల్లవానిని బెదరఁగొట్టక, నేర్పరితనముతో నింకను వానితో ముచ్చటించెను. పార్వతీభాయి లాలనకుఁ గలకఁదేఱి బాలకుఁ డిపుడు సరియగు సమాధానము లిచ్చునటు లామెకుఁదోఁచెను. పిల్లవానిసంగతి విడిచిపెట్టి,తక్కిన కాంతలు తమ పనులలోఁ దాముండిరి. పార్వతీభాయి సావకాశముగ వానితో ముచ్చటింపఁ గలిగెను. ప్రసంగధోరణిని, ఆపిల్లవాఁడు, తన్నుఁబంపిన యాయన తననాయనయనియును, మిగుల దయగలవాఁడనియును, కొన్నిదినములక్రిందటఁ దన్ను కొందఱు బాధింపఁగా, ఆయనయే తన్నురక్షించెననియును గ్రహింపఁగలిగెను. అపుడు వారిరువురికిని ఇంకఁ గొంత సంభాషణముజరిగెను.

పార్వ:—"ఐతే. నీవుచూడఁగోరు పార్వతమ్మను నీవానవాలు పట్టఁగలవా?"

బాల:—"పట్టలేకేమి!"

పార్వ:—"పార్వతమ్మను నేనే. ఇప్పుడేమి చెప్పెదవు?"

బాల:—"మీచేయి చూపించండి"

పార్వ:—"ఇదుగో నాచేయి"

బాల:—"ఎడమచేతివ్రేలికి ఉంగరము ఆనవాలున్నదే. ఉంగరమేదీ?"

పార్వ:—"అదియెవరో దొంగ ఈనడుమ యెత్తుకొని పోయినాఁడు."

పార్వతికనుల కపుడు చోద్యముసురీతిని, ఆపిల్లవాఁ డొకయుంగరము తన చొక్కాజేబునుండి తీసి చూపించెను. అది యామె పోగొట్టుకొనినదే! "ఇది నీదగ్గఱ కెట్లు వచ్చినది?" అని యాతురతతో నాయంగన యడుగఁగా, పిల్లవాఁడు తానే దొంగలించితిననియు, ఆసందర్భముననె రక్షకభటులు తన్ను శిక్షించుచుండఁగా, తన నాయన యడ్డుపడి కాపాడెననియు, నాఁటినుండియు తాను దొంగతనము వదలిపెట్టితిననియుఁ జెప్పెను.

తన పేరు. వానికిని, వానినాయనకును ఎట్లు తెలిసెనని పార్వతీభాయి యడుగఁగా, "మీ పేరీయుంగరమునఁ జెక్కఁబడినదట" అని బాలకుఁడు చెప్పెను. ఏదో బహుమానమిచ్చి, పిల్లవాని నంపివేయఁ జూచు పార్వతీభాయితో నపుడు "మీరు మా అమ్మగారగు పార్వతమ్మగారివలె కనఁబడెడము లేద"ని పిల్లవాఁడు పలికి, ఆయుంగరము పూర్వము తమనాయన అమ్మగారికై చెన్నపట్టణములో చేయించినారని చెప్పెను! అందుచేత పార్వతీభాయి గుండెలు తటతటఁ గొట్టుకొనసాగి, యింకను వానితో నిట్లు ప్రసంగించెను.

పార్వ:—"మీ నాన్నగారి నివాసస్థల మేయూరు?"

బాల:—"కొండవీటి సీమ"

పార్వ:—"మీ నాన్నగారితోఁ గలసి అమ్మగారు లేరని చెప్పితివి-దీనికి హేతువేమి?"

బాల!—"కోపమువచ్చుటచేత"-

పార్వ:—"మీ నాయన మీ అమ్మగారిని గుఱించి యిపు డేమనుకొనుచున్నారు?"

బాల:—"మంచివారనిన్ని, త్వరలోఁ గలసి కొందుమనిన్ని చెప్పుచున్నారు."

ఈకడపటి వాక్యము వినునప్పటికి పార్వతి సందియములు వీడిపోయెను. ఇన్నాళ్లకు భర్తసమాచారము తెలిసెనని యానారీమణి కానందాశ్రువులు కన్నులనుండి స్రవించెను. ముద్రికమూలమున రామాయణమునందువలెనే తనకును బతికిని సమావేశము చోద్యముగఁ గలిగినందునకుఁ బార్వతి యానందపరవశ యయ్యెను. భర్త యిపుడు తిరిగి తనయందు సదభిప్రాయముగలిగి యుండుటకు పార్వతి మిగుల సంతసించెను. ఈమానినియె తాను వెదుకవచ్చిన పార్వతమ్మయని తెలిసికొనిన బాలకుఁ డంత, చిరకాలమునకుఁ దల్లినిజూచిన పుత్త్రికునివలెఁ గన్నీరు రాల్చుచు, ఆమె పాదములమీఁద వ్రాలెను. పార్వతి సొమ్మునపహరించుట నెపముగాఁ దాను సన్మార్గము చూరఁగలిగితినని బాలుఁ డాసాధ్వీమతల్లితోఁ జెప్పి, యుంగరమామెకిచ్చి, దీవనలు వడసెను.

## ౧౦. వీడుకోలుపు

చ. అమృతకళాంశతుల్యమగు హారము రాముఁడు సీత
కిచ్చె న్నా,రమణి ధరింపనొల్లక కరంబులఁదాల్చి నిజేశుఁ
జూడ భూ, రమణుఁడు నింతికన్నెఱిఁగి రాగముతో
నగుఁగాక యన్న న, క్కమలదళాక్షి వాయుజుని కంఠ
మునం దగిలించె వేడుకన్.

—భాస్కరరామాయణము.

దేశీయమహాసభ ముగిసిన మఱునాఁటి యుదయమున, అధ్యక్షుని గుడారమున నొక చిన్నసభ జరిగెను. ప్రముఖులలో ననేకులు కాకినాడ విడిచిపోవుటచేత, కొలఁదిమందియె యాసభ నలంకరించిరి. ఆసభ ముఖోద్దేశము, ఐచ్ఛిక సేవకులలో శ్లాఘనీయముగఁ బనులు చేసినవారిని బహూకరించుటయె. సభామంటపము, సుందరపుష్పములతో నలంకరింపఁబడెను. శ్రీమతి సరోజినీదేవి యగ్రాసనాధిపత్యము వహించెను.

ఐచ్ఛికసేవాసంఘములో నెల్ల ప్రథమస్థాన మొక యువకుని కీయవలయునని సరోజినీదేవి వక్కాణించి దేశభక్తుని బిలిచి, వాని కతని పేరు తెలిపి వానిని గురించి కొన్ని సంగతులు చెప్పుమని కోరెను. దేశభక్తుఁడంత నీయువకుఁడు ఆంధ్రుఁడగుటకె కాక తన సొంతదేశమగు గుంటూరుమండలపువాఁ డగుటకును దా నుప్పొంగుచున్నా నని పలికి యిట్లుపన్యసించెను.

"కొండవీడు పూర్వపురాజ్యములలోఁ బేరెన్నిక గన్నను దురదృష్టవశమున నేఁటివారిచే నాప్రాంతపువా రనాగరికులని భావింపఁబడుచున్నారు. ఇది సత్యము గాదు. నిజమగు నాగరకతను పైమెఱుగులనుబట్టి కాక, ఆత్మగుణములనుబట్టియె నిర్ణయింపవలయును. కొండవీటిసీమనివాసియగు విశ్వనాథము విద్యాధికతచేతను, దేశహితైకకార్యదీక్షచేతను నొప్పెడివాఁ డయ్యును కొన్ని కుటుంబసందర్భములచేత బోల్పూరు శాంతినికేతనముఁ జేరి, యచట దైవానుగ్రహమువలనను, ఆంధ్రమాసుగారి సుబోధమూలమునను మరల నాత్మశాంతి గాంచి యిపుడు స్వదేశమునకుఁ బోవుచున్నాఁడు.

"మార్గమధ్యమందలి కాకినాడపట్టణమున దేశీయసభాసమావేశ సందర్భమున దేశసేవ చేయఁగోరి విశ్వనా

ధము, పేరునకు ఐచ్ఛికభటసమూహమునఁ జేరకున్నను, వారితోఁ గలసి ప్రజాసంరక్షణార్థమై పరిశ్రమఁజేసి కృతకృత్యుఁడయ్యెను. వట్టిశిక్షయే యపరాధిని బాగుపఱుచునని నమ్మక, ప్రేమమార్గమె యపరాధి కాత్మోజ్జీవన మొనరించునని నమ్మి, కార్యసాధనమున విజయము గాంచిన ధీరుఁడీతఁడు. కావుననే చిన్ననాటనుండియు చౌర్యమున కభ్యాసపడిన పిల్లవాఁ డొకఁడు వీరిదయచేఁ బాత్రుఁడై సన్మార్గమునఁ జొచ్చెను. విశ్వనాథముగారికి ముందు గలుగనున్న శుభములను సూచనగ వీరితోఁ గొంతకాలము నుండి విడివడియున్న వీరి ధర్మపత్నికిని వీరికి నిచటఁ దిరిగి సమాగమమును,ఐక్యమును గలిగినవి. ఈదంపతులకు సర్వశుభములు చేకూఱునుగాక!"

దేశభక్తుని వచనముల కామోదించుచు, సరోజినిదేవి యంత ఐచ్ఛిక సేవకురాండ్రలో పార్వతి మిగుల యోగ్యతగల యువతీరత్నమని యిట్లు వాక్రుచ్చెను:—

"దైవముఖముచూచియో యీవనిత సేవాకార్యముల నిర్వర్తించెను. ఈసందర్భమునఁ బార్వతికి గలిగిన సాంసారిక కష్టములను గురించి యించుక సూచించెదను. హిందూదేశమును, కోడండ్రు వెతనొందు దేశమని వ్యవహరింపవచ్చును. అందులోను తెలుఁగువారి కోడండ్ర మగు మేము ఎక్కువచిక్కుల పాలగుచున్నాము. ఇట్లనుటవలన ఆంధ్రులు దుశ్శీలురని నామతముగాదు. వారు భరతఖండమును జిరకాలమేలిన రాజులసంతతివారు. ఉదారతాచిహ్నములు వారిసుగుణములం దిప్పటికిని గానవచ్చుచున్నవి. మతసాంఘికాది విషయములందు వీరు ప్రస్తుతము మనదేశమున ముందడుగు వేయుచున్నారు.

"పార్వతీ విశ్వనాథులు, తమ బాల్య కాలపు కుటుంబ కలహములకుఁ బ్రాయశ్చిత్తముగ నొకసంవత్సరము వేర్వేఱు ప్రదేశములందు తపస్సు సలిపి, మనఃపరిపాకము నొంది. యిపుడొక్కటియై జన్మభూమి నుద్ధరింపఁ బూనుచున్నారు— నాకుఁ దీక్ష గలిగినచో ఈదంపతుల విచిత్రచరిత్రము ప్రబంధరూపమున నిబంధింప నువ్విళులూరుచున్నాను. దైవము వీరల కన్నియైశ్వర్యములు నొసంగవలయును".

నల్లనిమీసము గడ్డమును దనబంగరు తనుచ్ఛాయ కొకవింత యందమొసఁగ, ఋషిపుత్త్రికునివలెఁ దేజరిల్లు విశ్వనాథము, తన కొసఁగఁబడిన పసిఁడిపతకము వందనపూర్వకముగనందుకొని, సతీతిలకముచేత నుంచెను. స్వదేశచీరధరించి, రమ్యమగు తెల్లకలువపూవువలె నావేదిక నలంకరించిన పార్వతి, సరోజినీహస్తదత్తమగు పుష్పహారమును తమ యభిమానపుత్త్రిని మెడలోనవైచి, ఆతని మూలమునఁ బోయినను పావనములైన యాతని చిన్నిచేతులతోనె మరల తనకు లభించిన చిరకాల సఖియైన ముద్రికయే తనకుఁ జాలునని యెంచి, ఇపుడు తనకుఁ బారితోషికముగ నీయఁబడిన రవలయుంగరమును పవిత్రమార్గమునకు మఱలిన బాలకుని చిన్నివ్రేలికిఁ బెట్టి ముద్దుపెట్టుకొనెను. తన మెడలోని పుష్పహారమును, వ్రేలియుంగరమును జూచుకొని బాలకుఁడు మురియుచు తల్లిదగ్గఱ గూర్చుండెను.






సముద్రాల వెంకటరాఘవాచార్యులు గారు

ఇదిగాదు కల్పనాకథ, యిది క్రొత్తదిగాదు ప్రకృతియెల్లను సాగియుండ
చదువరి! రోళ్లను రోకళ్లఁ దెగంబోడవడిన ప్రాఁబురాణమెసుమ్మా.

గీ. నీకొరకు గష్టమొనరించి నీదుపెద్ద, లేపరమభాగ్యములను గడించినారొ
వ్రాసియున్నార లిచట సువర్ణములను, చదువరీ రమ్ము త్రవ్వితీసెదవుగాని.

సీ. విమలగోదావరీవీధి విద్యానాథ కవి, పల్కునా డలంకారసమితి
కవిసోమనాథు డకుఠరరూపమున మహా, శైవగాథల వెదచల్లునాడు
దోసిళ్లకొలఁది నాంధ్రుల కెల్ల హరికథా, మృతము పోతన సమర్పించునాడు
ఆంధ్రరాజన్య శౌర్యప్రతాపాగ్నులు, విమతకాననముల వ్రేల్చునాడు
మహితకాకతీయాంధ్రసామ్రాజ్యలక్ష్మి, విభవగీతల జగ మాలపించునాడు
పాలుగొనలేని పాపము వాపికొనెదు, జీర్ణశేషము లైన దర్శింపరమ్ము.

సీ. తెనుగుపోటరుల వెచ్చనినెత్తురేటులు, పొంగిపొరలినట్టి పుణ్యభూమి
తెనుగుబాసకు తీరు తియ్యముల్నవరించి, చనువిచ్చి పెంచిన జన్మభూమి
పలుతెలుంగులగుగిరుల కాశ్రయం బిచ్చి, దిక్కుల కంపిన దివ్యభూమి
కోరువారల కెల్ల కొంగుబంగారమై, గారవించిన యట్టి కర్మభూమి
గౌరవము కట్టుకథలైన కమలవలసి, కాలగర్భములోపలఁ గలియుచున్న
కాకతీయాంధ్రలక్ష్మిని గాంచకుండ, గన్నులుండియు గ్రుడ్డివి గాకు మోయి.

సీ. ఆసేతుమగధదేశాంతర ముజ్జ్వాత, లూపు నాంధ్రపతాక మూగెనిచట
అల్లారుముద్దుగా నాంధ్రశిల్పకళా[illegible] సవ్వడిజేసె [illegible]నిచట
మనుమసిద్ధికయి తిక్కన్న రాజరాజేశ్వరునితోడ సలిపె మంతనము నిచట
స్వస్థానగౌరవస్థాపనమ్మున కాంధ్రశూరు లుత్తమగతుల్గోరి రిచట
ననుచుఁ దత్రత్యజనము నోరార నెసక, మెసఁగ వేళ్వేరఁజూపి వర్ణించుచుండఁ
గన్ను లున్నందులకు వానిఁగాంచి పొగడ, నోచుకొనకున్న నీవు—ఆంధ్రుడవు కావు.

సీ. మాన్యజీవనులైన మైలారువీరుల,తో చంద్రనిప్పులం దూకకున్న
శ్రుతిఁ జేసి సద్యశోసతిమంజుగళముతో, వీరగాథల నాలపింప కున్న
పరమమతావేశభరమున నీ కెలం, గుండెలలో గ్రుచ్చుకొనకయున్న
పరవీరమృత్యుదేవతతోడ నెదురొడ్డి, కత్తికి కండగా నెత్తకున్న
మానె నీవంగడపువారు మానధనులు, ప్రాణములు ధారవోసి కాపాడినట్టి
కీర్తిలత కాలవశత శుష్కించుచుండ, వేడికన్నీళులైనను విడిచిరమ్మ.

సీ. జీవితార్థముల వెచ్చించి యుత్తమలోక, ములకుఁ గట్టిన మెట్లు లిలనుగూలె
పుడమితేండ్లకు నధోభువనసంబంధమ్ము, సాగించుమార్గము ల్చాటువడియె
వేడినేరని వింత వెలుఁగుల సొబగారు, రత్నదీపమ్ములు రాలిపోయె
ఆఱువేళల తీతికనుమాట నెఱుఁగక, మ్రోయువాద్యమ్ములు మూలవడియె
ఎండకన్నెఱుంగని కన్నెలుండు నగరి, మంజుమంజీరరవములు మాటువడియె
ఏమిగానున్నదో ముందు నింకమీద, అమ్మయడుగుఁదమ్ముల కళ్ల నద్దుకొమ్మ.

సీ. గగనావతంస ప్రాకారమూర్తియెగాని, శుద్ధాంతసౌధము ల్గూడ లేవు
అఱుగానరాని ఖేయస్ఫూర్తియేగాని, కానవు పన్నీటికాలువలను
తునియలై నేలగూలిన రాలగుట్టలే,గాని పూసెజ్జలు గాన లేవు
శాంతిపాలితము నిర్జనభూమియేగాని, రమణీయరాజమార్గములు గనవు
సర్వమాంధ్రసామ్రాజ్య మస్తంగమింప, నిలిచియున్నవి అటనిట శిలలుకొన్ని
ఇపుడు చూడగలేకున్న నింకనెపుడొ, అరయుదువటన్న యాస రవ్వంతలేదు.

* * *

కాకతీయాంధ్రలక్ష్మి విఖ్యాతమహిమ,
జూడరావోయి గారాపుసుతుల కీవు
కథలుగానైన జెప్పుదుగాని తండ్రి!






పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు

## ౨. శమంతభద్రుడు - దృష్టిబోధోద్ద్యోతినీ కథ

దక్షిణ దేశంలోనే కంచి అని గొప్పపట్టణం ఉంది. దానిలో శమంతభద్రుడని ఒకస్వామి ఉండేవాడు. ఆయనను అందరూ ఆచార్య శమంత భద్రు డంటారు. ఆయన మంచి పరమాత్మవేత్త. ముని కూడాను. ఆయన పేరంటే ముల్లోకాలకూ తెలుస్తుంది. తర్కశాస్త్రం - వ్యాకరణశాస్త్రం - ఛందశ్శాస్త్రం అలంకారశాస్త్రం - మరి ఈలాగంటి లెక్కలేనన్ని శాస్త్రాలు ఆయన చదివాడు. మంచి ఉద్దండమైన పండి తుడుకూడాను. వీటి అన్నింటిని మించినవి శేషం- ఆ యనదగ్గర ఒకటి ఉంది. ఏమిటంటే- ఆయనకి చాలా ప్రాచీనకాలంనుండి పరంపరగా వస్తూవున్న అనేక మహానుభావుల జీవితచరిత్రలన్నీ బాగా తెలుసు. ఒక్క తెలియడంమాత్రమేనా ! ఆచరిత్రాంశాలను చెప్ప వలసివస్తే ఆయా సంప్రదాయాలు కన్నులకు గట్టినట్లు- వారివారి జీవితాలల్లో జరిగిన చిత్రచిత్రాల చరిత్రశ్లోకాలు అన్నీ- ఆయనకు నోటికివచ్చు. ప్రస్తావనకుతగినట్లు- నడ మనడమ- ఆచిత్రశ్లోకాలు చదువుతూ- చిలవలుపలవలు పెట్టి- ఆయనప్రసంగం చేస్తూంటే- ఎంతెంతవారైనా సరే కిక్కురుమనకుండా చెవులు దొరగిలపెట్టుకొని విం టూంటారట. ఇదేగాకుండా ఆయనదగ్గఱగల ఇంకో గొప్పతనం- కాయేన వాచా మనసాపి- ఏకరీతిగా నడుచు కోవడం అనేది వుంది. అంటే ఏమన్నమాటా- ఆయన ధర్మోపదేశం ఇతరులకు ఎట్లాచేస్తాడో అట్లా తాను ఆచరించి చూపుతాడన్నమాట.

అయితే ఏం- ఎంతవాడికీ పూర్వజన్మంలో చేసు కొన్న కర్మఫలం అనుభవింపక తప్పదు. పండితుడైనా సరే పామరుడైనాసరే, లక్షాధికారి అయినాసరే భిక్షాధికారి అయినాసరే, చేసిందాన్ని అనుభవించితీరాలె. తప్పేదిలేదు. శమంతభద్రుడు- ఈజన్మంలో ఇంత గొప్పవాడైనా, ఏజన్మంలో మహాపాపమో కాని, ఆయన భస్మవ్యాధికి గుఱి అయినాడు. భస్మవ్యాధి అంటే ఒక మోస్తరుగా అతిజఠరాగ్నికల తెల్లకుష్ఠు. ఇది కుష్ఠువ్యా ధులన్నిట్లోనూ చాలా తీవ్రమైనవ్యాధి. ఇది రానేరాదు. వస్తే కుదరడం చాలాకష్టమంటారు. జైనమతంప్రకారం ఈవ్యాధి- అసద్వేద్యకర్మవల్ల వస్తుందంటారు. అంటే ఏమిటంటే- తాను మహాజ్ఞానిగా వుండికూడా, యుక్తా యుక్తవివేచనా- సదసద్వివేకము చేయగలవాడై యుండి కూడా- ఎవడు లోభమోహాదులకు గురియై- [శాస్త్రతః ధర్మతః ఆనుపూర్వితఃకూడా] అసమ్మతమని చెప్పబడే పరమతాన్ని అవలంబించి భ్రష్టు డవుతాడో, వాడికి ఇల్లాంటి వ్యాధివస్తుందని చెప్తారు.

శమంతభద్రుడు ఈవ్యాధిరాగానే చాలాఖిన్ను డైనాడు. ఎన్నెన్నో ప్రతిక్రియలు చేశాడు. ఏం చేసి నా ఏమీప్రయోజనం కనబడడంలేదు. ఎప్పుడూ ఒళ్లం తా బూడిదవలె విరియబడిపోతూంటుంది. పైకిచూడడా నికి ఒకనొప్పీ దప్పీ ఉన్నట్టు కనబడదు. ఎంతతిండితిన్నా ఆగదు. రోజుకు ఎన్నిమార్లు భోజనంచేసినా ఒకనిమి షంలో- భూస్వాహాభువస్స్వాహా అవుతుంది ఎప్పుడూ నీరసమే. ఎప్పుడూ నిస్సత్తువే. కూచున్నచోటినుండి లేవలేకపోవడం జాస్తి. అబ్బబ్బా మహానరకంరా బాబూ! ఈవ్యాధి శత్రువులకైనావద్దు.

ఏమయినా- అనుభవించనిదే పోదని ఎంతనమ్మక మున్నా- ప్రతిక్రియచేసి చూద్దామన్న భ్రమ మనుషులకు పోనేపోదు. శమంతభద్రుడుకూడా ఇల్లాంటి భ్రమే

పొందాడు. గనుక ఆయన ఒకనాడు ఆలోచించుకొన్నాడుగదా—"శాస్త్రములకు మతమునకు మహాభివృద్ధి తీసికొవద్దామని అనుకుంటే నన్ను ఈవ్యాధి పట్టుకొని పీడిస్తున్నదిగదా. దీనికి ప్రతిక్రియఏమిటి? భస్మక వ్యాధి మహా మేహములవల్లగదా పుడుతుంది. కాబట్టి సమస్త మేహాలకున్నూ శాంత్యర్థమై స్నిగ్ధములై- మృదువులై మధురములైన- పక్వాన్నములను వేస్తూంటే క్రమంగా శాంతికల్గుతుందని వైద్యులు చెబుతున్నారు. ఈపనిచేయడమే ఉత్తమంగా నాకున్నూ తోస్తుంది-"

ఇట్లా ఆలోచించుకొని స్నిగ్ధములు మృదుమధురములగు పక్వాన్నములను సంపాదించి తినుటకు బయలుదేరాడు; కాని ఈ అయ్యగారికి రోజూ మృష్టాన్నాలు ఎవరు సమర్పిస్తారు? ఇది అన్నిటికంటే కష్టం.

కాబట్టి అయన ఏంజేశాడంటే —ఏ దేశంలో ఎక్కడ ఏవేషంగా సంచరిస్తే మంచిపుష్టిఅయినఆహారం దొరుకుతుంటుందో ఆదేశంలోనే పోయి, అక్కడ ఆవేషంగానే వుంటే సరిపోతుందని అనుకొన్నాడు. తర్వాతసరే అని కంచినివదిలిపెట్టి ఉత్తరంగా బయలుదేర్నాడు. కొన్నాళ్లకు పుండ్రదేశంలో వుండే చంద్రగిరికి వచ్చాడు. అక్కడ బౌద్ధభిక్షువులకు గౌరవం ఎక్కువ. వారినిమిత్తం ఆవూళ్లో గొప్పదానశాలఒకటికట్టించారు. ఏవూరినుండివచ్చినా ఎంతమందివచ్చినా బౌద్ధభిక్షుకులైతేసరి—ఆదానశాలలో గౌరవిస్తారు. భిక్ష లిస్తారు. సమస్త ఉపచారాలున్నూ చేస్తారు. బౌద్ధభిక్షువులుతప్ప మరి యితరులైతేనో మరి దిక్కూమొక్కూ ఉండదు. ఈసంగతంతా ముందుగానే తెలిసికొన్నాడు మన శమంతభద్రుడు.

నున్నగా తలగొరిగించికొని కావిబట్టలగట్టి ఇంకా ఏ మేమి వేషానికి కావలెనో అవన్నీ సిద్ధపరుచుకొని శమంతభద్రుడు బౌద్ధసన్యాసి అయిపోయినాడు. ఫరవాలేదు. అయినందుకు అతనికి ఆవూళ్లో మంచిగౌరవమే కలిగింది. దానశాలలో అతనికి భిక్షలు చక్కగానే దొరికేవి. కాని ఎన్నిభిక్షలైతే ఆ భస్మవ్యాధికి చాలవి. అక్కడికీ దినానికి ఒకచోటికి తెలియకుండా ఇంకో చోట చొప్పున రెండేసిభిక్షలుకూడా దొరికేవి. ఎంత అయినా ఆహుతి చాలలేదు. చివరకు విసుగుపుట్టి ఆ వూరువదిలిపెట్టి బయలుదేరాడు. క్రమంగాపోయిపోయి అనేకపట్నాలుదాటి దశపురమని ఒక వూరు చేరాడు.

పొట్టతిప్పలు తీరక దినమూ దేశాలను తిరగడం అంటే కష్టమే అనిపించింది. కాబట్టి శమంతభద్రుడు కొన్నాళ్లు దశపురంలో ఉండాలె అనుకొన్నాడు. అయితే ఆవూళ్లో మాత్రమేగాక ఆచుట్టుపక్కలగూడా బౌద్ధులంటే భిక్షం పుట్టదు. దశపురంలో బాగాసాగాలంటే భాగవతులుగావలె. పట్టెడుపట్టెడు నామాలుండాలె. పిలకజుట్టుండాలె. మెడనిండా తులసిపేరులుండాలె. వీటి అన్నింటిని మించిన విష్ణుపరత్వమును వెల్లివిరియించే ప్రపత్తి కడుపునిండా వుండాలె. ఇన్నివుండి కండ్లుమూసితెరుస్తుంటేనేగాని భాగవతులవేషంలభించదు. శమంతభద్రుడు ఇది ముందుగా తెలిసికొన్నాడు. ఎట్లా అయినా డొక్కశుద్ధి అయిందికాదా!

తర్వాత శమంతభద్రుడేమిచేశాడనుకొన్నారూ? భాగవతోత్తముడు – కేవల భాగవతోత్తముడే కాదు. పరమభాగవతోత్తముడైనాడు. అంతరంగంలో కాదు. బహిరంగంలోనే! అంతరంగంసమ్యక్త్వంమీదా బహిరంగం కపటమతవేషాలమీదా లగించింది. కొన్నాళ్లు ఈ వ్యాపారం లాభకరంగానే సాగింది. శమంతభద్రుడి వ్యాధిమాత్రం కొంచెమైనా తగ్గుదల చూపలేదు. రోజుకు రోజుకు హెచ్చుతూంది. ఎన్నికైంకర్యములు చేసినా ఎన్ని తిరుమాళిగలు సాయించినా చాలడం లేదు. అప్పుడతడు విసుగెత్తి మరికొన్నాళ్లకు ఆవూరినుండి లేచిపోయినాడు.

చివరకు ఎన్నెన్నితంటాలోపడి వారణాసి(కాశీ) వచ్చిచేరినాడు. అన్నీ ఒకయెత్తూ అగస్త్యుడొకయెత్తూ అన్నట్టు వారణాసిలో ఇంకో బెడదవచ్చిపడ్డది. ఈవూళ్లో అందరూ శైవులైవుండాలి- మహాదేవ శంభో-అంటూ తలనిండ రుద్రాక్షలపేరులను ధరించి భస్మోద్ధూళితగాత్రులయి మెడలో లింగాలు గుడిలో లింగాలతో మునిగి తేలవలెను. ఇట్లాతేలేవారినిమాత్రమే కాశీరాజుగారు గౌరవిస్తారు. కాని తక్కినవారిని గౌరవింపరు. కాశీరాజుగారైన శివకోటిమహారాజుగారి మతభక్తి- ధుర్ధంధరత్వం అలాంటిది. ఇకదానికి తిరుగులేదు.

ఎవరిమతం ఎట్లావున్నా-తనకడుపుసంగతిని భరించడమంటే చాలాకష్టం తోచింది. శమంతభద్రుడికి ప్రళయావస్థనైనా భరింపవచ్చునని-తోచింది. కనుక ఆ బాధనుండి ఎన్ని అకార్యాలనైనా చేయవచ్చుననుకొని శమంతభద్రుడు శివయోగిగా మారిపోయాడు. మెడలో చేతుల్లో నెత్తిమీద శివచిహ్నాలు తాండవిస్తూన్నవి. ఇట్లు సాక్షాత్తూ మూర్తీభవించిన శైవ చిహ్నాలతో శమంతభద్రుడు వారాణాసీమహారాజుగారిని దర్శింపబోయినాడు శివకోటి మహారాజుగారు నగరిలో లేడు. విచారణచేయగా- ఆయనక్రొత్తగా కట్టించిన శివాలయం దగ్గర నైవేద్యపుపళ్లు చెల్లించేచోట వున్నారని తెలిసింది. సరే అంటూ శమంతభద్రుడక్కడికే వెళ్లాడు.

ఓహోహో! ఆభక్తి ఏమని చెప్పనలెను. పుట్లకొలది అన్నపురాసులు- కొండలవలెవున్న భక్ష్యరాసులు- ఒకటారెండా-లక్షలకొలది- యామయామానికీ- ఈశ్వరునకు చెల్లిస్తున్నారు. చెల్లించినతర్వాత ఆప్రసాదాన్ని ప్రజలకు పంచిపెట్టించి ఎక్కువైనదాన్ని గంగలో దొర్లిస్తున్నారు. ఆస్థితి చూడడంతోటే శమంతభద్రుడికి కడుపుపొంగిపోయింది. తనరోగము కుదిరేరోజులు వచ్చాయనుకొన్నాడు. వెంటనే ఆఅర్చకులకందరికీ వినిపించేట్టుగా—ఓపరమపాతకులారా, శివనిర్మాల్యమును ఆరీతిగా పరిహరిస్తున్నారేమిరా? మీలో ఎవ్వరికీ నైవేద్యం మిగలకుండా దేవుడిచేత భుజింపచేసేసామర్థ్యం లేనేలేదా? ఎంత అల్పులుమీరు?—అని అరిచాడు. ఆయన మాటవిని పూజారివర్గమంతా వచ్చింది. శమంతభద్రుణ్ణి చుట్టుకొని-"అయ్యా!—మాకెవ్వరికీ మీరుచెప్పినట్టులుగా ఈనైవేద్యమంతా ఏమీమిగలకుండా దేవునిచే భుజింపచేసేంత శక్తిలేదు. మీరుచేయగలరా?—" అని అడిగినారు. శమంతభద్రుడు "అందుకుసందేహమా" అన్నాడు. అర్చకులు ఈవిషయాన్ని శివకోటిరాజుగారితో చెప్పినారు. ఆయన ఆశ్చర్యపడి "ధూర్తవ్యవహారం కాదుగదా—" అని అనుమానపడుతూ, "అయినా ఒకనాడు చూద్దాము—" అనుకొని సరే అని అంగీకరించినాడు.

రాజుగారి ఆజ్ఞ అయినతర్వాత అడ్డమేమున్నదీ! సరేఅంటే సరేఅన్నారు. రోజూకంటె ఆనాడు ఇబ్బడిగానైవేద్యం సిద్ధంచేయించి లింగావసరం చెల్లించమన్నారు. శమంతభద్రుడు పూజాపురస్కారాలన్నీ మామూలు అర్చకులనే చెయ్యమని నైవేద్యం సమర్పించిన తర్వాత చుట్టుపట్ల ఎక్కడమనుష్యులపొళకువైనా లేకుండా వెళ్లిపోండి, అట్లావెళ్లకపోతే శివుడు స్వయంగా ఆరగించడు అన్నాడు. వాళ్లంతా అట్లాగేఅని వెళ్లిపోయినారు. తర్వాత శమంతభద్రుడు తానొక్కడే గుళ్లోకి పోయి తలుపులు మూసికొని ఆప్రసాదం అంతా తానొక్కడేతిని- తర్వాత కొంతసేపటికి తలుపుతెరచాడు. పూజారులువచ్చి ఆఉత్తపాత్రలను వెలుపలికి తీసినారు. రాజు మొదలువారంతా ఆశ్చర్యపడినారు.

ఇట్లా ఆరునెలలు గడచినవి. శమంతభద్రుని వ్యాధి కుదిరింది. ఆహారం స్వస్థతకువచ్చింది. క్రమంగా నైవేద్యాన్నం మిగిలిపోతున్నది. పూజారులు ఈసంగతివెళ్లి రాజుతో చెప్పారు. రాజు సంగతంతావిని శమంతభద్రుణ్ణి పిలిపించి అడిగాడు.

శివ:—ఏమిమహాత్మా!— లింగమూర్తికి నైవేద్యము చెల్లుట లేదేమిటి?

శమం:—ఏల చెల్లడంలేదు. చెల్లుతూనే వున్నది. నిత్యమూ నేనేగదా అర్పణచేస్తున్నాను.

శివ:—అల్లాగా. అయితే ఇదివఱకు ఎప్పుడూ నైవేద్యం మిగలడంలేదు మీరు వచ్చినప్పటినుంచిన్నీ. ఇప్పుడెందుకు మిగులుతున్నది?

శమం:—ఇదిటయ్యా మహాప్రభూ! సందేహం? లింగమూర్తికి ఇప్పుడు అంతగా ఆకలిఅవడంలేదు. అందువల్లనూ, మీరు చేయించేనైవేద్యాలు గురుత్వం వహించి కాస్త అజీర్ణదోషం తేవడంచేతనూ, కొద్దికొద్దిగా భక్షిస్తూన్నాడు. కాస్త ఈఅజీర్ణం తగ్గడంతోటే మళ్ల పూర్ణాహుతి పుచ్చుకొంటాడట!

శివకో:—(అనుమానంతో) అట్లా-గా-అండీ!— అని వెళ్లినాడు.

కాని శివకోటికి అనుమానం కలిగింది. ఇంటికి వెళ్లుతూనే పూజారులతో ఆలోచించి ఆరాత్రికి ఒకకుర్రాడిని పత్రీపూలూవున్న గంపలో కూచోపెట్టి సోమసూత్రం తూముకింద ఉంచారు. మామూలుగా పూజాపురస్కారాలన్నీ అయిపోయిన తర్వాత తలుపులు

మూశారు. శమంతభద్రుడు నైవేద్యం ఆరగించడం మొదలుపెట్టాడు. సోమసూత్రంక్రింద బుట్టలో దాగివున్న ఆ కుర్రాడు మెల్లగా తప్పించుకొనిపోయి రాజుతో చెప్పినాడు. రాజు మహోగ్రుడై వచ్చేసరికి శమంతభద్రుడు ఆరగింపుచేసి నిలువబడియున్నాడు.

రాజువస్తూనే—ఛీఛీ! దుర్మార్గుడా! ఎంత పని చేశావురా! వేసింది యోగివేషమున్నూ చేసింది భోగి పనీనా? నీవంటి ధూర్తుడున్నాడా లోకంలో? రోజూ దేవుడికి ఆరగింపజేస్తున్నాననిచెబుతూ మెక్కుతింటున్నావా? ధూర్తుడా! ఇంత మహాపరాధంచేసినందుకు క్షమాపణంగా మొక్కు లింగానికి! మొక్కవేం—అని గద్దించాడు. శమంతభద్రుడుకూడా రాజును డీకొన్నాడు—"పో, పోవయ్యా!—నీ దేవుడెంత నీవెంత! నీదేవుడు రాగద్వేషాలు గలవాడు గనుక—నా నమస్కారాన్ని భరించలేడు. నేను జినదేవునికి తప్ప ఇతరులకు నమస్కరించను. నీవు రాజు ననుకొంటున్నావు. నీకు రాజత్వమెట్లా వర్తిస్తుంది?" అని యిట్లా ఏమేమో బదులు చెప్పాడు. శివకోటిరాజు భగ్గుమని మండిపడి అతన్ని బందీఖానాలో వుంచి అతనిచేత మర్నాడు ఎట్లాగైనా శివుడికి నమస్కారం చేయించాలెనని పట్టుదలతో వెళ్లిపోయినాడు.

శివకోటిరాజు వెళ్లిపోగానే శమంతభద్రుడికి కొంచెం వెనుక ఆలోచన కలిగింది—అయ్యో! ఎంతపిచ్చిపని చేశాను? నా ఆలోచనంతా ఏమైపోయింది? అని అనేక తరహాలుగా తలపోసుకుంటూ ఆమందిరంలో కూచున్నాడు శమంతభద్రుడు. పారిపోకుండా గుడిచుట్టూ రక్షకభటులు కావలి కాస్తున్నారు. శమంతభద్రుడిచిత్తం ఆ ఆపత్కాలంలో పరిపరి విధాల పరిగెత్తుతున్నాది. చివరకు ఏమైతే అది అవుతుందని మనస్సు రాయి చేసికొని పరున్నాడు. కన్నుమూసీ మూయకముందే జైనదేవత అతనికి ప్రత్యక్షమై—'నాయనా! నీకువచ్చిన ఫరవా లేదు—స్వయంభువాభూతహితే— అనుమున్నగు చతుర్వింశతి జినస్తోత్రమును పఠింపుము. నీయాపదలు రూపుమాయును—'అని చెప్పి వెళ్లింది. శమంతభద్రు డట్లాగే స్తుతించాడు. అతనికి ధైర్యం వచ్చింది. ఇంతలో తెల్లవారను కూడా వారింది.

రాజు జైనమునిచే నీశ్వరునికి మ్రొక్కించి శిక్షించి పంపవలెననే ఆతురతతో బయలుదేరివచ్చాడు. ఆయన వచ్చేప్పుడు—ఈపాటికి శమంతభద్రుడి ముఖం వెలవెల బోతూ ఉండవచ్చు ననుకొన్నాడు. కాని వచ్చి చూచేసరికి మంచి తేజస్సుతో వెలుగుతున్నది. రాజు హృదయంలో ఏదో చెప్ప వీలులేని ఆందోళనం కలుగుతున్నది. అయినా దాన్ని అణచుకొని ఆయన అన్నాడు—రా! రావయ్యా! ధూర్తుడా చేయి దేవుడికి నమస్కారం చెయ్యి.

శమం—నేను చెయ్యను.

రాజు—ఎందువలన?

శమం—ఎందువల్ల అని అడుగుతారా? నేను గనుక నమస్కారం చేస్తినా మీ ఈశ్వరలింగం గీశ్వరలింగం బద్దలై పోతుంది సుమండీ!

రాజు—పోయినాటికిచూదాం. వేన్నీళ్లకు కొంపలు కాలడం ఎంత నిజమో నీబోటి యోగ్యుని నమస్కారంచేత మాలింగమూర్తి బద్దలు కావడంకూడా అంతే నిజం. కనుక నీవు నమస్కారం చెయ్యకతప్పదు. చెయ్యి నమస్కారం.

శమం—తప్పదా!

రాజు—తప్పదు.

శమంతభద్రుడు సరే అంటూ చతుర్వింశతి జినస్తోత్రాన్ని చదువుతూ చుట్టూ ప్రదక్షిణం చేసి సాగిలపడ్డాడు వెంటనే బ్రహ్మాండమైన ఆలింగము పటపట మంటూ బద్దలుగా పగిలిపోయింది. వెంటనే ఆలింగంలో నుండే జినదేవునియొక్క చతుర్ముఖాకృతిగల ప్రతిమవచ్చి నిలిచింది. ఆ మహార్భటిచూచి రాజు తెల్లపోయినాడు. లోకులందరూ జయధ్వనులు చేసినారు. శివకోటి లజ్జతో తలవంచుకొని శమంతభద్రుని పాదములమీదబడి వేడికొన్నాడు. ఆర్యా!-తామెవ్వరు? ఏలయిట్లు ప్రచ్ఛన్నవృత్తితో నుండెదరు?- అని అనేకవిధాల వేడికొని అడిగెను. శమంతభద్రుడు- తనవృత్తాంతాన్ని తెల్పుతూ ఆశువుగా ఒకశ్లోకం చెప్పినాడు—

శ్లో. కాంచ్యాం నగ్నాటకోహం మలమలినతనుః లాంబు
శే పాండుపిండః, పుండ్రేండ్రే శాక్యభిక్షుః దశపుర

నగరే మృష్టభోజీ పరివ్రాట్, వారాణస్యామభూవం శశధరధవలః పాండురాంగస్తపస్వీ, రాజన్! యస్యాస్తిశక్తిస్సవదతు పురతః జైననిర్గ్రంథవాదీ.

[మహారాజా!— నన్ను ఎవరుమీరని యడిగి వేడుకొనుచున్నావు. గనుక నిజమును చెప్పుచున్నాను. నేను కాంచీనగరమున నుండెడివాడను. అచట నగ్నాటకుడనుగా (అనగా దిగంబరినై చరించువాడను.) నుంటిని. తరువాతశరీరమున రుగ్మతయేర్పడగా- తత్ప్రతీకారమునకై తిరుగుచు లాంబుశనగరంలో (ఇదేపుండ్రదేశంలోని పట్నము.) శాక్యభిక్షుకుడిగా మారినాను. ఆ తర్వాత మఱికొన్నాళ్లకు దశపురనగరంలో మృష్టాన్నాలు భక్షించే భాగవత సన్న్యాసి నైనాను. చివఱకు ఈ వారణాసిలో శంకరునివలె తెల్లని (భస్మముచే) శరీరంతో తపస్వినైనాను ఓరాజా! ఇన్నిమాటలెందుకు- నేను జైనమతమునకు జెందిన నిర్గ్రంథవాదిని. మీపండితులలోగాని మీలోగాని శక్తిగలవారెవరైనా వుంటే- రండి, ఎదటికి. వాదించి గెలవండి. లొంగదీసికొనండి- యని భావము ]

రాజు ఈమాటలనువిని—మహానుభావు డెంతవాడూకాకుంటే ఇంతపనిచేస్తాడా! —అని సమాధానపరుచుకొన్నాడు. కాని ఆయన ఆస్థానపండితులుమాత్రం— అట్లా ఒప్పుకోక ఆయనతో వాదానికి డీకొన్నారు. శమంతభద్రుడు ఒక పదినిమిషాల్లో- వారినందరినీ వాదంలో జయించి_తనబిరుదాల నన్నిటినీ ఇట్లాప్రకటించుకొన్నాడు—

శ్లో. పూర్వం పాటలిపుత్రనామ్నినగరే భేరీమయా తాడితా
పశ్చాన్మాలవసింధు ఠక్కవిషయే కాంచీపురే వైదిశే
ప్రాప్తోహం కరహాటకం బహుభటైః విద్యోత్కటైస్సంకటం, వాదార్థీవిచరామ్యహం నరపతే! శార్దూలవిక్రీడితమ్.

[మొదట నేను పాటలీపుత్రనగరంలో వాదాన్ని ఆరంభించి ఆప్రాంతాల్లో వుండేపండితుల్నందర్నీ జయించి జయభేరీ మోయించాను. ఆతర్వాత మాలవదేశంలో సింధుదేశంలో ఠక్కాదేశంలో (దీనినే ఇప్పుడు ఢాకాయంటారు) కాంచీప్రాంతాలలో, విదిశానగరంలోకూడా పండితులను జయించి జయభేరీ వాయింపించాను. ఆపిమ్మట విద్యలయందుత్కటులైన అనేకపండితులను వెంటబెట్టుకొని కరహాటకదేశంలో తిరిగి జయపత్రికలార్జించాను. మహారాజా!—ఇదిగో ఇప్పుడు వాదార్థినై శార్దూల విక్రీడితముగా ఇచ్చట సంచరిస్తున్నాను.]

ఇల్లా ప్రకటించి వెంటనే తన ఆవేషాన్ని తీసివేసి మామూలు జైనమునియొక్క వేషమునుధరించాడు. అత్యాశ్చర్యకరమైన ఈస్థితినంతనుచూచి శివకోటిరాజుగారు తానున్నూ తనప్రజలుమొదలగు వారున్నూ ఆశమంతభద్రునియొద్ద జైనమతదీక్షను స్వీకరించి ఆయనను అనేకవిధాల పూజించారు. తర్వాత ఆశివకోటిరాజు శమంతభద్రునియొద్ద చక్కగా మతరహస్యాలను తెలిసికొని, లోకక్షేమార్థమై లోహాచార్యుడు రచించిన ఆరాధనాకోశమును- ఎనభైనాలుగువేల శ్లోకాలుగలదాన్ని- సంగ్రహించి మూడున్నరవేలగ్రంథంగా వ్రాసి- లోకమును అనుగ్రహించినాడు. ఈరీతిగా సమ్యగ్దర్శన బోధలను ఉద్ద్యోతనముచేసి శమంతభద్రుడు కృతార్థుడైనాడు. శమంతభద్రుని ఈచరిత్రము మీకు [చదువరులకు] సుఖములనిచ్చి రక్షించునదిగా అగుగాక.

ఇది జైనులమతకథలలో శ్రీశమంతభద్రాచార్యుని యొక్క దృష్టిబోధోద్ద్యోతిని యన్నకథ-ముగిసింది.





# కోకిల-ఖద్యోతము

నాదెళ్ల వెంకట్రావుగారు, బి. ఏ.,

(ఆంగ్లకవి 'విలియం కౌపరు' ననుసరించి)

తరుణ సహకార పల్లవాంతరములందు
నిలిచి దినమెల్ల శ్రావ్యమౌ లలితగీత
ములను గొంతెత్తిపాడి కోకిల యొకండు
సందెసమయాన నాఁకలిఁ జెందె మిగుల.

ప్రతిదినముఁ దిను చూత ప్రవాళచయము
మొగముమొత్తి రుచింప కాపూట కేదొ
క్రొత్త యాహార మరయంగఁ గోర్కె పుట్టి
చుట్టుప్రక్కల కిటు నటుఁ జూచెఁ బికము.

అలముకొనుచున్న చీకట్ల యంతరమున
మినుకుమినుకున దూరాన మెఱయు నొక్క
మిణుఁగురుం బుర్వు గనిపింప మ్రింగు నూహ
నెగిరి పరభృత మద్దానియెదుట వ్రాలె.

అదియుఁ గోకిలయత్నంబు నరసి పలికె
సరస గంభీర మృదులభాషణము లొప్ప
"గాయకశిఖామణీ! నీదు గాన మన్న
నెంత చెవిఁ గోసికొందునో యెఱుఁగ వీవు.

నీదుగానంబు నెంతగా నేను మెచ్చి
సంతసింతునొ నా దేహకాంతిఁ జూచి
సగము సంతోష మీ వొందఁ జాలు నెడల
నన్నుఁ గబళింప నెంచియుండవు గదోయి.

సహజ మాధుర్యపంచమస్వరము నీకు
నైజ లావణ్యదీధితుల్ నాకు నొసఁగి
యంధకారంబు నలరింపు డనుచు మనల
కానతిచ్చిన యీశ్వరుం డతఁ డొకండె.

శ్రోత్రపర్వంబు నీపాట, నేత్రపర్వ
మస్మదీయ తనుద్యుతు లట్టి మనము
వైరభావంబు దవ్వులఁ బాఱఁదోలి
సఖులమై యుంట సకలేశు సమ్మతంబు"

ఈ యుపన్యాసమును నాలకించి పికము
మనసు మాఱుచుకొని వేగ వెనుకకేగి
మొగముమొత్తిన మామిడిచిగురులె తిని
యధికమైనట్టి క్షుద్బాధ నణచుకొనియె.





కీ. శే. రావుబహాదరు కందుకూరి వీరేశలింగం పంతులు గారు

చిత్రకారుఁడు: ఎస్. బాలసుందరం గారు.



# ఇక కావలసినదేమి?

(ప్రేమచందు వ్రాత ననుసరించి)

మాడపాటి హనుమంతరావు గారు

౧

గోపాలరావునకు ఆదాయము తక్కువగాను, వ్యయము హెచ్చుగాను ఉండుట సంభవించెను. చిన్నికుమారుని ఎత్తుకొని యాడించుటకొరకు ప్రత్యేకముగా నొకపనికత్తెనుంచుట కష్టముగా గానిపించుచుండెను. అయినను, బాలుని యారోగ్యముయొక్క అవసరములు కొంతవరకును, సరివారిలో మర్యాదగా నుండవలయునను తలంపులు కొంతవరకును, పనికత్తె జీతమును భరింప గోపాలరావును నిర్బంధించుచుండెను. పిల్లవానికి పనికత్తెతో ఎంతో మచ్చిక; నిముసమైనను దానిచంకవదలియుండడు. ఈకారణమువలన దానియక్కర మరింత అనివార్యమయ్యెను. పైకారణములుగాక మరియొకయంశముకూడ ఉండెను. మహాలక్ష్మి ఆయింటియందు మూడు సంవత్సరములనుండి పనిచేయుచుండినది. గోపాలరావుయొక్క ఏకపుత్రు నది కడుప్రేమతో పెంచుచు, ఆడించుచుండుటేకాక, గృహసంబంధమగు ఇతరకార్యములను గూడ శ్రద్ధతో నిర్వహించుచుండెను. ఇట్టిదానిని అకారణముగ దొలగించుటకాని, తొలగించుట కేదేని కారణమును కల్పించుటగాని గోపాలరావువంటి సత్స్వభావము కలవానికి దుస్తరముగ దోచుచుండెను. మొగమాట మాతని మానసమును సంపూర్ణముగ నాక్రమించి, మహాలక్ష్మిని పొమ్మనునంతటి ధైర్యమునకు ఏమాత్రము తా వొసగజాలదయ్యె.

మహాలక్ష్మియొక్క వర్తనమునుగురించి గోపాలరావున కెంత మంచియభిప్రాయ ముండినను, రుక్మిణమ్మ మాత్రము భర్తతో నేకీభవించునది కాదు. మహాలక్ష్మి యిల్లు గుల్లచేయుచున్నదని యామెతలంపు. బజారుకు పోయి వస్తువులు తెచ్చుచుండునపుడు, రుక్మిణమ్మ తలుపుచాటున పొంచుండి, కూరగాయలనుగాని, పంచదార పప్పు మున్నగు ఏవైన పదార్థములనుగాని అవతల ఎచ్చటనైన దాచుకొనుచున్నదేమో యని తొంగితొంగి చూచును. తెచ్చినసామగ్రులను పదిసారులు శోధించును, తర్కవితర్కములు సల్పును. "ఇంతేనా?" "ఏఖరచాప్పున తెచ్చినావు?" "అంతప్రియమైనదా?" యనుప్రశ్నములవర్షము మహాలక్ష్మిపై గురియుచుండును. మహాలక్ష్మి ఈప్రశ్నలకు తరచుగా, మిగులవినయముతో, మృదుశబ్దములలో ప్రత్యుత్తరముచెప్పును. కాని దొరసానిగారికి కొంతకోపోద్రేకము కలిగినట్లు కానవచ్చినప్పుడు మాత్రము, పనికత్తెయు కొంతయావేశమునకు లోనగుచుండెడిది. ఒట్టుపెట్టుకొనును; ప్రమాణముచేయును; ఉత్తర సాక్ష్యము నుల్లేఖించును; ప్రతివాదము సల్పును! ఈవ్యవహారమునందు ఎంతోకాలము గడచుచుండెను! ఇట్టినాటకము ప్రతిదినము ప్రదర్శింపబడుచుండెడిది. అయినను నాటకము సంపూర్ణప్రమోదాంతముగా గాని, సంపూర్ణ విషాదాంతముగా గాని యుండక, మహాలక్ష్మియొక్క దుఃఖాశ్రువులు కొన్నినేలరాలుటతో సమాప్తమగుచుండెను. అదియే మంగళహారతి! ఇన్నికష్టములు సహించుచు పనికత్తె ఇంకను ఇంటియందే యుండుట రుక్మిణమ్మ అనుమానములకు దోహదము కల్గించుచుండెను. "కేవలము అబ్బాయిమీది అపేక్షవలన నిది యిల్లువదలక పట్టుకొని యున్నదని నేను నమ్మను, తనలాభముకొరకే నిలిచియున్నది!" అని యామె యనుకొనును. మహాలక్ష్మి వంటి కొద్దికులపుమనిషియందు ఉదారమును లలితమునగు ప్రేమభావముండుట యసాధ్యమని రుక్మిణమ్మ యూహ!! నిజమేనేమో !!!

## ౨

ఒకనాడు దైవవశమున మహాలక్ష్మి బజారునుండి కొంచెము ఆలస్యముగా యింటికివచ్చినది. దారిలో ఇద్దరు కూరగాయలమ్ముకొను ఆడువాండ్రు ఎందుకనో తీవ్రముగా పోట్లాడుచుండిరి. వారి హస్తాభినయము, వారియుద్రేకపూరితమగు వాదవివాదము, వారిపరస్పర నిందారోపణ, వారొకరిపై నొకరు ప్రయోగించుకొను ఎక్కసక్కెములు, వారిసాక్ష్యము, వారి ప్రతిసాక్ష్యము, వారి పూర్వకక్షల యుల్లేఖనము నిరుపమానములుగా నుండెను. రెండుదావాగ్నులు తీండ్రించి పరస్పరాలింగనము చేయుచుండెనని భావింపుడు! రెండు విషసాగరము లుప్పొంగి సమ్మిళితము లగుచుండెననియైన తలంపుడు!! ఎట్టిప్రశంసనీయమగు వాగ్వేగము! ఎట్టి ప్రభావవంతమగు వక్తృత్వము!! ఇరువురిలో ప్రతియొకతెయు తనభావముల ప్రకటింపవలయునను నుత్సాహాతిరేకమువలన రెండవదానిమాట చెవిజొనిచ్చుటలేదు. ఆశబ్దములయల్లిక, ఆభావగాంభీర్యత, ఆయుపమాన పరంపర, ఆతీర్మానములలోని తర్కమును వినినచో, అసూయాగ్రస్తుడుకాని మహాకవి యుండునా? ఆచిలుకగోరువంకలు తమపలుకుల యానందమున నిమగ్నములై యుండెను. చూచువారికి వీరివద్దనున్న వాగ్జాలపుసరకు తరుగనిదిగా గానవచ్చుచుండెను! ఇదంతయు ఎందుకనువచ్చినది? ఒకతెవద్ద కూరగాయల గొనవచ్చినవాడొకడు రెండవ యామెవద్ద వాని గొనినందునకు!

జనులు గుంపులు గుంపులుగా గూడియుండిరి. సిగ్గుమాలిన ఈవ్యవహారమును, ఇట్టిభావను వినువారిలో ఎందరో యాచకులు, చదువుకొనినవారుగూడ నుండిరి! ఎంత మంచివినోదము!!

మహాలక్ష్మికూడ ఈవినోదము ననుభవించుచుండెను. అంతలో తొమ్మిదిగంటల ధ్వని వినవచ్చెను. దాని మనము నావరించిన సమ్మోహనాస్త్ర ప్రభావము వదలిపోయెను! గబగబపరుగెత్తి ఇల్లుచేరెను!

దాదిరాకచూచి, రుక్మిణమ్మముఖము పెంచుకొని యనెను "ఏమే, బజారులో దారి దప్పితివా?"

మహాలక్ష్మి అపరాధము నొప్పుకొను ముఖలక్షణములతో, చూడ్కుల నేల వాల్చి ప్రత్యుత్తరమిచ్చెను. "దొరసానిగారు, నా కెరుకయున్న పనిమనిషియొకతె చాలదినములతరువాత దారిలో కనుపడినది. మాట్లాడుటలో కొంచెము ఆలస్యమైనది"

దొరసానికోపము మరింతహెచ్చెను. "దొరగారికి కచ్చేరీకి (ఆఫీసుకు) పోవువేళయగుచుండగా, ఈ సమయములో నీవు విహారము సల్పుచుంటివా?" యనెను. సమయమునుగ్రహించి, దాది మారుమాట పల్కక, అబ్బాయిని చంకనెత్తుకొనియె.

రుక్మి: (మొగమెర్ర జేసికొని విదిలింపుతో) "అబ్బాయిని దింపండి, దొరసానిగారూ! మీరు వదలితే గుండె పగలదు లెండి!!"

యజమానురాలి ఈయాజ్ఞను నెరవేర్చుట దాదికవసరముగా దోచలేదు. ఆమెకోపమును జల్లార్చుటకు ఆమెయాజ్ఞను నిరాకరించుటయే ఉత్తమమగు ఉపాయమనితోచెను. అబ్బాయిని అట్లే చంకనుంచుకొని ద్వారమువైపు నడచుచుండెను. రుక్మిణమ్మ తొందరగాబోయి, పిల్లవానిని దాది చంకనుండి లాగికొని యనెను "నీనంగనాచితనము చాలకాలమునుండి చూచుచున్నానులే. నాకీచమత్కారములు చూపవలసినపనిలేదు. మరెవరికైన చూపు కొల్లలు! కొల్లలు!!"

మహాలక్ష్మి అబ్బాయిని ప్రాణసమానముగా ప్రేమించుచుండెను. రుక్మిణమ్మకు ఈసంగతి తెలియుననియే దానితలంపు. రుక్మిణమ్మను, తనను బంధించుచుండిన ఏకపాశము ఏదైననున్నచో అది అబ్బాయియే అని యనుకొనెడిది. కఠినవాక్కులు ఈబంధమును సడలింపజాలకుండెను. తనను నౌకరీనుండి తొలగింతురని అది ఎప్పుడును అనుకొని యుండలేదు. కాని యిప్పుడు అబ్బాయిని బలవంతముగా చంకనుండి లాగుకొనినమీదట దాదికి సహనము తొలగిపోయెను. "అమ్మగారూ, నావలన అంత గొప్ప తప్పిదమేదియు జరుగలేదు. మహాఅయితే పావుగంట ఆలస్యమై యుండవచ్చును. దీని కింత ఆగ్రహపడుచున్నారు! 'ఇంకొకయిల్లుచూచుకోవే'యని స్పష్టముగా చెప్పగూడదు? పుట్టించినవాడు పిడికెడుకూడు పెట్టడా? కూలినాలి దొరకని కరువుకాలము కాదుగదా! అమ్మా!" అని ముఖము చిట్లించుకొనెను.

రుక్మి: "నీవు లేకపోతే మాకుమాత్రము పనిసాగదా ఏమి? నీవంటి పనికత్తెలు పైసాకు పదిమంది తిరుగు చున్నారు!"

మహా: "చల్లగా ఉండండి, అమ్మగారూ దాదులు పని కత్తెలు కావలసినంతమంది దొరుకుతారు. నాతప్పు మన్నించి సెలవిప్పించండి!"

రుక్మి: "మగవాండ్ల వద్దికిపోయి నీకు రావలసినజీతము లెక్క చూచుకో."

మహా: "నాకు రావలసిన పైకముతో అబ్బాయికి మిఠాయి కొని పెట్టండి."

ఇంతలో గోపాలరావు లోనికివచ్చి యడిగెను "ఏమి సమాచారము?"

మహా: "అయ్యా! ఏమియునులేదు. దొరసానిగారు సెల విచ్చినారు. వెళ్లుచున్నాను."

ఉత్తకాళ్లతో నున్నవాడు ఎట్లుముండ్లను తప్పిం చుకొనుచు నడచుచుండునో, మనగోపాలరావుకూడ అట్లే గృహసంబంధమగు చిక్కులను తప్పించుకొనుచు, తొలగి తొలగి తిరుగుచుండువాడు. కనుక కొంచెము కోప దృష్టితో ప్రశ్నించెను

"అసలు ఏమిజరిగినది?"

రుక్మి: "ఏమియు జరుగలేదు. నాయిష్టమువచ్చినది. ఉం చదలచుకొనలేదు; ఉంచనన్నాను. ఎల్లకాలము ఉంచు కొందునని కరారుచేసితినా?"

గోపా: "సుఖముగా కుడిచి కూర్చుండలేక ఏదో యొక చిక్కు తెచ్చిపెట్టుకొను చుందువు."

రుక్మి: "ఏమిచేయను? నాకిట్టి వెఱ్ఱియున్నది. స్వభా వమే యట్టిది. మీకు మహాలక్ష్మి ఇష్టమైనది కనుక మెడకు కట్టుకొనండి. ఇంటిలో దానియవసరము లేదు!"

ఇల్లువదలిపోవునపుడు దాదికన్నులు బాష్పపూరి తములై యుండెను. అబ్బాయిని—కృష్ణమూర్తిని—ఒక సారి ఎత్తుకొని ముద్దుపెట్టుకొని మరిపోవలయునని హృద యము కొట్టుకొనుచుండెను. కాని ధైర్యముకలుగలేదు. నిరాశాభరితమగు మానసముతో మహాలక్ష్మి వాకిలిదాటెను!

## 3

కృష్ణమూర్తి దాది వెంటవెంట ద్వారమువరకు వచ్చెను. కాని మహాలక్ష్మి తలుపు బయటినుండిమూసెను. అమాయకుడగు బాలకుడు "మాచీ, మాచీ" అని యేడ్చుచు క్రిందబడి పొరలాడసాగెను. రుక్మిణమ్మ అదమాయిం చెను; బుజ్జగించెను; ఎత్తుకొన యత్నించెను; మిఠాయి తెప్పించిపెట్టెదనని యాసగొలిపెను. బజారుకు తీసికొని పోయి బొమ్మలమూపెదనని వాగ్దానమొనర్చెను. ఈపద్ధ తులలో నేదియు అక్కరకురాకపోగా, కోతిపేరు బూచిపేరుచెప్పి భయపెట్టెను. అన్నియు వ్యర్థము లయ్యెను. "తుదకు రుక్మిణమ్మకు కోపమువచ్చి, పిల్లవాని నేల చదికిలబడవేసి, గృహకృత్యములవైపు మరలెను. కృష్ణమూర్తిముఖము, చెక్కులు ఎఱ్ఱబారెను కనురెప్ప లుబ్బెను. ఏడ్చిఏడ్చి అట్లేయలసి, పరుండి నిద్రపోయెను.

'కొంచెముసేపు ఏడ్చి వాడే యూరకుండును' అని రుక్మిణమ్మయనుకొనెను. కాని అబ్బాయి నిద్రలేవ గానే మరల "మాచీ," "మాచీ"యని దాదిపేరు జెప్పుచు ఏడ్వసాగెను. సాయంత్రమువేళ గోపాలరావు కచ్చేరీ నుండివచ్చి, బాలునిస్థితిమూచి, విచారపడి భార్యను కోప దృష్టితో నవలోకించెను. పిల్లవానినెత్తుకొని యోదార్చు చుండెను. "మాచి" తనకొరకు మిఠాయితెచ్చుటకై బజారునకుబోయినదని నమ్మకము కుదిరినతరువాత, కృష్ణ మూర్తి సమాధానపడి యూరకుండెను.

చీకటిపడగానే యాశిశువు మరల ఏడ్వసాగెను "మాచి, మిఠాయి తెచ్చిందా?"యని. రెండుమూడుదినము లీప్రకారము గడచెను. "మాచి" "మాచి"యని. యేడ్చుట అల్లరిపెట్టుటతప్ప కృష్ణమూర్తికి వేరుపనిలేదు. నిముస మైనను వానిచంక బాయకుండిన యానోరులేనికుక్క, గూటిలో నెల్లప్పుడు గూర్చుండి కుంయి, కంయిమనక వానినెప్పుడు సంతోషపెట్టుచుండినపిల్లి, వానికి కడు ప్రేమాస్పదమైన యాయెగురజాలని చిలుక,—ఇవియ న్నియు తమప్రాముఖ్యమును గోల్పోయెను. బాలుడు వీనినికన్నెత్తియైన చూడడు. తనమీద అపేక్షపడునది యు, ఎత్తుకొని త్రిప్పునదియు, జోకొట్టి నిద్రపుచ్చున దియు, పాటలుపాడి నవ్వించునదియు,— నగుసజీవయగు దాదిస్థానమగు పైవస్తువులలో నొక్కటియైయు ఆక్రమింప

నేరదయ్యెను. నిద్రలో బాలుడప్పుడప్పుడు కలువరించి "మాచీ, మాచీ"యని యరచుచు మేల్కొని యేడ్వ మొదలిడును. ఒక్కొకప్పుడు ద్వారమువద్దకి బోయి "మాచి"ని బిగ్గరగా బిలుచుచుండును. రమ్మని చేతులతో సంజ్ఞ చేయుచుండును. దాదియుండు గదిలోనికిబోయి యచ్చట గంటలకొలది కూర్చుండును. 'మాచి' యచ్చటికివచ్చునని వానినమ్మకము! ఆగది తలుపు వేసి యుండినచో పోయి తట్టుచుండును! లోపల నది దాగియున్న దేమో యని వానియూహ. సింహద్వారము తెరచినచప్పుడు వినరాగానే "మాచి" వచ్చినదేమో యనుకొని పరుగెత్తిచూచును. బంతివంటి యాశరీరము కృశింపసాగెను. గులాబిపూలవంటి చెక్కులు ఎండిపోయినట్లు కాన్పింపదొడగెను. తల్లిదండ్రులిరువురు వాని మందహాసమునకై పరితపించుచుండిరి. చక్కిలిగింతపెట్టి బలవంతముగ నవ్వించినచో, ఆనవ్వు నిముసమునకంటె నిలిచెడిదికాదు. పాలమీద వానికి ప్రేమతగ్గెను. పటికబెల్లముమీద అంతకంటెను. పండ్లుగాని, బిస్కట్టులుగాని వానికి రుచిగా నుండలేదు. "మాచి" పెట్టుచుండినప్పుడు వానికీవస్తువులు మహారుచిగలవిగా దోచుచుండెను. ముద్దులు మూట గట్టుచున్న రెండుసంవత్సరములు దాటిన కృష్ణమూర్తి—నవనవలాడుచుండిన యాకోమలపు మొక్క—వాడ జొచ్చెను. సందిట నెత్తికొనగనే ఆనందము గొల్పుచుండిన బాలుడు నేడు శల్యముల గూడుగా మారెను. రుక్మిణమ్మ బాలుని ఈస్థితిచూచి లోలోన చింతించుచు తన తెలివితక్కువతనమును నిందించుకొనుచుండెను. తనపనియేమో చూచుకొనుచు దివానఖానా (చావిడి)లో కూరుచుండు—ఏకాంతవాస స్వభావముగల — గోపాలరావు ఇప్పుడు అబ్బాయిని చంకనుండి దింపజాలక పోయెను. ప్రతిదినము వానిని విహారమునకై తీసికొనిపోవుచుండెను. దినదినము క్రొత్త క్రొత్త హల్వాలు పెట్టించుచుండెను. కాని యా మొక్క వాడిపోవుచునేయుండెను. దాది యా మొక్కకు సూర్యకాంతి. అట్టి నైసర్గికసాధనమును గోలుపోయి మొక్క ఎట్లు నవనవలాడగలదు? మహాలక్ష్మి ఇంటినుండిపోయిన మూడవ నాడే మరియొక పనికత్తెనుంచిరి. కాని కృష్ణమూర్తి దానిని 'దయ్యము'ను జూచినట్లుచూచి, దగ్గరకు బోక వెనుదీసెను!

బాహ్య ప్రపంచమున "మాచి" కనబడనందున, కృష్ణమూర్తి, మానసిక ప్రపంచమున—ఊహాలోకమున—తరచుగా దానిని జూచుచుండును. అచ్చట నది తిరుగుచుండెను. అదే పూర్వపు ఆకారము: అవే ముద్దుమాటలు. అవే మనోహరములగుపాటలు; అవే తియ్యని మిఠాయీలు: అవే రాత్రిందివములు!! ఒంటరిగా గూర్చుండి "మాచి"తో సంభాషించుచుండును. "మాచీ, చూడు నాకుక్క ఎట్లా అరుస్తుందో," "మాచీ, ఆవుపాలపిండుతా" "మాచీ, గుర్రము ఎక్కిపోతా" మున్నగువాక్యములు పల్కుచుండెను. తెల్లవారగానే చెంబుతీసికొని దాదియుండిన గదిలోనికిపోయి, "మాచీ,మంచినీళ్లుతాగు" అనును! పాలగ్లాసుతీసికొనిపోయి గదిలోపెట్టి "మాచీ, పాలుతాగు" అని పల్కును!! మంచముమీద దిండుపెట్టి దానిపైన దుప్పటికప్పి, "మాచి, నిద్రపోతున్నది." అని వచించును!! రుక్మిణమ్మ అన్నము తినుచుండినపుడు పళ్లెములు తీసికొనిపోయి దాదిగదిలోపెట్టి "మాచి అన్నము తింటుంది" అని చెప్పును!!! "మాచి" ఇక కనుపడదని బాలునకుదోచెను. దాదిస్మరణమాత్రమువానికి సంతోషదాయకమైయుండెను. శిశువునందిప్పుడు బాల్యమునకు సహజమగు గండాగొండితనము, హటముపోయి, ఆస్థానమును సాధుత్వము, నిరాశయనునవి యాక్రమించెను. రెండువారము లిట్లు గడచెను. అది వర్షకాలము. ఊరిలో జ్వరములు, దగ్గుపడిసెములు ఉండెను. కృష్ణమూర్తి ఋతువు మార్పును సహింపజాలదయ్యె. రుక్మిణమ్మ శిశువువిషయమై ఎంతో జాగ్రత్త పుచ్చుకొనుచునే యుండెను. ఫ్లానలుకుడతా తొడుగుచుండెను. నీటిదగ్గరకు పోనీయదు. ఉత్తకాళ్లతో నొక్క యడుగైన పెట్టనీయదు! అయిననేమి? జలుబుచేయనే చేసెను. జ్వరము, దగ్గు పడిసెము రానేవచ్చెను.!!

## ౪

ప్రొద్దుటిపూట. శిశువు మంచముపైన కన్నులు మూసి పరుండెను. రుక్మిణమ్మ మంచముమీద గూర్చుండి బాలునియొడలి కేదో తైలము రాయుచుండెను. గోపాలరావు చింతాప్రదర్శకములగు చూడ్కుల కుమారునిపై బరపుచు ప్రక్కన చదికిలబడియుండెను. అతడీనడుమ

భార్యతో నీవిషయమున మాట్లాడుట చాలవరకు మానుకొనెను. రుక్మిణమ్మపైన నతనికి అసహ్యము కలుగజొచ్చెను. కొడుకునకువచ్చినవ్యాధికి మూలకారణము తల్లి యని యాతడు నిశ్చయించి, నేరము నామెపైననే మోపెను. గోపాలరావుదృష్టి కామె ఉత్తవిరసురాలు; అల్పబుద్ధిగలది; కోమలభావశూన్య!"

రుక్మి: (జంకుతో) "ఇవాళ్ల పెద్దడాక్టరుగారిని తీసికొని వస్తారా? ఆయనవైద్యమువలన మనము గట్టెక్కగలమేమో?"

గోపా: (ఆకాశము నావరించియున్న నల్లనిమేఘములవైపుజూచి) "పెద్దడాక్టరుకాడుగదా ధన్వంతరివచ్చినను ఉపయోగములేదు."

రుక్మి: "అట్లైతే, ఇక ప్రపంచములో ఈవ్యాధికి మందే లేదా?"

గోపా: "ఒకటేమందు; కాని అదిదొరకునదికాదు."

రుక్మి: "మీకెప్పుడు ఆభ్రమతప్ప మరొకమాటయే లేదు. మహాలక్ష్మి సంజీవితెచ్చునా? అమృతభాండముతీసికొని వచ్చునా?"

గోపా: "అది నీమనస్సునకు విషభాండమే యగుగాక, అబ్బాయి విషయమున నది అమృతభాండమే!"

రుక్మి: "ఈశ్వరుని చిత్తమునందు—ఈశ్వర వ్యవహారమునందు మహాలక్ష్మికి అంత ప్రవేశమున్నదేమో!—నేనెరుగను."

గోపా: "ఎరుగని పక్షమున—ఇంకను తెలిసికొనని పక్షమున—యుందు ఏడ్చెదవు! కడుపున చిచ్చుపెట్టుకొందువు!!"

రుక్మి: "ఛీ ఊరుకోండి, ఇటువంటి అశుభము నోట రానీయవలదు. 'శుభము పలుకరా—అంటే ఏమో' యన్నట్లు—అవతలికి పోండి."

గోపా: నేనుపోతాను. కాని ఈవిషయమున నింద నీపైననే యుండునని నమ్ము. కృష్ణుడు ఆరోగ్యమును మరల కాంచవలయునని నీకిష్టమున్న పక్షమున—మహాలక్ష్మివద్దకు పో., దానిని బ్రతిమాలుకో; వేడుకో నీకొడుకు ప్రాణములు దానిచేతిలోనే యున్నవి!

రుక్మిణమ్మనోరు ప్రత్యుత్తర మియ్యలేదు.-కన్నులుమాత్రము బాష్పములతో జవాబుచెప్పెను.

గోపా: "ఏమనెదవు. పోయిదానిని వెదకివత్తునా?"

రుక్మి: "మీరెందుకుపోతారు? నేనే పోయెదను."

గోపా: "అంతమాత్రము దయ చేయకు; నాకు నీమీద నమ్మకములేదు. నీనోటినుండి ఏదైన రాగూడనిమాట వచ్చినయెడల అదివచ్చుటకు సిద్ధముగా నుండినను రాకపోవునేమో?"

రుక్మిణమ్మ ఈయెత్తిపొడుపునకు ప్రత్యుత్తరముగా నొకతీవ్రదృష్టి భర్తపై ప్రసరింపజేసి యనెను "నిజమే. అబ్బాయి జబ్బుపడినందునకు నాకేమైన విచారమున్నది కనుకనా?—సిగ్గుచేత మీతోననలేదు కాని నాకెన్నియోసారులు తోచినది. దానియిల్లు జాడ నాకు తెలిసియుండిన యెడల నేనెన్నియో దినములక్రిందనే దాని బతిమాలితీసికొని వచ్చియుందును. నామీద కోపముండినను, దానికి అబ్బాయి అంటే ప్రాణము. ఈదినము పోయివచ్చెదను. దానిచేతులుకాదు— కాళ్లుపట్టుకొనెదను. పుత్రభిక్షముపెట్టుమని యేడ్చెదను! ఏమిచేసియైనను దాని బిలుచుకొని వచ్చెదను!

ఈమాటలు పలుకునపుడు రుక్మిణమ్మ కంఠముగద్గదికమయ్యెను. ఎంతో కష్టమున శబ్దములు పెదవులనుండి వెడలెను. గోపాలరావు భార్యదీనావస్థను సహానుభూతితో జూచి యనెను "నీవుపోవుట బాగుండదు. నేనే పోయివచ్చెదను."

౫

మహాలక్ష్మి, పాపము, ఈప్రపంచమున ఏకాకి. ఒకప్పుడు దానికుటుంబము గులాబిచెట్టువలె నవనవలాడుచుండెను. కాని కాలక్రమమున శిశిరఋతువు ఆకుల రాల్చివైచెను. ప్రతికూలవాతాహతి చెట్టును నాశనము చేసెను. ఇప్పుడానేత్రోత్సవకరమగు చెట్టునకు స్మారక చిహ్నము ఈమిగిలినకొమ్మ—ఈమహాలక్ష్మి— మాత్రమే.

కృష్ణమూర్తి నాడింపు నుద్యోగము దొరకిననాటినుండియు, ఎండిపోయిన తుదికొమ్మకు ప్రాణమువచ్చెను. ఇది చిన్నచిన్న క్రొత్తయాకుల దొడగెను. నిస్సారమైన జీవితమున నొకింత క్రొత్తవికాసము కలిగెను! కటికిచీకటి

యందు. అరణ్యమున దారితప్పి తిరుగుచుండిన బాటసారికి సన్నని దీపకాంతి పొడచూపెను! రాలురప్పలలో బడి కొట్టుకొనుచుండిన దాని ప్రాణము లిప్పుడు పుష్పభరితమగు నారామమున సంచరించుచుండెను !! దానిజీవితము ఇప్పుడు నిరర్థకముకాక సార్థకముగా బొడకట్టియుండెను !!!

కృష్ణుని అమాయికపు మాటలు, మనోహరములగు వానిచేష్టలు, మహాలక్ష్మి హృదయమును వశముచేసికొనెను. కాని మనస్సులోని ప్రేమ నది దాచియుంచుకొనును. తల్లికి తెలిసిన ఆమె యసూయపడునేమోయని మహాలక్ష్మిభయము. చాటుగా మిఠాయితెచ్చి బాలునికిబెట్టి యానందించును. కృష్ణునకు దృష్టితగులకుండ తాయెత్తులను రక్షరేకులను తెచ్చికట్టును. ఇతరులుచూడగా వాని కేతినువస్తువును పెట్టదు. 'అబ్బాయి ఏమియు తిననే తిన' డని యందరకు చాటును. వేయేల? మహాలక్ష్మిది స్వచ్ఛమైన మాతృప్రేమ! దానిలో ఆత్మానందముతప్ప స్వార్థము లేశమైనను లేదు !!

గోపాలరావుగారి యిల్లువదలిననాడు నాటకశాలయందొక్కమారు అన్నిదీపము లారిపోయినప్పటియుండుస్థితి మహాలక్ష్మి మనస్సున నుద్భవించెను. కన్నుల యెదుట అదియే ప్రదర్శనము; అదియే ఆట! చెవులలో అవే పాటలు !!

ఆనాడు దాని కేమియు తోచలేదు. రాత్రి ఎట్లోగడిపెను. ఉదయమున ఇల్లూడ్చుకొనుచుండగా, మిఠాయీ అమ్మువానికేక వినవచ్చెను. వెంటనే చీపురుకట్ట పడవైచి హల్వాకొనబోయెను. "నేడు హల్వా ఎవరికి కొనిపెట్టవలెను? నాయొడిలోగూర్చుండి ముద్దులుగులుకు ముచ్చటలు నేడెవ్వరాడుదురు? హల్వా తినునప్పుడు కృష్ణునికన్నులందును, పెదవులందును, శరీరము యొక్క ప్రతియవయవమునందును ప్రకటమగుచుండు ఆనందరసము ఈనాడు నాకెక్కడినుండిలభించును" అను భావములు తలంపునకురాగా మహాలక్ష్మి హృదయము వ్రయ్యలుకాజొచ్చెను ! అట్టిస్థితిలో "అబ్బాయిని చూచివత్తాము" అనుకొని యది చిత్తవిభ్రాంతితో నిల్లు వెడలెను. సగముదూరముపోయి మరలివచ్చెను.

కృష్ణుడు ఒక నిముసమైనను మహాలక్ష్మి హృదయమును వదలియుండలేదు. నిద్రలో దానికి బాలు డేడ్చుచుండినట్లు వినవచ్చి యదరిపడిలేచును. ఒక్కొకమారు కూర్చుండినప్పుడు, కృష్ణుడు కద్రగుద్రము నెక్కిపోవుచున్నట్లు తోచి పక్కుననవ్వును. ఇరుగుపొరుగు వారిండ్లకుపోయి వాని చిలిపిచేష్టలు వర్ణించుచుండును. ఆబాలునిపైగల ప్రేమ మహాలక్ష్మి హృదయస్థలమునంతను ఆక్రమించియుండెను. రుక్మిణమ్మచూపిన నిరాదరణను గురించిన వ్యాకులమునకు అచ్చట నిక స్థలమేది?

మహాలక్ష్మి ప్రతిదినము, "కృష్ణుని ఈరోజు చూచెదను" "ఈరోజు చూచివచ్చెదను" అని సంకల్పించుకొనుచుండెను. ప్రతిదినము బజారునకుబోయి ఏవో ఆటవస్తువులనో, మిఠాయియో కొని తెచ్చుచుండెను. కాని సగముదూరముపోయి మరలివచ్చుచుండును. కొన్నివేళల నాలుగు అడుగులుపోయి తిరుగను. "ఏమి మొగము పెట్టుకొనిపోదును?" అని యొకమారనుకొనును. "కృష్ణుడు అసలు నన్ను గుర్తుపట్టునా? పట్టకపోతే ఏమి చేయుదును? పిల్లవాండ్రకు అపేక్ష నమ్మకమేమి? క్రొత్త దాదికలవారై యుండవచ్చును. ఇట్టిభావములు గొలుసులై దాని కాళ్లగట్టివైచుచుండెను!

ఈప్రకారము మూడువారములు గడచెను. దూరపుప్రయాణము చేయుచున్న బాటసారిహృదయమువలె మహాలక్ష్మి మన స్సెప్పుడును నిరుత్సాహపడియుండును. ఇంటిలోని వస్తువులెక్కడివక్కడనే పడియుండును! అన్నముమీదగాని బట్టమీదగాని ఆసక్తియుండదు! ఆ దినములలో ఇరుగుపొరుగువారు కొందరు కాశీకిబోవు యత్నమునం దుండిరి. పంజరమునుండి బయటబడిన పక్షి ఏదైన నొకమూల నాశ్రయము వెదకుకొనునట్లు, మహాలక్ష్మి మానసము విశ్రాంతికై అటునిటు పరువులుపెట్టుచుండెను. అట్టిసమయములో కాశీయాత్రమాట దాని మనస్సునకు వచ్చెను. ప్రయాణయత్నములు చేసికొనెను.

హైదరాబాదు రైలుస్టేషనునందు యాత్రికులనేకులు గుంపులుగుంపులుగా గూడియుండిరి. కొందరు రైలు డబ్బాలలో గూర్చుండియుండిరి, కొందరు తమవారి సెలవు లందికొనుచుండిరి. ఎటుచూచినను సందడిగానుండెను. పరమార్థము మూరగొనుటకై యాత్రకు బోవుచున్నవారిని

ఈ సమయమున గూడ ప్రపంచము పట్టిలాగుచునే యుండెను! 'వరికోత లైనతరువాత చెరువులోపల కర్బూజాపంట పండించవలసినది సుమా" యని కుమారుల హెచ్చరించు తండ్రులును, "రైతులవద్దినుండి పైకము వసూలు కానిచో దావాచేయక మరచెదవు సుమా" యని తమ్ములకు బోధించు అన్నలును, "అప్పు లిచ్చి వారివద్ద నూటికి నెలకు రెండురూపాయలకంటె తక్కువ వడ్డీకి వప్పుకోవలద"ని పిన్నలకు చెప్పు పెద్దలును, "సరకులు సమయమునకు అందనియెడల నీవు స్వయముగా పోయిరావలసినద"ని ఖండితముగా గుమాస్తాలకు చెప్పు యజమానులును ఎందరో యుండిరి! కొందరు మాత్రము ధ్యాననిమగ్నులును, కేల జపమాలలను త్రిప్పుచుండిన వారును కానవచ్చుచుండిరి.

మన మహాలక్ష్మి యొక డబ్బాలో గూరుచుండి యనుకొనుచుండెను: "ఈ పెద్దమనుష్యులను ఈ సమయమున గూడ ప్రపంచవ్యామోహము వదలిపెట్టక పోయెనే. ఇప్పుడు కృష్ణుడు ఇక్కడ నుండెనా, ఎంత ఏడ్చునో ఎంతగోలపెట్టునో! నా యొడిలోనుండి అసలు దిగియే యుండడు. కాశీనుండి వచ్చిన తరువాత పోయి చూచివస్తాను: రైలు ఇంకా ఎందుకు సాగదు? ఉడకపోసిపోసి ప్రాణముపోవున ట్లున్నదే!"

అంతలో గోపాలరావు బైసికలు చేతబట్టుకొని ప్లాటుఫారముపైన ఎవరినో వెదకుచుండినట్టు కాన్పించెను. అతని ముఖము వెలవెల పోవుచుండెను: ఆయనను చూడగానే మహాలక్ష్మి బండిలోనుండి తల యీవలకు బెట్టెను. గోపాలరావు అది కనుపడగానే ముందునకుసాగి ప్రశ్నించెను:"ఏమిమహాలక్ష్మీ!నీవుకూడయాత్రపోవుచున్నావా?"

మహా:—"అవునండి, అయ్యా, ఇక్కడ చేయదగిన పని యేమున్నది? జీవనము లేదు. ఈ పాడుశరీరము ఎన్నడు పడిపోవునో. దేవునకు ముఖము చూపు ఆస్కారము ఉండవలెనుకదా! అయ్యా, అబ్బాయి గారు బాగున్నారా?"

గోపా:—"నీవు యాత్రకు పోవుచునే యున్నావు. అబ్బాయి సంగతి విచారించి మాత్రము ఏమిచేయగలవు?—వాని క్షేమమునకై కాశీ విశ్వనాథుని ప్రార్థింపుచుండుము."

మహాలక్ష్మి గుండెలుకొట్టుకొనసాగెను. "అయ్యా, అబ్బాయిగారి శరీరము బాగులేదా?" అని యడిగెను.

గోపా:—"నీవు మాయిల్లువదలిన నాటినుండి అబ్బాయి ఆరోగ్యము చెడినది. రెండువారముల వరకు "మాచీ, మాచీ" యని రాత్రిం దివములు నిన్ను స్మరించుచు, మారాము పెట్టినాడు. ఇప్పుడు వారము దినము లైనది. జ్వరము దగ్గు పడిసెము వదలటము లేదు. మందు మాకులవలన ఉపయోగము కనుపడ లేదు. నిన్నుచూస్తే ఆరోగ్యము కుదురునేమో యనుకొని, బ్రతిమాలి తీసికొని పోదామని మీ యింటికి వెళ్లి విచారించితిని. నీవు కాశీయాత్రకు బోవుచున్న వార్త తెలిసి వచ్చినాను. నిన్ను రమ్మనుమను బుద్ధి యున్నది. కాని నీ విషయములో మేము చూపిన ఆదరణ ఏ మంత బాగుగా నుండినది? నిన్ను పిలుచుటకు ధైర్యము తోచుట లేదు. అంతేకాక, కాశీ పోనివాండ్రను పంపుట పుణ్యముగాని పోవుదానిని ఆపుట మెచ్చదగిన పని కాదుకదా. ఆయువు మిగిలి యున్నయెడల బ్రతుకగలడు.!"

మహాలక్ష్మి కన్నులు చీకట్లు గ్రమ్మెను. ఎదుటనున్న వస్తువులు నీటిమీద తేలియాడుచున్నట్లుండెను. విచిత్రమగు భయభ్రాంతి తోపసాగెను. "ఈశ్వరా! కాశీ విశ్వనాథా! నా కృష్ణుని ప్రాణము కాపాడుము తుచ్ఛగాల నగు నా ప్రాణములు నీ కర్పించుచున్నాను!!" అను ప్రార్థనావచనములు అప్రయత్నముగా మహాలక్ష్మినోట వెడలెను. కన్నుల బాష్పములు గారసాగెను. కంఠము చెడెను. "నేనెంత కఠినురాలను. పాపము కృష్ణుడు ఏడ్చిఏడ్చి వ్యాధిగ్రస్తు డయ్యెనేమో. నేను చూచియైన రాకపోయితిని. రుక్మిణమ్మ దుస్స్వభావము కలదియే యనుకొందము. నోటివట్టముదే యనుకొందము. అయినను అబ్బాయి నాకేమి యపకారము చేసెను. తల్లి యపరాధమునకు నేను కొడుకును—అమాయకు డగు శిశువును—శిక్షించితిని! రామచంద్రప్రభో! నా తప్పు మన్నింపుము!! అపరాధిని, మహాపాపిని!!" యను భావములు మెదడునందు పరువిడసాగెను. "అక్కటా! అబ్బాయికి నామీద ఇంత యపేక్షయున్న సంగతి నే నెరుగకపోయితిని! తెలిసి యుండిన పక్షమున, రుక్మిణమ్మ తిట్టినను — మెడబట్టి

యింటినుండి గెంటివేసినను అక్కడనే పడియుండును. పాపము, ఎట్టి స్థితియందున్నాడో కదా" యని తలపోసి భయకంపితమగు ధ్వనితో నడిగెను:

"అయ్యా, పాలు త్రాగుచున్నాడు కాదు ?"

గోపా:—"పాలమాట యడుగుచున్నావా ? రెండు దినములనుండి కన్నులే తెరవడు."

మహా:—అయ్యో, నాయనా ! ఓరీ కూలీ, ఈ సామాను కొంచెము దింపు, మాయయ్యా, మంచివాడవు. ఇక నాకు కాశీ గయలు తోచవు. త్వరగాదింపు. (గోపాలరావుతో) అయ్యగారూ, జట్కాబండి ఉన్న దేమో చూచి కుదిరించండి. నాకాళ్లు వడకుచున్నవి !"

మహాలక్ష్మి జట్కాబండిలో గూర్చుండెను దారిలో బండ్లు అడ్డముగా నిలిచియుండెను. జట్కాగుఱ్ఱము మందముగా నడువసాగెను. ప్రయాణికులు కొందరు గుంపులు గుంపులుగా మార్గమున మూగియుండిరి. మహాలక్ష్మి కీయాటంకములు కోపము, విసుకు తెప్పించుచుండెను. గుఱ్ఱమునకు రెక్కలు వచ్చినచో సంతసించియుండెడిదేమో. గోపాలరావుగారి యింటి సందు సమీపించెను: "దేవుడా క్షేమముగా నుండుము" అను మాటలు మాటిమాటికి నోట వెడలుచుండెను !

బండి సందులోనికి ప్రవేశించగానే ఏదో రోదన ధ్వని వినవచ్చెను. గుండెలు పగులసాగెను. తల తిరుగ దొడగెను. సముద్రమున బడి మునిగిపోవుచున్నట్టు దోచెను. జట్కాలోనుండి క్రిందికి దుముకదలచెను. అంతలో ఆధ్వని అత్తవారింటికి బోవుచున్న యొక క్రొత్తకోడలిదని తెలిసి ప్రాణములు కుదుటబడెను!

ఇల్లు ప్రవేశించిరి. మహాలక్ష్మి భయముతో ద్వారమువైపు చూచెను. అంతయు నిశ్శబ్దముగా నుండెను. వంటవాడు కూర్చుండియుండెను. మహాలక్ష్మి ధైర్యముతో లోనికి బోయెను. క్రొత్తదాది ఏదో మందు సిద్ధము చేయుచుండెను. రుక్మిణమ్మ తనగదిలో పిల్లవాని నొడిలో గూర్చుండబెట్టుకొని, తలుపువైపు దృష్టి నిగుడించి—దుఃఖము: నిరాశ—ఈరెండును కలిసి యేర్పడు చూపుతో—ఉండెను.

మహాలక్ష్మి రుక్మిణమ్మ యొడినుండి కృష్ణు నెత్తుకొని, నీరు నిండియున్న కన్నులతో ననెను: "నాయనా, కృష్ణమూర్తీ, కన్నులు తెరువు."

బాలుడు కన్నులు తెరిచి, రెండునిముసములవరకు నిశ్శబ్దముగా తన్నెత్తుకున్న మనిషి ముఖము తేరిపార చూచుచుండెను. తరువాత వెంటనే దాని మెడను కౌగిలించుకొని యనెను: "మాచి వచ్చింది! మాచి వచ్చింది!!"

కృష్ణుని పచ్చబారినమోమున కాంతి హెచ్చెను. ఆరిపోవనున్న దీపమునకు తైలము దొరికెను. ఇక కావలసిన దేమి ?



# ఆశాభంగము

దువ్వూరి సాంబమూర్తి గారు

పసిడిగిన్నియయంబోసిన ప్రణయమధువు
గాంచి యెంతోమురిసితినిగాని గ్రుక్కె-
డైన త్రావంగలేనైతి అక్కటకట
అంత పెదవులకందియు నందరాని
నాదుచక్కనిమధుపాత్ర నాయెదుటనె
పెరికి నేలకు గిరవాటు వెట్టినారు
నాటిమొదలు హృదయమున నాటుకొనిన
చింతచే బ్రతుకెంతయు చివికిపోయె
తొడిమి తెగిపోవగా జారి పుడమిబడిన
పూవుచందమునో లేక తీవలన్ని
విరుగగా నేలపడియున్న వీణవలెనో
ఇంపుచెడి యెంటిగా చీకటింటిలోన
తిరుగులాడుచుంటిని ప్రభూ! దిక్కుమాలి.




పెనుమర్తి వెంకటరత్నము గారు

౧

చామనచాయగలవాఁడు. కమలములవలె నున్నను లేకపోయినను నందము లొలుకు నేత్రములు. హృదయమార్దవము నేత్రచ్ఛాయలలో విహరించుచున్నది. ముఖవికాసమునఁ జింతామేఘము లున్నను, బాహ్యప్రకటనమంత బాగుగయుండలేదని యనఁ జాలము.

'ఇరువదేఁడులుండునేమో! ఏమిచిత్రము! ఆనందధామమునఁ దిరుగు నీవయోవసంత వేళల నీవిరాగితావృత్తియేమి? ఆహా! ఆనడలలో సౌందర్యదేవీవదనచ్ఛాయ లధ్యయనము చేయుచున్నవి.'

అని విజయపురిలోని యౌవతమున గుసగుసలు బయలుదేఱెను. ఆమూఁగిన గుంపులో నాకుమారునిఁ గని ముగ్ధలైనవారు తరుచు. వెన్నవంటి వారి హృదయవృత్తి ద్రవీభూతమై, అసహజమైన యాయౌవనాతిథివేషమున నానందముతోఁ గూడిన దుఃఖాశ్రువుల వెలిపెట్టినది.

నవయౌవనుఁడగు నాయోగి తను నీక్షించు నాకామినీబృంద ముగ్ధావలోకనములకుఁ బరాఙ్ముఖుఁడై, మాటాడక రాజవీధినుండి ప్రశాంతగంభీరముగ నడచిపోవుచుండెను. తన ప్రియురాలినిబాసి విరహగీతము బాడుకొనుచు నొక విహంగమట్టె పరువిడెను. ఆకసమున మబ్బులు కారుక్రమ్ముకొనుచుండెను.

౨

శిశిరకుఁ జిన్ననాఁటనుండియు బొమ్మల పెండ్లిండ్లుచేసి వినోదించుట యపారముగు నానందమూలకందము. ఆశైశవసామ్రాజ్య పట్టాభిషిక్తయైన శిశిర తన కాలమంతయు నీరకముగ ఆటపాటలలో వినియోగించుచుండెను.

కలవారి బిడ్డయగుటచే శిశిరకు చెలిమికాండ్రు, చెలికత్తెలు అనేకులుండి, యాపెతో నాడుకొనుచు తమ యానందరసమున కుత్పత్తిస్థానమైన శిశిరకుమారిక యెడ నతిసౌహార్దముతో మెలంగుచుండిరి.

కాలము గడచినది. శిశిరకు శైశవలీలలోని వ్యాపారము లనుభవనీయములగుటకుఁ గాలపురుషుఁడు యౌవనశంఖము నూదినాఁడు. చెలిమిచేయువారెల్లరు పెద్దవారయి యెవరిత్రోవ వారు గనుఁగొనిరి. కాని అందరిలోన శిశిరకు వసంతునికూడ ప్రేమ యగాధ

ము నపారమును. శిశిరనువిడిచి వసంతుఁ డుండలేఁడు! వసంతుని వీడి శిశిర యుండలేదు. బాల్యమునాఁడే నాటుకొని నల్దిక్కులకు వాసనలు చిమ్మిన యీతీఁగె పూచి ఫలవంతమగు కాలమాసన్నమైనది.

వసంతుఁడు పేదయింటివాఁడు. పూట గడువని నిరుపేద. కాని యతనిహృదయము శరన్నదివలె నైర్మల్యభాగధేయము.

3

శిశిర కిప్పుడు పదుమూఁడవయేఁడు. మన్మథుఁడు సానపెట్టిన యాయౌవనమూర్తి సౌందర్య నిధానమైనది. శిశిర ప్రతిదినము పూఁదోఁటలోని కేగ తోఁబుట్టువువోలె నొకచిఱు మల్లెతీవను పెంచుచుండెను. ఆమల్లె దినదిన ప్రవర్ధమానమై, గుబురుకొని యున్నది. శిశిర ప్రతిసాయంతనము మల్లికామంటపమున నాసీనయై, చదువుకొనుచుండును. మలయపర్వతమునుండి వీతెంచు గాలికెరటము లామూర్తికి శైతల్యము ప్రసాదించి భావసమాధికిఁ గొంపోవును. శిశిర యీనాఁ డామల్లెపొదకడ శయనించియున్నది. దక్షిణమునుండి గంధవాహుఁడామెను కుశలప్రశ్న చేసి మందగమనుఁడై పోయెను. శిశిరకు నిద్దురవచ్చెను. జగన్మండలమంతయు నామెకదృశ్యమైనది. ఆజగత్తున నొకమహత్తరమగు తేజఃఖండము దిగంతములకుఁ బ్రాకి వెలుఁగుచుండెను. ఆతేజస్సున నొకయవ్యక్తమూర్తి యామెకుఁ బ్రత్యక్షమయ్యెను. ఆమూర్తినిజూచి యామె తన్మయతనొంది రసైకస్రవంతిలో మునిఁగెను. మరల నొకగాలితరఁగ మల్లెపై సోఁకెను. క్రూరదంష్ట్రావికృత హాసములతో నొకభయంకరవ్యక్తి శిశిరకుఁ గనఁబడెను. ఆతఁడు తన కృపాణమునుజూపి బెదరించుచుండెను. శిశిర చలించెను. కనులు తెరచెను. మల్లెపొద నిలువున మాడిపోయెను. మెత్తఁదనపు నిగారములన్నియు ప్రళయవారిధిలోఁబడెను. శిశిర మూర్ఛిల్లెను. భయములేదని యొకయవ్యక్త ఘోషము విని యామె తెప్పిఱిల్లినది.

౪

వసంతుఁడు పేదవాఁడని, శిశిరమనోరథము శూన్యము గావింపఁబడినది. వారిదంపతీత్వము నైష్ఫల్య కృపాణముచే ఛేదింపఁబడియెను. శిశిరవివాహము జరిగినది. ఎవరో బంధుగులలో నొకరిని గట్టిరి. కాని శిశిరహృదయములో 'భయములేద'ను నిర్ఘోషము పెళ్లివారివాద్యఘోషములలోఁగూడ మ్రోఁగుచుండెను. శిశిర కానందవాహినిలోని కెరటముల చల్లఁదనము గానరాలేదు. పెళ్లివారందరును పుష్టిగా తుష్టిగా భోజనములుచేసిరి. ఈదాంపత్యము చాలా బాగున్నదని వినుతించిరి.

'శశినముపగతేయం కౌముదీమేఘముక్తా
జలనిధి మనురూపం జహ్నుకన్యావతీర్ణా
ఇతిసమగుణయోగప్రీతయ స్తత్రపౌరాం'

అని కాళిదాసునిశ్లోకము చదువుకొనిరి. తమ దేహము తామే యెఱుఁగని యీ పెండ్లియుత్సవములో వసంతు డెక్కడకు పోయెనో యెవ రెఱుఁగుదురు? ఎఱుఁగవలయునన్న నవసర మెవరికి?

## ౫

శిశిరఋతు వాసన్నమైనది. కమలముల కు బాధ తాళజాలనిదైనది. ఆ నిద్దపుఱేకులు వాడిపోవుచున్నవి.

* * * *

శిశిర మంచము పట్టినది. దిన దినము కార్శ్యమా పెయంగములతో చెలిమిఁజేయవచ్చుచుండెను. ముఖము పాండురమై వివర్ణమైనది. దేహమున రక్తచ్ఛాయ శైత్యము భజించుచుండెను.

వ్యాధిముదిరి భయంకరమగు సన్నిపాతము క్రింద మారినది. వైద్యులు యావచ్ఛక్తిని వినియోగించి పోయవలసినమందులుపోసిరి. బంధుమిత్రులయొక్క ఆశలు చితికి చీలికలైపోయినవి. నేటి కిరువదిరోజులు గడిచినవి. ఇఁక రెండురోజులలో వ్యాధి తిరుగుననిరి. భగవంతునిమీఁద నాధారమువేసిరి. నేఁడు జ్వరము తీక్ష్ణముగానున్నది. శిశిర మంచమునుండి లేచి లేచిపోవనారంభించెను.—

'ఓ కరాళమూర్తీ! రమ్ము! భయములేదు! నీ కత్తినాకిమ్ము! నేను కత్తితో నాట్యమాడెదను. నెత్తుటిలో అమృతము చూపించెదను. నేఁడు విశ్వమాత పిలుచుచున్నది. అదుగో! వసంతుఁడు, మాధవుని మధురమూర్తి! చిగురు చేతులు చాచి పిలుచుచున్నాఁడు. పూల నవ్వులుగురియుచున్నాఁడు. మృత్యుదేవి నావసంతుని భయపెట్టుచున్నది. బలే! సెబాసు! మృత్యుదేవి పాఱిపోవుచున్నది. ఓ మృత్యుదేవీ! రమ్ము! ఆడుకొందముర‌మ్ము! వసంతా! రమ్ము! మృత్యుదేవితో ఆడుకొందము.—అదిగో నామాత! విశ్వమాత! జగద్ధాత్రి! పిలుచుచున్నది. వసంతా! రమ్ము కత్తులరథములో పోవుదమురమ్ము!— భయములేదు! నామల్లెతీవ మాడ్చినవాఁడేడీ? రా. ఇటురా. నిన్ను మా మృత్యుమాత చే కొట్టించెదను. అదిగో! ఆనందనోద్యానము వసంతుఁడు పిలుచు చున్నాఁడు. కోయిలలు పాడుచున్నవి. రా. పో. పో' అని ప్రలాపింప సాగెను.

## ౬

ద్వార దేశమున గీతము వినఁబడెను. శిశిర కాయాసముపుట్టెను. ఝంఝా మారుతము తీవ్రముగ వీచెను. చెట్లు ఫెళ్లుఫెళ్లుమని విరిగి పడుచుండెను. ఆకాశమున కారుమబ్బులు క్రమ్మి లోకమున చీఁకట్లు పేర్చెను. భిక్షువు గీతము పాడుచుండెను.

### గీతి

"ప్రళయానిలంబులోఁ బ్రణయంబు మ్రోఁగె
విలయాగ్నిలోనఁ దేనెలు పొంగిపోయె
కారు మబ్బులలోన కాంతి పుంజములు
దిగనంతవీథిలో సాగసి పోయినవి
ఆనందలోకాన నదిగో పికంబు !
శాశ్వతప్రణయ సంచార గీతులుపాడు"

శిశిర తటాలున లేచి పరుగు పరుగున వచ్చినది. భిక్షువు గీతముపాడుచునేయుండెను. శిశిర భిక్షువు కడకువచ్చి బాహు వల్లరులు సాచినది. భిక్షువు కంఠమున గీతము మ్రోఁగుచునేయున్నది. ప్రళయ ఝంఝా

నిలంబు వీచి సముద్రమున తుపాను పుట్టెను. ఆ పరిష్వంగమునుండి ఏకమగు దివ్య తేజము మిన్ను ప్రాకినది. సముద్రము పాడినది.

"తేనెవాకలలోన తేలిపోదాము
పూవునాకలలోనఁ బొరలివద్దాము
దివ్యయాత్రకుపోయి దేవకన్యలకు
సాగరగీతముల్ ప్రోగుచేద్దాము"

దేహాళీవర్తియగు పంజరము నుండి చిలుక యెగిరిపోయి వసంతుని నాశ్రయించినది. పంజరము శూన్య గీతుల బాహిరిల్లినది.



# *తృష్ణా గీతము

విశ్వనాథ సత్యనారాయణ గారు

'ఇది మహావర్ష ఋతువుపై నీనిశానమాత్ర
మయము భీకరమయ్యె నామనసు
మీభయంకరరూపమ్మునే వరించు
నేయగాధమ్ములోదిగునో! యిదేమి?'

'నాదు దురవస్థగని నిశానలిననేత్రి
కనుల వెంట బాష్పమ్ములు కార్చదొడగె
నాకును భయమ్మొ గలిగెడు నామనస్సు
మాత్ర మేటికో చీకట్లు మలచుకొనెడు.'

'గాఢతిమిరంపు దుప్పటికప్పుకొనియె
చలికి బెదరినదనఁగ నిశాలతాంగి
ఆముసుఁగులోకి నన్ను రమ్మనుచునున్న
దటకు పోవలెనని నాకు నాశ మెండు.'

'ఈతమశ్శ్రీల శర్వరి యెల్లలోక
మావరించెను వర్షంబు లంతకంత
కధికమై యుప్పెనంబోలె నలముకొనియె
ప్రథితమార్గంబులను పరీవాహసమితి'

'కడగియుఱిమిన జీవలోకంబులెల్ల
బధిరితంబౌనో పిడుగులుపడి జగంబు
సమసిపోవునో యిట్టివర్షంబుకతన
ప్రలయజలరాసి లోకంబుపైనబడునో.'

('నర్తనశాల 'నుండి)






చిల్లరిగె శ్రీనివాసరావుగారు, బి. యే. (ప్రధానాచార్యులు: ఆంధ్రజాతీయకళాశాల)

ప్రాచీనకాలములో రోము పట్టణము ఇటలీదేశములో ననేకరాష్ట్రముల మధ్య నొకపేరొందిన రాష్ట్రము. పూర్వకాలములో నేదేశములోనైనను పట్టణరాష్ట్రములే యుండెడివి. అయినను మనము చెప్పబోవుకథనాటికి చుట్టుప్రక్కలనుండెడి రాష్ట్రములపై నీరోముపట్టణరాష్ట్రము అధికారము నేయుటకు సాగింప నారంభించెను. అందుచేత దీనివిజృంభణకు తక్కినరాష్ట్రములు సహింపకుండెను. ఎటులైన దీనియధికారమును పడద్రోసివేయవలె నని తక్కినరాష్ట్రములుపాయము లరయుచుండెను. ఇక తామందరునుగలిసి దీని వంచింపకున్న క్రమక్రముగా లోబడిపోవుదుమని వానికి భయము తోచి యొక కట్టడి కట్టుకొని రోము నాక్రమించెను. సైన్యములను గూర్చుకొనివచ్చి పట్టణముచుట్టు ముట్టడించెను. అట్లు వచ్చినవారు లాటినులను తెగవారు. వారల నెదుర్కొనుటకు రోమనుసైన్యము కదలి నడచెను.

రోమను సేనాపతు లిద్దఱు. వారిని కాన్సలులని పిలుతురు. వారిద్దఱును మహావీరులని పేరొందినవారు. అందులో నొకని పేరు టిటసు మానిలీసు. వీనికి టార్క్వేటసు అను మారుపేరుకూడ గలదు. వీని కీబిరుదునామ మొక కారణమున లభించినది. వీడు గాలులని యొక తెగవారిలో నొక మహాకాయుఁడగు యోధుని బరిమార్చి వానిమెడలో టార్కు అను నొకబంగారు కడియ ముండగా దానిని లాగుకొని తాను విజయచిహ్నముగా నెప్పుడును ధరించెడువాడు. రెండవవీరుడు పబ్లియసు డెసియసుముసు. వీడు సంపూర్ణ సేనాధిపత్యము వహించకమునుపే తనయుద్ధకౌశల పరాక్రమములచే కాన్సలును ఓటమినుండి రక్షించియుండెను. ఇట్టి వీరపురుషులిద్దఱును తమసైన్యమును విసూవియసు పర్వతప్రాంతమునకు కయ్యమునకై గొనిపోయిరి.

ఇఁక నాకాలపు రోమనులు మనవలెనే చచ్చిపోయినవారి సూక్ష్మశరీరములు పితృలోకమునకు బోవునని నమ్ముదురు. వారిపితృదేవతలు 'దేయిమానిసు'లని పిలువబడుదురు: అనగా దేవతలకును మనుష్యులకును మధ్యరకమువారని వారి యుద్దేశము కావచ్చును. అయితే వారి పితృలోకము ఊర్ధ్వలోకము గాక అధోలోకముగా పరిగణింపఁబడుచుండెను. ఆ అధోలోకము ఈవిసూవియసు పర్వతప్రాంతముననే యుండెనని వారియభిప్రాయము. వీరిసేన విడిసినసమీపముననే యదియున్నదని వారియూహ. ఇంతేకాక ఆనాటిరాత్రియా

వీరు లిద్దఱికి ఒక్కటే కలవచ్చెను. ఆకల యందు వారికొక్క భూతము కాన్పించెను. ఆ భూత మొక్క మేలిముసుంగు గప్పుకొని వారల కిట్లు చెప్పెను 'రోమనునాయకుడు పితృదేవతలను సంతుష్టాంతరంగులఁ జేసినచో రోమనులు లాటినుల నోడింపఁగలరు. అట్లుగాక లాటిను నాయకుఁడే పితృదేవతలను బ్రీతులఁ జేసినవాఁడైన యెడల లాటినులే రోమనుల పరాభూతులఁ జేయఁగలరు." పితృదేవతలను దృప్తులఁజేయుట యన నేమి? దేశముకొఱకై పూర్ణభావంబున ప్రాణంబొసంగుట.

కావున మఱునాడు మానిలీసును డెసియసును మంతనమాడుటకు కలిసికొనిరి. తమ కిద్దఱకును ఒక్కటే కలవచ్చినదని వారు ఒండొరులతో ననుకొనిరి. ఆకలలో చెప్పిన తెరగున నిద్దఱును దేవతలను దృప్తులనుజేయ సంసిద్ధులైరి. అంతట నుభయులును ఈ యేర్పాటు చేసుకొనిరి. యుద్ధసమయమున తమసైన్యపక్షముల నెద్దానిపై లాటినులు ఎక్కువ విజృంభింతురో యాదెసనున్న నాయకుడు దేవతాప్రీతిగా శత్రువులపై గవిసి ప్రాణము లర్పింపవలెనని వారనుకొనిరి. ఏలయన వారికి స్వప్నదృశ్య మట్లు సేయుడని బోధించెను.

తరువాత రోమనులును లాటినులును యుద్ధమునఁ దలపడిరి. సైన్యములు సంకుల సమరమున గలిసెను. డెసియసు నాయకత్వము వహించినపక్షమును లాటినులు తీవ్రముగ నాక్రమించిరి. అతని అగ్రదళములు విచ్చి వెనుకకు తొలగెను. అంతట దేవతాప్రీతికొఱకు బలిపోవలసిన సమయము వచ్చెనని డెసియసు గ్రహించెను. దానిమీద నాతఁడు ప్రధాన పురోహితుని పిలిపించెను. ఆ ప్రధాన పురోహితుని పేరు పాంటిఫెక్సు మాక్సిమసు. ఆతనివలన రోమనుశాస్త్రానుసారమైన విధివిధానంబులఁ బడసి దేవతలకు తనను బలిసమర్పణంబు చేసికొనెను. దేవతలకు బలిహోమంబు లర్పించు వేదికపై యజ్ఞపశువు నిలుచువిధమున నాతడు నిలిచి బట్టలను బిగియఁగట్టుకొని లాటినులసైనికపంక్తులపై విజృంభించెను. ఆతఁడట్టి యావేశమున పైకురుకు నప్పుడు శత్రుపక్షముల కొక్క యమానుష పురుషుండుగాఁ గాన్పించెను. ఆతని తేజమును జూచి లాటినులు బెగడొందిరి. ఆతఁ డశ్వముపై నెక్కి సమరక్రీడ జరుపునపు డందఱ కన్నిరూపుల ప్రత్యక్షమై భయంబు పురికొల్పెను. చిట్టచివఱకాతడు శత్రువులకొల్తలకు రణనిహతుఁడై పడినను రోమను లాతని వీరావేశమును గైకొని శత్రువుల నురుమాడిరి. లాటినులు భయకంపితులై చెల్లాచెదరై పోయిరి. సైన్యముయొక్క రెండవపక్షమున కధినాయకుఁడైన మానిలాసుకు స్వప్నగత వృత్తాంతము యథార్థమయ్యెనని కబురు పోయెను. డెసియసు ప్రాణము సమర్పించి ధన్యుడయ్యెనని యాతఁడు తెలిసికొనెను.

మానిలాసు చాల విచారపడెను. తన కాయదృష్టము లభింపకపోయెనేయని యతని విచారము.

---




భండారు వీరరాజేశ్వరరావు గారు, బి. ఏ.

౧

ఈవు నను జూడ నిచటి కేతెంచువేళ
లలితకోమలపాదాబ్జములను, నాదు
కోమలామృత హృత్పాత్రఁ గ్రుమ్మరించి
ప్రణయరసమున గడగివైతును శుభాంగి!!

ఈవు నను జూడ నిచటి కేతెంచువేళ
నాసువర్ణ మనోకేతకీ సుమంబు
కళుకురేకుల నొక్కటొక్కటిగఁ గూర్చి
ప్రణయహారంబు మెడఁజుట్టెదను శుభాంగి!!

ఈవు నను జూడ నిచటి కేతెంచువేళ
నాసరళరాగ హృదయరత్నంపుదీప
కళికలో, తాపపుం దైలములనుబోసి
ప్రణయనీరాజనముఁ బట్టెదను శుభాంగి!!

ఈవు నను జూడ నిచటి కేతెంచువేళ
నామృదులముగ్ధ హృదయగ్రంథంబులోని
యమృతపత్రంబులందు వ్రాయంగఁబడిన
ప్రణయగీతంబులను బాడెదను శుభాంగి!!

ఈవు నను జూడ నిచటి కేతెంచు టెపుడో??
నేను నీమానసాంతర్విలీన మగుట
యెపుడో? యనుచింత చేత జీర్ణించి నీప
దంబుకడ రాలు పూజాసుమంబునైతి.

౨

ఆమనోజ్ఞ విశాలనీలాంబుదముల
మెఱుపుసింహాసనముకై భ్రమింప బోను;
నీయమూల్యానురాగ సందీప్తమైన
హృదయపీఠి నలంకరించెద నటంచు.

స్వర్గలోక కల్పకతరుచ్ఛాయలందు
నలరు పూబొదనీడల కాసపడను;
లేఁతచలిమొడలందుఁ జరించువేళ
నీనిడుదనీడలను శయనింతుననుచు.

ప్రవిమలవినీల గగనమార్గమునఁ బాఱు
లలితమందాకినీజలంబుల వరింప;
నలలుకలచని నీమధురాధరముల
నమృతపుం జిన్కగా మారనగు నటంచు.

నిఖిలలోకంబులను బూజనీయమైన
ఇంద్రపదవినిగూడ నే నీసడింతు;
అమిత ప్రణయతరంగితమైన నీదు
కంటిలో పాపగా మారఁగల నటంచు.





# ఇరుగుపొరుగు పోరు

పాలపర్తి ఆంజనేయులు గారు

(టాల్‌స్టాయి అనుకరణము)

## ౧

రామయ్య గ్రామంలోని మంచిసంసారులలో ఒకడు మంచివయస్సులో ఉన్నాడు. పైగా చేతి కక్కరకువచ్చిన కొడుకులు ముగ్గు రున్నారు. పెద్ద కొడుకు పెండ్లిఅయినది. రెండోవాడు పెండ్లియీడులో వున్నాడు. మూడోవాడు యెదిగినకుఱ్ఱాడు. గొడ్లుగోద చూస్తూ ఉంటాడు. రామయ్య భార్య సీతమ్మ పొదుపరియైన మంచి ఇల్లాలు. కోడలుకూడ చెప్పుచేతుల్లోవుండి కష్టపడి పని చేసేదే. ఇక వాళ్లకుటుంబం సుఖంగా ఉన్నదంటె ఆశ్చర్యమేమున్నది? ఇంట్లో కూర్చోని తినేది ఒకముసలాడే. రామయ్యతండ్రి ముసలయ్య ఉబ్బసము చేత మంచమెక్కి చాలకాలమైంది. రామయ్యకు రెండఱకల యెడ్లు, బండి, ఆవులు, గేదెలు, దూడలు, పాడి పంట అన్ని లక్షణంగానే ఉన్నాయి. ఇంట్లో ఆడవాళ్లు అందఱిబట్టలకు తమ చీరెలకు కావలసిననూలు వాళ్లే వడుకుతారు. ఇంటిపని, గొడ్లు, గోద పాడి అంతా వాళ్లే చూచుకుంటారు. మొగాళ్లుకేవలము వ్యవసాయంతోనె పడికొట్టుకుంటుంటారు. పంట లొచ్చేవరకు కావలసిన సంవత్సరగ్రాసం నిలవచేసుకొని మిగతాధాన్యము అమ్మి పన్నులు పైఖర్చులు వాడుకుంటారు. రామయ్య కేచీకుచింత లేదుగాని పొరుగింటి నాగన్నపోరుమాత్రము ఎక్కువైంది.

నాగన్నతండ్రి సుబ్బయ్యకూడ చాల మంచి సంసారె పాపము! కొద్దికాలముక్రిందటనే చనిపోయినాడు. ముసలయ్య పెత్తనం సాగినంతకాలము సుబ్బయ్య బ్రతికివుండగా రెండుకుటుంబాలు ఏపోరుపొక్కు లేకుండా ఉంటూవచ్చినాయి. ఆడవాళ్లు చేట జల్లెడ, రోలు రోకలి యేదికావలసివచ్చినా, మగవాళ్లు నాగళ్లు సంచులు, పార పలుగు యేదికావలసినా ఒకళ్లయింట్లోనుండిఒకళ్లు ధారాళంగా తీసికొనివెళ్లుతూ ఇరుగుపొరుగు ముచ్చటగా వుండేవాళ్లు. ఎప్పుడైనా పశువులు కళ్లంలోపడితే తామె తోలి 'ఒరే! అబ్బాయి! ధాన్యంయింకా సంచుల్లోకియెత్త లేదు. కాసేపు పశువులను రానీయబోకని చెప్పేవారు. ఇప్పటివలె అప్పుడు ఇళ్లువాకిళ్లు తాళా లేసుకోవడం, ఒకరివస్తువు మరియొక రడిగిపోతారేమో అని దాచుకోవడం అప్పుడులేవు తండ్రులకాలంలో ఆలా జరిగింది. ఇపుడుకొడుకులుకోడళ్లకాలంలో అంతాతల్లక్రిందులైంది.

## ౨

రామయ్య కోడలికి పుట్టింటారు గేదగొడ్డును ఇచ్చారు. మెళ్లోకి నానుపోచ చేయించుకుందా మని దాని పాడి ఆఅమ్మాయి చేసుకుంటూ, పాలు నెయ్యి వీలు చొప్పున అమ్ముకుంటూ గొడ్డును జాగ్రతగా చూచుకుంటున్నది. ఒకనాడు చీకటిపడ్డా గేద యింటికి రాలె. పాడిగొడ్డుయింటికిరా లేదేమాని వెతుకుతుంటె రామయ్య కొడుకు ఆఖరాడు "వదినె, వదినె, నాగన్నగారి వామి దగ్గర గేదగొడ్డొకటి మేస్తూంది మందేమోచూచావా?" అన్నాడు. అంతట లచ్చమ్మవెళ్లి మేసేగేద తమదే అనుట తోలుకొస్తూంటే నాగన్న పెండ్లాము "లోకుల దొడ్లు తేరగా ఉన్నాయి మేయడానికి" అన్నది. ఈపిల్ల వినిపించుకోకుండా చక్కావచ్చింది. తర్వాత గొడ్డుకు చిట్టెట్టి పాలుతీయబోతే గేద చేపలేదు. పొదుగు పట్టిపోయి ఉంది. లచ్చమ్మకు అనుమానంవేసి నాగన్న ఇంటికి వెళ్లింది. నాగన్నతల్లి చూచి 'దేనికొచ్చావే అమ్మాయి' అన్నది. "అదికాదు అమ్మమ్మా, గేదెనుతోలుకెళ్లానా, తీరా పాలుపితకబోతె పొదుగు పట్టెదే" అన్నది లచ్చమ్మ.

"అయితే అమ్మాయి! మేము పాలుపితుక్కున్నామని అడగొచ్చావా? మేమంతగతిలేక ఉన్నామా?



ధ్వంసమయిన సీతానగరమునందలి వీధి యొకటి

ఈ గ్రామము తాడేపల్లి కృష్ణావారధులకు నడుమనున్నది. సంపూర్ణముగ ధ్వంసమయినది



నూలు, నేత మిల్లులు—సీతానగరము. కట్టడము ముగియనుండ నిట్లు ధ్వంసమయినది

ఇతర్ల గొడ్లపాలు పిండుకుంటానికి! మాగొడ్లపాలే మురిగి పోతున్నాయి. కుడితితొట్లో పోస్తున్నాము. దొడ్లో పడి జనపకాడంతా తినేసింది. గొడ్లను కట్టేసుక్కోలేని వాళ్లకు గొడ్లెందుకు?' అని కేకలేసింది.

పడుచుపిల్లేమో లచ్చమ్మ పౌరుషంవచ్చి కోపంతో "మీదొడ్లోపడ్డదని పాలు పితుకున్నారు కాబోలు" అని ఇంక ఒకటికి నాలుగు కలిపించి అన్నది. వాళ్లకి కోపం ఎగేసుకొచ్చింది. తిట్టుకోటం మొదలుపెట్టారు. చెరువునుండి నీళ్లుతెస్తూ సీతమ్మ వచ్చి కలిపించుకుంది. ఇంతలో నాగన్న పెండ్లాము లోపలినుండి వచ్చి ఉన్నవి లేనివి కలిపి దులపటం మొదలుపెట్టింది. నలుగురమ్మలక్కలు చేరారు. వీధంతా మోగిపోతున్నది. ఒకళ్లమాట ఒకళ్లు వినిపించుకోకుండా వాగ్యుద్ధము మొదలుపెట్టారు.

"నీవు దొంగవు, నీవురండవు, నీవు కజ్జాకోరువు నీవుముసలాడిని కూడుపెట్టకుండా చంపుతున్నావు. నీవు అది, ఇది" అని నానాకూతలు కూసుకోటం మొదలుపెట్టారు. 'రోకలి తీసికెళ్లి పొన్నుపోగొట్టావ్. మాబిందె తీసికొనివెళ్లి నీళ్లుతెచ్చుకుంటున్నావు తేతెమ్మ'ని నాగన్న పెండ్లాముమీదపడి లాక్కోపోయింది. పోట్లాటలో నీళ్లు చింది వీళ్లువాళ్లు కూడా జలకమాడారు. ఇంతలో పొలంనుండి నాగన్నవచ్చి పోట్లాటలో జొరబడ్డాడు. ఇదిచూచి రామయ్య, కొడుకు యిద్దరు వచ్చికలబడ్డారు. రామయ్య బాగా బలం కలవాడేమో అందరిని చెదరగొట్టి నాగన్న జుట్టు పుచ్చుకొని ఊడివచ్చేటట్టు గుంజాడు. ఇంతలో పదిమంది వచ్చి బలవంతాన విడదీసి యిళ్లకు పంపేశారు.

ఇది కలహానికి కారణం; కథంతా ముందే ఉన్నది.

## 3

మరునాడు నాగన్న ఊడపీకినజుట్టు కాగితంలో చుట్టుకొనివెళ్లి మేజస్ట్రీటుకోర్టులో కేసుదాఖలుచేశాడు. నాగన్న ఆడవాళ్లు 'రామయ్యను గోదావరి స్నానం చేయించి బుఱ్ఱగొఱిగించి ముంతచేతికిప్పిస్తా' మని ఇరుగు పొరుగువాళ్లతో అనడం మొదలుపెట్టారు. ఈ చాటు కూతలు రామయ్యను రెచ్చగొట్టాయి.

మంచంలోఉన్న ముసలాడు యీపోరుచల్లార్చ్చలని తిప్పలుపడ్డాడు. కాని లాభం లేకపోయింది. నయానా భయానా చెప్పాడు."కాస్తదానికి ఈలా పోట్లాడుకుంటారా? ఎంత బుద్ధిలేని పని. నిజంగావాళ్లు పితుకున్నారో లేక దూడేకుడిచిందో; ఏమీ ఆలోచనేలేదాయె ఇంత ఏడిస్తే చెంబెడుపాలు. మన మెందరికి పోయడం లేదు. ఉట్టిమీదనుండి పిల్లిభోర్లదోస్తే పోలేదా! ఇది ఎందుకొచ్చిన తగాదా, రామన్నా! పోనీ, వాళ్లు ఒక మాట మిగల అన్నారే అనుకో. ఊరుకుంటే పోలేదా? ఆలాగాదు ఈలాగని చెప్పకూడదా? క్రోధం పెంచిన కొలది పెరుగుతోంది. ఇంతటితోనైన ఊరుకోండి. బాగుపడుతారు" అన్నాడు ముసలయ్య.

ముసలాళ్లమాటలు పడుచాళ్లకు నచ్చవు. రామయ్యకు యిపుడు సమాధానంపడడం చిన్నతనంగాఉన్నది. ఇదికాదు ఉపాయమని రామయ్యకూడ కోర్టుకు వెళ్లి యెదురుచార్జి దాఖలుచేశాడు. ఇవి కోర్టులో విచారణ జరుగుతున్నాయి. ఇవి ఇట్లా ఉండగా రామయ్య కొడుకు చేలో గడ్డివాముదొడ్లో జొరబడి జనపకట్టలు ఎత్తుకుపోతుంటే గంపళ్లపున్నాయి చూచాడని భార్య చెప్పితే విని నాగన్న మఱొకఛార్జి దాఖలు చేశాడు. ఇంటిదగ్గర రెండిళ్లకు జగడంలేని రోజు లేదు. చుట్టుపక్కల కాపరంచేయడానికి కష్టంగా ఉంది. పెద్దవాళ్లను జూచి పిల్లలుకూడా కొట్టుకోడం తిట్టుకోడం మొదలుపెట్టారు. చెరువొడ్డున, బావి దగ్గర ఎక్కడకలిసినా ఆడవాళ్లు తిట్టుకోవలసిందె. బావిలోనుండి తోడే నీళ్లకంటె నోటినుండి వదిలెమాటల జోరు ఎక్కువైపోయింది. వినరాని కూతలు కూడా సాగాయి.

రానురాను మాటలు చేతల్లోకి దిగాయి. వాళ్లవి వీళ్లు, వీళ్లవి వాళ్లు కన్ను యేమరితే ఎత్తుకుపోవడం మొదలుపెట్టారు. వారించేవాళ్లు లేకపోవడంచేత, చిన్న పిల్లలుకూడ చేయసాగారు. ఇదివఱకు గ్రామపంచాయతీ కోర్టుకు ఫైలులేదు. వీళ్లతగాదాలకోసం వారం వారం కోర్టు తప్పకుండా పెట్టాల్సివచ్చింది. గ్రామకోర్టుమొదలు జిల్లాకోర్టువఱకు వీళ్లకేసులులేని కోర్టులేదు. ఒక తడవ రామయ్యకు ఒకతడవ నాగన్నకు జరిమానాలు శిక్షలు

పడుతూనే ఉన్నాయి. పగ తీర్చుకోటానికి ఒకరిమీద ఒకరు చేసే దురాగతాలకి అంతేలేదు. ఇదిచూచి ఊరు కోలేక ముసలయ్య "నాయనలారా! పగ పంతం మానివేసి ఎవరిపనివాళ్లు చూచుకోండిరా. ఎందుకుపాడైపోతార్రా" అని మంచంలోనుండి ఎంత మొత్తుకున్నా వినిపించుకుండే వాళ్లు కనుపించలేదు.

౪

ఇట్లా అయిదారేండ్లు గడిచింది. ఒకనాడు పెండ్లిలో, తమచేలోపడి కోసినపనలు ఎత్తుకపోతుంటె నాగన్నను పట్టుకున్నారని నలుగురెదుట రామయ్య భార్య అన్నది. ఈమాట నాగన్న విన్నాడు. కొంచెము నిషాగా కూడ ఉన్నాడేమో. కోపంపట్టలేక సీతమ్మను క్రిందపడేటట్టు తన్నాడు. సీతమ్మ గర్భణీతో ఉన్నది కూడాను. ఈసంగతి రామయ్య విని 'ఇక సమయందొరికింది. దీనితో నాగన్నకు ద్వీపాంతరవాసమె' అని చెప్పి సంతోషంతో ఛార్జి దాఖలుచేశాడు. కాని మేజస్ట్రేటు దెబ్బలు కనిపించలేదని కేసు కొట్టేశాడు. కలెక్టరుకు అపీలు చేస్తే డిస్ట్రిక లెక్టర్ను విచారించ మన్నాడు. ఇక్కడ కూడా పోతుందేమో అని క్రిందనుండి పైదాకా గుమాస్తా లందరికి కాస్తో కూస్తో తినిపించాడు. మేజస్ట్రేటు విచారించి "కోర్టు ఎదుట బహిరంగంగా నాగన్నను కొరడాతో ఇరువది దెబ్బలు కొట్టవలసినదిగా శిక్ష విధించడమైనది' అని తీర్పు చెప్పాడు. బెంచి గుమాస్తా నాగన్నకు తీర్పుచదివి వినిపించాడు. తీర్పు చదువుతూంటే రామయ్య నాగన్న మొఖంవంక చూస్తూ ఉన్నాడు. నాగన్న వివర్ణుడై పోయినాడు. దుఃఖంచేత, సిగ్గుచేత ముఖం గోడవైపు తిప్పుకున్నాడు. శిక్ష చెప్పిన పిమ్మట బోను దిగి బయటకివస్తూ "నన్ను కొట్టిస్తున్నాడు. నా ఒళ్లు మండుతుంది. నా ఒంటిమీద మంటలు వాడికి ఎక్కడో అక్కడ కనిపిస్తాయి" అన్నాడు నాగన్న.

వెనకనుండి వచ్చుచున్న రామయ్య యీమాటలు విని మేజస్ట్రేటు దగ్గరకువెళ్లి "బాబో! నాకొంప తగలెట్టానంటున్నాడు. మీరె రక్షించాలి' అని మొత్తుకున్నాడు.

మేజస్ట్రేటు నాగన్నను పిలిచి "నీవు అలాగన్నమాట నిజమేనా?"

"నేనేమి అనలేదండి మీరు దొరలు. నా తప్పేమి లేకపోయినా నన్ను దండిస్తున్నారు. తప్పు చేసినవాడు తప్పించుక పోతున్నాడు" అని యింక ఏమేమో చెప్ప బోయినాడు; నోటమాటరాలేదు. శరీరము ఆపాదమస్తకం కంపించింది. ఒక్కనిమిషం కొయ్యబొమ్మలాగ దృష్టినిగుడ్చి చూచాడు. ఆచూపు అంతులేని అఘాతములోనుండి వస్తున్నట్టున్నది. ఆదృశ్యంచూచి మేజిస్ట్రేటు గుండెలు దడదడ కొట్టుకొన్నాయి. వాడేదో కృతనిశ్చయుడయినాడు; వాడికో పిడికో యేదో మూడుతుందనుకున్నాడు.

గుండెదడ తగ్గిన తర్వాత మేజస్ట్రేటు "ఇదిగో మీరిద్దఱు యిలాచూడండి; (నాగన్న వైపుచూచి) నీవు ఆప్రకారంగా కడుపుతో ఉన్న ఆడమనిషిని కొట్టడం న్యాయమేనా? పోనీ, ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకొని మీరిద్దఱు సఖ్యతగా ఉంటె మంచిది. చేసిన తప్పు ఒప్పుకొని రామయ్యను క్షమాపణ కోరితె శిక్షరద్దు చేస్తాను." ఈమాట గుమాస్తా విని "క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 176 సెక్షన్ ప్రకారం శిక్ష చెప్పిన తర్వాత రద్దుపరచుటకు వీలులే"దని ఆక్షేపణచెప్పి రామయ్యకు కృతజ్ఞత చూపించాడు."

మేజస్ట్రేటు: "నీవు మాట్లాడకు; మానవకృతముల యిన అన్ని శాసనములకంటె కరుణాసముద్రుడయిన భగవంతుని ఆజ్ఞలను శిరసావహించవలె" అని చెప్పి ఆ రైతు లిద్దరిని సఖ్యపరచవలెనని చాల యత్నించెను. కాని నాగన్న యేమాత్రం లొంగక లేదు.

నాగన్న—"యాభైయేండ్లువచ్చి మనమలనెత్తి ఇపుడు యీదుర్మార్గుడి మూలాన దెబ్బలశిక్ష పడ్డదిగా! ఇక వీడ్నా క్షమాపణకోరడం? అయిందెమో అయిన్ది. నా పేరు శాశ్వతంగా జ్ఞాపకముంచుకుంటాడు." అని నాగయ్య బయటకు వచ్చాడు.

౫

రామయ్య ఇంటికి వచ్చేటప్పటికి సూర్యుడు అస్తాద్రి చేరలేదు. ఇంక రెండుమూడు ఘడియల ప్రొద్దున్నది. ఇంటికి వెళ్లాడు. ఎవరూ లేరు. పచ్చిగడ్డి పరకలకు పొలానికి వెళ్లిన ఆడవాళ్లు యింకా తిరిగిరాలేదు. కొడుకులుకూడ రాలేదు. గోడకు చేరబడి కూర్చున్నాడు

రామయ్య. 'ఖహ్,ఖహ' అని దగ్గుతుంటు ముసలయ్య మంచంలోలేచి కూర్చొని దగ్గుతెర తిప్పుకోలేక అవస్థ పడుతున్నాడు. కోర్టులో శిక్ష చెప్పేటప్పుడు నాగన్న తెల్లపోయి మొఖం చిన్నపుచ్చుకొని నలుగురి ముఖాలు చూడలేక గోడవైపు తిరిగిన దృశ్యం రామయ్యకు జ్ఞాపకం వచ్చింది. లోలోపల విచారించుకున్నాడు. మనస్సు కలుక్కుమన్నది. తోడి సంసారి నలుగురిలో ఎంత పరిభవము పొందాడా అని విచారమైంది. మనస్సులో 'ఛీ! ఎందుకు వచ్చింది యీపాడు పోట్లాట' అని అసహ్యం పుట్టింది. ఇంతలో ముసలయ్య నెమ్మదిగా దగ్గి మంచం ఆనుకొని కూర్చున్నాడు.

ముసలయ్య—శిక్ష వేశారా?

రామ: 'ఆ, ఇరవై కొరడా దెబ్బలు శిక్షపడ్డది'

ముసలయ్య తల పంకించి,ముక్కుమీద వ్రేలువేసుకొని "అహా! ఆహా! ఎంతపని జరిగింది. నిజంగా దీనివల్ల నష్టం పొందేది నీవుగాని వాడుకాడు. సరే, వాడుదెబ్బలు తిన్నాడు. అందువల్ల నీకు వరిగిందేమయినా ఉన్నదా కక్షకావేశాలు పెరగడం తప్పితే?"

రామయ్య: మళ్లీ ఈజన్మంలో యీపని చేస్తాడంటావా?

ముస: ఏమిటే! చెయ్యడంటావు. నీకంటె వాడు తప్పుచేసిందేమిటి?

రామ: ఆడదాన్ని పట్టుకొని చచ్చేటట్టు తంతె, ఇంక ఏంచెయ్యాలి. పైగా ఇప్పుడు కొంప తగలెట్టానంటున్నాడు 'బాబూ! నీవు మహానుభావుడవురా' అని దండంపెట్ట మంటావా?

ముసలయ్య ఒక్కవేడి నిట్టూర్పు విడిచి: 'నేను బస్తీలు గిస్తీలు తిరుగుతున్నానుగదా మంచంలోపడి ఉండె ముసలాడి కేంతెలుసునని నీవూహ. ఒరే, రామన్నా అంతేనా? ఎవళ్లుచేసే తప్పులు వాళ్లకు కనుపించవు. ఇతర్లుచేసేవి అన్నీ తప్పులుగానె ఉంటాయి. నీవు వాడికి చాల అన్యాయం చేశావు. పోనీ,తప్పు వాడిది ఒక్కడిదె అయితె ఇన్నేళ్లు ఈవ్యాజ్యాలు, ఛార్జీలు దెబ్బలాటలు ఎందుకు సాగుతాయి? వ్యాజ్యంగాని దెబ్బలాటగాని ఇద్దరి మధ్యగాని ఒక్కరితో సాగదుగదా? వాడి తప్పులె వెతుకుతుంటావు గాని నీతప్పులు నీవు చూచుకోవుగా, పోనీ,వాడు చెడ్డవాడె అనుకుందాము; నీవు మంచివాడవయితె తగాదా ఎందుకొస్తుంది? వాడి జుట్టూడ పెరికిందెవరు? వాళ్ల జనపకట్ట ఎత్తుకపోయిందెవరు? వాడిని కోర్టుకు ఎక్కించిందెవరు? పైగా అంతా వాడినెత్తినేసి రుద్దుతావా? అసలు నీనడతె చెడ్డది. ఉన్నతుళ్లే అక్కడ ఉన్నది. నేను యీప్రకారంగా యెప్పుడు ప్రవర్తించలే. వాళ్లనాయనా నేను యీలాగె ఉన్నామా? మేము ఏలా ఉన్నాము! ఇరుగుపొరుగు లాగున్నాము. వాళ్ల ఇంట్లో బియ్యం అయిపోతే వాళ్ల ఆడవాళ్ళు వచ్చి "బాబాయి మా ఇంట్లో బియ్యం అయిపోయినాయి' అంటె 'అమ్మాయి మూలబానలో ఉన్నాయి తీసికో కావలసినవి' అనేవాడిని. వాళ్ల పశువుల దగ్గర ఎవరు లేకపోతే 'ఒరె రాముడూ వాళ్ల పశువులుకూడ చూస్తూ ఉండరా' అని చెప్పేవాడిని. నాకేమైనాఅక్కరపడితె 'సుబ్బన్నా అది కావా'లంటె 'అన్నా తీసికో' మని అతను చెప్పేవాడు. అదిగో, అట్లామారోజులు గడిచినాయి. ఇందాక వాళ్లెవరో చెప్పుకుంటున్నారులే; అదేదో దేశంలో ఎవళ్లెవళ్లో తలకాయలు బద్దలు కొట్టుకున్నారట. ఆదెబ్బలాట కంటెకూడ హీనంగాఉంది మీది. ఇకేంబ్రతుకో? ఛీ,ఛీ,ఇంతపాపం ఎప్పుడూలేదు. మగవాడివి,ఇంటి యజమానివి;దీనికంతకుజవాబుదారినీదె. ఇంట్లో ఆడవాళ్లకు పిల్లలకు ఏం నేర్పుతున్నావు? కొట్లాటలు, పోట్లాటలు. మొన్ననీ కొడుకు వీరడు శపథంపట్టి మరీ తిట్టుతున్నాడు నాగన్న పెళ్లాన్ని. వాళ్ల అమ్మ కొడుకు ప్రయోజకత్వం చూచి నవ్వుతోంది. ఇదంతా బాగా ఉందా? దీనికి ఎవరు జవాబు చెప్పాలి. పాపం పుణ్యం యేం విచారించుకో అక్కరలే!అంతాసవ్యంగానె ఉన్నదనుకుంటున్నావా? నీవు ఒకటి తిట్టే నేను రెండు తిట్టడం; నీవు ఒకటి కొట్టితే నేను రెండుకొట్టడం ఇంతెనా జరిగేది? ఏంరా అబ్బాయి? గాంధిమాత్ముడు ఏం చెప్పాడు!మీరంతా రోడ్డుమీదికి లగెత్తికెళ్లి మరీ చూచారుగా. మాత్ముడిబోధ బడిపంతులు వినిపిస్తుంటె నేను యిన్నాను. ఆయన దేవుడె. 'మీలోమీరు దెబ్బలాడుకోకండి. కోర్టులకెక్కొద్దు. ఒకేళ ఒకడు నోరుజారి ఒకమాటన్నా రెండోవోడు వెనక్కితగ్గితె వాళ్లోవాడె సిగ్గడి తలకాయ వంచుకుంటాడు. మళ్లీ అంటె రోసమెక్కుతుంది.

కచ్చ పెరుగుతుంది." ఇవన్ని మంచిమాటలు కావూ? చల్ల నేళ చెయ్యెత్తి మారాజుకు దణ్ణం ఎట్టుకోవాలె. నీవు ఇంటుంటావుగా. మాట్లాడవేం నేచెప్పిందంతా నిజమేనా?" రామయ్య బెల్లంకొట్టిన రాయిలాగ మాట్లాడక వింటు న్నాడు. ఇంతలో ముసలయ్యకు దగ్గు తెరవచ్చింది. మాట్లాడలేకపోయినాడు. దగ్గి దగ్గి కఫం దిగజారినాక మరల మొదలు పెట్టాడు.

'మాతృ్కడి వాక్యాలు అబద్ధనుంటావా? అదంతా మనమంచికేనా చెప్పింది? నీసంగతి విచారింమకో. ఈకచ్చలు పెరక్కముందు బాగుందా? లేక ఇప్పుడె బాగుందా? అవంతా ఎందుకు? ఈకోర్టులకు పోసినడబ్బు లెక్కచూడు. రానుపోను బండ్లకు, ఫూటకూళ్ళకు కాస్తా కూస్తా అయిందా? నీకొడుకులు చూడు ఎంతలో ఎంత వాళ్లయినారో? ఏదో ఇంత ఉంది తిందామంటె అది కూడ సన్నగిల్లుతున్నదిగదా? ఎందుచేత? ఎప్పుడైనా దాని మొఖం మనం చూస్తేనా? వొళ్ళుపై తెలుస్తుంటేనా? చేతి కక్కురు కొచ్చిన బిడ్డలుంటె వాళ్లను చేతికిందేసుకొని ఉన్న చేరెడు నేల బాగుచేసుకోడం పోయి, నిన్ను పట్టినదయ్యం నిన్నుకోర్టులకు యీడుస్తుంటే? తరుణంలో దున్నడం నాటటం అంటూ ఉంటేనా పండడం; లేకపోతే ఆభూదేవి మాత్రం యేం యిస్తుంది. ఈ సంవత్సరం బావడచేను వరి యేమాత్రం అయింది? నీవు యేకార్తిలో ఊడ్చావు? ఫుబ్బలో ఊడిస్తే ఫూడ్చుకపోక యేమవుతుంతది. బస్తీమట్టు తిరిగినకొద్ది నెత్తిమీద బరువు పెరుగుతున్నది. నీవు గణించే లాభంయిదేగా? ముక్కుతూనో మూలుగుతూనో ఇంకా బ్రతికిఉన్నాను కాబట్టి ఊరుకోలేక చెప్పుతున్నా. నాయనా! ఇకనైన నీపని నీవు చూచుకో. పిల్లలూ నీవు కొంచెముకష్టపడితె నాలుగుగింజలు పండుతాయి. సుఖపడవచ్చు. నిన్ను ఎవరైనా ఏమన్నా అంటె వాళ్లకర్మం వాళ్లే అనుభవిస్తారు. అన్ని కనిపెట్టేవాడు భగవంతుడె ఉన్నాడు. నీసంగతి నీవు చూచుకుంటివా బాగుపడతావు."

రామయ్య కుక్కిన పేనులా గూరుకున్నాడు. మాట్లాడలె

"రామయ్యా! పెద్దవాణ్ని చెప్పుతున్నా విను. రేపు బస్తీకివెళ్లి వ్యాజ్యాలన్నీ రద్దుపరచుకొనిరా! ఎల్లుండి సంవత్సరాది: నాగన్నను భోజనానికి పిలు. అయిందేమో అయింది. గతించింది మరిచిపోండి. క్రొత్త సంవత్సరం సుఖంగా ఉండండి. దేవుడిమొఖం చూచి మనస్సులో ఉన్నదంతా కడిగివేసుకొండి. పాతఆకులురాలి క్రొత్త ఆకులు చిగుళ్లువస్తున్నాయి. మీమనస్సుల్లోకూడ కొత్త కొత్త స్నేహాలు అంకురించాలి. ఇంక నేచెప్పేది ఏం లేదు. మీప్రాప్తం."

రామయ్యమనస్సు కలకతేరింది. కొంచెము నిర్మలమైంది: తేలికపడ్డది. కాని సమకూడెమార్గం తోచలేదు. రామయ్యమనస్సు తెగలేదని ముసలాడికి ఏలా తెలిసిందో మళ్లా మొదలెట్టాడు.

"రామయ్యా! ఇపుడేవెళ్లు. మళ్లీ రేపుమాపనవద్దు. శుభస్య శీఘ్రం అన్నారు. ముదిరిపోయినాక విచారించి యేంలాభం?"

ఇంకేమేమో చెప్పబోతుంటె గలగలలాడుకుంటు ఆడవాళ్లు ఇంట్లోకి వచ్చారు. ఇరవై దెబ్బలు శిక్షపడ్డదని నాగన్న కొంప ముట్టిస్తానన్నాడని అన్ని సంగతులు వాళ్లకపుడె తెలిశాయి. చేలో గడ్డి కోసుకుంటూ ఒక పోట్లాటకానిచ్చి ఇంటికివచ్చారు ఆడవాళ్లు. మేస్ట్రీటు అన్యాయం చేశాడని నాగన్న మళ్లీ బడిపంతులుచేత కొత్తఅర్జీ వెనుకటినేరాలన్నీ పెట్టి మనమీద వ్రాయించి పెద్దకలెక్టరు దగ్గర దాఖలుచేసి యీతడవ మన్ని నాశనము చేస్తామని నాగన్నకోడలు అంటున్నదని వచ్చి చెప్పారు. దీనితో మరల రామయ్యఒళ్లు మండిపోయింది. రాజీ బుట్ట దాఖలు అయింది.

## ౬

పాటుపడె సంసారికి ఎప్పుడు పనే ఉంటుంది. ఆడవాళ్లతో మాట్లాడకుండానే పశువులను, ధాన్యపుగిరిసెలను చూచుకుంటానికి రామయ్య దొడ్లోకి వెళ్లాడు. ఇంతలో ప్రొద్దుకూకింది. అంత చీకటిచీకటిగా ఉంది. దూరాన ఉన్న మనిషి స్పష్టంగా కనిపించడంలే. పొలాల కెళ్లిన వాళ్లంతా తిరిగి వస్తున్నారు. మెఱకచేల దుక్కికి వెళ్లిన కొడుకులు నాగళ్లు బుజానపెట్టుకొని దానా బుట్టలు, మెడతాళ్లు తీసికొనివస్తున్నారు. పశువుల మేతగీత ఉంచె చూచుకొని తిరిగివచ్చి వాళ్లను కలుసుకొని పనిపాటలన్ని

విచారించాడు. వీరయ్య పొలానికి తోలుకువెళ్ల వలసిన ఎడ్లను బయటకు తోలి తడిక అడ్డంవేసి వచ్చాడు. ఇంటికివచ్చిభోజనముచేసిపడుకుందామనుకున్నాడు రామయ్య. ఈతాపత్రయంలో తండ్రిచెప్పినమాటలు నాగన్నవ్యవహారం పూర్తిగ మరిచిపోయినాడు. తలుపుతీసికొని లోపలికి వెళ్లబోతుంటె అవతలనుండి పెద్దగొంతుతో "పాపం పండిపోయింది. ఇకవీడ్ని బతకనివ్వకూడదు. వీడుబతకడం ఊరుకుచేటె. ఇకసాగనంపుతా వీడ్ని "అని కేకలేయడం వినపడ్డది. ఈమాటలతో రామయ్య కోపము తోకత్రొక్కిన త్రాచువలె భీకరాకృతి దాల్చింది. కాని పైకి పొంగలేదు. నాగన్న తిట్లు చాలించిందాక నిలబడ్డాడు; నిలబడినట్లే ఉండి తర్వాత ఇంట్లోకి వెళ్లాడు.

సీతమ్మ వంటచేస్తోంది. కోడలు రాటను వడుకుతున్నది. పెద్దకొడుకు త్రాళ్లు పేనుతున్నాడు. రెండోవాడు చల్లని ఆముదందీపంవద్ద కూర్చొని దాశరథీశతకం చదువుతున్నాడు. ముసలయ్య తాను చిన్నప్పుడు చదివిన పద్యాలు ఆప్యాయంగావింటూ 'రామరామ'అని మననం చేస్తున్నాడు. మూడోవాడు పొలానికెళ్లి పడుకోవడానికి తయారవుతున్నాడు. అంత ఎవరిపని వాళ్లు చక్కపెట్టుకుంటున్నారు. అంత నిశ్శబ్దంగా ప్రశాంతంగా, ఆనందంగా ఉంది: కాని ప్రక్కపోరు మాత్రం పొడుచేస్తోంది.

రామయ్య విసుక్కొంటు, చిటమట లాడుతూ ఇంట్లోకివచ్చి పాలచెంబు దారిలో పెట్టారేం; సగ్గిళ్ల బుట్టలు క్రింద పడేశారెవరు? ఎక్కడవస్తువక్కడ ఉంచరంటూ నాలుగుకేక లేశాడు. ఎద్దుమెడ పట్టా చెడిపోయింది బాగుచేద్దామని కూర్చున్నాడు; ఏం తోచలె. అంతా నిస్పృహగా ఉంది. నాగన్నమాటలు చెవిలో గింగురుమంటున్నాయి. కోర్టులో అన్నముక్కలూ, ఇప్పుడు సాగనంపుతా నన్న మాటలు స్ఫురణకు వచ్చాయి.

ఇంతలో వీరయ్య అన్నంతిని గొంగళి, దుప్పటి చేతిలోకర్ర తీసికొనిచెప్పులు తొడుక్కొని బయటికి ఎడ్ల దగ్గరికి వచ్చాడు. పెద్దకొడుకు తమ్ముణ్ణి ఊరిబయటదాక పంపివద్దామని లేవబోయినాడు. ఇంతలో రామయ్య కొడుకును తానె పంపుదామని లేచాడు. బయటఅంతా గాఢాంధకారంగా ఉంది. కళ్లు పొడుచుకొన్న కనబడడం లేదు. చుక్కలు అదృశ్యమయినాయి. నల్లని మేఘాలు నలుదిక్కులనుండివచ్చి దట్టంగా ఆకాశమంతా కప్పివేశినాయి. నెమ్మది నెమ్మదిగా గాలి చెలరేగుతున్నది. వీరయ్య యెడ్లను తోలుకొచ్చాడు. పొలానికి వెళ్లే ఇతర పిల్లలుకూడా వచ్చారు. వాళ్లతోకలిసి వీరయ్య ఊరిబయటకు వెళ్లేటంతవఱకు రామయ్యచూస్తూ వాకిట్లో నిలబడ్డాడు. రామయ్య వెంటవెళ్లాల్సిన అవసరం లేకపోయింది.

నాగన్నమాటలుమాత్రం మఱపుకు రాలేదు. "నాఒంటిమీద మంటలు వాడికి ఎక్కడో అక్కడ కనిపిస్తాయి" అని నాగన్నఅన్నమాటలు జ్ఞాపకానికి వచ్చి గుండెలు తటతట కొట్టుకోటం మొదలుపెట్టాయి.'వాడు ఇపుడు యేంచేసినా చేయగలవాడె' అనుకున్నాడురామయ్య; ఈచీకట్లో ఏంకొంపమునుగుతుందో అనుకున్నాడు. అన్ని గలగల ఎండి ఉన్నాయి. 'జయ్' మని గాలి వీస్తున్నది. "తాచుపాముపగ పట్టాడు. ఏవైపునుండి యేం ముట్టిస్తాడో' అని పిరకాపడ్డాడు రామయ్య. 'కాచిఉండి సమయంలో పట్టుకుంటెతప్ప లేకపోతె చిక్కడు' అని లోలోపల ఏమోమో తలపోస్తూ 'అయినా ఒక పర్యాయం చుట్టూతిరిగివద్దా'మని మూలతిరిగి పైదాక చూచాడు. పైమూలను ఎవరో అట్లావెళ్లినట్లు కనిపించింది. చప్పున నిలబడి తదేకధ్యానంతో ఏమైన చప్పుడు వినబడుతుందేమో అని వింటూ చూస్తూ ఉన్నాడు. చీకట్లో మొదట కళ్లు కనిపించలె. చూడంగా చూడంగా పశువుల చావిడి చూరు కొన్నికొన్ని పెద్దవస్తువులు కనిపించాయి. గాలి చప్పుడుతప్ప అంతా నిశ్శబ్దంగాఉన్నది. మనిషిఎవరు కనిపింపలేదు. అయినా చూచివద్దామని ముందుకు నడిచాడు. అడుగుల్లో అడుగువేసుకుంటూ దడి ప్రక్కనె వెళ్లాడు. ఇంతలో సావడికి అవతలప్రక్కను దక్షిణంగా ఏదోవెల్తురువలె మెరిసింది. రామయ్య గుండె ఝల్లుమన్నది. నిలబడిపోయినాడు. దృష్టినిగుచ్చి చూచాడు. చేతిలోగడ్డిచుట్ట తలగుడ్డ మనిషి కనిపించాడు. గుండె చిక్కబట్టి తడబడుతున్న కాళ్లు నిలవతొక్కుకొని చూస్తున్నాడు. ఇంతలో చూరుఅంటుకొని మంట పైకి పాకుతున్నది. ఆవెల్తుర్లో నాగన్నను సరీగా పోల్చుకున్నాడు.

'కొంపకు చిచ్చెట్టుండగానె చిక్కాడురా' అని పరుగెత్తి పట్టుకోపోయినాడు. ఇంతిలో నాగన్న గంతేసి పరుగెత్తాడు. "దొంగ, దొంగ పట్టుకో'ండని కేకలేస్తూ వెంట పడ్డాడు. చేతికి వెనకనుండి ఎగురుతున్న తలగుడ్డ చిక్కిందిగాని ఒకగుంజుగుంజిచింపుకపోయినాడు నాగన్న. కాని తరిమి వెంటపడ్డాడు. నాగన్న ఇంటిలో జొరపడపోగా రామయ్య పట్టుకోబోయినాడు. నాగన్న ప్రక్కనున్న బండివసికట్టె పుచ్చుకొని యీడ్చి ఒకదెబ్బ రామయ్యను కొట్టాడు. ఆదెబ్బకు రామయ్యతల దిమ్మెక్కి క్రింద పడ్డాడు.

## ౭

రామయ్యకు తెలివివచ్చి లేచేటప్పటికి వీధిఅంతా పట్టపగలువలె వెలిగిపోతున్నది. వెనక పశువుల పాక, చుట్టుగుడిసె భగభగ మండుతున్నాయి. మంటలు ఆకాశానికి ఎగిరి ఇంటిమీదవచ్చి పడుతున్నాయి. గాలి జుయ్‌మని వీస్తున్నది "ఇదేమి మంటలురో బాబో, చూరు పీకి నలిపేస్తే పొయ్యేదిరో"అని నెత్తుబాదుకుంటూ శోకాలు పెట్టి యేడవడం మొదలుపెట్టాడు. గొంతుపూడిపోయింది. గుడ్లురెండు ఒప్పగించి చూస్తూఉన్నాడు. లేవబోతే కాళ్లు తడబడ్డాయి. ఎట్లాగో తిప్పలుపడి లేచాడు. ఇంటి దగ్గరకు వెళ్లాడు. చాలాజనం చేరారు. మంటలు ఎవర్నీ దగ్గరకు చేరనివ్వడంలేదు. చేసేది ఏం కనిపించక 'రామ రామ' అంటు ఆర్తాలాపం చేస్తున్నారు. గాలిఎక్కువైపోయింది. చుట్టుపట్ల ఇండ్లలోని వారందరు పశువులను విడిపించి ఇండ్లలోని సామాను బయటవేసుకుంటున్నారు. ఇంతలో సుడిగాలి తిరిగింది. నాగన్న ఇల్లుకూడ అంటుకున్నది. యెదటవున్న ఇళ్లుకూడ ముట్టుకున్నాయి. ఎవరి శక్తికి మించిపోయింది. దేవుడిమీద భారంవేసి లబోలబోమని ఏడుస్తూ నిలబడ్డారు. రామయ్యఇంట్లో మనుష్యులు కట్టుగుడ్డలతో బయటపడ్డారు. పశువులు,కోళ్లు, ధాన్యం నాగళ్లు, చెంబు తప్పాల, పెట్టెబేడ అన్నీ అగ్నిహోత్రు నికర్పణమైనాయి. ముసలాణ్ణి ఎట్లాగో ప్రాణంతో బైటికిలాగారు. నాగన్న తనదాకా రాదనుకొన్నాడు. తీరావచ్చేటప్పటికి పశువులు కొంతసామానుతో తప్పించుకొని బయటపడ్డాడు.

రాత్రిఅంతా రావణాసురిడి కాష్టంలాగ తగలడుతూనే ఉన్నది. "చూరు ఊడపీకి నలిపేస్తే పొయ్యేదో" అని మొత్తుకుంటూనె ఉన్నాడు రామయ్య. ఆదుర్దాకొద్ది ఏమేమో చేయబోతాడు దూలం కాల్తుంటె లాగబోయి నిప్పుల్లో పడ్డాడు. ఆడవాళ్లు "వద్దో" అని నోరెట్టుకొని ఏడుస్తున్నారు. కొడుకులు పరుగెత్తుకొనివెళ్లి బయటికి లాగారు. జుట్టు,బట్టలు,వొళ్లు కొంతకాలాయి. కాని రామయ్యకు ఏమి తెలియలె. దుఃఖంలో స్పృహ తప్పిపోయింది.

## ౮

మఱునాడు ఉదయాన గ్రామపెద్ద లక్ష్మయ్య కొడుకొచ్చి "రామయ్యబాబాయి, మీనాన్నకళ్లు తేలేస్తున్నాడు; నిన్నొక్కసారిచూడాలి రమ్మన్నాడు" అని చెప్పాడు.

రామయ్య మతిపోయింది. తండ్రిమాటే జ్ఞాపకం లేదు.

"ఎవ్వరా రమ్మనేది?"అని మరల అడిగాడు.

'మీఅయ్య నిన్ను రమ్మంటున్నాడు. ప్రాణం పొయ్యేట్టున్నది. నాతోరా మాపాకలో ఉన్నాడు" అని రెక్కపట్టుకొని తీసికెళ్లాడు.

ముసలయ్యను ఇంటిలోనుండి బయటకు తెచ్చేటప్పుడు కాలుతున్నవాసంముక్క మీదపడి ఒళ్లుకూడా కాలింది. ఆచుట్టుపక్కల ముసలయ్యను పడుకోపెట్టడానికి చోటులేక పడమటిపీధిలో ఉన్న గ్రామపెద్ద లక్ష్మయ్యయింటికి తీసికొనివెళ్లి దొడ్లోపాకలో పడుకోపెట్టారు. రామయ్య వెళ్లేటప్పటికి లక్ష్మయ్యభార్య ఒకరిద్దరు పిల్లలుమాత్రమె ముసలయ్య దగ్గర ఉన్నారు.

అప్పటికె ముసలయ్యను క్రింద పెట్టారు. కాని ప్రాణం పోలేదు. కొంచెం తెలివిఉన్నది. లక్ష్మయ్య భార్య నీకొడుకు వచ్చాడని చెప్పింది. అతను దగ్గరకు రమ్మని సంజ్ఞచేశాడు. రామయ్య దగ్గరకు వెళ్లాడు.

"నేనేంచెప్పాను రామయ్యా ఊరంతా తగలబెట్టింది ఎవరు!" అని హీనస్వరంతో నెమ్మదిగా పలికాడు ముసలయ్య.

"వాడే. ఇంకెవరున్నారు. నే చేస్తుండగా పట్టుకున్నా. గడ్డిమట్టకు నిప్పంటించి చూర్లో దోపాడు. ఆమారు అప్పుడే ఊడపీకేస్తే పొయ్యేదె.

"ఒరే! రామన్న! ఇక నే బ్రతికను. ప్రాణంపోతున్నది. ఎప్పుడో అప్పుడు అందరు పోవాల్సిందె. ఈ పాపకృత్యానికి కారకు లెవరు?"

రామయ్య నోటివెంట మాటరాలె. ఊరికెచూస్తున్నాడు.

"నేను చావబోతున్నాను. దేవునిఎదుట ఇప్పుడైనా నిజంచెప్పు. నేనేంచెప్పాను నీకు" అని ముసలయ్య హీనస్వరంతో అన్నప్పటికి వాని తీక్షణతకు రామయ్య ఆగలేకపోయినాడు. అప్పుడప్పుడె రామయ్యకు కొంచెము మతివచ్చింది. తాను ఉన్న ఘోరదుస్థితి గ్రహించాడు. ఆవురుమనిఏడుస్తూ తండ్రిమీదపడ్డాడు. 'తప్పంతా నాదే. దేవునికి నీకుకూడ ద్రోహంచేశాను. ఇక నాకు బ్రతుకు తెరువులే' దని తండ్రికాళ్లు పట్టుకున్నాడు.

కొడుకు యిప్పటికైన సత్యం గ్రహించాడు గదా యని మరణావస్థలో ఉన్నను "జయరామ, జయ రామ" అని భగవంతునికి ధన్యవాదములర్పించాడు ముసలయ్య. కొమారునివైపు చూచి 'ఒరే! రామన్నా! నాయనా!" అని పిలిచాడు.

'ఏమిటి నాన్నా' అని దుఃఖంతో పలికాడు రామయ్య.

"ఇపుడు నీవు చేయ్యాల్సిందేమిటి?"

"నాకు యీ జీవితం ఎట్లాగడపాలో తెలియకుండ ఉంది"

ముసలయ్య కొంచెము కన్నులుమూసి ప్రాణం తెచ్చుకొని కళ్లు తెరచి "నీకేం భయంలేదు. భగవంతుణ్ని నమ్మి నడుచుకుంటె అన్ని వాడె చక్కపెడ్తాడు." మరల కొంచెమాగి "నేచెప్పేది విను. నిప్పెవరుపెట్టారో చెప్పొద్దు. ఇతరుల తప్పులను మనం క్షమించితె మనతప్పులను భగవంతుడు క్షమిస్తాడు." అని హితోపదేశంచేస్తూ చేతులుమోడ్చి భగవన్నామస్మరణ చేస్తూ ప్రాణములు విడిచాడు.

## ౬

రామయ్య నాగన్నమీద ఎవరితోను ఏం చెప్పలేదు. నిప్పు ఎలాపుట్టిందో ఎవరికి తెలియదు.

రామయ్య ద్వేషం సహితం అగ్ని హోత్రునికి ఆహుతి అయిపోయింది. తాను నిప్పుపెట్టడం చూచి కూడా రామయ్య ఊరుకోడంచూస్తే నాగన్నకు అత్యాశ్చర్యంగా ఉంది. "ఏంవచ్చి పడుతుందో, ఇన్నిరొంపలు తగులపడ్డాయి." అని గుండెలలోపల అతనికిపీకుపీకుమంటున్నది. నాటినుండి రామయ్యామోస్తరే మారిపోయింది. నాగన్నకూడ క్రోధం మానివేశాడు. ఇద్దరు మరల ఎప్పుడు పోట్లాడలేదు. మొగవాళ్లను చూచి ఆడవాళ్లు పిల్లలుకూడ పోట్లాటలు మానుకొన్నారు. పిల్లలు ఒకరి యిళ్లకు ఒకరువచ్చి ఆడుకోటం మొదలుపెట్టారు. ఇళ్లు కట్టుకొనేటంతవఱకు ఇద్దరు ఒక్కఇంట్లోనే కాపురమున్నారు. పరోక్షంగా ఇద్దరు మాట్లాడుతూనే ఉన్నారు. ఇంతలో శ్రీరామనవమి వచ్చింది. ఆనాడు రామయ్య నాగన్నను "ఒరే నాగన్నా" అనిపిలిచి పశ్చాత్తాపహృదయంతో 'మనను శనేశ్వరుడుపట్టాడు. ఏడేండ్లు యేడిపించాడు. అయిందేమో అయింది. ఇకనుండి మీ అయ్య, మాఅయ్య ఏలావున్నారో ఆలాఉండాలి మనం. ఇవ్వాళ మీరందరు మాయింటికి భోజనానికి రావాలి.' అని పిలిచాడు. నాగన్న శరీరం దుఃఖభారముచే కుంగిపోయింది. నోట మాటరాలేదు. ఆదృశ్యం చూచి రామయ్య కళ్లవెంబడి నీళ్లుకార్చాడు. దుఃఖభరమైన హృదయాల్లోనుండి పొంగిపారలి కన్నుగవ కెలకులనుండి బాష్పవారి ఏకమై ప్రవహించింది.

ఇళ్లు కట్టుకుండేటప్పుడుకూడా యిద్దరు కలిసి పరస్పరం సహాయముచేసుకొంటూ కట్టుకొన్నారు.

భీష్మునివలె మరణశయ్యనుండి తండ్రిచేసిన ఉపదేశం రామయ్యజీవితంలో మూర్తీభవించింది. అప్పటినుండి రామయ్య కాపురం భూతలస్వర్గమైంది.





# బాల

సాహిత్యసరస్వతి సీరిపి ఆంజనేయులు గారు బి. టి. ఎస్.

౧

ముంగురు లలీకమునఁ జాలముద్దుగురియఁ
గన్నె మొగమునఁ జిఱుచుక్క చెన్ను
హేమసందానము శిరోధిసీమ నలరఁ [గుల్క
గరయుగళిఁ గంకణావళుల్ మురువుడింప
నంగుళీయకములు వ్రేళ్లఁ జెంగలింపఁ
జిన్నికటి మొలనూలు గజ్జెలు సెలంగఁ
గాళ్లఁ గడియము లందెలు కాంతు లీన
బోరగిలఁబడి మెఱపుఁ జూపుల నిగుడ్చి
కోమలాధర యుగ్మమ్ముఁ గొంతవిఱచి
బాహులఁ గదించి యొకపాద మోహటించి
చిత్రగతిఁ బ్రకృతి నిట్లు లక్షించుచుండు
బాల! నీలోనెసఁగు మేటిభావమేమి?

*　　*　　*

౨

ప్రకృతి నవ్యము-కాక, యాప్రకృతిలోని
చేతనాచేతనగణమ్ము నూతనమ్మె—
కాని, సకలంబు నీకు నక్కజముఁగూర్పఁ
గంటఁబడు వస్తువుల నెల్ల గాంచి సేతు
వన్నిటికిఁ గేలుసాఁచెద వందికొనఁగ
నైన, జగమున నీకు మహానురక్తిఁ
గొల్పు నద్వితీయవ్యక్తి కూడనొండు.
అదియె నీజన్మమున కాదియైనశక్తి
యదియె నీస్థితి కాధారమైనశక్తి
యదియె నీవృద్ధి కండయౌనట్టిశక్తి
దాని కెనయగువస్తు విద్ధరణిలేదు
దాని సరిదాఁకునట్టి పదమ్ములేదు
గాని యది యొక్కదివికె సమానమగుడు

జననియును జన్మభూమియు స్వర్గసమము
లని వచించిరి తొల్లింటియార్యు లట్టి
వాక్యమణి నొదలవహించి వఱలునట్లు
గా దలంపవె దాని నాకమ్ముకరణి
నెన్ని చిత్రపదార్థమ్ము లెదుటనున్న
సృష్టివైభవమెల్ల నీచెంతనున్న
నాత్మ వానియందెంత యైక్యమయియున్న
మాతృదేవి యొకించుక మఱుగుగాగ
లోకమే మున్గినట్టు నీలోదలంచి
కడువగతు వంత నామెసాక్షాత్కరింప
సంభ్రమంబున-మఱి మహోత్సాహవృత్తి
గాలు సేతులు నిటునటు నేలజఱచి,
చిన్ని మెడ నిక్కవొడిచి-లక్షించి, యామె
కేలొసంగగాంచి, యుప్పొంగి-కేకరించి,
మాతయొడిజేరి శోకంబు మఱతు వొకట.

*          *          *

## 3

నీకు శోకంబుగలదని నేవచింప
నేడ్చెద వొకప్ప డీవది యేడ్పుగాక
నవ్వెదవు నీవు నీయంత నవ్వుగాక
యేడ్పునవ్వు లొకద్దె లయించునంత
నీమదిని సంతసంబొండె నిండుచుండు
నీమణత్రయబాధ నీకెందు లేదు
సంసృతివిచారమార్గ వాసనయు లేదు
మఱి యహంకారవైరి నీదరినిలేడు
రాగవిద్వేషములు చేరరావు నిన్ను
గామషట్కము మొదలె నీకడకురాదు
స్వపరభేదమ్ము నీకు లవమ్ము లేదు.
పుల్కసుడు భూసురుడు నొక్కపోల్కి నీకు
నురు దయాఢ్యుడు నిష్ఠురుం డొక్కవిధము
ప్రవిమలంబైన నీయంతరంగ మొండె
సర్వసమభావమునకు దృష్టాంతమగుచు
ననుపమంబగు జాతిముత్యంబుపగిది
ఘనమునం జాఱు నమృతశీకరముపగిది
కామ్యగంగానదీజలకణముపగిది
రమ్యమైనవిశుద్ధ దర్పణముపగిది
మలినమేలేని చంద్రమండలముపగిది
వఱలు నద్దాని కెది సాటివచ్చు బాల?
దాని కది యొక్కటియె సరిదాకుగాన,
నీస్థితిని నీకుసరియగునెవడు ? సర్వ
సముడు నిన్సంగుడొక్క యీశ్వరుడుతక్క.



# ఆంగ్ల సామ్రాజ్యములోని స్త్రీల రాజకీయ హక్కులు

దేశభట్ల లక్ష్మీనరసింహము గారు, యం. యే., యల్. టి.

బాధ్యతలు, హక్కులు అనునవి కావడికుండల వంటివి. సంఘాభివృద్ధికై సంఘములోని ప్రతి జ్ఞానవంతుడు కొన్ని కట్టుబాట్లకు లోబడియుండ వలసి యున్నాడు. ఇందుకు ఉదాహరణముగ సంఘ క్షేమాభివృద్ధికి వలయు నిబంధనలను ఆచరించుటకును అత్యావసరముగ వ్యయముకావలసినద్రవ్యము చేకూర్చుటకును సంఘసభ్యు లందరును బాధ్యులై యున్నారు. అట్టిసంఘము నిరంకుశాధికారి యగు నొక ప్రభువునకు లోబడి యున్నను, ప్రజాహితమగు ప్రాతినిధ్యవర్గమునకు లోబడి యున్నను, పైనిచెప్పబడిన బాధ్యతలు అవశ్యకము లను విషయము నిర్వివాదము.

ఇక వివాదమునకు స్థాన మేది యనిన:—ప్రజాయత్తప్రభుత్వములలో ప్రజల ప్రతినిధుల నేర్పఱచుకొనుటయందు సర్వజనులకు హక్కుండవలెనా లేదా యను అంశము. ఈసమస్యలో “సర్వజనులు” అను పదమునకు వివేకవంతులగు సర్వజను లనునర్థము చెప్పవలెను. కారణ మేమన:—అవివేకులగు వెఱ్ఱివాండ్రు, బాల్యదశయందున్న చిన్నవాండ్రు, ప్రభుత్వప్రదేశమం దేలాటి సంబంధము లేకుండ తిరుగుద్రిమ్మరులు మొదలగువారికి యెన్నికల హక్కునిచ్చుట కెవ్వరు నిచ్చగింపరు. ఇక వివేకులన్న నెవరు అనుప్రశ్న రాకమానదు. 20 వ శతాబ్దివరకు మొత్తముమీద రాజ్యములలో నెన్నికొను హక్కునకు దగినవారు, పురుషులుగాని స్త్రీలుకారను విపరీతాభిప్రాయము ఉండెడిది. (పురుషులలో సైతము కొంత ద్రవ్యసంపత్తియో, జ్ఞానసంపత్తియో లేనివారికి ఆ హక్కు నిచ్చుట అన్యాయమనికూడ వాదములుండెను, కాని, చాలవరకు ఇండియా మొదలగు కొన్ని దేశములయందు దక్క నితరప్రదేశములలో నట్టికువాదములు నశించినవి.)

స్త్రీలహక్కునుగురించి యిప్పటికిని లోకములో నచ్చటచ్చట వివాదములు జరుగుచునే యున్నవి. ముప్పది సంవత్సరములనుండి మన సామ్రాజ్యములోని చాల భాగములలో (క్రింద చెప్పబోవువిధముగ) స్త్రీల హక్కులు స్థిరపడినవి. కొన్నిభాగములలో నింకను స్థిరపడలేదు. వీరమతులగు స్త్రీరత్నము లాయాదేశములందు మొఱపెట్టుకొనుచునే యున్నారు. ఈకాలదిపాటి రాజకీయ హక్కును వారికొసంగిన నేమియుపద్రవము ప్రజాసంఘమునకు వాటిల్లునో తెలియరాకున్నది. పురుషులకు వలె స్త్రీలకును తల్లిదండ్రులు విద్యచెప్పించుచున్నారు. స్త్రీలు తమకై యేర్పడిన కళాశాలలో ఉన్నతవిద్యనభ్యసించుట సర్వసాధారణమై యున్నది. ఉన్నతవిద్యయందు తీక్ష్ణులై కొన్నివిశ్వవిద్యాలయములలో (Universities) స్త్రీలు సెనెటు మెంబర్లుగ నున్నారు. పురుషులవలె వారును ఉన్నతపదవుల నలంకరించుచున్నారు. విద్యాశాలలందు పాధ్యాయినులుగను, వైద్యశాలలలో గొప్పవైద్యురాండ్రుగను, మతసంఘములలో మత ప్రచారకురాండ్రుగను, ఇంగ్లండుమొదలగు రాజ్యములలో కర్మాగార పరీక్షాధికారిణులుగను (Factory Inspectors) పారిశుధ్యపరీక్షాధికారిణులుగాను, (Sanitary Inspectors) పత్రికాప్రవర్తకురాండ్రుగను (Journalists) అనేకస్త్రీలు పనిచేయుటకుశక్తిగలిగినవారై యున్నారు. ఇక చిన్నపదవులలో- గుమాస్తాలుగను, టైపుకొట్టువారుగను, సంక్షిప్తలేఖకురాండ్రు (షార్టుహేండు వ్రాయువారు)గను, వేలకొలదియున్నారు. ఇట్లు స్త్రీలు పురుషులవలె, గొప్పకార్యముల నిర్వహించుటకు వలయు జ్ఞానము సంపాదించుకొనుట కర్హులై యుండగా, మూడు నాలుగేండ్లకొకతూరి, రాజకీయచర్చసభలకు దగిన ప్రతినిధుల నొకరిద్దరి పేర్లు వారు సూచించుట కర్హురాండ్రు కారా యను విషయము వేఱుగచర్చింప నక్కఱలేదని చెప్పవలసియున్నది. అయినను ఆదినుండియు, నేటిదనుకను పురుషులకు రాజకీయవ్యవహారములం దెక్కుడు పాలున్నందున, వారు స్త్రీలకు చిన్నహక్కులనైన నిచ్చు

టకు నొల్లకుండుట విపరీతముకాదేమో. ఈవిషయము నందు ప్రతిపక్షులవాదము క్లుప్తముగ చెప్పవలెను.

1. సుకుమారియై సంసారవిషయములను చక్కగ దిద్దుకొనుచు మెలగెడు కులాంగనను రాజకీయవ్యవహారములలో నిమగ్నురాలినిగ జేయుటవలన సంసారానందమునకు భంగముకల్గుటయేగాక, ఆమెయొక్క తేజోవంతమైన పాతివ్రత్యధర్మమునకు ముప్పువచ్చునట. పైని జెప్పినవిధమున, మూడుసంవత్సరముల కొకపర్యాయమొకటి రెండు గడియలకాలము తనదికాదనుకొని ఎన్నికలస్థానమునకు (పోలింగుస్టేషనుకు) వెళ్లి సంఘోపకారి యగునని తనకు తోచినవానికి వోటిచ్చినందున, తనసంసారసౌఖ్యత్వ మెట్లు చెల్లాచెదరై పోవునో తెలియరాకయున్నది. స్త్రీకి విద్యాగంధ మున్నపక్షమున పత్రికలమూలమున లోకవ్యవహారముల తెలిసికొనుచున్నపుడు, తనసంసారధర్మమును మఱింతబాగుగ నిర్వర్తింపకొనగలుగునని యీకాలమున నమ్మనివారు లేరు. ముఖ్యముగ శిశుపోషణ, శిశువిద్య మొదలుగాగల సంసారవిషయములపట్ల రాజ్యభారము వహించు సభ్యు లేమి చేయుచున్నారో తల్లులు తెలిసికొనియుండవలెను. అట్లైనచో, సంసారవ్యవహారములకును, రాజకీయధర్మములకును ఎక్కువ సంబంధమున్నదని స్త్రీలు గుర్తెఱిగినపుడు వోటింగుహక్కును కోరకుందురా!

ఇందు మఱియొక అంశమున్నది. వోటింగుహక్కు నిచ్చినంతమాత్రమున, భార్యాభర్తల యనురాగమునకు చిక్కువచ్చుననుట హాస్యాస్పదముగ కనిపించును. ఆ హక్కులేని కాలమున వారు అనురాగబద్ధులైయున్నయెడల, హక్కువచ్చినతరువాత, అదియెట్లు విషమువలె పరిణమించునో తెలియకున్నది. జనాభాలెక్కలప్రకారము ప్రపంచమున పురుషుడే స్త్రీకంటె నెక్కుడుగ సంసారవైషమ్యమునకు కారణభూతుడని తెలియవచ్చుచున్నది. ముఖ్యముగ బీదకుటుంబములను చూడుడు. త్రాగుబోతుతనము, జూదము మొదలగు చెడునడతలన్నియు పురుషుని నెక్కువ ఆవరించియున్నవనియు, వానివలన కుటుంబసౌఖ్యము చెడిపోవుచున్నదనియు లోకానుభవము తెలుపుచున్నది. అన్యాయముగ స్త్రీనాక్షేపించనేల? అదియునుగాక, అవివాహితలైన స్త్రీల విషయమునను, భర్తలు చనిపోయిన స్త్రీలవిషయమునను ఏమి చెప్పెదరు? ఇట్టివారికి ఓటింగు హక్కు నిచ్చిన ఏసంసారములు చెడిపోవును?

2. స్త్రీలకు ఓటింగు హక్కునిచ్చినను, వారు తమ హక్కును చక్కగ ఉపయోగించుకొనలేరట! ఇది గొప్ప పొరబాటు. అనుభవమునకు విరుద్ధము, తమ సమాజముల తాము చక్కగ నడుపుకొనుచు లోకవార్తల నెన్నియో తెలిసికొనుచు రాజకీయ విషయములం దాసక్తి చూపుచున్న యీకాలపు స్త్రీ లట్టివారు కారని నమ్మవలెను. మఱియు, వివేకవంతులగు పురుషులందరికి ఓటింగుహక్కు ఉన్నమాత్రమున వారందఱును పోలింగుస్టేషనులకు వెళ్లి ఓట్లనిచ్చుచున్నారా? 100 కి 50,60 మంది కన్న నెక్కువగా పురుషులు ఓట్లనిచ్చుట యేదేశమందును సామాన్యముగ కాన్పించదు. హక్కు అనునది యున్నయెడల దాని నుపయోగించుటయందు హక్కుగలవారు తమ యిష్టానుసారముగ వర్తింతురు. ఈసందర్భమున, మన దేశమున, ఘోషాస్త్రీలకు ఓట్లు హక్కు ఉండియు నుపయోగము లేదనియు, అందుచేత మన దేశస్త్రీలలో కొంత భాగమునకు ఆహక్కునిచ్చుట అనవసరమనియు కొందరు చెప్పుట వింతగా కనబడుచున్నది. ఘోషాస్త్రీలు బహిరంగస్థలములందున్న యెన్నికల స్థానములకు రా వీలులేనియెడల ప్రత్యేకస్థానముల నేర్పాటు చేయుట కష్టముకాదు. అదియునుగాక ఎవరో కొందరు ఓటింగుకు ఒప్పుకొనరని అందరకును హక్కులేకుండ చేయుట న్యాయముకాదు.

ఇంతవరకును స్త్రీలు ఎన్నికొనుటకు అర్హురాండ్రుకారా అనువిషయమును చర్చించితిమి. పైనిజెప్పబడిన వాగ్వివాదములు అఱువది డెబ్బదిసంవత్సరముల నుండి జరుగుచునే యున్నవి. ఆంగ్లేయ సామ్రాజ్యములోని ఆయాప్రదేశములందలి స్త్రీలు తమ పట్టువిడువక, తీవ్రముగ ఆందోళనములు జరిపి కొంతవరకు సఫలీకృతమనోరథులైరి. వారియాందోళన మెంతవరకు ఫలించెనో చూతము.

ఇంగ్లండులో 1792 వ సంవత్సరమునుండి స్త్రీలు ఎన్నికల హక్కు కొరకు బహిరంగముగ పాటుపడ మొదలిడిరి. ఆసంవత్సరమున మేరీ వాలుస్టనుక్రాఫ్టును

నామె దానిని గుఱించి యొక చిన్నపుస్తకమును ప్రకటించినది. ఆమె అల్లుడు షెల్లీ అను మహాకవికూడ ఆమెకు సహాయ మొనర్చెను. తర్వాతి సంవత్సరములలో పార్లమెంటులో సభ్యులుగానుండిన కొందఱు మహాపురుషులు స్త్రీలహక్కులను స్థిరపఱుచుటకై క్రొత్త చట్టములనుగాని, ప్రాతచట్టములలో వలయు మార్పులనుగాని కావింప నెన్నియో ప్రయత్నములుచేసిరి. అందు ముఖ్యముగ 1864 సం॥న జాన్ స్టువర్టుమిల్లు అను ప్రసిద్ధపురుషు డొకడును ఈయన తర్వాత 1870 వ సంవత్సరములో జేకబ్ బ్రైటు అనుపురుషుడును గట్టి ప్రయత్నములు సలిపిరి. 1874వ సం॥లో సుప్రసిద్ధురాలగుఆనీబిసెంటమ్మగారు సైతము బహిరంగముగ ప్రయత్నముచేయ మొదలిడిరి. కాని అట్టిమహానుభావుల ప్రయత్నములవలన స్త్రీలకు స్థానికపరిపాలనా విషయములలో కొన్ని హక్కులు మాత్రము కలిగెను. అనగా ఇంగ్లండుజిల్లాలోని స్కూలు బోర్డులలో మెంబర్లు అగుటకును, మునిసిపాలిటీలలోని మునిసిపల్ సభ్యత్వమునొందుటకు స్త్రీలకు హక్కుకలిగినది.

ఇరువదవ శతాబ్దాదినుండి స్త్రీవర్గములు తమకు కావలసిన పార్లమెంటు సభ్యుల నెన్నుకొను హక్కుల కొరకు స్వయముగ పాటుపడవలెనని కొన్నిసమాజములనేర్పఱచుకొని, నయముననైనను భయముననైనను, శాంతియుతముగనైనను శాంతిరహితముగనైనను సర్కారు మంత్రులను ఒప్పించవలెనని అనేకయత్నములు కావించిరి. కాని ఆస్క్విత్, లాయిడ్ జార్జి, చాంబర్లెన్ మొదలుగాగల రాజ్యతంత్రజ్ఞులు స్త్రీలయాశయములకు విముఖతను జూపుచునే యుండిరి. ఇంతియకాక దేశములోపలుకుబడి కలిగినరాజకీయ తత్వజ్ఞులగు డైసీ మొదలయినవారు కూడ పైమంత్రులతో నేకీభవించుచువచ్చిరి. దౌర్జన్యయుతమగు సహాయనిరాకరణమును స్త్రీలు కొందరు మొదలుపెట్టిరి. సుప్రసిద్ధురాండ్రగు పెత్ ఖర్ స్టు, యానికెన్ని మొదలయినవారు దేశచట్టముల నుల్లఘించుచు వందలకొలదిగ కారాగృహవాసమునకు జేరుటయేగాక అచటిభోజనము కూడ ముట్టరైరి. ఇట్లు ఎన్నెన్నో యుపాయములు సల్పిరికాని స్త్రీలలో ప్రాజ్ఞులగువారు కొందరు చట్టములకు విరుద్ధముకాని ప్రయత్నములు సలుపనిశ్చయించి తమసమాజములలో తమకు న్యాయమనితోచిన విధమున తీర్మానములు కావించుకొని అట్టితీర్మానములను ప్రభుత్వమువారికి విన్నవించుకొనుచుండిరి. ఈవిధముగ స్త్రీలు తమయాందోళనమును జరుపుచువచ్చిరి. 1910వ సంవత్సరమున ఆస్క్విత్ మంత్రి, స్త్రీలకు సహాయముచేసెదనని వాగ్దానముచేసియు వారిని మోసపుచ్చెను. అయినను బాల్ఫరు, స్నోడను, రెడ్ మాండుప్రభృతులు స్త్రీలయుద్యమములకు అవసరమగు సహాయము నిచ్చుచుండినందున స్త్రీలు నిరుత్సాహురాండ్రుకాక తమ ప్రయత్నములను సాగించుచునే వచ్చిరి. చివరకు లాయిడ్ జార్జియె మంత్రిపదవికి రాగోరి 1911వ సంవత్సరమునుండి స్త్రీలకు ఎన్నికోలు హక్కునిచ్చుట తనకును తనపక్షమువారైన దేశీయ విశాలహృదయులకును (National Liebrals) సమ్మతమని దేశములో నెల్లడిచేయసాగెను. 1918వ సంవత్సరములో లాయిడుజార్జిగారి అధ్యక్షతక్రింద నుండిన మిశ్రమమంత్రివర్గమువారి సహాయమున పార్లమెంటువారిచే ఎన్నికోలు విషయమైన సంస్కరణచట్టమొకటి శాసింపబడెను. ఆ చట్టమునందు స్త్రీలకు కొన్నిషరతులమీద ఎన్నికొనుటకు హక్కు యియ్యబడెను. అనగా 30 సంవత్సరముల వయస్సుగలిగి, సర్కారున కేదో యొక పన్ను చెల్లించుచు, ఇంగ్లాండులోని విశ్వవిద్యాలయముల వలన నంగీకరించబడిన నేదోయొక యోగ్యతాపత్రమున్న ప్రతిస్త్రీకిని పైహక్కు యియ్యబడినది. అదేసంవత్సరమున మఱియొక నూతనచట్టముప్రకారము 21 సం॥ లు వయస్సుగలస్త్రీలు పార్లమెంటులో సభ్యురాండ్రగుటకు నర్హురాండ్రైరి. ఇంతవరకు ఆంగ్లేయ నారీమణులు ధన్యురాండ్రనవలెను. అయినను మొదటిచట్టము వారికి సంపూర్ణసంతృప్తిని కలుగజేయలేదు; కారణమేమనగ, దానిప్రకారము మేజరు అనగా 21 సంవత్సరములు వయస్సుకలిగిన ప్రతిపురుషునికిని ఎన్నికొనుట కుహక్కుండగా స్త్రీలకుమాత్రము పైజెప్పబడిన షరతులను విధించుట అన్యాయమని వారు వాదించుచున్నారు.

అయినను, 1918 వ చట్టముప్రకారము 60 లక్షల స్త్రీలకు హక్కుగలిగినది. 1922 వ సంవత్సరాంతమున జరిగెన పార్లమెంటు యెన్నికలలో ననేకస్త్రీలు ఓట్లనిచ్చిరి. ఎనమండ్రు పార్లమెంటు సభ్యురాండ్రైరి. వారిలో మిస్ మార్గరెటు బాన్ ఫీల్డు అనునామె

మాక్డొనాల్డుగారి మంత్రివర్గమున నొకమంత్రిపదవినికూడ నలంకరించెను.

**1924** వ సంవత్సరము అక్టోబరునెలలో జరిగిన పార్లమెంటు యెన్నికలలో తిరిగి అనేకస్త్రీలు (నాలుగు లక్షలమంది) ఓట్లనిచ్చిరి. నలుగురు పార్లమెంటుసభ్యురాండ్రైరి. ప్రస్తుతపు బాల్డ్విన్ మంత్రివర్గపువారు స్త్రీలకు పురుషులకువలె సంపూర్ణహక్కులను గలుగజేయుటకు నొప్పుకొనుచున్నారు. త్వరలో వారి యభీష్టములు నెరవేరునుగాక.

ఇంగ్లండునందేకాక, ఇతరసామ్రాజ్య భాగములలోకూడ స్త్రీలహక్కులు చాలవరకు స్థిరపడినవి. ఆస్ట్రేలియా, న్యూజీలెండు, టాస్మేనియా రాష్ట్రములలో ఇతర సామ్రాజ్యభాగము లన్నిటికంటె ముందుగ 1902, 1903 వ సంవత్సరములలోనే, స్త్రీలహక్కులు ఆమోదింపబడినవి. దక్షిణ ఆఫ్రికాలో 1924 వ సంవత్సరము ఏప్రిల్ మాసములో స్త్రీల యెన్నికోలుహక్కు చట్టరూపము దాల్చినది. కనడారాష్ట్రమునందును కొన్నిసంవత్సరములక్రిందట చట్టము లేర్పడినవి. అన్ని ప్రాంతములలోను ప్రతిపక్షుల వాదములప్రకార మెక్కడను స్త్రీలగుణములు చెడిపోలేదు. కుటుంబసౌఖ్యములు అంతరించలేదు. ఇంగ్లండులో జరిగిన ఆందోళనము ననుసరించి, పైరాష్ట్రములలోని స్త్రీలును, తమహక్కుల కొరకు అనేకధర్మయుత ప్రయత్నములుచేసి జయము గాంచిరి.

ఇండియాదేశములోని స్థితులనుగూర్చి కొంచెము విపులముగ చెప్పవలసియున్నది. ప్రాచీనకాలమునుండి మనదేశమున స్త్రీపురుషులకు సమానరాజకీయ హక్కులుండవలయునని యేశాస్త్రకారులు చెప్పియుండలేదు. ప్రాచీనఅభిప్రాయము ప్రకారము, హక్కులకును, భాధ్యతలకును భేదములేదు. మతానుసారముగ రెండును మానవుని ధర్మములు. అంతియగాక, జీవయాత్రయందు జరుపదగినవిధులలో స్త్రీపురుషులకు సహజమగు విభాగము కలిగియున్నది. అయినను ప్రాచీనకాలమునుండి యీకాలమువరకును "స్త్రీ"అనుపదముచే నిర్వచింపబడు గుణసముదాయము మనదేశమున పూజనీయమైయున్నది. మనకుకావలసిన సంపత్తి,విద్యల కధిదైవములు స్త్రీరూపులగు లక్ష్మీసరస్వతులేకదా. అర్థనారీశ్వరుడు తనరూపముచేత దేశీయకులాంగనల నర్ధాంగులుగ పురుషుడుచూడవలెనని ప్రబోధముచేయుచున్నాడు. ఆంగ్లేయ విద్యాసంపర్కము రాకపూర్వము మనదేశమున స్త్రీలును, తమ సంసారవిధుల నన్నిటిని ధర్మయుక్తముగ నడుపుకొన్నయెడల మోక్షప్రాప్తి కర్హులగుదురను ధర్మశాస్త్రోక్తులను నమ్ముచు జీవయాత్ర గడుపుచుండెడివారు. ఇప్పటికిని మనదేశమున అట్టియూహలు అడుగంటలేదు.

కాని నాగరికతాప్రోద్బలమువలనను దేశములో కలుగు అనేకరాజకీయ సంస్కరణముల వలనను, స్త్రీల యూహలు అనేకవిధములుగ వృద్ధియగుచున్నవి. ఇట్లు అభివృద్ధియగుట సహజము న్యాయమును. పురుషులయాలోచనలలో మార్పులుకలుగుచున్నపుడు స్త్రీలకు నట్లు మార్పులుకలుగుట నైజమునకు విరుద్ధముకాదు. స్త్రీతన కుమారునికి నవయుగమున కనుకూలమగు జ్ఞానాభివృద్ధి కావలెనని కోరునపుడు,తనకుమారుడును,అతనితోడివారును వారిభావిదశలలో నెట్లు దేశరాజకీయ విషయముల పట్ల వర్తింతురో తెలిసికొనుట తల్లులకుతప్పుగాదు. అందుచేతనే మనదేశమున స్త్రీలు ఇప్పుడిప్పుడు రాజకీయ విషయములలో జోక్యము కలుగజేసికొనుచున్నారు. కాని సామ్రాజ్యములోని యితరదేశములలో స్త్రీలవలె విపరీతముగ మనవారికి రాజ్యాంగవిషయములందు జోక్యముచేసికొనుట అక్కరలేదు. దానికి కాలమునులేదు. అయినను ఆంగ్లేయ నారీమణులమార్గమును వీరును కొంతవరకవలంబించుచున్నారు. ఆనిబిసెంటమ్మగారు, డోరోతీ జీనరాజదాసగారు, మార్గరెటుకసిన్సుగారు మొదలుగాగల ఆంగ్లేయ నారీరత్నములు మనదేశపు స్త్రీలకును రాజకీయహక్కు లుండవలెనని పత్రికల మూలమునను సమాజముల మూలమునను గొప్ప బోధనలు సల్పుచున్నారు. మఱియు మనదేశపు స్త్రీలలో ననేకులు ఉన్నతపరీక్షలయందుత్తీర్ణులై గొప్పపదవుల నలంకరించుచు రాజకీయ విషయములందు సుముఖత వహించుచున్నారు. ఇట్టివారిలో కీర్తిశేషురాలగు రామాబాయి రనేడేదేవిగారిపేరు మొదట స్మరించవలెను. ప్రస్తుతము విడువని దీక్షతో రాజకీయాందోళనమునపాల్గొనియున్న సరోజినీదేవిగారును, దాసుగారిసతీమణిగారును, న్యాయ

మూర్తులగు సదాశివయ్యరుగారి సతీతిలకమును, న్యాయ మూర్తులగు దేవదాసుగారి భార్యయును, అనసూయా విదుషీమణియును, సరళాదేవి చౌదురాణిగారును, కీర్తిశేషురాలగు బైఅమ్మను సాహిబాగారునుమాత్రమే గాక మఱియెందఱో స్త్రీసంఘాభివృద్ధికై చేసినప్రయత్నములు దేశవిదితములు.

1919 సంవత్సరమునుండియే మన దేశస్త్రీలు చట్ట నిర్మాణసభ్యుల (Legislative Councilor's) ఎన్నికొనుహక్కులను సంపాదించుటకొరకు గొప్ప ప్రయత్నములు జరుపుచున్నారు. కారణ మేమన, ఈసంవత్సరము నుండియే మనదేశములోని పురుషులకు అట్టి హక్కు నూతన రాజ్యాంగశాసనము ప్రకారము ఎక్కువగ అలవడినది. ఇట్టిశాసనము పుట్టనున్నదని వినినంతనె పురుషులతోపాటు స్త్రీప్రతినిధులును 1918 వ సంవత్సరములో మాంటేగు, ఛెంసుఫర్డు ప్రభువులయెదుట తమవిన్నపములను చేసికొనిరి. అనేకసంఘములతరఫున కావింపబడిన తీర్మానములు వారికి పంపబడినవి. అఖిలభారత కాంగ్రెసులోను, ఇతర రాజకీయ మహాసమ్మేళనములలోను తీర్మానములు కావింపబడినవి. అంతియగాక దేశస్త్రీల తరఫున హీరాబాయితాతాదేవిగారును, మిటుబా తాతా దేవిగారును, ఇంగ్లండుకువెళ్లి ఆంగ్లేయులకు తమ యాశయములను తెలియబరచుకొనిరి. ఇట్లు అనేక విధములుగ కావింపబడుచున్న ఆందోళనమువలన మొదటిఫలితమే మన స్థానికపరిపాలనా(Local boards and Municipalities) సంఘసభ్యుల నెన్నుకొనుటకును, సభ్యురాండ్రుగ నుండుటకును, స్త్రీలకు హక్కు యివ్వబడినది. అదియును మన చెన్నపురిరాజధానియందు మొదటవ్యాపించినది. దానినిబట్టియే తిరుచనాపల్లి, తంజావూరు, మధుర, కాకినాడ, రాజమండ్రి, గుంటూరు మొదలగు మునిసిపాలిటీలలో వరుసగ—సతీమణులగు జ్ఞానదొర M. A. గారును, రజాక్ దేవియును, వేలాయుధమీననుగారి భార్యయును, కోకా కృష్ణవేణమ్మగారు, కందమర్తి బాబాయమ్మగారును,గుండు అచ్చమాంబగారును మఱికొందఱును సభ్యురాండ్రై దేశసేవ యొనర్చుచున్నారు. స్థానికవిద్యాపరిపాలనా సంఘములందును (Educational Councils) స్త్రీలకు సభ్యత్వము చేకూరినది. ఇట్టి సంఘములలో అనంతపురములోని శ్రీమతి ఉత్త సుందరమ్మగారును, రాజమహేంద్రవరములోని ప్రిన్సిపాలు కృష్ణమ్మగారి భార్య చెన్నపురిలోని న్యాయమూర్తులగు దేవదాసుగారి భార్య పాలు అప్పస్వామిగారి సతియున్నగువారు సభ్యురాండ్రుగ నున్నారు. విశ్వవిద్యాలయ సంఘములందు (University Councils) కుమారమంగళము జమీందారిణి యగు రాధాబాయిదేవి సభ్యురాలుగ నున్నది. ఇంతియుకాక గౌరవనీయ మేజస్ట్రేటుపదవులును స్త్రీలకొసంగబడుచున్నవి. సైదాపేటలోని మార్గరెటు కజిన్సుగారును, ప్రొఫెసరు లక్ష్మణయ్యరుగారి సతీ తిలకమును, చెన్నపురిలోని కలక్టరుగారగు వి. పి. రావుగారి భార్యయును, న్యాయమూర్తులగు సదాశివయ్యరుగారి యర్ధాంగియును, మదనపల్లిలోని రంగనాథము మొదలియారుగారి కొమారితయగు జయలక్ష్మి దేవియును మఱికొందఱును ఇట్టి గౌరవ స్థానముల నలంకరించుచున్నారు.

ఇట్టి సందర్భమున శాసన సభ్యత్వహక్కు స్త్రీలకు అచిరకాలముననే సంపూర్ణముగ లభించుట సహజము. ఇప్పటికి దేశీయ రాజ్యములయిన(Native states)కొచ్చి, తిరువాన్కూరు, రాజకోట(కత్తియవాడు ప్రదేశములోనిది) లలోని శాసనసభలలో నీమధ్యనే కొంతవరకు యెన్నికోలు హక్కును, సభ్యత్వహక్కును ఆయా రాజ్యస్త్రీలకు దయచేయబడినవి. ఇందు ముఖ్యముగ తిరువాన్కూరుసభలో సభ్యురాలుగ నియమింపబడిన లూకోస్ పూనెను దేవిగారు సుప్రసిద్ధురాలు. వీరు తిరువాన్కూరు రాజ్యముఖ్యపట్టణమగు తిరువనంతపురములోని, స్త్రీ శిశువైద్యశాలాధ్యక్షురాలుగ నుండిరి. వీరు శాసనసభ్యురాలుగ 1924 సెప్టెంబరు నెలలో నియమింపబడిరి. వీరే మన దేశమందంతట మొదటి శాసనసభ్యురాలను ఖ్యాతి గాంచుచున్నారు.

ఇక బ్రిటిషు ప్రభుత్వములోనున్న మనదేశరాష్ట్రసభలలోను కూడ స్త్రీలకు కొంతవరకు యెన్నికోలు హక్కు లభించినది.

1919వచట్టములో ఆయారాష్ట్రములలోని శాసనసభలు ఆమోదించినయెడల ఆయారాష్ట్రస్త్రీల కట్టిహక్కులు కలుగుట కభ్యంతరముండదని స్పష్టముగ నిబంధనలున్నవి. ఆప్రకారముగ ఇప్పటికి అయిదురాష్ట్రసభలు

అనగా–చెన్నపురి, బొంబాయి, మధ్యరాష్ట్రము, బంగాళము, అన్నాముల లోని సభలు–అట్టి ఒప్పుదలను చట్టరూపముగ గావించినందున అచటి స్త్రీలు యెన్నికోలు హక్కును పురుషులవలె అనుభవించుచున్నారు. మిగిలిన రాష్ట్రసభలును తగిన చట్టములను త్వరలో గావింతురనుటకు సందేహము లేదు.

ఎన్నికోలు హక్కుతోబాటు సభ్యత్వహక్కుల బడయుటకై నారీమణులు సమావేశములలో వలయు తీర్మానములు చేయుచున్నారు. 16-2-1924 దినమున చెన్నపురి సెనేటుహౌసులో జరిగిన స్త్రీమహాసభయందు తద్విషయమై గంభీరోపన్యాసములు ఇయ్యబడినవి. ఈసభలో ముఖ్యముగ పాల్గొనిన మార్గరెటు కజిన్సు గారున్ను, సదాశివయ్యరుగారి సతీమణియును మఱి కొందరు స్త్రీరత్నములున్ను గవర్నరుగానుండిన వెల్లింగ్డను ప్రభువుగారియెదుట స్త్రీవర్గములతరఫున తమ యాశయముల విన్నవించుకొనిరి. అతిశీఘ్రకాలముననే సర్వేశ్వరుని దయచేత వారి మనోరథములీడేరును గాక!



# మాయమ్మ మాకిత్తువా

కొడాలి వెంకటసుబ్బారావు గారు

కానురాజుగడ్డ శివయోగానంద రావుగారు



౧

అమ్మకై పూదండ
లల్లుకొనివచ్చాను
అందులో సగభాగ
మాశపెడుతున్నాను
మాయమ్మ మాకిత్తువా దైవమా
మాలలన్నియు నిత్తురా

ఆకలౌతుం దమ్మ
అన్నమే యంటేను
అయ్యో నాయనయంచు
ఆదరించే యమ్మ
నగుపడకపోనిత్తువా దైవమా
అన్యాయమొనరింతువా

అమ్మపై కొండెంబు
లయ్యతో చెప్పాలె
ననుకొంటె మాకట్టి
యదను లేకుంటుంది
అమ్మనెత్తుకపోదువా? మమ్మల్ని
ఆటలాడగనీదువా

పిన్నపిల్లలమీది
ప్రేమమాపై లేదు
అమ్మమ్మకిపుడు మా
యమ్మ లేకుంటేను
అట్టిపాక్షికభావముల్ దైవమా
ఎట్టులో భరియించుటల్

మాయమ్మ భాగవత
మిప్పి చెపుతూవుంటె
కన్నులకు కృష్ణయ్య
కనుపించుతాడంచు
మేనత్తలంటారుగా ఆకతలు
మేము వినగాలేముగా

మామయ్యకూతుళ్లు
మాయత్తయేదంటె
మారుమాటేలేక
మనసునీరౌతాది
మాలోపమునుదీర్పవా దైవమా
మమ్ముల్ని దరిజేర్పవా

రైక బొడ్డునదోపి
రాలుస్తు కన్నీళ్లు
నాస్నానకపువేళ
నాన్నకూర్చోవాలి
లోకులందరి జూడవా ఆలాగె
నాకు పెళ్లిని జేయవా

అమ్మయేదేవుళ్ల
కపుడు మొక్కిందోను
అవి దీర్పగాలేక
అగచాట్లబడతాము
అవి మాకు జెప్పమంచూ కోరెదము
అమ్మనొకసారంపుమంచూ

అమ్మనుజూపరా
అన్నయ్య యంటేను
తమ్ముళ్లతోనేను
తగవాడగాలేను
మాయమ్మగొనితెత్తువా దైవమా
మాపోరు లడగింతువా

అమ్మనాకేదంచు
అడుగుతావేమోను
నీకులేదనిమాకు
నిరసింపన్యాయమా
ఉన్నవారిని వ్రేల్చుటా దైవమా
నిన్ను మాతో పోల్చుటా

అమ్మ నీరూపులో
ఐక్యమైపోయింది
అమ్మాయనేమాటె
హరియించిపోయింది
అమ్మ నెత్తుకపోతివా భాషకే
యపకారమొనరిస్తివా

తల్లిలేకుంటేను
తనువులేదంటారు
తనువులేకున్న భూ
తపురూపమైతినా
సందేహమునుతీర్తువా
దైవమా జననిలోటునె దీర్తువా





3. పడిపోయిన వస్త్రపరిశ్రమాలయము



౪. పడిపోయిన విద్యార్థులు ఇనుపరేకులు పోతపోయు యంత్రాలయము

ఆంధ్రదేశము-గాలివాన, 16-5-1925 ఆంధ్రజాతీయకళాశాల, బందరు



౧. పడిపోయిన పంచమేతర విద్యార్థి వసతిగృహాము



౨. పడిపోయిన వడ్రంగపువిద్యార్థులు పనినేర్చుకొను గృహాము,




3

మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు

మంగియువరాజుకుమారుఁడైన మూఁడవ విష్ణువర్ధనుని యనంతరము వేంగీ చాళుక్యరాజ్యభారమును వహించినవాఁడు ఆతని యౌరసపుత్త్రుఁడైన విజయాదిత్యుఁడు. ఈతనికి త్రిభువనాంకుశ, విక్రమరామ బిరుదములు కలవు. ఈతఁడు వివిధయుద్ధములందు విజయము సంపాదించి విజయసిద్ధి యని పేరుఁ గాంచినవాఁడు. ఈతనినాఁటినుండియే త్రిభువనాంకుశనామము వేంగీచాళుక్యులకు వంశపరంపరాగతముగ వచ్చు బిరుద వాచకమయ్యెను.

### రాష్ట్రకూట విజృంభణము

ఈతఁడు పరిపాలించుచుండిన కాలమున దక్షిణహిందూదేశ చారిత్రమున సుస్థిరముగఁ దనచిహ్నములను దిగవిడిచిన యొక గొప్ప పరివర్తనము సంభవించెను. ఆపరివర్తనముతో దక్షిణాపథరాజకీయ రంగమంతయు మహాసంక్షోభమును జెందెను. దీనికిఁ గారణభూతులైనవారు రాష్ట్రకూటులు. వీరినే వల్లభులందురు.

వీరు తమశాసనములందుఁ దాము లట్టలూరు లేక రట్టలూరు లేక లత్తనూరు పురవరాధీశులమని చెప్పుకొనియుండుటచేత మొట్టమొదట వీరు లట్టలూరుప్రాంతమువారని యూహింపనవకాశము కలుగుచున్నది. నిజాంరాష్ట్రమునందలి ఉస్మానాబాదు జిల్లాలోని పరెండతాలూకాయందలి యిప్పటి లాటూరే లట్టలూరని ఫ్లీటుదొరగారు నిర్ధరించియున్నారు. అది యటుండ క్రీస్తుశకము ఏడవశతాబ్దమునాఁటి వీరి శాసనము లొకటిరెండు మధ్యపరగణాలలోని బేటుల్ జిల్లా యందలి ముల్తాయి తహాశీలులో ముల్తాయి తివార్ఖేడ్ గ్రామములలో దొరకినవి. అందొకటి అచలపురమునుండి యొసంగఁబడినది. అప్పుడది రాష్ట్రకూటులకు రాజధానిగ నుండినట్లూహింప నవకాశము కలదు. తరువాత నది వారికి రాజధానిగ నుండకపోయినను వారి రాజ్యమునందలి ప్రధాన నగరములలో నొకటిగ నుండెను. ఈపుర మిప్పుడు ఎల్లిచ్పూరు అనుపేరఁబరగుచున్నది[1]. రాష్ట్రకూటులు తాము లట్టలూరపురవరాధీశ్వరు

1. ముల్తాయి తహాశీలులోని తివార్ఖేడ్ నగరమునకు ౫౫ మైళ్లదూరమునందున్న ఎలచ్పురము, లేక అలచపురము అనఁబడు ఎల్లిచ్పూరే అచలపుర మని తివార్ఖేడ్ శాసనము ననుసరించి రాయబహద్దరు హీరాలాల్ గారు నిర్ధరించియున్నారు.

లమని చెప్పుకొనియుండుటచేతను, వీరి శాసనములు ఏడవశతాబ్దమునాఁటివి మధ్యపరగణాలలో దొరకియుండుట చేతను, అశోకవర్ధన మహారాజుయొక్క దక్షిణాపథపు ధర్మానుశాసనములందుఁగూడ వీరు రాష్ట్రికులనుపేరఁ బేర్కొనఁబడియుండుటచేతను వీరు అసలు వింధ్యపర్వత ప్రాంతముల మధ్య హిందూదేశమున నివసించియుండు ఆదిమ జాతుల వారిలో నొకరని సదాధారమున నిశ్చయింపవచ్చును.

కాలము గడచినకొలఁది రాష్ట్రికూటులు కొంత దేశమును సంపాదించుకొని రాజ్యమేలినట్లు కన్పట్టును. బాదామిచాళుక్య వంశమునకు మూలపురుషుఁడైన జయసింహవల్లభుని నాఁటికి రాష్ట్రకూటులు ఎనిమిదివందల గజసైన్యమున కధిపతులనియు, అప్పుడు వారికి ఇంద్రరాజను నతఁడు రాజనియు, ఈతనిని జయించియే యీ జయసింహుఁడు దక్షిణాపథమున చాళుక్యరాజ్యమును స్థాపించెననియు మన కీవఱకుఁ దెలియును. నాఁటినుండియు రాష్ట్రకూటులు స్వతంత్ర రాజ్యమును నిర్మించుకొనుటకై తరుణమున కెదురుచూచుచుండిరి. అంతవఱకు వారు చాళుక్యులలో బలవంతులు సింహాసనమునకు వచ్చినప్పుడు వారికిఁ గప్పములు కట్టుచు సామంతమండలికులై, బలహీనులు బయలుదేఱినప్పుడు తమ స్వాతంత్ర్యపతాకలను విప్పి వారి నెదిరించి యుద్ధముచేయుచు నీవిధమున పూర్తిగ స్వతంత్రులునుగాక, పూర్తిగ నస్వతంత్రులునుగాక తమ కాలమును వేగించుచుండిరి. ఇట్లున్నవారి కిప్పటికి సమయము తటస్థించెను. ఇటు బాదామిచాళుక్యులును, అటు కాంచీపురపల్లవులునుకూడ నిరంతర సంగ్రామములతో బలమును, ధనమును గోలుపోయి ఉభయులునుగూడ సొమ్మసిల్లియుండిరి. బాదామిచాళుక్యప్రభువగు రెండవ విక్రమాదిత్యుఁడు, అతనికుమారుఁడగు రెండవ కీర్తివర్మయు, కాంచీపుర ప్రభువగు నందివర్మపల్లవమల్లుఁడు నిరువురునుగూడ సమర్థులును, మహాబలపరాక్రమశాలురు నైనయోధులైయైనను ఎడతెగక వారొండొరులతోఁ బోరాడుచుండుటవలన రాష్ట్రకూటులు విజృంభించుట కవకాశము కలిగెను.

ఇట్టితరుణమున దంతిదుర్గుఁ డనువాఁడు రాష్ట్రకూటులకు నాయకుఁడై సైన్యములం దీసికొని బాదామినగరమును ముట్టడించెను. ఒక్కకుదురులోనివారగుట వేంగిచాళుక్యులు బాదామిచాళుక్యులకు వారి కష్టకాలమున బాసటమై నిలిచి రాష్ట్రకూటులపై నెదురుతిరిగి యుండవచ్చును. రాష్ట్రకూటులకును, దమకునుగూడ బాదామిచాళుక్యులు శత్రువులగుటచేత కాంచీపురపల్లవులు రాష్ట్రకూటులకు సాయపడిరి. ఈ ప్రచండసమరమున బాదామిచాళుక్యు లోడిపోయిరి. మఱలనింకొకమాఱు రాష్ట్రకూటుల భాగ్యరేఖ బయలుపడెను. చాళుక్యులతోడి పోరాటమున నెప్పుడు విజయము కలిగెనో యప్పుడే రాష్ట్రకూటులకు దక్షిణాపథమునంతయు నేకఛత్రముక్రిందికిఁ గొనివచ్చి నొక్క మహాసామ్రాజ్యమును నిర్మింపవలెనని పెద్దకోరిక కలిగెను. నాఁటినుండి రాష్ట్రకూటులకు,

ఇతరదక్షిణాపథ రాజన్యులకు ఎడతెగని యుద్ధములు జరిగెను. తుట్టతుదకు వారు తమకుఁ దోడ్పడినపల్లవులనుగూడఁ గరుణించియుండ లేదు. రాష్ట్రకూటరాజగు దంతిదుర్గుని వాడి మగఁటిమికి కోసలులు, కాళింగులు, శ్రీశైలాధిపతులు, నాగరాజులు, కాంచీపురపల్లవులు అందఱు లోఁగిపోయిరి. అయినను ఓడిపోయిన బాదామి చాళుక్యభూపతు లెడపతడపఁ దమపోయిన రాజ్యమును మఱల సంపాదించుకొనుటకై ప్రయత్నింపక పోలేదు. తుదిమాఱు రెండవకీర్తివర్మ నోడించి దంతిదుర్గుఁడు వేసినపునాదులను గట్టిపఱిచి రాష్ట్రకూట రాజ్యలక్ష్మికి వాసయోగ్యమైన విశాల సౌధమును నిర్మించుట ఆతని పితృవ్యుఁడును, ఆతనియనంతరము రాజ్యమునకువచ్చినవాఁడునైన కృష్ణరాజు పాలఁబడెను. అంతటితో బాదామిచాళుక్యచారిత్రముసంపూర్తి యగుచున్నది. రాష్ట్రకూటులకు మొట్టమొదట నాసికానగరమును, పిదప మాల్యఖేట మును రాజధానులుగ నుండినను సాధారణముగ దేశచారిత్రమున వీరిని మాల్యఖేట రాష్ట్రకూటు లందురు. ఈ మాల్యఖేటము నిజాంరాష్ట్రములోని యిప్పటి మాల్ ఖేడ్ గ గుర్తింపఁబడినది.

తమ కదివఱకున్న స్వల్పరాజ్యమును విస్తరింపఁజేసికొనఁ బ్రయత్నించు పాండ్యులతో నొకవైపు, క్రమక్రమముగ దినదినాభివృద్ధిఁ గాంచుచున్న రాష్ట్రకూట ప్రభుపుంగవులతో నొకవైపు, ఉత్తరమునుండి దక్షిణమునకుఁ దమరాజ్యమును విస్తరింపఁజేసికొనఁ ప్రయత్నించు వేంగీచాళుక్యులతో నొకవైపు పోరాడవలసివచ్చుటచేత కాంచీపుర పల్లవ రాజ్యము నానాఁటికి కృంగి కృశింపఁ దొడంగెను. అనతికాలముననే రాష్ట్రకూటరాజ్యము దక్షిణాపథరాజ్యములలో ప్రధానస్థానమాక్రమించెను. రాష్ట్రకూటులు, బాదామి చాళుక్యులతోడి పోరాటమున వారికి వైరులై నిలిచిన వేంగీచాళుక్యులు- ఈ యిరువురే క్రీస్తుశకము ఎనిమిది, తొమ్మిది శతాబ్దముల దక్షిణాపథమున బలవంతులై మహాసామ్రాజ్య సంస్థాపనమునకై ఓహరి సాహరియని పెనగులాడినవారు. రాష్ట్రకూటులలోను, వేంగీచాళుక్యులలోనుగూడ సమర్థులును, బహుపరాక్రమశాలురు నైన రాజపరమేశ్వరు లుండుటచేత నీపోరాటముల కంతము లేకపోయెను. అందువలన నీవఱకు బాదామిచాళుక్య, కాంచీపురపల్లవ సంగ్రామము లెట్లో అట్లే యీ విజయాదిత్యునినాఁటినుండి మాల్యఖేట రాష్ట్రకూట, వేంగీచాళుక్య సంగ్రామములు దినదినమును జరుగుసంగతులయ్యెను.

వేంగీచాళుక్యులకు ఈరాష్ట్రకూటుల యొత్తిడి శుభతుంగ, అకాలవర్ష నామాంతరములం బరగు పైనుడివిన కృష్ణరాజ కుమారుఁడగు (రెండవ) గోవిందరాజుకాలమునుండి యారంభమయ్యెను. ఈ గోవిందరాజునకు ప్రభూతవర్షుఁడనియు, విక్రమావలోకుఁడనియు నామాంతరములు కలవు. ఈతఁడు యువరాజుగ నుండఁగనే తమతోడి యుద్ధములలో బాదామిచాళుక్యులకుఁదోడ్పడినకారణమునఁ గావచ్చును వైరమును బాటించి క్రీస్తుశకము

౭౯౯-కి పూర్వమే వేంగిభూపాలుని జయించి నట్లు ఆతని అలాస్ తామ్రశాసనము తెలుపుచున్నది[1]. వేంగిభూపతులకును, రాష్ట్రకూట నృపాలురకును జరిగిన యుద్ధములను దెలుపు మొట్టమొదటి శాసనమింతవఱ కిదియే; కాని యీవిషయము వేంగిచాళుక్య శాసనములం దెచ్చటను దెలుపఁబడియుండలేదు. ఎట్లయినను రాష్ట్రకూటు లొకవేళ వేంగిని జయించిరనియే యంగీకరించినను ఆవిజయము తాత్కాలికము గాని స్థిరమైనది కాదు. ఈ రాష్ట్రకూట గోవిందరాజు దండయాత్రల మూలమున వేంగిచాళుక్య భూపాలుర యధికార మించుకంతయినఁ జలియించినట్లు కాని, దేశమున గొప్పసంక్షోభము జనియించినట్లుకాని కానరాదు. వేంగిచాళుక్యరాజ్యము పశ్చిమమున నిజాంరాష్ట్రములోని కుక్కనూరు వఱకు[2] వ్యాపించిన ట్లూహింప నవకాశముండుటచేత నెచ్చటనో రాష్ట్రకూట రాజ్యముయొక్క సరిహద్దుల నిజాంరాష్ట్రమున నీయుద్ధము జరిగిన జరిగియుండవచ్చును. గోవిందరాజుయొక్క అలాస్ తామ్రశాసనము ననుసరించియు నట్లే యూహింపఁదగియున్నది. ఈవిజయాదిత్యుఁడు క్రీస్తుశకము ౭౯౯ మొదలు ౭౭౦ వఱకు రాజ్యముచేసెను

ఈతనిపిదప నితని కుమారుఁడైన విష్ణువర్ధనమహారాజు రాజ్యమునకు వచ్చెను. ఈతనికి మకరధ్వజబిరుదము కలదు. విష్ణువర్ధన నామాంకితులైన వేంగిచాళుక్యప్రభువులలో నీతఁడు నాలుగవవాఁ డగుటచేత నీతనిని నాలుగవవిష్ణువర్ధనుఁ డందురు. ఈతనికాలము నాఁటికి చాళుక్యుల యధికారము వేంగిదేశమున సుస్థిరముగ నాఁటుకొనెను. పశ్చిమ సముద్రతీరమున రాష్ట్రకూటులవలెనే పూర్వ సముద్రతీరమున వేంగిచాళుక్యులు బలవంతులైరి. ఈవిష్ణువర్ధనుని ప్రపౌత్రుఁడగు గుణక విజయాదిత్యుని సాతలూరుశాసనమున[3]నీతఁడు వేంగి 'పండ్రెండువేల' దేశమును బరిపాలించెనని తెలుపఁబడెను. విష్ణువర్ధనునినాఁటికి వేంగి పండ్రెండువేలదేశ మనియు, చాళుక్యులు వేంగిని పరిపాలించిరనియు స్పష్టముగఁ జెప్పిన మొట్టమొదటి చాళుక్యశాసన మిదియే. దీనిననుసరించి యీవిష్ణువర్ధనునినాఁటినుండియే చాళుక్యరాజ్యమునకు వేంగి సుస్థిరమైన యాటపట్టయ్యెననియు, చాళుక్యుల పాలీధ్వజము వేంగినాఁట సుప్రతిష్ఠిత మయ్యెననియు నిరాతంకముగ నిశ్చయింపవచ్చును. చాళుక్యులకు వేంగిపై నభిమానము కుదిరెను. తమ మొట్టమొదటిదేశమైన బాదామిరాజ్యముపై నభిమానమును, మమతయు వీడిపోయెను. వేంగి పూర్వచాళుక్యశాఖకు మాతృదేశ మయ్యెను. దానంజేసియే కాలము గడచినకొలఁది తరువాతి చాళుక్యప్రభువులు వేంగీదేశమును

> అస్తి ప్రశస్తజాతీనాం రత్నానా మివ వారిధిః
> జన్మభూమి శ్చలుక్యానాం దేశో వేంగీతి విశ్రుతః.[4]

అని కీర్తింపఁదొడంగిరి.

---

1. Ep. Ind. Vol VI P 208. 2. Ep. Rep. for 1918. p 130. 3. భారతి సం 1. సం 1.

4. జాతిరత్నములకు సముద్ర మెట్లు జన్మస్థానమో అట్లే చళుక్యులకు వేంగీదేశము జన్మభూమి.

ఈనాలవవిష్ణువర్ధనునికాలమున రాష్ట్రకూటరాజ్యముల గృహకలహము లుదయించెను. రాష్ట్రకూటరాజగు కృష్ణభూపాలునికి పైనిచెప్పిన గోవిందరాజేగాక ధారావర్షుఁడనఁ బరగు ధృవరాజ నిరుపముఁ డను కుమారుఁడుకూడ నుండెను. రాష్ట్రకూట సింహాసనమునకై గోవిందరాజునకును, ధృవరాజునకును పోరాటము సంభవించెను. ఈ పోరాటమున గోవిందరాజు వేంగీ, కాంచీ, మాళవాది దేశాధిపతులను దనకు సాయముగఁ బిలిచెనని యొకశాసనము తెలుపుచున్నది[1]. ఈ విషయమే నిజమగునేని ఆతఁడు తనకు సాయముగఁ బిలిచిన వేంగీదేశాధిపతి నాలుగవ విష్ణువర్ధనుఁడు కావచ్చును. ఈపోరాటములలో తుదకు ధృవరాజు జయలక్ష్మిం జేకొనియెను. వేంగీ మాళవదేశాధిపతులును పరాజయము నొందిరి. గోవిందరాజ, ధృవరాజుల యీగృహకలహములవలన వేంగీచాళుక్య, మాల్యఖేటరాష్ట్రకూట వైరానలము మఱల ప్రజ్వరిల్లెను. దీనికితోడుగ ధృవరాజమరణానంతరము ఆతని కుమారుఁడైన యువరాజ (మూఁడవ) గోవిందరాజు రాష్ట్రకూట సింహాసనమునధిష్ఠింపకుండఁ జేయుటకై పూర్వవిరోధములను పాటించి దక్షిణాపథమునందలి పండ్రెండుగురు రాజులు తంత్రముచేసినట్లురాష్ట్రకూట శాసనములు తెలుపుచున్నవి. వీరిలో నుండిన నొకవేళ మననాలవవిష్ణువర్ధనుఁడుకూడ నుండవచ్చును. ఎట్లయిననేమి ప్రభూతవర్ష శ్రీవల్లభ జగత్తుంగనామాంతరములం బరగు మూఁడవ గోవిందరాజు వారిని ఒక్కొక్కరినే జయించి రాష్ట్రకూటరాజ్యమును స్వాధీనపఱుచుకొని క్రీస్తుశకము ౭౮౩-౮౪ మొదలు ౮౧౪-౧౫ వఱకు పరిపాలనము నెఱపెను. తన్ను పదభ్రష్టునిం గాఁ జేయింప తంత్రములు పన్నినవారిలోఁ జేరిన వేంగీచాళుక్యులపైఁ బగ తీర్చుకొనుటకై ఆతఁడు సమయముకొఱకు వేచియుండి శస్త్రములను సానఁబట్టుచుండెను. ఇందుకు వారికికాలముకూడ ననుకూలించెను.

దేశ మిట్టివిషమస్థితియం దున్నప్పుడు విష్ణువర్ధనుఁడు క్రీస్తుశకము ౭౭౦ మొదలు ౮౦౬ వఱకు ముప్పదియాఱేండ్లు ధరాపరిపాలన మొనరించి పరలోకగతుఁ డయ్యెను. అతనికి విజయాదిత్యుఁడు, భీమసల్కి యనబరగుచాళుక్యభీముఁడు అను నిరువురు కుమారులు కలరు. విష్ణువర్ధనుని యనంతరము వేంగీచాళుక్యసింహాసనమునకై భీమసల్కి, విజయాదిత్యులు తగవులాడఁజొచ్చిరి. ఈతగవులలో విజయాదిత్యునిపక్షమున నృపరుద్రుఁడనునతఁడు చేరెను. ఈతఁడు విజయాదిత్యునికి హైహయవంశజుఁడైన భ్రాతయని తెలియుచున్నది. దీనిననుసరించిచూడ ఒకవేళ నీతఁడును, విజయాదిత్యుఁడును పినతల్లి పెదతల్లి బిడ్డలని యూహింపవచ్చును. భీమసల్కి రాష్ట్రకూటరాజగు గోవిందుని, ఆతనిక్రింద సామంతమండలికులుగ నుండిన మైసూరు దక్షిణగంగులను ఆశ్రయించి చాళుక్యసింహాసనమునకై జరుగు నీపోరాటమునఁ దనకు తోడ్పడవలసినదని ప్రార్థించెను. వేంగీచాళు

1. Ep Ind. Vol iii, p. 104.

క్యులపైఁ బగతీర్చుకొనుటకుఁ దగిన యదనెప్పుడుదొరకుననియు, వేంగీచాళుక్యరాజ్యము నెప్పుడు కబళింప వీలగుననియు నెదురుచూచుచుండిన గోవిందరాజునకు భీమసల్కి సంప్రార్థనము అపరిమితానందము నొడఁగూర్చెను. వేంగీరాజకుటుంబములోని భీమసల్కి యీ విధమున వచ్చి తన్నాశ్రయించుటచేత కావచ్చును [1] ఆతనిని చులకనగఁ జూచి మూఁడవ గోవిందరా జొక శాసనమున తన లేఖాహారుఁడు (లేఖలను గొనిపోవువాఁడు) తా నొసంగిన యాదేశమును ఇంకను పూర్తిగ చెప్పి చెప్పకమునుపే వేంగీశ్వరుఁడు 'స్వశ్రేచ్ఛ'తో వచ్చి కింకరునివలె ఎడతెగకుండ పాటుపడి (మాల్యఖేటపుర?) ప్రాకారమును (? వాహ్యాళీవృతి?) గట్టెనని సగర్వముగఁ జెప్పుకొనియున్నాఁడు[2]. భీమసల్కిసంప్రార్థనమును సాకుచేసికొని రాష్ట్రకూటగోవిందరాజు వేంగీదేశముపైనెత్తివెళ్లెను.

### ద్వాదశవర్ష సంగ్రామము

నాఁడు మొదలు రాష్ట్రకూటులకును, వేంగీచాళుక్యులకును ద్వాదశవర్ష సంగ్రామము సంప్రాప్తమయ్యెను. రాష్ట్రకూటుల తోను, గాంగులతోను వచ్చినభీమసల్కి వేంగీరాజ్యము నాక్రమించుకొనియెను. అతిసాహసముతో విజయాదిత్యుఁ డొంటరియై నిలిచి పండ్రెండు సంవత్సరము లెడతెగకుండ అహర్నిశములు గంగ, రాష్ట్రకూటబలములతోఁ బోరాడెను. ఈద్వాదశవర్ష సంగ్రామమున ప్రారంభదశలో మొట్టమొదట రాష్ట్రకూటులే జయించిరి[3]. రాష్ట్రకూటుల విజయముతో వేంగీరాజ్యము భీమసల్కి కైవసమయ్యెను. అప్పటికి స్వరాజ్యసంపాదనమునకై విజయాదిత్యుఁడు తనపూనిక విడువక రెట్టించిన యుత్సాహముతోను, పట్టుదలతోను వైరులపైఁ దలపడుచు వచ్చెను. తుట్టతుద కాతఁడు ఖడ్గసహాయుఁడై భీమసల్కిని[4] అతనిపక్ష మవలంబించి వచ్చిన దక్షిణగంగబలమును, వల్లభేంద్ర దండనాయకులను నూటయెనిమిది యుద్ధములందు జయించి తుదకు వేంగీదేశమును స్వాధీనముచేసికొని నరేంద్రమృగరాజనియు, సమస్తభువనాశ్రయుఁ డనియు చాళుక్యార్జునభూపాలుఁడనియు, విక్రమధవళుఁ డనియు బిరుదుపేరుల ధరియించి తెలుఁగునాఁట చాళుక్య సింహాసనము నధిష్ఠించెను. మూఁడవ గోవిందరాజుయొక్క పరిపాలనాంత్య కాలమంతయు నట్లు వేంగీచాళుక్య సంగ్రామములతోఁ గడచిపోయెను. గోవిందరాజు ననంతరము క్రీస్తుశకము ౮౧౪-౧౫ లో రాష్ట్రకూట సింహాసనము నధిష్ఠించిన అతిశయధవళ, నృపతుంగ నామాంతరములంబరగు అమోఘవర్ష మహారాజు తండ్రి చూపిన త్రోవనే నడచి

1. గోవిందరాజుయొక్క ఆజ్ఞాప్రకారము కింకరునివలె వచ్చి సేవచేసినవాఁడు భీమసల్కియై యుండవచ్చునని మొట్టమొదట నూహించి తెలిపినవారు కీర్తిశేషులైన శ్రీకొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు. నాకీ యూహయే సరియైనదిగఁ గన్పట్టుచున్నది.

2. Ep. Ind. Vol. VI. pp. 244-45, Verse 19.    3 Ind Ant. Vol. VI, p. 71.

4. వేంగీరాజ్యము నీతఁడు బాలింపకపోవుటచేత నరేంద్రమృగరాజ విజయాదిత్యుని తరువాతిరాజు లీతనిని మొదటి చాళుక్య భీమునిగఁ బరిగణించియుండలేదు.

వేంగీచాళుక్య సంగ్రామములు తండ్రితో నంత రింపకుండునట్లు చూచెను. గోవిందరాజును, అమోఘవర్షుఁడునుకూడ నరేంద్ర మృగరాజ విజయాదిత్యునికిసమకాలికులే. అందువలన గోవిందరాజు చనిపోయినపిదపఁగూడ వేంగీచాళుక్యులకు రాష్ట్రకూటులయొత్తిడి తగ్గదయ్యెను. అమోఘవర్షుఁడుకూడ మూఁడవ గోవింద రాజువలెనే కడు పరాక్రమవంతుఁడు. సమర్థుఁడు. చెన్నుమాసిన రాష్ట్రకూటుల కీర్తి నీతఁడు మఱల నొక్కమాఱు తేజరిల్లునట్లు చేసెను. ఈతఁడే రాష్ట్రకూట రాజధానిని మాల్యఖేటమునకు మార్చినవాఁడు. ఈతని పరిపాలన ప్రారంభకాలమునసైతము అనఁగా రెండవ విజయాదిత్యుని పరిపాలనాంత్యకాలమున రాష్ట్రకూట, చాళుక్యవైరములు చాల ప్రబలముగ నుండెను.

కాని నరేంద్రమృగరాజ విజయాదిత్యుని కుమారుఁడగు నైదవ విష్ణువర్ధనుని సతీమణి రాష్ట్రకూటవంశ సంజాతయైన శీల మహాదేవి యని మనకు చాళుక్యశాసనములు తెలుపుచుండుటచేత నీమె మూఁడవ గోవిందరాజు యొక్కగాని, లేక అమోఘవర్షునియొక్కగాని కూఁతురై యుండవచ్చుననియు, గోవిందరాజామోఘవర్షులిరువురిలో నెవరో యొకరు వేంగీ చాళుక్యులతో పోరాడఁజాలక తుదకుఁ దమ కూఁతురైన శీలమహాదేవిని నరేంద్రమృగరాజ విజయాదిత్యుని కుమారుఁడైన అయిదవ విష్ణువర్ధనునికొసంగి పరిణయము గావించి వారితో సంధిచేసికొనిరనియు నూహింప నవకాశము కలుగుచున్నది. ఈ విధమున రాష్ట్రకూట, చాళుక్యవంశములు రెంటికి సంబంధబాంధవ్యములు కలిసినను ఉభయులకు అంతశ్శ్వైతములు మాత్రము పోలేదు.

అమోఘవర్షుని పరిపాలనప్రారంభదశలో రాష్ట్రకూటరాజ్యము చాళుక్యుల మూలమున మూలముట్టుగ పునాదులకంటఁ గంపించి పోయెననియేకాక యా ప్రభువరేణ్యుఁడే రాష్ట్రకూట రాజ్యలక్ష్మి చాళుక్య సముద్రమున మునిగిపోవ మఱలదాని నుద్ధరించెననియు నాటి శాసనములు తెలుపుచుండుటచేత ఆతఁడు గొప్ప పరాక్రమవంతుఁడనియు, ఆతనికి సమకాలికులైన వేంగీచాళుక్యులకు సరియైన ఉద్దియనియు నిశ్చయింపవచ్చును. ఈతఁడు వేంగీ చాళుక్యులను వింగవల్లి అనుచోట నోడించెనని క్రీ.శ. ౮౩౩ నాఁటి యొక రాష్ట్రకూట శాసనము తెలుపుచున్నది. ఈవింగవల్లి ఎచ్చటిదో తెలియరాదు. ఇది వేంగీపురమైయుండవచ్చునని కొందఱు తలంచుచున్నారు. కాని యందులకుఁ దగినయాధారము కానరాదు. ఈతఁడు వేంగీశ్వరునిచే పూజింపఁబడియె నని మఱియొక రాష్ట్రకూట శాసనము తెలుపుచున్నది. ఈవిషయములన్నియు రాష్ట్రకూటులకును, చాళుక్యులకును సంబంధ బాంధవ్యములు కలియక పూర్వము జరిగినవని విశ్వసింపవచ్చును. ఉభయ రాజవంశములకు వైషమ్యములు వదలకపోయినను, శాశ్వత సంధి కుదరకపోయినను ఈవివాహసంబంధ మూలమున తాత్కాలికముగనైన శాంతి చేకూరెనని యూహింపవచ్చును.

విజయాదిత్యుఁడు సమధిగత రాజవిద్యాచతుష్టయుఁడు. చతురుపాయ ప్రయోగచతురుఁడు. దుష్టనిగ్రహ, శిష్టానుగ్రహ కరుఁడు. పరమ బ్రహ్మణ్యుఁడు. పరమమాహేశ్వరుఁడు. రాష్ట్రకూటరాజగు గోవిందున కీతఁడు తగిన యుద్ధియగుటచేత రాష్ట్రకూటుల దండయాత్రలమూలమున వేంగీదేశము కలఁగి నలిగి పోయినను చాళుక్యాధికారమునకు రవంతయైన ప్రమాదము సంభవింపదయ్యెను. అది కడుంగడు పరాక్రమశాలురు, శౌర్యసాహసోపేతులునైన బలవంతులగు రాజపుంగవులను జూచినకాలము. అట్టి కష్టకాలమున నరేంద్రమృగరాజ విజయాదిత్యుఁడు రాష్ట్రకూటులవలనియపాయము బొరయకుండ చాళుక్య పాలీధ్వజమును బరిరక్షించి కృతకృత్యుఁడయ్యెను.

ఈ రెండవ విజయాదిత్యుఁడు గొప్ప శివభక్తుఁడు. పాపభీతి కలవాఁడు. రాష్ట్రకూటులతోఁడి యుద్ధములలో జనసంహారముఁ గావించినపాపముఁ బోఁగొట్టుకొనుటకై యుద్ధములు జరిగిన నూటయెనిమిది స్థలములందు తన పేర నూటయెనిమిది నరేంద్రేశ్వరాలయములను గట్టించి, అగ్రహార ప్రపారామ తటాకోపవనములను బ్రతిష్ఠించి, వెండిబంగారులతో అనేక పర్యాయములు తులాభారములు తూఁగి యా ధనమంతయు నిరుపేదలకు దానముచేసి వారి దారిద్ర్యమును నివారించి తండ్రితాతలు సముపార్జించినకీర్తికి వన్నెపెట్టెను. తెలుఁగు దేశమున నేడున్న నరేంద్రపురములు, నరేంద్రేశ్వరాలయములు వీటిలోఁ గొన్నియైన నీనరేంద్ర మృగరాజ విజయాదిత్యప్రతిష్ఠితములై ఉండవచ్చును.

రాష్ట్రకూట యుద్ధములలో నీ విజయాదిత్యునికి బోటి(ష్జ)మ, నిరవద్యేశవత్సలుఁడు, నృపరుద్రుఁడు, వెలనాటిచోళుల పూర్వుఁడైన మల్లియ - ఈ మొదలగువారందఱు బాసటమై నిలిచి వేంగీదేశము రాష్ట్రకూట ప్రతాపానలమున కాహుతికాకుండఁ గాపాడిరి. ఈ రెండవ విజయాదిత్యుఁడు క్రీస్తుశకము ౮౦౬ మొదలు ౮౪౬ వఱకు నలుబది సంవత్సరములు పరిపాలించి కీర్తిశేషుఁ డయ్యెను.

రెండవ విజయాదిత్యుని పిదప వేంగీ చాళుక్య సింహాసనము నధిష్ఠించినవాఁడు (అయిదవ) విష్ణువర్ధనుఁడు. ఈతనిభార్యయే రాష్ట్రకూటాన్వయసంజాతయైన శీల మహాదేవి. ఈతఁడు తండ్రితోపాటు రాష్ట్రకూటులతో జరిగిన మహాయుద్ధములలో పాల్గొనినవాఁడు. ఈతఁడు గొప్ప నయవేత్త: సమస్తాయుధములతో యుద్ధముచేయుటలో నీతఁడు మిక్కిలి నేర్పరి యగుటచేత నీతనికి కలివిష్ణువర్ధనుఁ డని పేరువచ్చెను. రాష్ట్రకూటుల యుద్ధముల మూలముననో లేక మఱి యే కారణముననో కాని ఈతఁడు ఒకటిన్నఱ సంవత్సరము మాత్రమే వేంగీదేశమును బరిపాలించెను. ఈతనికి అమోఘవర్షుఁడును సమకాలికుఁడే. ఇంతకంటె నీతనిని గుఱించి మన కెక్కువ విశేషములు తెలియరావు. ఇతని కాలమునాఁటి తామ్రశాసనము లింతవఱ కొక్కటియు బైలుపడలేదు.

ఇతనికి (మూఁడవ) విజయాదిత్యుఁడు, విక్రమాదిత్యుఁడు, యుద్ధమల్లుఁడు, నృపకాముఁడు అని నలువురు కుమారులు కలరు. ఈ నల్వురిలో బాహుబలపరాక్రమవంతుఁడు,

శౌర్యసాహసోపేతుఁడు నగు మూఁడవ విజయాదిత్యుఁడు తండ్రియనంతరము క్రీస్తుశకము ౮౪౮ లో రాజ్యమునకు వచ్చెను. ఈతని శాసనముల ననుసరించి విక్రమాదిత్య, నృపకాము లిరువురును ఈతని కనుకూలురుగ నుండినట్లు తెలియుచున్నది. ఇఁక నీతని సోదరులలో మిగిలినవాఁడు యుద్ధమల్లుఁడు. ఈతఁడు తన సన్నిహితబంధువుల సహాయ, ప్రోత్సాహముల మూలమున రాజ్యముకొఱకు కాశపడి తన సోదరుఁడైన విజయాదిత్యునితోఁ గలహించెనేమో మనకుఁ దెలియదు కాని విజయాదిత్యుఁడు సింహాసనమునకు వచ్చునప్పటికి మాత్రము దేశమునం దల్లరులు రేఁగెననుట కాధారములు కలవు.

ఆకాలమున చాళుక్యరాజ్యమునకు దక్షిణముననున్న దేశమంతయుఁ జాల కలవరముగ నుండెను. అప్పటికప్పుడే కాంచీపుర పల్లవరాజ్యము దక్షిణమున మధురపాండ్యుల యొక్కయు, పశ్చిమమున రాష్ట్రకూటుల యొక్కయు, గాంగులయొక్కయు, ఉత్తరమున చాళుక్యులయొక్కయు ఒత్తిడిమూలమున అడకత్తెరలోని పోకచెక్కవిధంబున నలుగుడువడి చిద్రుపలుచిద్రుపలై క్షీణించెను. ఈవిధమున నది క్షీణించుచుండిన కాలమున పల్లవులసంతతిలోనివార మని చెప్పుకొనినవారలే యొకకొందఱు ప్రబలులై యదివఱకు వారేలిన దేశమున నధికారము నెఱపఁజొచ్చిరి. వీరిశాసనములు చెంగల్పట్టు, ఆర్కాడు తంజావూరు, తిరుచునాపల్లి మండలములందుఁ గన్పట్టుచున్నవి. కొందఱు చరిత్రకారులు వీరికి గాంగపల్లవు లని పేరిడిరి కాని వీరు పల్లవులలోని వారేయగుట తన్నామమునకు భిన్నమైన లేక యతిరేకమైన నామమున వీరి సంకేతముచేయుట యనవసరమని కొందఱి యభిప్రాయము. గాంగపల్లవు లనబడు వారు గాక పల్లవులలోనివారే మఱికొందఱు మైసూరులోని యుత్తరభాగమున నున్న చితల్‌దుర్గమండలమును, అనంతపురమండలములోని దక్షిణ, పశ్చిమభాగములంగల హిందుపుర, మడకశిర తాలూకాలను ఆక్రమించుకొనిరి. ఈతెగపల్లవులను చరిత్రకారులు నోలంబ లేక నోలంబ లేక నోనంబ లేక నోడంబపల్లవులందురు. వీరినిబట్టియె వారాక్రమించుకొనిన దేశమునకు నోలంబవాడి యనిపేరు కలిగెను. ఇది ముప్పదిరెండువేల దేశము. గాంగపల్లవులును, నోలంబపల్లవులునుకూడ కాంచీపురపల్లవ రాజ్యాంత్యకాలమున బలవంతులై ఆయాయి దేశములనధికారము నెఱపినవారలే. నోలంబపల్లవరాజ్యము నెల్లూరు మండలములోనికి వ్యాపింపకపోయినను గాంగపల్లవరాజ్యము మాత్రము నెల్లూరుమండల దక్షిణభాగమంతయు వ్యాపించెనని చెప్పవచ్చును. అరుదుగనైన వీరిశాసనములు నెల్లూరుమండల దక్షిణభాగమునఁ గాన్పించుట చూడ వీరిరాజ్యము నెల్లూరుపురమువఱకు వ్యాపించి వేంగీచాళుక్య రాజ్యమునకు దక్షిణపు సరిహద్దుగనుండెననికూడ నూహించుట కవకాశముకలుగుచున్నది. విజయాదిత్యునికాలమున నీగాంగపల్లవులును, నోలంబపల్లవులునుగూడ దక్షిణగాంగులకు మిత్రులుగనేయుండిరి. అందు

గాంగపల్లవు లొకవేళ స్వతంత్రులుగనే పరిపాలించుచుండినను నోలంబపల్లవులు మాత్రము వారికి సామంతులై తుదకు వారితో సంబంధబాంధవ్యములుకూడ నెఱపి వారితోడ్పాటు మూలమున రాజకీయముగ నభివృద్ధిలోనికి వచ్చుచుండిరి. చాళుక్యరాజ్యమునకు దక్షిణమునను, నైఋతిదిక్కునను పైనుడివినవారలే గాక మఱికొందఱుకూడ నుండిరి. వారిని బాణులని, వైదుంబులని యందురు. ఇప్పటి చిత్తూరుమండలముయొక్క దక్షిణభాగము, మైసూరులో నుత్తరమున చితల్దుర్గమండలము ప్రక్కతూర్పుగనున్న కోలారుమండలము, అనంతపురమండలములోని కొంతభాగము-ఇదియంతయు నొకప్పుడు బాణులాక్రమించిన దేశమే. దీనికే పెరుంబానప్పాడి యని పేరు: అనఁగా పెద్దదైన బాణరాజుల దేశము.

* వైదుంబులు చిత్తూరుమండలములోని పశ్చిమోత్తరభాగమున, అనఁగా ముఖ్యముగ మదనపల్లి తాలూకాలో రాజ్యమేలుచుండిరి. విజయాదిత్యుని కాలమునాఁటికిఁ దమతమ రాజ్యములను విస్తరింపఁజేసికొను సందర్భమున నీబాణులు, వైదుంబులు, నోలంబులు—నిరంతరము నొండొరులతోఁ గలహించుచుండిరి. దక్షిణాపథమున నెనిమిది, తొమ్మిది శతాబ్దముల గొప్ప సామ్రాజ్యములను స్థాపించినవారు రాష్ట్రకూటులు, వేంగీచాళుక్యులుమాత్రమే యని యీవఱలోఁ జెప్పబడినది. అందు చాళుక్యులు నెల్లూరువఱకే గాని అంతకుదిగువ దేశముపై దాడి వెడలినవారు కారు. రాష్ట్రకూటు లట్లుగాక దక్షిణమున కాంచీపురమువఱకుఁగూడ నెత్తివెళ్లి పల్లవులను, గాంగులను జయించి తమకు సామంతులుగఁజేసికొనిరి. కాని రాష్ట్రకూటులలో బలహీనులు బయలుదేఱినపుడు గాంగపల్లవులు బలవంతులై తమ చుట్టుప్రక్కల నున్నవారిని లోఁబఱుచుకొనుచు వచ్చిరి. ఈవిధమున గాంగులైననేమి, బాణులైననేమి, నోలంబులైననేమి, వైదుంబులైననేమి—వీరలెల్లరు బలవంతులైన రాజులకు లోఁగిపోవుచు, బలహీనులను ధిక్కరించి స్వాతంత్ర్యమును బ్రకటింపుచు నిట్లు కాలము గడపుచుండిరి. ఇట్లుండ గాంగపల్లవులను జయించి వారిరాజ్యము నాక్రమించుకొనుటకై దక్షిణమున మధురపాండ్యులును, తంజావూరు చోళులును పదింబదిగఁ బ్రయత్నములు సలుపుచుండిరి. ఈవిధమున విజయాదిత్యుఁడు సింహాసనమునకు వచ్చునప్పటికి చాళుక్యరాజ్యమునకు దక్షిణమున గొప్ప సామ్రాజ్యమును నిర్మించుటకై పలువురు పగపంతములను బాటించి పట్టుదలతోఁ బ్రయత్నములు సలుపుచుండిరి. సామ్రాజ్యసంస్థాపనోద్యమతత్పరుల కార్యదీక్షకు నెనిమిదవ శతాబ్దమున దక్షిణాపథమునందలి యుత్తరభాగమెట్లు రంగస్థల మయ్యెనో యట్లే తొమ్మినవ శతాబ్దము కడపటిభాగమున దక్షిణాపథపు దక్షిణభాగము రంగస్థలమై తనర్చెను. ఈవిధమైన ప్రయత్నములలో ముందు ముందు మహోన్నతదశనందఁగల చోళమహాసామ్రాజ్యమునకు పరకేసరివర్మ బిరుదాంకితుఁడైన విజయాలయుఁడు పునాదులు వేసినను గాంగులుకాని, నోలంబులుకాని, మఱియెవ్వరుకాని యాతనికి మన విజయాదిత్యుని కాలమున

లోఁబడియుండలేదు. ఈవిధమైన ప్రయత్నములలోనే నోలంబులు బాణులను ఒకమూలకుఁ దఱిమి తమరాజ్యమును విస్తరింపఁ జేసికొనుచుండిరి.

వేంగీచాళుక్యరాజ్యమునకు దక్షిణమున నుండిన దేశమంతయు నీవిధమున సంక్షోభించియున్నకాలమున ప్రాయశః దక్షిణపు సరిహద్దులనుండు మన్నెదొరలును, కొండదొరలును అగు ఆటవికులైన బోయరాజులు అప్పుడప్పు డాకస్మికముగ చాళుక్యభూపతుల రాజ్యముపై నెత్తివచ్చుచు, చాళుక్యరాజ్యశాంతికి భంగము కలిగించుచు, వీలు చిక్కినయెడల వేంగీవిషయమునుగూడ నాక్రమించుకొనుటకుఁ బ్రయత్నింపఁజొచ్చిరి. ఈ విధమైన యీ 'బోయ'రాజుల యల్లరులకు విజయాదిత్య సహోదరుఁడైన యుద్ధమల్లుఁడైనఁ గారణము కావచ్చును లేదా దక్షిణదిక్కునను, పడుమటి దిక్కునను వేంగీచాళుక్య రాజ్యమునకు సరిహద్దులనున్న పల్లవులో లేక గాంగప్రభువులోయైనను కారణము కావచ్చును. అదియునుంగాక యొకవేళ నీబోయరాజులు వేంగీచాళుక్యులకు శత్రువులైన పల్లవ ప్రభువులకు లోబడిన సామంతమండలికులైనఁ గావచ్చును. ఎట్లయినను ఈ బోయరాజుల అల్లరులకు ఎవరు కారణభూతులు అన్న విషయము నిదమిత్థమని నిర్ణయింపలేము.

విజయాదిత్యుని పరిపాలనప్రారంభకాలము నందలిబోయ యుద్ధములలోను, ఇతర శత్రువుల తిరుగుబాటులలోను ఆతనికి సహాయభూతుఁడైనవాఁడు కడెయరాజు అనునతఁడు. ఇతఁడు విజయాదిత్యమహీపతికి విశ్వాసపాత్రుఁడైన మిత్రవర్యుఁడై, పరమవిధేయుఁడైన భృత్యుఁడై, ఆలోచనలుచెప్పు మంత్రియై పేరుకెక్కిన వాఁడు. తుట్టతుద కీతఁడీ యుద్ధములలోనె విజయాదిత్యునికి బాసటగ నిలిచి తన శౌర్యపరాక్రమములంజూపి స్వామి హితమునకై జీవిత సర్వస్వమును ధారవోసి రణరంగమున వీరశయనము నలంకరించెను. ఈకడెయరాజుపైఁ గలప్రేమాతిరేకంబున భృత్యధర్మనిర్వహణమునందును, వినయ విధేయతలందును దండ్రియంతటివాఁడును, శౌర్య, సాహస పరాక్రమంబుల నాతనిని మించినవాఁడు నగు నాతని కుమారుఁడు పాండరంగనికి సర్వసైన్యాధిపత్యము నొసంగెను. విజయాదిత్యుఁడు తన పరిపాలనమున ప్రథమ సంవత్సరముననే పాండరంగనికిఁబట్టము కట్టినట్లు శాసన దృష్టాంతములవలనఁ దెలియవచ్చుచుండుటచేత కడెయరాజు మరణానంతరమే పాండరంగనికి సర్వసైన్యాధిపత్యము లభించెననియు, కడెయరాజుయొక్క తోడ్పాటు మూలమున సంపాదించుకొనఁ గల్గిన రాజ్యమును గుణకవిజయాదిత్యుఁ డాతనికుమారుని సహాయమున నిలుపుకొనఁ గలిగెననియు నూహించుట సమంజసము.

వేంగీచాళుక్య సైన్యమునకు నధిపతియైన నాఁటంగోలె పాండరంగప్రభువు మూఁడవవిజయాదిత్యునిఁ గుడిభుజమై శాత్రవకుతంత్రముల భగ్నముఁ గావించుచు, రిపుసైన్యము నోడించి వారిదుర్గములను బట్టుకొనుచు, నిర్వక్రపరాక్రమంబుఁగల్గి త్రిభువనాంకుశుల పాలీ

ధ్వజము పూర్వసముద్రతీరమున నిరాతంక ముగ నిరంతరము రెపరెపలాడునట్లుచేసి విజయాదిత్యునికిఁ గడుంగడు ప్రేమాస్పదుఁడై తుదకు కటకాధీశుఁడయ్యెను. నాఁటనుండియు పాండరంగని వంశమువారు వేంగీచాళుక్యుల కడ మంత్రులై, సైన్యాధిపతులై, హితులై ప్రసిద్ధికెక్కిరి. ఈపాండరంగనిబట్టి యేమో పండరంగనివారని యొకకొందఱ కాంధ్రదేశమున ప్రఖ్యాత పౌరుషనామ సూచకమైన యింటిపేరు కలిగెను.

విజయాదిత్యుని ప్రారంభకాలమున నీ పాండరంగప్రభుని విజయములనుదెలుపు శాసనములు ఒంగోలు తాలూకాలోని అద్దంకి ధర్మవరము ప్రాంతములను, కందుకూరుతాలూకాలోని కందుకూరు ప్రాంతములను గనఁబడుచున్నవి. అతఁడు 'కొలఁదిలేని బోయకొట్టములు' పండ్రెండు సాధించినట్లు ఈశాసనములందుఁ గలదు కావునే ఆబోయరాజులు ప్రాయశః నెల్లూరుమండలములోనివారైయుండురని యూహించుట కవకాశముకలుగుచున్నది.

ఇట్టి యూహాకు మఱియొక యాధారము కూడఁ గలదు. ప్రసిద్ధమైన యొకకోటక్రింద నుండు దేశమునకు కొట్టమని పేరు: అనఁగా కోటను ప్రధానస్థానముగఁ జేసికొనిన ప్రభువు ఆకోటక్రిందనుండు దేశమునంతను బరిపాలించును. ఈ కొట్టమే తెలుఁగున కొట్టామయ్యెను: కొట్టామన దేశము. వేంగీచాళుక్య రాజ్యమునకు దక్షిణముననుండు తొండమండలమున అనఁగా పల్లవరాజ్యమున కొట్టములు,నాడులు అను పేరుగల దేశపరిపాలనా విభాగములు కలవు. ఒక్కొక్క కొట్టముక్రిందఁ బెక్కునాడు లుండును. పల్లవుల తరువాత రాజ్యాధికారమును నెఱపిన చోళులుకూడ నీ పరిపాలనావిభాగములను పాటించి కొట్టములపై మండలములనుగూడ నేర్పాటుచేసిరి; అనఁగా నొక్కొక్కమండలమున పెక్కుకొట్టములు, నొక్కొక్క కొట్టముక్రింద పెక్కునాడులు నుండును. పల్లవరాజ్యము నెల్లూరుదాక వ్యాపించియుండిన కారణమున నీకొట్టములు నెల్లూరుమండలముననుగాన్పించును. నెల్లూరు మండలములోని వెంకటగిరితాలూకా తొండమండలం సీమయని క్రీ.శ. ౧౮౧౫ వఱకుఁ గూడ దానపత్రములలో పేర్కొనఁబడియున్నది. అందువలన కొట్టములనునవి ముఖ్యముగ పల్లవరాజ్యములోనివి గనుక పాండురంగఁడు జయించిన బోయకొట్టములు నెల్లూరు మండలములోనివనియు, నీ బోయరాజులు గాంగపల్లవులకు సామంతులుగ నుండియుండురనియు నిశ్చయింపవచ్చును.





# అధిక్షేపము

వెలగపూడి దానయ్యచౌదరి గారు

సునిశిత కుఠారధారణ! మనుజేశ్వర నికరహరణ! మండితవీర్యా!
జననీ కంఠవిదారణ! వనజోద్భవ వంశజనిత! భార్గవరామా!

క. ఎవఁడోయొక కులనాశకుఁ, డవివేకితఁ జేసినట్టి యపకృతి కొఱకై
భవదీయ విప్రకుల గౌరవముల్ భువిఁ గల్పితేమి? రామా! విపులన్.

క. పరమతపో నిరతుఁడు సత్కారుణుఁడు జమదగ్నిమునికి గలిగియు ధరణీ
సురకులము మఱచి క్రూరత, శిరములు దెగనఱకుటేమి చేతలు రామా!

శా. పాపం బంచణుమాత్రమైన మదిలో భావింపకే క్రూరతన్
బాపం బేమి యెఱుంగనట్టి నృపులన్ బల్మాఱు వెంటాడి నీ
కోపం బెల్ల నశింప మస్తకముల్ గొడ్డంటఁ దున్మాడుచున్
రూపున్మాపితి వింతమాత్రమున నారూఢత్వముల్ గాంతువే.

సీ. జపము సేయుటమాని యపకృతి మదిఁ బూని, దారుణత్వ మొనర్పఁ దలఁచినావు
ఆమ్నాయమును రోసి యాగ్రహంబును దాల్చి, నిర్దయత్వముఁ బూని నిలిచినావు
చర్మాసనము డిగ్గి సమరస్థలం బెక్కి, యట్టహాస మొనర్చి యఱచినావు
అక్షమాలను వీడి యాయుధంబు ధరించి, సివమెక్కి నృపతులఁ గలిసినావు
గీ. ఇరువదొకమాటు శిరముల నఱకినావు, తివిరి రక్తంబులో మున్గి తేలినావు
పరమక్రూరుండవని పేరు వడసినావు, పరశురామ! యిదెక్కడి పాపమయ్య

సీ. అఘమర్షణస్నాన మాడు నీరము భాతి, రాజుల గాత్రాళి రక్తమెల్లఁ
గట్టుకొనంబడు కాషివస్త్రము భాతి, రాజరక్తార్ద్ర వస్త్రంబు మిగులఁ
బూజలు గావించు పుష్పాళి భాతిని, రాజసంఘంపు శిరంబులెల్ల
భక్తితో జపియించు వరమంత్రముల భాతి, పటుక్రోధమునఁ బల్కు పల్కులెల్లఁ
గీ. జేసి; జమదగ్ని నామంబుఁ జెఱచివైచి, భూసురత్వంబు నెల్లను బుగ్గిజేసి
పరమక్రూరుండవని పేరు వడసినావు, పరశురామ! యిదెక్కడి పాపమయ్య.

గీ. గండ్రగొడ్డలి చేఁ దాల్చి క్రౌర్యమూని, ధర్మపథమును విడనాడి తలలఁ దునిమి
రాజవరు లేలఁదగినట్టి రాష్ట్రమెల్లఁ, బాఱులకొసంగు టది యెట్టి పాడియయ్య.

గీ. సత్యశౌచదయాధర్మ శమదమాది, విప్రధర్మంబులను వీడి వెఱ్ఱివగుచుఁ
క్రూరబుద్ధిని వహియించి గొంతు లూడ్చి, పరశురామ! గడించిన ఫలము గలదె?

ఆ. ఫలము పూజ్యమయ్యెఁ బాడు పేరా వచ్చెఁ, జిత్తశాంతిపోయెఁ జెడియె కులము
అక్కటకట! యెంత యధమత్వ మొనఁగూడె, బాహుబలవిశాల పరశురామ!

# ప్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులు కారా?

చిలుకూరి వీరభద్రరావు గారు

(౨ సంపుటము ౬ సంచిక తరువాయి)

ఎక్కడిమేరువు? ఎక్కడియంధకారదేశము? ఎక్కడిసుమేరియనులు? ఓహో! ఇదేటి బాదరాయణసంబంధము? అని చదువరులు ప్రశ్నింపవచ్చును. ఇయ్యది నేను గల్పించిన క్రొత్తసిద్ధాంతము గాదు. శ్రీ వేంకటరంగయ్యగారిచే శ్లాఘింపఁబడిన సుప్రసిద్ధ పరిశోధకు లగు కాశీప్రసాద జయస్వాలుగా రిట్లు వ్రాయుచున్నారు :—

"ప్రాచ్యప్రాచీనచరిత్రమునఁ బ్రామాణికాగ్రగణ్యు లగు 'హాల్' (Hall) గారు ద్రావిడహిందువులే సుమేరియనులను సిద్ధాంతము నిపుడు ముందునకుఁ దెచ్చుచు నిట్లు వ్రాయుచున్నారు :

The ethnic type of the Sumerians so strongly marked in their statues and reliefs, was as different from those of the races which surrounded them as was their language from those of the Semites, Aryans, or others; They were decidedly Indian in type... He was very like a Southern Hindu of the Deccan......

"మనుష్య శిలావిగ్రహము లందును, ఉబికి యుండినట్లు చెక్కఁబడిన చిత్రపుం బనులయందును స్పష్టముగాఁ గన్పట్టెడు సుమేరియను జాతివారి యాకారస్వరూపములు, ఆర్యులు, సెమిటీయులు, (Semites) తదితరుల భాషలతో వారిభాష భేదించిన విధముగానే వారిజాతి భేదించినదిగా నుండెను. వారివిగ్రహములు నిశ్చయముగా భారతీయుల మాదిరినుండెను...... ... అతఁడు దక్షిణాపథమందు (Deccan) నివసించెడి దక్షిణ హిందువుంబోలియుండెను."

ఇట్లు వారు వ్రాసినదానిని వక్కాణించి జయస్వాలుగారు 'The Southern Connection is established' దక్షిణ సంబంధము స్థాపింపఁబడినది.' అని వ్రాసినారు.[1]

ఒకింతకాల మీవిషయమటుండ నిత్తము. మనమిత్రులు వేంకటరంగయ్యగారు పదునాలుగవ శతాబ్దిలోఁ, గొండవీడు, రాజమహేంద్రపుర, రాజ్యములను బరిపాలనము చేసి వాసిగాంచిన రెడ్డిరాజులను శుద్ధాంధ్రులనిరిగదా! వీరిభాషలో శుద్ధాంధ్రులననేమి?

1. The Journal of the Behar and Orissa Research Society Vol. VI, part II, page 194.

శుద్ధనిషాదులనుమాట. ఎక్కడను మార్పులేని నిషాదజాతియని యర్థమేగద? ఇదెంతవఱకు సత్యసమన్వయమునకుఁ దోడ్పడఁగలదో యొకింత పరిశీలింతము. ఈ రెడ్డిరాజులు పంటరెడ్లని మన గ్రంథములలో వర్ణింపఁబడియున్నారని మన మెఱుంగుదుము. కాఁబట్టి వీరు కృషికులు (పంటకాపులు). కృషిశబ్దముయొక్క వైకృతము 'కిషన్ లేక కుషన్' అనునది. ఏమికారణముచేతనో వీరిలోఁ దఱుచుగా వేమనామమె కనుపట్టుచుండెను. 'వేము' అనఁగా, తెలుఁగులో వేపచెట్టని యర్థముగాదు గాని మఱియొకయర్థము గానరాదు. వీనిలో 'నేలవేము' తురకవేము అని రెండు విధముల యిన జాతిభేదములు గలవు. వీరిలో పోలయవేమ, అన్నయవేమ, కోమటివేమ, రాచవేమ, కాటయవేమ' అని వేమనామములే పెక్కులు వినంబడుచున్నవి. క్రీస్తుశకమునకు నొకశతాబ్దికిఁ బూర్వముననో ఒకశతాబ్దికిఁ బరముననో హిందూదేశముపై దండెత్తివచ్చి పశ్చిమోత్తర ప్రదేశముల నాక్రమించి పరిపాలనము చేసిన 'కుషన్' తెగరాజులలో నొకవేముఁడు గనుపట్టుచున్నాఁడు. 'వేమకాడ్ఫిసెస్' (Wema Kadphises) అని అమ్మహారాజునకు నామము. వీనితండ్రి కుశుఁడు. 'వేమ' అనునది నిజమైన నామము. 'కాడ్ఫిసెస్' అనునది బిరుదము. ఈపద మైరేనియను భాషాపదమని డాక్టరు థామస్‌గారు వక్కాణించుచున్నారు. (J. R. A. S. 1913, 633) కాడు అనఁగా ముఖ్యుఁడు లేక మొనగాఁడు iChef అని యర్థము దెలిపినారు. ఈకుషన్ రాజులలో బ్రసిద్ధులు కుశుఁడు వేముఁడు, కనిష్కుఁడు, హావిష్కుఁడు, వాశిష్కుఁడు, విజయకీర్తి, వాసుదేవుఁడు మొదలగువారు. వీరెవరు? ఈకుషనులకు మనకుషనులకు సంబంధ మేమైన యుండునా? లేదా? అనునవి చర్చాంశములై యున్నవి. వీరినిగూర్చి చరిత్రకారులును, పరిశోధకులును భిన్నాభిప్రాయముల వెలిపుచ్చి యున్నారు. సుప్రసిద్ధులయిన జయస్వాలుగారు తామేదియు నిర్ధారణ చేయక వీరికి సమకాలీనులై హిందూదేశములో నివసించెడివారు వీరిని శాకులనుగఁ దెలిపిరని వ్రాయుచు "Equally, for a Mongolian or Persian or even mixed origin, arguments can be adduced" మంగోలులనికాని, పారశీకులనికాని, మిశ్రులనికాని హేతువులను సమానముగాఁ జూపవచ్చును" అని వ్రాసియున్నారు[1]. కల్హణపండితుఁడు తన రాజతరంగిణిలో కనిష్కాదులను తురుష్కులని చెప్పియున్నాఁడు. తురుష్కులన్న మాత్రముచేత మహమ్మదీయులని చదువరులు దుర్భ్రమఁ జెందరాదు. అప్పటికి మహమ్మదుగారు పుట్టియుండలేదు. వారవలంబించిన మతము హిందూమతమే. మన యైతిహ్యములు సంప్రదాయములను బట్టి వీరిని హిందువులకన్న భిన్నులనుగఁ జూడఁజాలము. భరతవర్షమునుండి యుత్తరకురుభూములకుఁ బోయిన తెగలవారి నెల్లరను హిందువులకన్న భిన్నజాతులనుగా నెంచి పాశ్చాత్య చరిత్రకారులు పెక్కండ్రు హిం

(1) J. B. O. R. S. Vol vi Part ii Page 2I.

దూదేశమెల్ల కాలము విజాతీయుల దాడుల కాలవాలమై యెల్లప్పుడును పారతంత్ర్యమున మునింగియున్నట్లుగా చిత్రపటము నొకదాని జిత్రింపుచు వచ్చినారు. వీరిసిద్ధాంతములు క్రమమైనవి గావని యిప్పు డిప్పుడె తెలిసి కొనుచున్నారము. ఉత్తర మధురానగరము నందలి చిత్రవస్తు ప్రదర్శనశాలయం దుంచఁబడిన యొక 'కుషన్' రాజు సింహాసనము మీఁదఁ గూర్చున్నవిధముగాఁ జెక్కఁబడిన యొక శిలావిగ్రహపీఠముమీఁది శాసనమును (కాశీ ప్రసాదజయస్వాలుగారు చదివినదాని) ఈదిగువ నుదాహరించుచున్నాను.

"మహారాజో రాజాధిరాజో దేవపుత్రో కుశనపుత్రో షహి (షా?) వేమతక్షుమస్య బర్కణపతినహామ-క్ష-నో దేవకులకారితా ఆరామోపుష్కరుణి ఉదపానచస(ం)వ-6. మతకో" (J. B. O. R. S. Vol. vi, part ii, page 14)

ఈ శాసనమునుగూర్చి వీరు విశేషముగాఁ జర్చించి యున్నారు. ఇయ్యది రాజాధిరాజయిన వేమమహారాజు యొక్క శాసనము. ఈరాజునకు 'తక్షుముఁడు, బర్కణపతి' అనునవివిశేషణములుగాఁ జేర్పఁబడినవి. వీనిలో 'తక్షమ' శబ్దమున కర్థము తెలిసికొనఁగోరి కలకత్తాలో ఇంపీరియల్ లైబ్రరిలో శబ్దశాస్త్రజ్ఞులుగనున్న 'వాన్‌మనేన్' అనువారికి జయస్వాలుగారు వ్రాయఁగా: ప్రాచీనపహ్లావీ (జెండు) భాషలో 'తక్షమ' శబ్దమునకు 'ధైర్యశాలి' అని యర్థము గలదని వ్రాసినారఁట. మఱి యును బర్కణపతియన జయస్వాలుగా రిట్లర్థముచెప్పుచున్నారు. 'వర్క-హుమ' అను రెండుశాఖలుశాకులలో గలవఁట. దరియవసు Darius శాసనములలో 'శకాహౌమవకా' యని యుదాహరింపఁబడి యుండెనట! కనుక నా రెండు శాఖల కధిపతియైనవాఁడని యర్థము చెప్పినారు. కుషన్‌రాజులకు బంధువులై వారి సామంతకోటిలోఁ జేరిన పశ్చిమక్షాత్రపరాజులను (ఖగారాట వంశజులను) శాకులనుగ హిందూవిలేఖకులు వక్కాణించి యున్నారు. పైనివక్కాణించిన వర్క లేక వక్క లేక వకకుల మాంధ్రులలో నుండుటచేతనే యాంధ్రభాషలో వక్క, బక్క, వక్కుపులుగు, (బకము) వకవకలు, పకపకలు, బకబకలు, బెకబెకలు, బగబగలు, వక్క (వక్కాకులు) వక్కణము, వక్కాణము, వక్కరము, వక్కరింపు, వక్కాణింపు, వక్కు, వక్కికట్టె మొదలగు శబ్దజాలము పుట్టినది. వకశబ్దము సంస్కృతములో బకశబ్దమైనది. బకాసురుఁ డీబకులలోనివాఁడె. సంస్కృతములోని వాకు, వాక్కు, వకుశము మొదలగు శబ్దజాలమంతయు నీ శాఖ వలనఁ గలిగినదని విశ్వసింపవచ్చును. సముద్రగుప్తుని శాసనములోఁ దైవపుత్రషాహి షాహానుషాహి శకమురుండ యని యొకకుషణరాజు ప్రస్తావింపఁబడియుండెను. మరుండ లేక మరుండ యనునది శకజాతిలో నొక యంతశ్శాఖయై యుండవచ్చునని జయస్వాలుగారి యభిప్రాయమైయున్నది. ఆసేతు హిమాచల మధ్యమునంగల యేకులమువారయినను సరే నాగరికు లయినను సరే యనాగరికులయినను సరే వారి యనాగరికతను, నాగరికతనుగూడ సూచించు శబ్దజాల మెంతయో హిందూదేశ



కల్లేపల్లి దేవాలయము

ఈదేవాలయము కృష్ణామండలమునఁగల దేవరకోటసంస్థానమునకు సంబంధించిన కల్లేపల్లిగ్రామమునఁగలదు. ఇచట ప్రతివత్సరమును మహాశివరాత్రికి గొప్పయుత్సవము శ్రీ చల్లపల్లిరాజాగారివలన జరుపఁబడుచుండును.



కల్లేపల్లి దేవాలయ గోపురము

ఇది మిక్కిలి శిల్పనైపుణ్యమును ప్రదర్శించునదియై చక్కఁగ నుండును. దీనిప్రాంగణమున మంచితటాకముగలదు.



శివగంగ దేవాలయము, బందరు

శ్రీ దేవరకోటసంస్థానాధీశ్వరులు అంకినీడుగారు (1815—1819) దీనిని నిర్మించిరి



శ్రీకాకుళ దేవాలయగోపురము

భాషలలోఁ గానుపించును. ఈ శబ్దజాలమును విచారించినపుడాకులములపరిణామాభివృద్ధులు కాలము ననుసరించి మనము తెలిసికొనుట కవకాశము గలదు. క్రమమైన చరిత్రము వ్రాసిపెట్టియుండకపోవుటచేత కాలనిర్ణయము చేయుటలో మాత్రము పొరపడుచుందుము. ఆయాకులములలో నుండు పరస్పర స్పర్థలు, వైషమ్యముల మూలమున నేవిషయమును బరిశోధింపఁ బూనుకొన్నను, అనుకూల ప్రతికూలపక్షములు గానుపించి సత్యమును దెలిసికొనుటకు సాధ్యము గాకుండఁ జేసి మనస్సును విశేషముగాఁ గలవరపెట్టుచుండును. మనము సత్యము చెప్పవలసివచ్చినపుడు వీనిని మనము బహుజాగరూకతతోఁ బరిశీలించి మఱి చెప్పవలయును. ఎంత జాగరూకులమై పరిశీలించినను ఒకప్పుడు భ్రమప్రమాదములకు లోనగుచుందుము. ఎంత శక్తిసామర్థ్యములుగల పరిశోధకుని పరిశోధనమునందయినను భ్రమప్రమాదజనితములయిన దోషము లుండకమానవు. ఏదియో యొకదోష మున్నంత మాత్రముచేత వారిపరిశోధనమంతయు నిరర్థకమైనదియు, వ్యర్థమైనదియు, సత్యదూరమైనదియు నగునా? ఎన్నఁడును గాఁబోదు. ఇప్పుడు కుషనులనుగూర్చి తెలిసికొనఁగోరి కొంత చర్చచేయుచున్నాము. ఈకుషనుల శాసనములలో కుషన్ రాజులకు బిరుదములుగాఁ జేర్పఁబడిన 'కాడ్ఫిస్, కాడ్ఫేస్ లేక కాడ్ఫిసేస్' అను శబ్దములనుగుఱించి కొంత వఱకు తెలిసికొనఁ బ్రయత్నించి చూతము. ఈపదము లైరేనియన్ భాషాపదములని జయస్వాలు మొదలగువారు తలంచిరి. కాని ఇయ్యవి ద్రావిడభాషాపదములే యని నాయభిప్రాయము. 'కాడు + పేస్' అని విడదీసి 'కాడు' అనఁగా Chief (మొనగాఁడు) అని డాక్టరు థామస్సుగా రర్థము చెప్పినారు. ఈ యర్థము నేనధిక్షేపింపకయె మఱికొంత వ్యాఖ్యానముచేయుదును. మన తెలుఁగు భాషలో కాఁడు లేక గాఁడు అనునది పుంప్రత్యయముగా శబ్దములకుఁ జేర్పఁబడుచున్నది. అందగాఁడు, సొగసుకాఁడు, వన్నెకాఁడు, మొనగాడు, మొదలగువానిని జూచుకొనునది. ఈకాఁడు లేక గాఁడుయొక్క పూర్వరూపము కాండు లేక గాండునై యున్నది. మన దేశములో గాండ్లజాతిగలదు. ఈగాండులనుబట్టియె మన దేశభాషలలో విశేష శబ్దజాలము ప్రవేశించియున్నది. తక్కువ తరగతులనఁగా మాలమాదిగలను తదితరులను పేరులుపెట్టి వ్యవహరింపవలసివచ్చినపుడు మనము వారిని రామిగాడు, సుబ్బిగాఁడు, సోములుగాఁడు, లచ్చిగాడు, కిష్టుగాఁడు, గోవిందుగాఁడు, సత్తిగాఁడు' అని యీవిధముగాఁ గాఁడు ప్రత్యయమును జేర్చి ప్రసంగించుటయెగాక గాంధీగారి సత్యాగ్రహము వఱకు నిట్లు వ్రాయుచునే యున్నాము. ఇప్పుడిప్పుడీ యేకవచనము వ్రాయుటకు భయపడి గొందఱు గాఁడునకు బహువచనరూపమైన 'గారు' ప్రత్యయమును జేర్చి రామయ్యగారు, సుబ్బయ్యగారు, సోములయ్యగారు, లచ్చయ్యగారు, కిష్టయ్యగారు, గోవిందయ్యగారు, సత్తెయ్యగారు, అని వ్రాయుచున్నారు.

అనాగరికులపట్ల నాగరికులకుఁ గల యుల సత్వము లేక నిరసనభావము ప్రపంచమునందంతటను గలదు. ఒకప్పుడిట్లు నిరసింపఁబడిన వారే స్వయంకృషివలనను, సంస్కారముల మూలముననను, తపోబలముచేతను నుత్తమ స్థానములంబొందఁగలిగిరనుటకు నీ'కడ'జాతినే దృష్టాంతముగాఁ జూపవచ్చును. ఈ'కడ'జాతి వారిలోఁ గొన్ని తెగలవారు వైదికయుగమున నుత్తర కురుభూములకుఁ బోయి యున్నప్పుడు మఱికొన్ని తెగలతోడి సంబంధము వలనఁ గొంతమార్పును బొంది యక్షరాక్షసగంధర్వాదినామములతో నొప్పియుండిరి. చీనాదేశీయులయిన చరిత్రకారు లీకుషణ (కృష్ణ) రాజులనుయూచిజాతి(Yu-chi )గణములోఁ జేర్చియున్నారు. కాని 'కడ' జాతివారిలో తమిళదేశములోని వారికిని దక్షిణాపథమని చెప్పఁబడిన తెనుఁగు దేశములోని వారికిని ప్రాచీన కాలముననందే శాఖాభేదములున్నట్లు గన్పట్టుచున్నది. కాడు శబ్దమునకు తెలుఁగుభాషలో ౧ శ్మశానము, ౨ అడవి, 3 నాశము, అని మూఁడర్థములు గలవు. అడవియను నర్థము తమిళ కన్నడభాషలలోఁ గలదు. పే సనఁ దమిళభాషలోఁ బిశాచమని యర్థము. తెలుగులో పేసీయందురు. పేసీశబ్దము తరువాత పేచీశబ్దముగ రూపాంతరము నొందినది. తమిళభాషలోని పేసు పిశాచమైనప్పుడు ప్రాచీనపహ్లావీ (జెండు) భాషలోఁగూడ నాయర్థమై యుండును. 'కాడ్జేన్' అనఁగా పిశాచములకు మొనగాఁడు లేక ప్రభువు అని యర్థమగును. కాటితేఁడు (కాడు + తేడు) అనగా శివుఁడు. పిశాచములకు మొనగాడు లేక ప్రభువు మొదట బేతాళుఁడు తరువాత శివుఁడు. కాటికాపరియైన బేతాళుఁడు కాటితేఁడునకు సేవకుఁడు. మనదేశములో విజయదశమికి ముందు నుండి శరన్నవరాత్రములలోఁ దెలఁగాలు, కాపులు మొదలగువారు భేతాళుని పూజింపుచుందురు. పురాణాదులలో బేతాళునికులము పిశాచకులముగాఁ జెప్పఁబడినది. చరిత్రమున వీని దేశులకై యుండునో పరిశీలింతము 'శ్వేతహూణులు, తత్సంబంధజాతులు' (White Huns And Kindred Tribes) అను శీర్షికతో నొక వ్యాసము 'ఎమ్. ఆరెల్, స్టెయిన్' అనువారిచే వ్రాయఁబడి 'ఇండియన్ ఆంటిక్వెరీ' అను పత్రికలోఁ బ్రకటింపఁబడినది. అం దిట్లు వ్రాయఁబడినది.

We learn from the Annals of the Hiang and Wei dynasties that the tribe, a section of the great yue-chi, originally dwealt to the north of the great wall of China. They then went by the name Hoa-tun and were in subjection to the Juan-Juan whom we have before mentioned. Little by little the Hoa grew from an insignificant tribe into a powerful nation. After the name of their ruling family they styled themselves ye-tha-i'-li-to or in an abbreviated form of the name, Yetha (just as the yue-chi took the name of Kushan) from this originated the name Epthalites (Hepthalites) subsequently applied to them by the Greeks, as well as the Armenian Haital and the Haythal of Persian and Arab writers."

I. A. Vol. xxxiv, 1905, P. 80

'మహాయూచీ' అను తెగవారిలో నొక శాఖవారు చీనాదేశపు గొప్పదగు సరిహద్దు గోడకు నుత్తరముగా మొదట నివసించియుండిరని హ్యాంగ్ (Hiang), వై (Wei) వంశ చరిత్రములనుండి మనము తెలిసికొనుచున్నాము. వారిచటనుండి 'హూవా లేక హూవా-తున్' అనుమాఱు నామముతో వెడలిపోయి మాచే నిదివఱకుఁ బేర్కొనఁబడిన 'జవాన్-జవాన్' అను తెగవారికి లోఁబడియుండిరి. తరువాత వారు తమ్ముఁ బరిపాలించుచున్న 'యేత లేక యేత-లి-ఇ-తో' అనువంశము వారినామమునే యూచీలు 'కుషాన్' నామమును బెట్టుకొన్నట్లుగాఁ దమ తెగకుఁ బెట్టుకొనిరి. అందుచే గ్రీకులు వీరిని 'హెప్తలితీస్' అనియు, ఆర్మీనియనులు 'హెయితాల్' అనియు అరబ్బులును, పారశీకులును, 'హేతాల్' అనియు వ్యవహరించుట సంభవించినది.

హిందూదేశములోఁ గొన్ని తెగలవారు పకారమునకు బదులుగా హ' కారముచ్చరింతురు. కొందఱు పకారమునకు బదులు బకారము నుచ్చరింతురు. 'హేతాల్' సంస్కృతములో 'బేతాల' శబ్దముగ సంస్కరింపఁ బడినది. కన్నడ మరాటీభాషలలో పకారమునకు హ కారము వాడబడుచున్నది. మన భాషలో పాలు వారిభాషలో 'హాలు' అగుచున్నది. సంస్కృత భాషలో ఒత్తు తగ్గించి 'బేతాల'అన్నను బ్రాహ్మణేతరులు మాత్రము జే భేతాలా! అని యొత్తుపెట్టి సంబోధింతురు. మన దేశములో చాపలు మొదలగువాని నల్లుకొని జీవించి బ్రదికెడి 'ఏతుల' యనుజాతి యొకటి గలదు. విశాఖపట్టణము జిల్లాలో 'యాత' యను నొకమన్నెజాతి కలదు. కొన్ని కులములలో ముఖ్యముగా మలబారులో 'ఐతర' శాఖవారు గానుపింతురు. ఐతవాండ్రు మన తెలుఁగు దేశములోఁగలరు. అయితేశ్వరుఁడు, అయితమ్మ, అయితరాజు, అయితనీడు, మొదలగు నామములు మనవారిలోఁ గన్పట్టుచున్నవి. ఋషులలో ఐతరేయుఁ డొకఁడుగలఁడు. ఐతరేయ బ్రాహ్మణమె గలదు క్షత్రియులలో యయాతిమహారాజుగారి సోదరునిపేరు 'యాతి' ఈరీతిగాఁ గన్పట్టుచున్నది. ఇంతియకాదు. అచ్చతెనుఁగు శబ్దముగా వక్కాణింపఁబడిన 'ఏతు' అను శబ్దమునకు ఉద్ధతి యను నర్థముగలదు. ఏతము (నీళ్లెత్తెడు యంత్రవిశేషము) ఏతము సంస్కృతమైనపుడు 'చిత్రవర్ణము' అను నర్థము గలదు. తెలుఁగులో 'ఏతరి' అనఁగా దుర్నయపరుఁడని యర్థము.

ఏతరి :—

మీఁతరము వారలేతఱి
నేతరితనమునఁ దపస్విగృహ కన్యకలన్
పీత భయవృత్తివేడిరొ
కోతముఁ దర్కింప కొరక్రొవ్వలటంచున్.
[స్వా. మ. ౬. ఆ.

ఏదడి అనఁగా నొకవిధమయిన యెలుగుగొడ్డునకు నామము. ఏదు అనఁగా ముండ్లపంది, శల్యములని యర్థములుగలవు. బృహత్కథలో విక్రమార్కునితో సంబంధించిన బేతాలుని వింతకథలు పెక్కులు మనము చదువుచున్నాము. ఈ 'యేత' లు ప్రాచీన

కాలమున మిక్కిలి బలాఢ్యులుగ నున్నట్టు గన్పట్టెదరు. చీనాదేశీయులయిన చరిత్రకారులు వీరిని యుధిష్ఠిరులనియు శక్తిమంతులనియు వర్ణించియున్నారని 'స్టెయిన్'గారు దెలుపుచున్నారు.) I. A. Vol xxxiv. 1905, P. 80.) మనలోఁ బరమ తపోగుణసంపన్నులయినవారిని యతు లందురు. మొట్టమొదట నీ 'యేత' తెగవారిలోనట్టివారు ప్రబలుటచేతనె 'యతి' నామము సంస్కృత వాఙ్మయము లోనికి వచ్చినది. నహుషపుత్రుఁడైన యయాతి మహారాజునకు జ్యేష్ఠుఁడగు 'యాతి' యను నాతఁడు రాజ్యభారము నొల్లక పరమతపోగుణగరిష్ఠుఁడై 'యతి' యను పేరఁబరఁగెను. యయాతి మహారాజు తాను క్షత్రియుండయ్యును బ్రాహ్మణుండగు శుక్రునికూతురగు దేవయానిని వివాహము చేసికొనెనని మహాభారతము దెలుపుచున్నది. శుక్రునకు 'ఉశనసు' అను నామాంతరముగలదు. ఉశనసులను చరిత్రకారులు 'ఊషను' (Uishans)లని వక్కాణించిరి. వీరు నివసించు ప్రదేశము 'హ్యూ-షూన్' (Hiu-sun) అని చీనాదేశస్థులచే వ్యవహరింపఁబడు చున్నది. ఇదియె మహాభారతములోఊష్ణ ('ఊషన్') దేశముగాఁ జెప్పఁబడినది. వీరికే 'ఉగ్ర' లను నామాంతరము గలదు. ఔశనసులు భృగువంశీయులయిన భార్గవులుగ పురాణేతిహాసములందుఁ జెప్పఁబడిరి. భార్గవులు రుద్రగణములలోనివారు. భగుఁడనువాఁడు 'ఇంద్రుఁడు, విష్ణువు, వరుణుఁడు' వలెనే ద్వాదశాదిత్యులలోనివాఁడు. 'వర్క-హూమా' అను రెండు తెగలు శకజాతిలోనివని యిదివఱకే తెలిపియున్నాను. వర్కశబ్దము సంస్కృతమున భర్గశబ్దముగ, హూమాశబ్దము ఉమాశబ్దముగ నయ్యెను. ఊషన్ ద్వాదశాదిత్యులలోనివాఁడయిన 'పూషన్' అయి యుండును. బకుఁడు ద్వాదశాదిత్యులలోని భగుఁ డగుచున్నాఁడు. పురాణములలో వర్ణింపఁబడిన బకాసురుఁడు భరతఖండములోనివాఁడు. విజాతీయులీ కులములను (Ushans Uigurs) అని వ్యవహరించుచున్నారు. పౌరాణికులు కొందఱు భూలోకమున నురగులుగ వ్యవహరింపఁబడినట్లుగ వక్కాణించియున్నారు. మంగోలియాకు 'ఉరగ' అను పట్టణము రాజధానిగఁ గూడ నొకప్పు డుండెను. మధ్యాసియాఖండమున గిల సంస్థానములు గలవనియు నంతటను 'శోక్' అను తెగవారిచే వ్యాపింపఁబడియున్నదనియు, ప్రాచీనమయిన హ్యూ-షాన్, 'కూన్-తు' (Hiu-sun and kiun-tu) అను దేశములలో ముఖ్యముగా సితెగవా రున్నారనియు, ఎట్లయినను ఊషనులకు సమీపస్థులనియు డాక్టరు స్టెయిన్‌గారు వ్రాయుచున్నారు.[1] ఉశనుఁ డనఁగా శుక్రుఁడని యిదివఱకే తెలిసికొన్నారము. మన తెలుఁగుభాషలో 'చుక్కలు' అనఁగా నక్షత్రములకు మాత్రమే గాక 'చుక్క' అనఁగా శుక్రుఁడనికూడ నర్థము గలదు.

రాత్రులందు తెల్లవాఱుజామున నుదయించెడు శుక్రుని వేఁగుచుక్కని తెలుఁగువారు

1 I. A. Vol xxxiv, 1905, p. 43.

(Barbarians) బేర్కొనుటయెగాక తమ వాదమునకు బలముగా వీరు బౌద్ధ దేవాలయములను, బౌద్ధధర్మశాలలను నిర్మాణము చేయుట వక్కాణించిరి.1 బౌద్ధాలయములు ధర్మశాలలు బౌద్ధభిక్షుల విశ్రాంతిగృహములునిర్మించుటయె కిరాతత్వమును (Barbarianism) బలపఱచుట కుచిహ్నములని డాక్టరు స్టెయిన్‌గారివంటి పరిశోధకులు వ్రాయ సాహసించుటకుఁ గారణమేమయియుండునో? అలెగ్జాండరుని తరువాత హిందూదేశమునకుఁ బశ్చిమోత్తరమునను బాక్ట్రియాదేశములోను వర్ధిల్లుచుండిన గ్రీకుల రాజ్యము నీకార్త్తికేయులు నిర్మూలము గావించినట్లు చరిత్రకారులు దెలుపుచున్నారు. వీరు శుద్ధశైవ మతాభిమానులయినను బౌద్ధమతమునకు రక్షకులై వర్ధిల్లఁజేసిరి. వీరు నిజముగాఁ గిరాతకు లనుకొన్నను, ఈ యొక్కవిషయమె వారిశక్తి సామర్థ్యములను వేయినోళ్లఁ బ్రస్తావింపఁజేయుచున్నది. ఇట్టి కిరాతకులు గూఁడ 'రాజాధిరాజపదవికి' వచ్చుటకుఁ గారణము వారియం దేదోమహచ్ఛక్తియుండఁ బట్టియె సాధ్యపడునుగాని లేకున్న సాధ్యపడఁగలదా? చరిత్రమున కందిన యీ రాజవంశములో మొదటివాఁడు కి-ట్సొ-లొ (ప్రాకృతభాషలలోను గన్నడములోనుకృష్ణుని 'కిట్టో' యందురు) అనువాఁ డని కొందఱు చీనాచరిత్రకారులు వ్రాసినట్లుగా డాక్టరు స్టెయిన్‌గారు దెలుపుచున్నారు. అదివఱకుఁ బరిపాలనము చేయుచున్న పూర్వపు రాజకుటుంబము వారిని నవతలకు సాగనంపి యీ కిట్టొగారు బాక్ట్రియాదేశము తామాక్రమించుకొన్నారఁట! తరువాత నీనూతన రాజకుటుంబము వారిని 'జవాన్-జవాన్' (జవన లేక యవన లేక పవనకులము) అనువారు వీరిని హిందూ కుశపర్వతముల దిగువ భాగములకుఁ దఱిమివేసి బాక్ట్రియాదేశము (బాహ్లీకదేశమును) నాక్రమించుకొనిరఁట. అప్పుడీకృష్ణుని వంశపువారు కావ్ ఫూ (Kao-fu) (కాఁపు) అనంబడు కాఁబూల్ (కపిల) దేశమును గాంధారదేశమును బరిపాలించుచుండిరఁట. వీరి రాజధాని పురుష పురమఁట. (Peshawar) పెషావరనఁగా నిజముగాఁ బురుషపురము గాదు. పేష్వారులనఁ బిశాచము లని యర్థము. కాని బాక్ట్రియాలో రాజ్యము చేసిన రాజకుటుంబమువారును, పెషావరులో రాజ్యముచేసిన రాజకుటుంబమువారును నేకజాతిలోనివారేనఁట. వారుభయులు జ్ఞాతులఁట. వీరు కషణ లేక కుషణ జాతివారేనఁట. వీరి నాణెములపై వ్రాయఁబడిన దేవనామములును, బిరుదములును గ్రీకుభాషాలిపిలోనుండుటచేతను, పారశీకరాజుల ప్రాచీనబిరుదనామమైన 'షాహనాణ్‌షా' (రాజాధిరాజు) అను బిరుదమును వీరు వహించుటచేతను, ఐరేనియనులయొక్కయు, గ్రీకులయొక్కయు నాగరికతాశిక్షణములను బొందినవారని కొందఱు తలంచుచున్నారు. డాక్టరు స్టెయిన్ గారు నుడివిన కారణమె సరియైనయెడల 'మన్నెసుల్తాన్' అను బిరుదమును వహించిన (శ్రీ) విజయనగరము మహారాజు గారు

1. Their barbarian origin not with standing they testified their religious leanings by the founding of numerous monesteries and shrines (Ind, Ant, Vol, XXXIV, 1905 p. 77)

వ్యవహరించుచున్నారు. సంస్కృతమునఁగల శుక, శుక్ల, శక, శాక, శకున, శకుంతల, శోక, శ్లోక, సుఖ మొదలగు శబ్దజాలమును, చొక్క, చొక్కాటము, చొక్కము, మొదలగు వైకృత శబ్దజాలమును ఈ తెగకు సంబంధించినవే. మఱియు సక్కిలి, చక్కిలి, చాకలి శబ్దములను జూడుఁడు. ఉత్తర దేశమున 'సుకాలి' యను తెగ గలదు. వ్యాసునికొడుకయిన శుకుఁడు యోగీంద్రుఁడని వక్కాణింపఁబడియుండెను. గాంధారరాజగు సుబలుని కొడుకును దుర్యోధనాదుల మేనమామయు నగు శకుని క్షత్రియుఁడును జూదగాఁడు నై యుండెను. మఱియొక శుకుఁడు రావణునకు మంత్రిగ నుండెను. త్రివిష్టపమున కధిపతియైన యింద్రునకు శక్రుఁడని నామాంతరము గలదు. 'శక్నోతి దుష్టజయ ఇతిశక్రః' అనఁగా దుష్టజయమునందు శక్తుఁడు ('శక్‌ల్' శక్తి).

కొండవీడు రాజమహేంద్రవరము రాజ్యములను బరిపాలించిన రెడ్డిరాజులు కపిధ్వజులు; శైవులు; ఆరాధ్యగురుపరంపర గలవారు. పైని వివరింపఁబడిన వేమ, కనిష్కాదికుషను లన్ననో వృషధ్వజులును శైవుల్లు నై యున్నారు. వీరి నాణెములపై మహాసేనుఁడు స్కందుఁడు, కుమారుఁడు, విశాఖుఁడు, అను వారి విగ్రహములును, వృషభమును జిత్రింపఁబడియున్నవి. బుద్ధునివిగ్రహముగల నాణెములు కొద్దిసంఖ్యగలవి మాత్రమె గన్పట్టినందునసమదృష్టితో బౌద్ధమతమును వారు ప్రేమించినవారయినను వారు శైవమతాభిమానము గలవారుగా నుండిరని చరిత్రకారులు పెక్కండ్రభిప్రాయ పడుచున్నారు.

ఈకుషన్‌రాజులజాతిని తెలుపుటసాధ్యము గాక కాఁబోలు తమ యభిప్రాయమును విస్పష్టముగా దెలియఁ జెప్పక యితరుల యభిప్రాయము లిట్లున్నవని మాత్రము జయస్వాలు గారు వ్రాసియున్నారు. వీరుకార్తికేయుని బూజించువారగుటచేత కార్తికేయుల తెగలోనివారయి యుండవలయును. ఈకార్తికేయుని జన్మమును గూర్చి మహాభారత కాలమునాటి దుర్యోధనుఁడు:—ఆగ్నేయః కృత్తికాపుత్రో రౌద్రో గాంగేయ ఇత్యపి శ్రూయతే భగవాన్ దేవః సర్వగుహ్య మయోగుహః' అనఁగా, కుమారస్వామి యుత్పత్తి తెలియదు కొందఱగ్నికిఁ బుట్టెననియు, కొందఱు కృత్తికకనియు, కొందఱు రుద్రునకనియు, కొందఱు గంగా దేవికనియుఁ బలుకుదురు." అని కర్ణుని సూతపుత్రుఁడని ధృతరాష్ట్రుని మహాసభలో భీముఁ డధిక్షేపించి పలుకునపుడు భీమునికిఁ బ్రతివిధముగా జవాబు చెప్పెనని మహా భారతమున వక్కాణింపఁబడియున్నది. వీరి నాణెములపై మహాసేనుఁడు, స్కందుఁడు, కుమారుఁడు, విశాఖుఁడు' అనునామము లుండుటచేత వీరిని కార్తికేయుల తెగలలోని వారనుటలో దోషము లే దనికొనియెదను. రాజతరంగిణిలో వీరిని తురుష్కులనుగఁ జెప్పినది గ్రంథకర్త యొక్క యజ్ఞానమని తలంచెదను. రాజతరంగిణి క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దిలో రచింపఁబడినదిగావున దానింబురస్కరించుకొని పాశ్చాత్యులు వీరిని తురుష్కులనుగా భావించుట న్యాయమగునా? వీరుహిందువులు. డాక్టరు స్టెయిన్‌గారు వీరిని కిరాతులుగఁ

తురుష్కుల నాగరికతా శిక్షణములను బొందినవారని చెప్పవలసివచ్చును. ఇది సత్యదూరము. వీరు హిందువు లగుటచేతను నంతకుఁ బూర్వము బహుకాలమునుండి నాగరికత హిందూదేశమున వర్ధిల్లుచుండుటచేతను వీరు నాగరికత నేర్చుకొనుటకై పారశీకులకడకుఁ బోనక్కర లేదు. ఒకవేళ నట్టిశిక్షణముఁ గొంతఁ బొందినను వీరి ప్రాచీనులు నాగరికత లేనివారని తలంపరాదు. గ్రీకు లాక్రమించుకొన్న ప్రదేశములను వీరు వారల నాక్రమించుకొని పరిపాలనముచేసినవా రగుటచేత నాప్రదేశములలో నుండు ప్రజలు తమ నాణెములపై నుండు లిపిని తెలిసియున్నారను కారణముచేతఁ గొన్నినాణెము లావిధముగా రాజ్య మాక్రమించుకొన్న వెంటనే కొట్టించి యుండవచ్చును. అవియైనను స్వల్పసంఖ్య గలవియె యని స్టెయిన్ గారు నుడువుచున్నారు. ఇంక వా బిరుదమునుగూర్చి విచారింతము. ప్రాచీనకాలమునందు నిల్లువాకిలి లేక గొఱ్ఱెలు, మేకలు, గోవులు మొదలగు పశుబృందములతోను, భారవాహకములైన గాడ్దెలు, ఒంటెలు, గుఱ్ఱములు మొదలగు జంతువులపై తమతమ వస్తుసంచయమును బెట్టుకొని తమ పశుబృందములను సంరక్షించుకొనుటకై పచ్చికపట్టులుగల ప్రదేశములకు సంచారములు సలిపెడు గుంపులుగల తెగలవారికంటె నెక్కడనో యొకచోట స్థిరనివాస మేర్పఱచుకొని నాగళ్లు కట్టుకొని భూమిని దున్నుకొని జీవించు కర్షకులు పూర్వకాలమునఁ బూజ్యులుగాఁ బరిగణింపఁబడుచుండిరి. సంస్కృతభాషలో 'కృషాణుఁ డనఁగా, సేద్యగాఁడని యర్థము. ఈకృషాణశబ్దమె చీనాభాషలో Kuei-shuang లేక Kuei-Choang (కుయిషాన్ లేక కొయిషాన్) అని వ్యవహరింపఁబడినది.

ప్రాచీనకాలమున నసురులలో 'అర్' అను తెఁగవారు గలరు. వారును కృషాణులవలెనె దేశాటనమును విడిచి అరకలు కట్టుకొని భూమిని దున్నుకొని జీవించు నర్యులై పూర్వకాలమున బూజ్యులుగాఁ బరిగణింపఁబడుచుండిరి. నేనిట్లు వ్రాయుటఁజూచి చదువరులు 'అర్' అనునేదో యొక తెగవారున్నారని నీవొప్పుకొనుచున్నావే, వారే యార్యజాతివారు కారాదా?' అని ప్రశ్నింపవచ్చును. 'అర్' అనునొక తెగవారు మన తెలుఁగువారిలోఁ గలిసిపోయినారని చెప్పుటకుఁ దగిన దృష్టాంతములు మన తెలుగు భాషలో శబ్దజాలము కనుపట్టుచున్నది. అయ్యవి యచ్చతెలుఁగు పదములు దేశీయములై యున్నవి. చూడుఁడు (౧) అరిగాపు (అరి+కాపు) కట్టుకావలి (౨) అరిగాఁపు=కప్పము గట్టువాఁడు (3) అరిగాళ్లు=ద్వారపుగుజ్జుపు పీటలకు వెనుకటి భాగమున నూఁతగానుంచెడు కమ్ములు అరిగోలు (అరి+కోలు) ఏఱుదాటించఁదగిన సాధన విశేషము (౪) పైయర్థమె. "గీ" ఈఁదు కొయ్యలు తెప్పలు నీఁదుకాయ, లరడ లరిగోళ్లుపడవలు దరులుపుట్లు, చేపడవలోడలాదిగాఁ జెలఁగునట్టి, యంబుతరణంబులకు నెల్లనధిపుఁడతేఁడు" హంస ర. ఆ. (౫) అరక=నాగలి, ఏరు, (౬) అరకాఁడు=కర్ష

కుఁడు (౮) అరుఁగు=తిన్నె (౯) అరగడము= వయస్సు చెల్లినది. ౧౦ అరప=మీఁదఁగూర్చుండుటకై యేర్పఱచిన చిన్న చప్పరము, మంచము (౧౧) అరగడి=కులుచగోడ (౧౨) అరగలి= సందేహము (౧౩) అరి=కప్పము; శరసంధానస్థానమైన యల్లెనడుము (౧౪) అరికట్టు= అడ్డగించు (౧౫) అరవరలు=శుష్కము (౧౬) అరుదు= ఆశ్చర్యము (౧౭) అరులు= వాత్సల్యము (౧౮) అరువు=ధాన్యాదుల ఋణము (౧౯) అరుజు=మత్స్యవిశేషము (౨౦) అరులు మరులు=మురిమియందు గలిగెడు మదితబ్బిబ్బు (౨౧) అరుసు(వై)=రాజు (౨౨) అరకాటి=ఓడనడపువాఁడు (౨౩) ఆరె=మాదిగవానిసూది (౨౪) ఆరాటము, = పరితాపము (౨౫) ఆరడము=ఉత్సాహము, పూనిక (౨౬) ఆరబము=పైరు (౨౭) ఆరు=కలుగు, ఉ., కర్ణుఁడా, భూరమణున్ నడిన్‌గదిసి భూరిశరంబులు మేననింపనో, వ్వారుటయుం దొలంగెనతఁడు. (భార. కర్ణ. ౩ ఆ. ౨) నిండు విప్రులకు నాహారం బపూపాజ్యపూర్వకమై తద్దయుఁ దృప్తిగాఁగ మనసారం బెట్టె (మనసారన్=మనఃస్ఫూర్తిగా) బో. ౩. ఆ. (౩) రోమావళి (౨౮) ఆరుగ=సస్యవిశేషము (౨౯) ఆరుచు= ఆడించు, విసరు, (౩౦) ఆరుపోరు= ఎడతెగని కలహము (౩౧) ఆరెకుఁడు= తలారి (తలైయార్) (౩౨) ఆరెవడ్లు = సూదుల వంటి తోఁకలుగల వడ్లు (౩౩) ఆరడి=నింద.

ఇయ్యవి దేశీయములుగాని సాంస్కృతికములు గావు; తత్సమములు గావు; తద్భవములు గావు; వందలకొలఁది చూపఁగలను. సంస్కృతపదములు, వైకృతపదములు చెప్ప నక్కరలేదు. వేలకువేలు గలవు.

సంస్కృతములో అర్ ధాతువునకు భూమిదుక్కి దున్నుటకును, పడవ గడపు తెడ్లచే నీటిని గదలఁగొట్టుటకును కూడ నీ ధాతువున కర్థమని వెనుకఁ దెలిపియున్నాఁడను. కొందఱు నిఘంటుకారులు 'ఋ-గతౌ' అను ధాతువునుండియు, మఱికొందఱు 'అర్చ' ధాతువునుండియు, ఆర్యశబ్దము పుట్టినదని వ్రాసినదానిని పూర్వమె చెప్పియున్నాను. అది యునుగాక ఆర్యులలో దక్షిణోత్తర శాఖ వారయిన జరాతుష్ట్రులలో అర్ ధాతువు కృషితో సంబంధించిన కార్యములను దెలియఁ జేయుటకుమాత్రమె వాడుకలో నుండఁగా హైందవార్యులలో నీధాతువునకు బదులుగా 'కృష-విలేఖనే' అను ధాతువు వాడుకలోనికి వచ్చినది. దీనినుండి కృషి, కృషీవల, కర్షక శబ్దములు పుట్టినవనిగూడఁ దెలిపియుంటిని. (భారత సం. ౧. సంచిక. ౨౧) కావున కుషణులు హైందవార్యులనుటకు సందియము లేదు. 'ఈకృషాణులు ప్రభుత్వమును వహించినపిమ్మట క్రమక్రమముగా 'కు' లోపించి 'షాన్' అనునది 'రాజు' అను నర్థమిచ్చునదియై భాషలో బిరుదునామమై యొప్పియుండ వచ్చును. దానినే పారశీకులు 'షా'ను బిరుదుగా గ్రహించిరి. ఈకనిష్కాదిరాజు లా జరాతుష్ట్రుల దేశమును జయించినందున 'షాహనాన్ షా-కనిష్క-కషనో' అని తననాణెములపై ముద్రించుకొనియుండెను. డాక్టరు స్టెయినుగారు 'కషనో' శబ్దమును 'కసనో' అను చదువుచున్నారు. కషనో (కాపు) అన్నను, కసనో (కర్షణ) అన్నను నొక్కటియె. ఏదియైనను నయ్యది జాతిని తెలుపుచున్నదని డాక్టరుగారు వ్రాసినది సత్యము. షాహనాన్ షా అనఁగా రాజాధిరాజు.




ఎల్లాప్రగడ లక్ష్మీనారాయణగారు, బి. యస్. సి.

ప్రణయసందేశముల గొనివచ్చు మంద
పవనకైశోరమున కిడె వనకుమారి
రాగభరితమనోజ్ఞపరాగపటలి.

ఇంపుగా మావిచివురు లందించుకొనుచు,
నించు సయ్యాటకై ముచ్చటించుకొనుచు,
ప్రేమరస మొల్కగా వనప్రియయుగంబు
కొమ్మచివరల సొరుగా గూరుచుండె.

చంచువుల దోరగాయలు సించివైచి,
ఆరగించెడు చిలుక లొయ్యారమొప్ప
ఱెక్కలు విదిర్చి సారెసారెకు నిజప్రి
యాంగనల జూడబోయె రయంబుమీఱ.

భువనమోహనకారణాద్భుతత్వదీయ
వేణుగానసుధారసవేల్లనమున
పూచె నాప్రేమలత; యిదె పూవుదండ
గైకొని ధరింపు చూచెద కన్నులార.

చిన్ననాడె నీతోడిదాస్నేహరసము,
వీనులలరించు నీవేణుగానరసము,
వీనితోడనె బుట్టినప్రేమరసము
ఇన్నిరసముల నించినహృదయపాత్ర
నందుకొనుమోయి! యిదియ నీకర్పణంబు.

నెన్నుదుట నాడుకొనెడి నీ నీలికురుల,
కంబు సోయగమును నవ్వు కంఠసీమ,
చెంగలువకచ్చు దెగడు ముంజేతులందు,

ప్రణయసూత్రనిబద్ధానురాగ కుసుమ
మాలికలు సవరింతు రమ్మా! ప్రియుండ!

మోహరససేచనంబుల మొలకలెత్తి
లీలమందారములలోన గాలివారి
ప్రణయ మాహాత్మ్యమున వృద్ధి బడసినట్టి
హృదయవల్లిక యొసగె నీ ప్రేమకుసుమ
మాలికల నందుకొమ్ము రమ్మా! సఖుండ!

ఈ నదీతీరసైకతోద్యాన సరసి
యానపాత్రలనెన్నొ విహారములను
చిన్ననాడు నిన్గూడుక చేసియుంటి
కొదమతుమ్మెదపాటల కొమరుమీఱ
పూవు బొదరిండ్ల నిన్గూడి పూవుబుత్తు
లెత్తితిని, సైకతముల నెన్నెన్నియాట
లేని యాడిటి మరచితివే సఖుండ?

చేయికిని చేయిజేర్చి యీచెట్లపొంత
నీయలరుసెజ్జలందు, నీయిసుకతిన్నె
లందు నీతేనెవాకలయందు రేల
చెలగియాడితిమోయి వెన్నెలలబైట.

కోయిలల గీతములతోడ గుదురుపరచి
తేంట్లపాటలతోడ సూత్రీకరించి
వ్రాలు చిలుకపల్కులతోడ మేళవించి
మురళి మ్రోయించితివి లోకమోహనముగ.

అల్లనల్లన విచ్చెడి మల్లెమొగ్గ
అరవిరిసియాడు సరసీరుహంపు మొగ్గ
కొలనులో దాగు లేత చెంగలువ మొగ్గ
నేరియిచ్చితి మరచితివే సఖుండ!

మోవి సంజకెంజాయల మెఱుకలాడి
చిరునగవు వెన్నెలల నిగ్గు చిలుకు నీదు
మోము జాబిల్లి ముచ్చటల్ పోవనిమ్ము;
అకట! నోచనె యొక్కకటాక్షరేఖ

యౌవన వసంతమాయె నాయందు; నీదు
రమ్యహృదయ పంజరమస్వరాగశుకము
పెంచుకొనిమొద నీకదే ప్రియసఖుండ!
అధరబింబోపహార సమర్పణమున.

కిసల తూలికతోడి లిఖింపబడిన
వకట! పంక్తుల నీసువర్ణాంకురములు,
ప్రణయసందేశము లటంచు భ్రమలబడితి
చెలువుడా! ప్రణవంబని తలపనైతి.

బాలసూర్యోదయ ప్రభాపటలిబోలు
నీదు తేజశ్శరీరమన్దేహములయిన
కామమోహంబుల నడంతు ప్రేమమాత్ర
జాల పూతాశ్రుధార నంజలి ఘటించి.

ఈ ప్రణవమంత్రమే జపియించి, సకల
సౌఖ్యముల ద్రెంచి, యోగాగ్ని సంఘటించి,
యందు స్వాత్మోపహారసమర్పణమున
నాథ నిన్గూడు దెన్ని జన్మములనైన.



# రివ్వుమను యవ్వనము

యస్. జి. ఆచార్య

జాల మీలీల నీవేల జేసెదవు ?
మేలుగాదది మనకు ఆలసింపకుము.

పసపుబంగరుసంజ
దశవెల్గి దిశపైని
పసిడి నిశలోన
కృశియించి పోయినది. జాల॥

ఆకసంబంతటను
జీకటులు గ్రమ్ముకొని
రేఖవలె మెరుపొకటి
నాకు గనబడిపోయె. జాల॥

పుట్టినది, పెరిగినది,
పుష్పమై వెలసినది,
పట్టుమని గంటలో
గిట్టుటను గాంచితిని జాల॥

పువ్వుజీవమువలెనే
జవ్వనము నిక్కముగ
గువ్వవలె త్వరితముగ
రివ్వుమం చనిమొగురు. జాల॥

# హిందూదేశమున గ్రహారాధనము

నిడుమోలు కనకసుందరం గారు, బి. ఏ అనర్సు

## వేదకాలము - ఆదిత్యవర్గము

ప్రాచీనకాలమున హైందవులు సూర్యుడు, సావిత్రి, మైత్రేయుడు మొదలగు పేరులతో నాదిత్యుని పూజించుచుండెడివారని వేదములవలన తెలియవచ్చుచున్నది. ఈదేవతావర్గమును 'ఆదిత్యవర్గ'మని పేర్కొనుట యుచితముగ దోచుచున్నది. ఈవర్గమునందు సూర్యుని నామమొక్కటియే జ్యోతిశ్శాస్త్రవిచారమున మనకగపడును. ఋగ్వేదమునందును, తదితర దేవతలకంటె నతి తరచుగా సూర్యు నొక్కనినే, కొన్ని సమయములందు మన కిపుడు ప్రత్యక్షముగనగపడుచున్న సూర్యమండలముగ భావించిపూజించియున్నారు. అతడు జ్యోతిర్మయుడు; అంధకారమును పారద్రోలువాడు. కాలమానముల కాధారభూతుడు. 'సావిత్రి' యింతకంటె సంక్లిష్ట భావమున కన్వయించుచున్నది. 'మైత్రేయుడు' జ్యోతిర్దేవుడని చెప్పినను చెప్పవచ్చును. తదితరాదిత్యులతో జ్యోతిశ్శాస్త్రమున కెట్టిసంబంధము నున్నట్లు తోపదు.

ఆదిత్యవర్గమునం దొక్కసూర్యుడు తప్ప తదితర దేవతలు జ్యోతిర్గోళస్వరూపముల దాల్చియున్నటుల ఋగ్వేదమునం దెచటను వర్ణింపబడకపోయినను, నివి యన్నియు, సూర్యునితో సంబంధముకలవిగను, కొన్ని సమయములం దాతని నామాంతరములుగను వాడబడియున్నవి. అంతియేగాక, కొన్నిసందర్భములం దీయాదిత్యుల స్వరూపస్వభావవర్ణనాదు లొకదానితో నొకటి సరిపోవుచున్నవి. ఋగ్వేదమున [మం VII ఋ 36 (2); మం VII ఋ 75 (5)] సూర్యుడును సావిత్రియు ఇర్వురును 'ఉషానాథులు'గ వర్ణింపబడియున్నారు. సూర్యుడు, 'అదితి' పుత్రుడనియు [మం I ఋ 1ౘ1 (9)], సావిత్రి మైత్రేయులు ఆదిత్యులనియు [మం VIII ఋ 18 (3); మం II ఋ 27 (1)] వర్ణింపబడియున్నారు. సూర్యుడు ఏడుగుర్రముల రథము నెక్కివచ్చుననియు [మం VII ఋ 60 (3)], సావిత్రి రెండుగుర్రముల రథము నెక్కుననియు [మం I ఋ 35 (2)] చెప్పబడి యున్నది. సూర్యసావిత్రు లిర్వురును, దుస్స్వప్నదోషాపహరులును, పిశాచముల పారద్రోలగలవారు నని [మంX ఋ 37 (4); మం I ఋ 35 (9)] వ్రాయబడియున్నది.

## సూర్యుడు - విష్ణువు

ఆదిత్యవర్గమునందు పూషుడు (విష్ణువు) కూడచేర్పబడి యుండినటుల మనము కొంతవర కూహింపవలసి యున్నది. వేదములకు పిదపకాలమున 'పూష' పదము సూర్యదేవుని నామాంతరముగ నుపయోగింపబడియున్నది చూడుడు.

> హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితమ్ముఖమ్
> తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయదృష్టయే
> పూషన్నేకర్షే యమ సూర్యప్రాజాపత్య వ్యూహ
> రశ్మీన్ సమూహ, తేజోయత్తేరూపం కళ్యాణ
> తమతత్తేపశ్యామియోఽసావసౌ పురుషః సోహం
> మస్మి — ఈశోఽపనిషత్తు.

[సత్యధర్మల ముఖ(ద్వార)ము బంగారుపాత్రచే కప్పబడియున్నది. ఓపూషా! దానిని తొలగించి అసత్యధర్ములను దర్శనము చేయనిమ్ము! ఓపూషా! దివ్యజ్ఞానీ! సూర్యా! నీకిరణములను వెదజల్లి మరల కూడబెట్టుము......]

వేదములకు పిదపకాలమునందే విష్ణువు ఆదిత్యులలో ప్రథముడును, హైందవులు పూజించు మూర్తిత్రయములో నొక్కడెడునునై ప్రముఖుడగు దేవుడుగ నారాధింపబడుచున్నాడు గాని వేదములం దతని కంత ప్రాముఖ్యతలేదు. వేదములందాతని వర్ణించుపట్ల నాతని త్రిమూర్త్యాత్మక స్వరూపమే సూచింపబడి యున్నది;

కాని యీమూర్తిత్రయవిభేదము సూర్యునికే వర్తించు నని యాధునికులు కొందరూహించుచున్నారు.

"బ్రహ్మస్వరూప ముదయే
మధ్యాహ్నేతు మహేశ్వరమ్
సాయం ధ్యాయే త్సదావిష్ణుం
త్రిమూర్తిశ్చ దివాకరః"

అని మనము త్రిమూర్త్యాత్మకుడగు భగవంతునితో సూర్యుని బోల్చి ప్రార్థించుచున్నాము. ఋగ్వేదమునం దొకచోట [మం I ఋ 155 (1)] మాత్రము, విష్ణువునకు సంవత్సర కాలములోని చతుర్థభాగముతో సంబంధ ముండినటుల సూచింపబడియున్నది. కాని, ఆధునికకాలమున నాతడు పరాత్పరుడుగ భావింపబడుచుండుటవలన సూర్యు డాదిగాగల గ్రహవర్గ మాతని యధీనులై ఆతని యాగ్రహాను గ్రహములచే నీచోచ్చదశల ననుభవించెడి పరాధీనతను పొందియున్నారు. విష్ణువునందు సూర్యాంశ లేవియును కన్పట్టవని 'ఓల్డెన్బర్గు' అనునొక జర్మనుశాస్త్రజ్ఞుడు తలచుచున్నటుల మాక్డొనల్ (Vedic Mythology) "వైదిక గాథలు" అను నొకగ్రంథము (39 వ పేజీ)న వ్రాసియున్నాడు. కాని పురాణములందుమాత్ర మీయిర్వురు పౌరాణికవ్యక్తులకును సంబంధముండినటుల వ్రాయబడియున్నది. విష్ణుపురాణమున (11-8-55) నీక్రిందిశ్లోక మున్నది.

వైష్ణవోంశః పరస్సూర్యః అంతర్జ్యోతిరసంప్లవం
అభియాయత మోంకారం తస్యతత్ప్రేరకంపరమ్.

(అంతర్జ్యోతి............. యగు సూర్యుడు విష్ణ్వంశ సంభూతుడు. ఓంకారమె ఆతని ప్రేరేపింప గలది.)

"కలనం దావక ఖద్యోతహస్తదళితఘాత్మభర్తమార్తాండ మండల ఖేదం బొనరించియేగ నెడ పన్మన్యంబునన్ హారకుం, డల కేయూరకకిరీట ధారియగు శ్రీ నారాయణుం గాంచి లోగలగంబారుచు నేగ నీవనెడుశంకన్ గృష్ణరాయాధిపా"

యని కీర్తించిన కవిరాయని యతిశకల్పనము నిరాధారమైనది కాజాలదు.

## అశ్వినీ దేవతలు

అతిప్రాచీనకాలమునందు రచింపబడిన వేదాది గ్రంథములందు జ్యోతిర్గణములోనివారగు నశ్వినీదేవతలు పేర్కొనబడియున్నారు. ఈనామమునకు అశ్వములు కలవారను నర్థము స్ఫురించుచున్నది. కాని, ఆనక్షత్ర రాశియందలి నక్షత్రములు అశ్వముఖమువలె నేర్పడియుండుటవలన నారాశి కట్టినామము కలిగెనని యాధునిక జ్యోతిశ్శాస్త్రగ్రంథములు సూచించుచున్నవి. ఆకసమున సూర్యుని కక్ష్యయగు విషువద్వలయమునందు ప్రథమ భాగమునయున్న యశ్వినీనక్షత్రము లిపటమునందు చూపబడిన రీతినేర్పడియుండు టెల్లరును గమనించియే యుందురు.



అశ్వినీనక్షత్రములను సూర్యచంద్రులతో పోల్చుటకు కొన్నిప్రయత్నములు జరిగినవి. సూర్యుని పుత్రికయగు 'సూర్య' యను నాపె, యశ్వినీదేవతలతోగూడి వారి రథమెక్కి తిరుగుచుట్లును, వారిభార్యయై యుండినట్లును చాలచోట్ల సూచింపబడి యున్నది. ఋగ్వేదమునం దొకచోట [మం VI ఋ 58(4)] నాపెకు పూషునితోడను, వేరొకచోట [మం X, ఋ 85] చంద్రునితోడను సంబంధమున్నటుల వ్రాయబడియున్నది. గ్రీకుల ఖగోళశాస్త్రములందు వర్ణింపబడిన డియోస్కూరాయ్ (Dioskouroi) యొక్కయు మన యశ్వినీదేవతలయొక్కయు స్వరూపస్వభావములందు కొంతసంబంధమున్నటుల దోచుచున్నది.

## సోముడు

ఋగ్వేదరచయితల పరమావధి చంద్రారాధనమే యైయుండెనేమోనని హిల్లిబ్రాంటు (Hilibrandt) అను నొక జర్మనుశాస్త్రజ్ఞు డభిప్రాయపడుచున్నాడు. కాని చంద్రునకు 'సోము'డను నామమున్నటుల ఋగ్వేదమునందెచటను గానరాదు. అటుతరువాత రచింపబడిన గ్రంథములందును, ముఖ్యముగా అథర్వవేదమందును [మం VII

8(3)] చంద్రునకు 'సోము'డను నామ ముపయోగింప బడియున్నది. చంద్రు నొకప్రత్యేక దైవముగ నారాధించు నాచారము ఆధునికకాలమున హిందువులందు ప్రబలియుండలేదు. ఆధునిక జ్యోతిశ్శాస్త్రములందు చంద్రుడు నవగ్రహములలో నొకడై యందును ప్రాముఖ్యము లేనిస్థానము నలంకరించుచున్నాడు. కాని ప్రాచీన కాలమున 'సోము' డను దైవతమున కుండిన ప్రాముఖ్యమును, హిందూమతాచారములకును చంద్రుని సంచారమునకునుగల తీరని సంబంధమును గ్రహించినవారెల్లరును ఆధునికహైందవ దేవతారాధనమునందు సోము డిట్టి కనిష్ఠస్థానమున కెట్లు త్రోయబడెనా యని యాశ్చర్యము జెందకపోరు.

వేదములందు పేర్కొనబడిన యిట్టి దేవతలకును, మన మాపేరులతో నిపుడు పిలుచున్న జ్యోతిర్గోళములకును గల సంబంధమునుగూర్చి పరస్పరవిరుద్ధములగు నభిప్రాయములనేకము లీనడుము తెలుపూపినవి. మైత్రుడు సూర్యుడనియు, వరుణుడు చంద్రుడనియు, ఆదిత్యులు తదితరగ్రహములనియు, నీభావములను 'సెమిటిక్' లేక సెమేరియన్సు (Semarians) అనువారివద్దనుండి హిందువులు గ్రహించియుండిరనియు, ఒల్డెన్బర్గ 'వేదమతము (Die religion des veda) అను తనగ్రంథమున వ్రాసియున్నాడు. హిల్లిబ్రాంటు అనునాతడు ఋగ్వేదమునకు చంద్రారాధనమే పరమావధియై యున్నదని యూహించినటుల పైనవివరించియుంటిని. కాని అతిప్రాచీన కాలమునందు కూర్చబడిన వేదములందు వచ్చు దేవతలను గూర్చిన యూహాలన్నియు నిరర్థకములు. ఋషిపుంగవులు పూజించియుండిన దేవతలయొక్క స్వభావవర్ణనములకును అతిప్రాచీనములగు వేదములందు గీర్తింపబడిన దేవతలయొక్క స్వభావవర్ణనములకును జాల వ్యత్యాస మున్నటుల దోచుచున్నది. ఋగ్వేదమునందు వివరింపబడిన దేవతలలో సూర్యు డొక్కడు తప్ప తదితరులకు జ్యోతిశ్శాస్త్ర సాంప్రదాయానుసూర్యములగు స్వరూపస్వభావములు కానవచ్చుటలేదు. అట్టి వేమైన నొకచోటయుండినను, నవి యతిక్లిష్టములగు వేదసారస్వతమునందు మరుగుపడి మనకు గ్రహింప నలవిగాకున్నవి. కావున, వేదములు పేర్కొనుదైవతములకును, వేదకాలానంతరము మధ్యయుగమునందు హిందువులుపూజించుచుండిన జ్యోతిర్దేవతలకును, నెట్టిసంబంధములు గలవో విచారించుట మనకు సాధ్యమగుటలేదు.

సూర్యుని పూజావిధానమును గూర్చియైనను వేదములు ప్రత్యేకించి శాసించియుండలేదు. ఆకాలమునందు సూర్యుడును, తదితర దేవతలవలెనే ఆరాధింపబడెడివాడని మన మూహింపవలసియున్నది.

## వేదకాలానంతరము

వేదములు రచింపబడినపిదప చాలకాలము వరకును హిందూమత సారస్వతమునం దొక్కగ్రంథమైనను బయల్వెడలలేదని ప్రస్తుతకాలమున శాస్త్రజ్ఞులెల్లరు నొప్పుకొనుచునే యున్నారు. ఎటులున్నను ఆ మధ్యకాలమునందు మానవుల భావనాదర్శములు చాలవరకు మారిపోయియుండెనని మన మూహింపవచ్చును. వేదములు నిర్మింపబడిన సమయమునకును, అటుపిమ్మట రచింపబడిన మతగ్రంథములు వెలువడిన సమయమునకును నడుమకాలములో నెన్నివేల సంవత్సరములు గడచెనో కాని యాసమయమునందు మానవులభావములు సంపూర్ణముగ పరిణతములైననని మాత్రము ఒప్పుకొనక తప్పదు. అథర్వవేదమునందే ముందు రానున్న మార్పునకు సూచన లగపడినవి. ఇట్టిమార్పు జ్యోతిర్దేవతారాధనములందుకూడ కలిగియుండెననుటలో నాశ్చర్యములేదు. శతపథబ్రాహ్మణము [VI-1-2(8)] నందు ద్వాదశాదిత్యులగూర్చియు, వారికిని సంవత్సరమునవచ్చుపండ్రెండు మాసములకునుగల బాంధవ్యమునుగూర్చియు సూచింపబడియున్నది. అటుపిమ్మట, నీసూదిత్యవర్గ మంతయు నొక్కసూర్యదేవునియందు లీనమై, ఆతడే సూర్య, సావిత్రి, మైత్ర, అర్యమాన్, పూషాది నామాంతరములతో పిలువబడుచుండెను. ఉపనిషత్తులందు సూర్యునకువిశేషమగు ప్రాముఖ్యము వచ్చినది. ఛాందోగ్యోపనిషత్తు (I-6) నందు సత్యయజ్ఞపౌలుషి

> "అథయదేతదాదిత్యస్యశుక్లం భాస్సైవసాఽథయన్నీలంపరఃకృష్ణం తదము స్తత్సామాథయ ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే హిరణ్యశ్మశ్రుహిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః"
>
> (సూర్యునియందగపడెడి ఆహిరణ్మయ పూరుషుడు.........సకలలోకముల కధినాథుడు ......)

అనివర్ణించియున్నాడు. ఈ ఉపనిషత్తునందు తృతీయ ఖండ మంతయు సూర్యకిరణధ్యానమును గూర్చినదై యున్నది. ఆదికావ్యములగు సంస్కృతభారత రామాయణములందు సూర్యారాధనము వివరింపబడియున్నది. భారతమున [ప III-3] సూర్యుడు అష్టోత్తరనామముల గీర్తింపబడియున్నాడు. రామాయణమునందు యుద్ధకాండమున నొక్క యధ్యాయము సంపూర్తిగ సూర్యసంకీర్తనమునకే వినియోగింపబడి యున్నది. (గోపీనాథరామాయణము, యుద్ధకాండమున పద్యము 2697 మొదలు 2718 పర్యంతము చూడుడు) అగస్త్యుడు రామున కిట్లు ఆదిత్యహృదయంబను స్తోత్రంబు నుపదేశించెను.

"సీ. దశరథతనయ యెద్దాని జపించిన
    గలన శత్రుజయంబు గలుగు నట్టి
యాదిత్యహృదయాఖ్యమగు స్తోత్ర మిపు డుప
    దేశింతు దాని బ్రతిగ్రహింపు
మది గుహ్య మది పుణ్య మది విజయావహం
    బది శత్రునాశన మదియు జప్య
మది శివ మక్షయ్య మది సర్వమంగళ
    మాంగళ్యమును బరమంబు సర్వ
తాపనాశంబు శోకచింతాప్రశమన
ముత్తమంబ ప్రతర్క్య మాయుష్కరంబు
వీర్యవర్ధన మంచితైశ్వర్యకరము
నిఖిలపాపప్రణాశంబు నిర్మలాత్మ"

బౌద్ధసారస్వతభాగములగు "జాతకములు" కూడ సూర్యారాధనమును గూర్చి ముచ్చటించుచున్నవి. పురాణములందు సూర్యుని గురించి యితిహాసములు పెక్కులున్నవి. వానిలో సూర్యవంశక్రమము వర్ణింపబడియున్నది. ప్రస్తుతకాలమున నుదయపురము, యోధపురము, జయపురము మొదలగు నుత్తరహిందూస్థానరాజ్యాధిపులు సూర్యవంశీయులని వాడుకొనుచున్నారు. వాయుపురాణమున 11 వ అధ్యాయమున వివరింపబడిన సూర్యారాధన క్రమ మిప్పటికిని కొంతవరకు హిందువులచే నాచరింపబడుచునే యున్నది.

సూర్యదేవతోపాసనమునందు పరస్పర విరుద్ధములగు రెండు సిద్ధాంతములు కానవచ్చుచున్నవి. అం దొకటి హైందవమత సాంప్రదాయములందు జనించినది. రెండవది పరమత ప్రచారమువలన నుత్పన్నమైనది. హిందూమతమున సూర్యదేవుడు పరమాత్మయగు బ్రహ్మమం దైక్యమగుచున్నాడు. సంధ్యావందనమందలి ముఖ్యభాగ మగు గాయత్రీమంత్రము [ఋగ్వేదము III, 62 (10)] సావిత్రీమంత్రమే. ఇయ్యది అనాదిని, సూర్యు నుద్దేశించియే రచింపబడెనేమో యను ననుమానము పొడముచున్నది. ఈమంత్రము నాంధ్రీకరించినచో నిట్లు చెప్పవచ్చును. దైవమగు సావిత్రియొక్క అప్రతిమానమగు మహిమ మనకు ప్రాప్తించుగాక; మన ప్రార్థనముల కాతడిది ప్రసాదించుగాత". వేదములలో సూర్యుని స్ఫురింపజేయని ఋక్కు ఒక్కటైనను కానరాదని కొందరి మతము, కాని రెండవమతమునకు వేదములందు ప్రమాణము లున్నను, హిందువుల యాచారములకు భిన్నముగ గన్పట్టుచు, చాల కాలము ఉత్తరహిందూదేశమున ప్రచారములో నుండెను.

## కొన్ని యితిహాసములు

జ్యోతిశ్శాస్త్రమునందు వచ్చు దేవతలను గూర్చిన యితిహాసములు కొన్ని వేదములనుండి సంగ్రహింపబడి యున్నవి. కాని, అట్టి యితిహాసము లనేకములు కావ్యయుగమునందే సృష్టింపబడినటుల నగపడుచున్నది. పెక్కుకథలకు వేదములం దెట్టి యాధారము నున్నటుల లేదు. ఋగ్వేదమునందు [మం. ఋ 175 (4)] ఇంద్రుడు సూర్యునిరథచక్రమును సంగ్రహించెననియెడి విచిత్రగాథ యొకటి కానవచ్చుచున్నది. కాని వేదకాలానంతరము కావ్యయుగమున నిర్మింపబడిన కథలన్నియు సూర్యచంద్రులకు సంబంధించినవై యున్నవి. రాహుకేతువులను రాక్షసులు సూర్యచంద్రుల గ్రసించి గ్రహణముల గల్గించుచున్నారను గాథ యతి ప్రాచీనమైనది. వాల్మీకిరామాయణమున చాలచోట్ల (కాం II అ 4; కాం IV అ 22 మొ...) నీకథ సూచింపబడియున్నది. రోహిణియు, చంద్రుడును భార్యాభర్తలై యున్నట్లును, వారి యన్యోన్యానురాగము మానవుల కాదర్శమైనట్లును కూడ రామాయణమునందే కొన్ని చోట్ల వ్రాయబడి యున్నది. వాల్మీకి రామాయణము (కాం ii అ 16) నందు, రామునకు సీతపైగల యనురాగము, చంద్రునకు రోహిణిపైగల యనురాగముతో పోల్పబడియున్నది. అతి ప్రాచీనకవియగు శూద్రకుని మృచ్ఛకటికమునందు (iV అంకము) ను

ఈకథ యుదహరింపబడి యున్నది. విచిత్రములగు గాథలనేకములు నేటికిని ప్రచారములో నున్నవి. వానిలో గొన్నిటి నిట పొందుపరచుచున్నాను.

సూర్యుడు 'సంజ్ఞ' యను నామెను వివాహమాడెను. సూర్యుని యప్రతిమానమగు ప్రతిభకు సహింపలేక ఛాయ (నీడ) యనునొక పరిచారికను సంజ్ఞాదేవి తనభర్త కొసంగి, యరణ్యములకేగి, యాడుగుఱ్ఱపు రూపమును దాల్చి తిరుగాడుచుండెను. సూర్యుడు మగగుఱ్ఱము రూపమున నామెను గలసికొనెను. అశ్వినీదేవతలు వారి సంతానములోని వారేనట. సూర్యుని ప్రతిభను తగ్గింప నెంచి, సంజ్ఞాదేవి తండ్రి, యల్లుని నొక కొలతబద్దపై బెట్టి ఎనిమిదవ వంతును తెగగొట్టెను. ఆవిరుగగొట్టబడిన భాగమునుండియే, విష్ణుదేవుని చక్రమును, శివునిత్రిశూలమును, కార్తికేయుని బరిసెయు మొదలగునవి యుద్భవించినవి. సూర్యుడు మహాపండితుడు. ఆతడు వేదములను సాంగోపాంగముగా నెరిగినవాడు. మార్కండేయ పురాణము (అ 103,20)న నీశ్లోక మున్నది.

తదేవం భగవా న్భాస్వా న్వేదాత్మా వేదసంస్థితః
వేదవిద్యాత్మక శ్చైవ పరః పురుష ఉచ్యతే॥

(వేదాత్ముడు, వేదసంస్థితుడు, వేదవిద్యాత్మకుడు నగు సూర్య భగవానుడే పరమపురుషుడని పేర్కొనబడుచున్నాడు.)

సూర్యుడు, స్మృతికర్తయగు యాజ్ఞవల్క్యునకు వేదార్థముల నుద్బోధించినట్లుల ఆల్బిరూని (Albiruni) యను పారశీకుడు రచించిన 'India' యను గ్రంథమున నున్నది. సూర్యుడు మయునకు గ్రహనిర్మాణక్రమము నుపదేశించినట్లుల సూర్యసిద్ధాంతము చూపుచున్నది:
"యథాశిఖా మయూరాణాం నాగానాం మణయోయథా తద్వద్వేదాంగ శాస్త్రాణాం గణితమ్ మూర్ధని స్థితమ్."

చంద్రుడు దేవదానవుల క్షీరసాగరమథనమున నుద్భవించె ననియు, లక్ష్మికి దోడబుట్టినవా డనియు, భారతము (ఆదిపర్వము 11-15)న గలదు. దక్షుని కుమార్తెల నిర్వదేడుగుర నాతడు వివాహమాడెను. వారే యిర్వదేడుగురు నక్షత్రకాంతలు. వారిలో రోహిణియను నామెను చంద్రుడు అధికముగ ప్రేమించుచుండెను. రోహిణీనక్షత్రము వృషభరాశియందు యీ పటమున జూపబడిన రీతి నేర్పడియున్న నక్షత్రములలో ప్రకాశవంత మగు నెఱ్ఱని నక్షత్రము. చంద్రు

*

*　*

రోహిణి *　*

డామెపై జూపెడి యభిమానమున కామె సోదరీబృందము కినిసి, తమతండ్రి యగు దక్షునితో మొరలిడుకొనిరి. దక్షుడు, అల్లుని పాక్షికబుద్ధికి గోపించి, క్షయవ్యాధి పీడితుడవు కమ్మని యాతని శపించెను. అటుపిమ్మట చంద్రుని ప్రార్థనములచే ప్రసన్నుడై, యాతని క్షయ రోగము నెలలో నొకసారి వృద్ధిక్షీణతల నందియుండు నటులమార్చి దక్షు డాశాపము నుపసంహరించెను. ఇదియే చంద్రుని కళలయందు వృద్ధిక్షీణతలకు గారణమట. విష్ణు పురాణము) చతుర్థాంశము,షష్ఠోధ్యాయము)న చంద్రుని వివాహమును గూర్చిన వేరొక గాథ వర్ణింపబడి యున్నది. చంద్రుడు దేవగురుని భార్యయగు తార నెత్తుకొనిపోయెను. అందువలన దేవతలం దొక ఘోరయుద్ధము పొసగెను. తారాచంద్రుల సంయోగము వలన నవగ్రహములలో నొకడగు బుధుడు జనించెను. ఆబుధునివలన చంద్రవంశము విజృంభించెను.

అంగారకుడు శివుని కుమారుడట, శివునికుమారుడగు కార్తికేయుడే యీతడని కొన్నిచోట్ల వ్రాయబడి యున్నది. కార్తికేయుడు పృథునాథుడు(యుద్ధదేవుడు) నెమలి వాహనముగా గలవాడు. విల్లు నంబుల దాల్చువాడు. పిల్లలకోడి (లేక గురకోయలు) అని మనము సాధారణముగా పిలచుచుండెడి కృత్తికలు అతని పెంచి యుండుటవలననే కార్తికేయుడను పేరాతనికి గలిగెనట.

బుధుడు మహాజ్ఞాని; తారాచంద్రుల పుత్త్రుడు. శుక్రుడు భృగు మహర్షి పుత్త్రుడు. బృహస్పతి దేవతల గురువు. శని, సూర్యునకును ఛాయకును బుట్టినవాడు. సర్పరూపుడగు రాహువునుగూర్చిన గాథ గ్రహణ కారణముల వివరించుచున్నందున జనసామాన్యమునకు చిరపరిచయమైనదై యున్నది. దేవాసురులు సాగరమథనముచే నమృతమును సంపాదించిరి. ఆయమృతమును విభజించు

కొనుటలో నిరుపక్షములవారికిని గొప్ప పోరాటము సంభవించెను. శ్రీకృష్ణుడు మోహిని రూపమును దాల్చి, యమృతమును పంచి పెట్టుటకు పూనుకొనెను, దేవతలొక ప్రక్కను రాక్షసులొక ప్రక్కను బారులుతీర్చి కూర్చుండిరి. రాక్షసుడగు రాహువు దేవతాస్వరూపమును దాల్చి దేవతలనడుమ నిరికెను. మోహిని, మొట్టమొదట దేవతల కాయమృతమును వడ్డించుచు రాగా, కృత్రిమవేషమున నున్న రాహువునకుగూడ నమృతము నొసంగెను. సూర్యచంద్రులు రాహువు చేసిన మోసమును గ్రహించి, మోహిని రూపమున నున్న విష్ణువునకు చే సైగజేసిరి. శ్రీకృష్ణు డాకపటమును వెంటనే గ్రహించి, రాహువు త్రాగిన యమృతము కంఠములో నుండి దిగకమునుపే చక్రమును ప్రయోగింప "రాహుకంఠము దెగి దేహము ధరణింబడియె దన్ముఖ మమృతస్పర్శమున నక్షయంబై నిలచెన్" (భారతము). ఆతని దుర్గతికి సూర్యచంద్రులే కారకు లనియెడి యుద్రోకముచే, రాహు విప్పటికిని సూర్యచంద్రుల నపుడపుడు గ్రసించుచు, గ్రహణములను కల్గించుచున్నాడు. ఈగాథ చాల వింతగనున్నది. కాని జ్యోతిశ్శాస్త్రమునందు తదితర గ్రహములకువలెగాక, రాహువున కొకగోళస్వరూపము లేదు. శనియాదిగాగల గ్రహములను గోళరూపమున నాకాశమునందు మనము చూడగలుగుచున్నాము గాని రాహుగోళమును దాని నెవ్వరు నెన్నడును జూచియుండలేదు. ఖగోళము(Ce!e ti-al sphere) పై సూర్యచంద్రులకక్ష్య లొకదాని కొకటి యొరగిలబడియున్నవి. ఆకక్ష్యలు రెండును కలసిన రెండు బిందువులలో నొకటి రాహువును మరియొకటి కేతువు నని జ్యోతిశ్శాస్త్రమున పిలువబడుచున్నవి. ఖగోళము పై సూర్యచంద్రుల కక్ష్యలు స్థిరములైనవి కావు. సూర్యుని కక్ష్యయగు క్రాంతి వలయము బహుసూక్ష్మముగను, చంద్రుని కక్ష్య చాల త్వరితముగను మార్పుజెందుచున్నవి. ఈమార్పువలననే, యీరెండు వలయములును కలసికొనెడి బిందువులుకూడ ప్రతినెలకు మారుచుండును. అయినను, యీరెండు బిందువులు [అనగా, రాహుకేతువులు] నెల్లపుడు నొకదానికొకటి సూటిగ ఖగోళము యొక్క లంబరేఖ(Diameter)కిరుపార్శ్వములనుండును. అనగా, ఖగోళమున విషువవలయమును 360 సమభాగములు డిగ్రీలుగ విభజించినచో, రాహుకేతు బిందువుల నడుమ సరిగా 180 డిగ్రీలుండును. ప్రాచీన గ్రంథములందు కేతువుయొక్క నామమే యుదహరింపబడియుండక పోవుటచేత, కేతువు మధ్యయుగమునందే జ్యోతిశ్శాస్త్రములోనికి దీసికొని రాబడెనని విదితమగుచున్నది. గోళరూపమున నాకసమున మన కగపించెడి గ్రహములలో శని సుమారు 30 సంవత్సరములలో నొక్కసారి ఖగోళమును చుట్టివచ్చుచున్నాడు. అనగా నాకాలములో సూర్యునిచుట్టు నొక్కసారి ప్రదక్షిణముచేయుచున్నాడు. అటులనే, బృహస్పతి, అంగారకుడు, శుక్రుడు, బుధుడు ...అని మనము పిలచెడి గ్రహగోళములు నియమిత సమయములలో సూర్యునిచుట్టు నొకసారి తిరిగి వచ్చుచున్నవి. అటులనే రాహుకేతు బిందువులును పదునెనిమిది మాసములలో నొకసారి ఖగోళమును చుట్టివచ్చుచున్నవి. కావుననే, యీ బిందువు లాకసమున మనకు ప్రత్యక్షముగ నగపించునవి కాకపోయినను, తదితరగ్రహములవలె నియమితకాలములో నొకసూర్యునిచుట్టి వచ్చుటచేతనే గ్రహవర్గమున జేర్పబడియుండవచ్చును.

శ్రీకృష్ణుని వాహనమగు గరుత్మంతుడు సూర్యాంశసంభూతుడని పాశ్చాత్యశాస్త్రజ్ఞుడగు 'జాకొబి' యను నతడు తలచుచున్నాడు. వినతకు కశ్యపమహర్షి కృప వలన లభించిన యండ మవియుటచే జనించిన గరుడుడు సూర్యమండలముదాక నెగయుట మొదలగు వృత్తాంతములు భారతమునందు వర్ణింపబడియున్నవి కాని 'జాకొబి'యొక్క ఊహల కట్టి యాధారము నగపించుట లేదు. గరుడుని సోదరుడగు ననూరుడు సూర్యరథసూతుడై యరిగెనట. అంతియేగాని, గరుడునిచరిత్రమునం దెచ్చటను సూర్యాంశమహత్వము విదితమైనటుల లేదు.

ఉత్తరదిక్కుననున్న ప్రకాశవంతములగు నక్షత్రములలో ధ్రువనక్షత్రము నొకటి. ఇది క్రీస్తుశకారంభమునకు 2780 యేండ్ల పూర్వమే గుర్తింపబడెనని 'జాకొబీ' యను పాశ్చాత్యపండితు డొక యభిప్రాయపడుచున్నాడు. ధ్రువుడు సవతితల్లి సురుచి ప్రేరేపణము వలన తండ్రియగు నుత్తానపాదునిచే నవమానింపబడి, యడవులకేగి, నారదోపదేశమున నారాయణునిగూర్చి యుగ్రతపమొనర్చి శాశ్వతమగు ధ్రువలోకమును జెందెనని యెడిగాథ హిందువులం దాబాల గోపాల మెరిగినదే.



శ్రీకాకుళ దేవాలయము

ఇది దేవరకోట సంస్థానములోనిది.



చల్లపల్లిలోఁగల శ్రీ దేవరకోట సంస్థానాధీశ్వరుల సౌధము

కాశిలోఁగల యొక్క పెద్దసౌధమునను సరించి కట్టఁబడినది. ఇది, కల్లేపల్లి శ్రీకాకుళముల దేవాలయములు

1746-1791 వఱకుఁ బాలించిన కోదండరామన్నగారిచేత నిర్మింపఁబడినవి.

ప్రస్తుతకాలమునం దీ ధ్రువనక్షత్రము ఖగోళముయొక్క ధ్రువస్థానమున నున్నదని—అనగా, నీనక్షత్రముచుట్టను ఆకాశమునందలి ప్రతినక్షత్రము దినమునకొకసారి తిరుగుచుండునని—ఆకసమును జాగ్రతగ పరిశీలించువారికి తోపకమానదు. కాని ఖగోళముయొక్క ధ్రువస్థానము కాలక్రమమున నిప్పటి ధ్రువతారకు దూరస్థమై సుమారు 13,000 సంవత్సరములలో నీనక్షత్రమునకు 46 డిగ్రీలు దిగువకేగునని యాధునిక పరిశోధనలు తెలుపుచున్నవి. ధ్రువతారయొక్క చలనము మన మూహింపజాలనంత సూక్ష్మమని మైత్రాయనబ్రాహ్మణోపనిషత్తునందు సూచింపబడియున్నదట.

ఉత్తర ధ్రువప్రాంతములం దగపడు ప్రకాశవంతములగు నేడు నక్షత్రములను సప్తర్షిమండలమని పిలచుచున్నాము. వారేడుగురును కృత్తికలకు భర్తలు. శాలివాహన శకాదికి 2536 యేండ్ల పూర్వ మీసప్తర్షులు మఘారాశియందుండిరని పురాణములందును, అటుపిమ్మట వరాహమిహిరుని బృహత్సంహిత యందును (13 అధ్యాయము) వ్రాయబడియున్నది. ఈనక్షత్రములు అస్థిరములనియు, నొక్కొక్క నక్షత్రరాశి 100 సంవత్సరముల చొప్పున గదలుచుండుననియు నందు వ్రాయబడియున్నది. బృహత్సంహిత త్రయోదశాధ్యాయమున నీసప్తర్షుల నామములు వివరింపబడియున్నవి గాని, వానికి జ్యోతిశ్శాస్త్రముతో సంబంధించిన యర్థమేమియు నున్నట్లగపడదు.

అరుంధతి సూత్రసారస్వతమునందు తరచుగా నుదహరింపబడియున్నది. ఆనక్షత్రము సప్తర్షులలో నొకడగు వసిష్ఠుని చెంతనే బహుసూక్ష్మముగ నగపడుచుండును. దానిని గుర్తింపజాలని మానవులు ఆరుమాసములలో మరణింతురని యొక పుక్కిటి పురాణము హిందూసంఘమున ప్రచారములోనున్నది.

కృత్తిక గుంపునం దేడు చిన్ననక్షత్రములు మిణుకుమిణుకుమనుచు మనకగుపడుచుండును. దూరదర్శిని యంత్రముగుండ చూచిన నందు సుమారు 300 నక్షత్రములున్నటుల నగుపడును. కాని హిందువుల జ్యోతిశ్శాస్త్రమున కృత్తికయందు ఏడే తారలున్నవనియు, నవి సప్తర్షుల భార్యలనియు వర్ణింపబడియున్నది.

1. అంబా 2. దులా 3. నితత్ని 4. రభ్రయన్తీ 5. మేఘయన్తీ 6. వర్షయన్తీ 7. చుపుణికా నామాసి ప్రజాపతీ నాత్వావిశ్వాభిర్ద్భిరూప దధామి.—

[తైత్తిరీయ బ్రాహ్మణము iv-4-5 (1)]

ఇందు సప్తతారల పేరులు వివరింపబడియున్నవి. ఈకృత్తికలే వర్షకారకములనియెడి యభిప్రాయము ప్రబలియున్నటుల అభ్రయన్తి, మేఘయన్తి; వర్షయన్తి యను నామములనుబట్టి యూహింపవచ్చును. కాని, యీవర్షములకుగల సంబంధమును ఆధునికులు నిరాకరించియున్నారు.

[వరాహమిహిరునిబృహత్సంహిత 21 (5) చూ.]

ఆకాశమున వెలుగు నక్షత్రరాసులను గురించిన కొన్ని వింతకథలు ప్రచారములో నున్నవి. ఋగ్వేదమునందలి యొక ఋక్కు [మం i ఋ 71 (5)] పై నాధారపడి, రోహిణి, మృగశిర, మృగవ్యాధ నక్షత్రములకు సంబంధించిన యొకకథ గలదు. వృషభరాశియందు రోహిణినక్షత్రముయొక్క స్థానమును పైపటమున జూపియుంటిని. రోహిణికి దూర్పున మృగశిరనక్షత్ర మున్నది. మృగశిరరాశియందు నక్షత్రము లీపటము చూపురీతి నేర్పడి యున్నవి. గ్రీకుదేశస్థు లీరాశిని ఒరయాన్ రాక్షసు




(Giant Orion)డందురు. పైపటమున నుత్తరముననున్న యొంటినక్షత్రమే హిందూశాస్త్రమున మృగశిర యని

పిలుచుచున్నాము. అది ఒరయాన్ రాక్షసుని శిరమట. దాని దిగువనున్న రెండునక్షత్రములును ఒరయాన్ యొక్క భుజస్కంధములు. వానిలో తూర్పున నున్నది 'ఆర్ద్రానక్షత్రము' అని మనము పిలుచుచున్నాము. వానికి దిగువ దాదాపుగా పూర్వపశ్చిమదిక్కులకు పంక్తిగ నేర్పడియున్న నక్షత్రత్రయము ఒరయాన్ యొక్క నడుముఘట్టి. వానికి దిగువ నుత్తర దక్షిణములకు పంక్తిగ నేర్పడియున్న నక్షత్రత్రయ మాతని ఖడ్గము. దిగువనున్న రెండునక్షత్రములును ఆతనిపాదములు.

మృగవ్యాధ నక్షత్రము (Sirius) ఆకాశమున ప్రకాశవంతములగు తారలలో నొకటి. స్వచ్ఛమగు దాని ప్రకాశతనుబట్టియే దాని నాకసమునందు గురుతింపగలము. అది ఒరయాన్ రాక్షసుని నడుముఘట్టిగా నేర్పడియున్న మూడు నక్షత్రములవరుసనే సూటిగా దూర్పునకు జూచినయెడల నగపడును. అది యీకాలమున ప్రొద్దుగ్రుంకగనే తూర్పున నగపడుచుండును. ఒరయాన్ రాక్షసునకు ప్రజాపతియనియెడి నామమును హిందువులు వాడుచున్నట్లు తెలియుచున్నది. ప్రజాపతి (Orion) తనకుమార్తె యగు రోహిణి (Aldebaran)ని తగుల్కొని పోవుచుండగా, మృగవ్యాధుడు (Sirius) ఇక్షుత్రికాండ మనియెడి తనబాణముతో నాతని గొట్టెను. ఆబాణమే యాతనినడుమున నాటుకొనియెను. దానినే మనమిపుడు ఒరయాన్ నడుముఘట్టియని పిలుచుచున్నాము.

మృగవ్యాధ నక్షత్రమునే దివ్యశ్వానమని యథర్వవేదమునందు వాడినటుల వేదవ్యాఖ్యాతలు సూచించుచున్నారు. (అథర్వవేదము v-80 చూ:) పాశ్చాత్య శాస్త్రమునందుకూడ 'Sirius' యనియెడి యీనక్షత్రమునకు 'Dog star' యను నామాంతరముకలదు. ఒరయాన్ రాక్షసు డొక వేటకాడు అనియు, నాతడు తన వేట కుక్కయగు దివ్యశ్వానము (మృగవ్యాధుడు) ను వెంట నిడుకొని కృత్తికలను వేటాడెననియు, నాతనినొక యెలుగుబంటి (Great Bear సప్తర్షి మండలము?) వెంబడించెననియు, చివర కొక తేలు(Scorpion-వృశ్చికము) కుట్టగా మరణించెననియు నొకవిచిత్రమగు గాథ పాశ్చాత్యదేశములందు వాడుకలో నున్నది.

పైన వివరింపబడిన రోహిణికథయందు మృగశిరరాశి ప్రజాపతియనియెడు పేరున బరగి ఒరయాన్ రాక్షసునితో పోల్పబడినటుల దెలియుచున్నది. కాని బాలగంగాధరతిలకు కృతమగు 'ఒరయ్యా' (Orion) యను గ్రంథమునందు, ప్రస్తుతము ఒరయాన్ రాశియందున్న యారు నక్షత్రములే మృగశిరరాశి యగునని స్థాపింపబడియున్నది.

తైత్తిరీయ బ్రాహ్మణమునందు 'నక్షత్రప్రజాపతి' యనియెడి పురుషుడొకడు వర్ణింపబడియున్నాడు. మత్స్యపురాణము 54 అధ్యాయము నందును, బృహత్సంహిత(అధ్యా 5 శ్లో 105) యందును వర్ణింపబడిన'నక్షత్ర పురుషు'లకు సాదృశ్యమున్నటులున్నది. బృహజ్జాతకమున

కాలాంగాని వరాంగమాననమురోహృత్క్రోడ
వాసోభృతో, వస్తిర్వ్యంజన మూరుజానుయుగళే జం
ఘేతతంఘ్రిద్వయమ్, మేషాశ్వి ప్రథమానవక్షరా
చరణా చక్రస్థితా రాశయో

యని పన్రెండు రాసులును వేర్వేరు అంగములుగాగల మానవస్వరూపమును నిర్మించి, కాలపురుషుడని నామకరణము చేయబడియున్నది. బృహత్సంహితయందలి నక్షత్ర పురుషునివర్ణనము దీనిపైననే యాధారపడినట్లగపడుచున్నది.

## సూర్యారాధనము

హిందూదేశమున సూర్యారాధనమును, గ్రహారాధనమును,2000 యేండ్లక్రిందటనే,ప్రచారములోనున్నటులనేక ప్రమాణములుకలవు. తక్షశిలానగరమున సూర్యదేవాలయమొకటియున్నటుల ఫిలోస్ట్రిటస్ (Philostratus) యనుగ్రీకు దేశస్థుడు రచించిన "అపోలోనియస్ జీవిత చరిత్రము" (Life of Appollonius) అను గ్రంథమునన్నది. యాజ్ఞవల్క్యుడును, వరాహమిహిరుడును, సూర్యారాధన క్రమమును వివరించియున్నారు. ముల్తాన్ నగరమున సూర్యదేవాలయ మొకటి నిర్మింపబడినటుల భవిష్యపురాణము (139 వ అధ్యాయము)న నున్నది. ఈయాలయమునందలి సూర్య విగ్రహమునకు పుష్పములతోను, సుగంధములతోను పూజలొనర్చుచుండెడివాడని చైనాదేశమునుండి ప్రయాణికుడుగ నీదేశమునకు వచ్చిన యువాన్‌చ్వాంగ్ అనునాతడు వర్ణించియున్నాడు.

(బీల్ గారి గ్రంథము I -274-275 చూడుడు) ఆల్బిరూని యను పారశీకుడు, ఇండియా యను గ్రంథమున (I, పుట 16) యీ దేవాలయమును గూర్చి ముచ్చటించి యున్నాడు. క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్దమునందు జీవించియున్న ఆనంగగిరియను పండితుడు సూర్యారాధకుల నారు తెగలుగ విభజించి యున్నాడు. అందు కొందరు ఉదయించెడి సూర్యుని, కొందరు మాధ్యాహ్నిక సూర్యమండలమును, మరికొందర స్తంగతుడగు సూర్యుని, నింకను గొందరు,— ఉదయ, మధ్యందిన, సాయంసమయముల త్రిమూర్తుల గనబడెడి సూర్యుని యారాధింపుచుండెడివారని చూపియున్నాడు. క్రీస్తుశకము 466 వ సంవత్సరమునందు చెక్కబడిన యొక శిల్పమునందు, సూర్యారాధనము సూచింపబడియున్నది. కాని యంతకు బూర్వ మీయాచారము వాడుకలో నుండెననుటకు నిదర్శనము లెవ్వియు గానరావు. అటుపిమ్మట నిది ప్రబలియుండెననుటకు నిదర్శనము లనేకములు కలవు. ప్రాచీన శాసనములలో మన కుపకరించు కొన్ని భాగము లిందు పొందుపరచుచున్నాను.

1. May that sun......whom the brahmans of enlightened minds, according to due rite... to be applied to a lamp for the divine sun.

విజ్ఞానులగు బ్రాహ్మణులు నియమిత విధుల నెవ్వని (పూజింతురో...) అట్టి సూర్యుడు......గాక!

స్కందగుప్తుని యిందూరు శాసనము క్రీ. శ. 465-466.

(Corpus Inscriptionum Indicarum Vol iii Page 71)

2. May that sun protect you who is worshipped by the post of gods for existence, and by the siddhas who wish for supernatural powers...who is the cause of the Destruction and the commencement of the Universe. Reverence to that sun whom the Brahminical sages......failed to comprehend, who nourishes the whole of the three worlds; who when he is risen is praised by Gandharwas, Gods, Siddha's, Kinnaras and Naras, and who grants desires to those who worship.

బ్రతుకుదెరవునకై సురానీకమును, దివ్యసామర్థ్యములకై సిద్ధులును యెవ్వని సేవించుచున్నారో, యెవ్వడు జగత్తుయొక్క యుత్పత్తిలయములకు కారణభూతుడో అట్టిసూర్యుడు మిమ్ములను రక్షించుగాక. ఎవడు (బ్రాహ్మణ) ఋషులకు భావనాతీతుడో, ఎవడు జగత్త్రయమునకు ఆధారభూతుడో, గంధర్వులు, సురలు సిద్ధులు, కిన్నరులు, నరులు ఎవ్వనియుదయమున గీర్తించుచున్నారో సేవించువారి కామితార్థముల నెవడు ప్రసాదించునో అట్టిసూర్యునకు జోహారు'

(కుమారగుప్తుని మందసోరు శాసనము క్రీ. శ. 473-474)

(Corpus Inscriptionum Indicarum, Page 87)

3. Let it be known to you that this village is given by me......to the holy Aditya...... with libations of water, to be enjoyed as long as the moon, the sun and the planets endure.

ఆదిత్యదేవున కీగ్రామమును నేను ఆచంద్రతారార్కముగ ననుభవించుటకు ధారాదత్తమొనర్చుచున్నానని మీరెరుగుదురు.

(జయవర్ధనుని రఘోలి రేకులు II బాలఘాట్ (Epigraphia Indica)

## సూర్యసిద్ధాంతము

సూర్యారాధనాచారము ప్రబలియుండె ననుటకు గ్రంథస్థమగు వేఱొకనిదర్శనము కానవచ్చుచున్నది. మధ్యయుగమున రచింపబడిన గ్రంథములలో సూర్యసిద్ధాంతము ప్రాముఖ్యమైనది. అందు ప్రథమశ్లోకము లివి.

అల్పావశిష్టేతు కృతేర్మయోనామమహాసురః
రహస్యం పరమంపుణ్యం జిజ్ఞాసుర్జ్ఞాన ముత్తమమ్
వేదాంగమగ్ర్యమఖిలం జ్యోతిషాంగతికారణమ్
ఆరాధయన్వివస్వన్తం తపస్తేపే సుదుశ్చరమ్
తోషితస్తపసా తేన ప్రీతస్తస్మై వరార్థినే
గ్రహాణాంచరితం ప్రాదా మయాయసవితాస్వయమ్.

శ్రీసూర్యఉవాచ:—

విదితస్తేమయాభావ స్తోషిత స్తపసాహ్యహమ్
దద్యాంకాలాశ్రయం జ్ఞానం గ్రహాణాంచరితంమహత్
న మే తేజః సహః కశ్చిదాఖ్యాతుం నాస్తిమేక్షణః
మదంశః పురుషోఽయం తేనిః శేషం కథయిష్యతి

[కృతయుగము అల్పావశిష్టమైయుండగా (సుమారు 2,000,000 యేండ్లక్రిందట) మయమహాసురుడు జ్యోతిషశాస్త్రము నెరుగగోరి, సూర్యునిగూర్చి యుగ్రతపము జేసెను. సూర్యుడు సంప్రీతుడై, వరార్థియగు మయునకు గ్రహచరితమును యిట్లు చెప్పెను. "నీ యభిప్రాయము నాకు విదితమైనది. నీతపస్సునకు సంతసించితిని. మహత్తరమును కాలాశ్రయమునగు గ్రహచరితమును నీకిచ్చెదను. నా తేజము నెవ్వరుసహింపజాలరు. నేనుచెప్పుటకు నాకు తీరికలేదు.* మదంశగల యీపురుషుడు సమగ్రముగ నీకది వివరింపగలడు."]

ఈశ్లోకములకు దరువాత వేఱొకశ్లోకము కొన్ని వ్రాతప్రతులందున్నది కాని యది ప్రక్షిప్తమని యనేకు లెంచుచున్నారు. దానిసారాంశ మిది:

(నీ నివాసస్థానమగు రోమకపురమునకు బొమ్ము. అచ్చట బ్రహ్మశాపమున కారాగారావస్థ ననుభవించు నేనీశాస్త్రము నీ కుపదేశింతును.)

ఈశ్లోకము మూలగ్రంథమునందున్నదనిగేసే మన మొప్పుకొన్నయెడల, హిందువుల జ్యోతిశ్శాస్త్రములన్నియును, రోమకపురము అనగా గ్రీసుదేశము ముఖ్యపట్టణమగు రోము (Rome) నగరమునందే జన్మించెనని యొప్పుకొనవలసివచ్చును. కొందరు శాస్త్రజ్ఞులు రోము Rum) అనునగరము ఉత్తర హిందూస్థానము నందుండెడివని వాదించుచున్నారు గాని యది యంత సమంజసముగ గన్పించుట లేదు.

## విగ్రహములు

సూర్యదేవునకు కైంకర్య మొనర్పబడిన యాలయములు హిందూదేశమున చాల నరుదుగనున్నవి. అవి మనదేశమున నేయేభాగములం దెన్నెన్నియున్నవో విచారించు టనువిశము కాజాలదు. ఇంతవరకు మనకు తెలిసియున్నవానిలో చాలభాగము దేశమున నైరుతిమూలను, కథియవాడు తక్షశిలానగరముల నడుమనే యున్నవి. వంగదేశమున నుత్తరప్రాంతములందును, ఒరిస్సాయందును శిథిలములగు నాలయములు కొన్నియున్నవి. దక్షిణ దేశములో నెల్ల నొక్క తంజావూరునందే యొకటి గలదు. సూర్యవిగ్రహములు సూర్యదేవాలయములకంటె పెక్కులున్నవి; కాని అవియు, పైనవివరింపబడిన ప్రదేశములందే విశేషముగ కానవచ్చుచున్నవి. నవగ్రహముల ప్రతిమలు వీనికంటె నరుదుగనున్నవి. అవి ఉత్తరహిందూస్థానమునందు కొన్ని ప్రాంతములందు దొరకుచున్నవి. కొల్హాపురమునం దొకనవగ్రహాలయము కలదు. దక్షిణదేశమునందలి శివాలయములలో జరచుగా నవగ్రహములు ప్రతిష్ఠింపబడియేయున్నవి. కాని ప్రాచీనాలయములలో పైన వివరింపబడిన యొక్కతంజావూరునందుదక్క నింకెచటను నవగ్రహములు కానరావు. ఇట్లు మనకులభించిన శిలాప్రతిమలేగాక, పైన వివరింపబడిన యాయా ప్రదేశములందు నవగ్రహాదులగూర్చి ప్రశంసించెడి శాసనములు కొన్ని దొరకియున్నవి. వానిలో గ్వాలియరు, బులందషర్ ప్రాంతములదొరకినవి ముఖ్యములైనవి. అనాదినుండియు, సూర్యార్చనమును—నవగ్రహార్చనమును—విధివిధాయకముగజరుపుచుండినప్రదేశములలో గుజరాతులోని ముధేరాప్రాంతములు, రాజపుటానాలోని ఓసియా, సిరోహిప్రాంతములు, పంజాబులోని ముల్తాను, ఒరిస్సాలోని కొనారకు ప్రాంతములును ముఖ్యములు. దక్షిణదేశమునం దంతటిలోను, తంజావూరులోని 'సూర్యనార్ కోవిల్' యేకాకియై గన్పట్టుచున్నది.

చంద్రుని దైవతముగ పూజించుటాచారము కూడ హిందువులందు ప్రబలియుండెను. క్రీస్తు అనంతరము ద్వితీయశతాబ్దమునందు పాలించిన కుషాన్ వంశీయులగు రాజులనాణెములపై చంద్రునిప్రతిమ చెక్కబడియున్నది. వాయుపురాణము (చతుర్థాంశము, షష్ఠాధ్యాయము)న చంద్రవంశానుక్రమణిక వివరింపబడియున్నది. ఆంధ్రదేశమును పరిపాలించిన రాజులు కొందరు చంద్రవంశీయులమని వాడుకొనియున్నారు.



---

* యాజ్ఞవల్క్యుడు వేదముల బోధింపుమని సూర్యునివేడగా "నిరంతరము తిరుగుచుండవలసిన నాకదియెట్లుల సాధ్యమగును?" అనియెనట. అల్బిరూని, India 1, 129.

# కుసుమ రత్నమాల

పో. సూర్యనారాయణ శర్మగారు

క్రాలియూ నాలియు చేసుక
నోలిఁ దినంబెల్లఁ జెమట యూరిచి
[యెటో తా
నాలిం బిడ్డలఁ బెంచెడు;
మాలా? నవకుసుమరత్నమాలా? చెపుఁడా!

కాలంబంతయుఁ బరుల పా
లాలం బనిసేసియుఁ బసులం గాచియునుఁ
ఆలంబ మయ్యె వారికి;
మాలా? నవకుసుమరత్నమాలా? చెపుఁడా!

చాలఁగఁ బండించిన ధా
న్యా లితరుల కందియిచ్చి యంబలితో ను
ద్వేలానందము నందెడు;
మాలా? నవకుసుమరత్నమాలా? చెపుఁడా!

తాలిమితో సుతఁ బరుపా
దాలకుఁ జెప్పులను గుట్టి దయసేయును వ
స్త్రాలకు నూలిఁదీయును;
మాలా? నవకుసుమరత్నమాలా? చెపుఁడా!

రాలం గొట్టినవానిని
పూలం బూజించినట్టిపోలికఁ దలపైఁ
దాలుచుఁ బరుపాదాలను
మాలా? నవకుసుమరత్నమాలా? చెపుఁడా!

చందరునికి నూల్పోగను
చందంబున నీకు నే వెసం గూర్చితి నీ
కందములను, గుందమ్ముల
బొందగు మాలం ధరింపఁబోలదొ సఖుఁడా!



# మహాసతి సీత

కలువలపల్లి రంగనాథశాస్త్రి గారు

(సంపుటము ౨. సంచిక ౬ తరువాయి)

చ. బలుకడగండ్లపాలయిన భర్తలు చెంగట లేకయుండినన్
పలువలు కావరంబునను బైకొనఁజూచిన గానవంబులో
పల వసియించినం గలఁకపాటువహింపక ధీరచిత్తతన్
చెలువుగఁ గాచికొండ్రు నిజశీలము సాధ్వులు లోకమెన్నఁగన్. ౭౬

ఉ. శీలవతీవతంస మగు సీత మహాసతి దుర్మదుండు వా
చాలుఁడునైన రావణుని చాపలవృత్తిని మాన్ప నీతివా
గ్జాలము వేయుభంగుల నికామముగా వివరించి చెప్పి యు
ద్వేలశమాఢ్యయై తన మదిన్ స్మరియించుచునుండె రామునిన్. ౭౭

# చీనాయందు భారత నాగరికత ధర్మములు

శరణు రామస్వామిచౌదరి గారు

భారతీయనాగరికతధర్మోపదేశముల, చీనా దేశమున ఏభారతీయపండితవర్యులు, మతప్రచారకులు, మహానుభావులు సహింపరాని కష్టముల నెదుర్కొని స్వార్థత్యాగులై తమజీవితములకూడ నర్పించుటకు సిద్ధులై చీనాదేశమున భారతీయ నాగరికత, ధర్మోపదేశముల వెదచల్లిరో, ఆ మాననీయులకీర్తి నిసుమంతయైన మనచరిత్రయందుఁ గానము. కాని వారి నామములు చీనాదేశచరిత్రయందు సుప్రసిద్ధములు: వారి కీర్తి అక్షయము; వారిమహిమ అనశ్వరము.

చీనాభాషను, సాహిత్యమును జదివి మనపండితుల చరితములు లోకమునకు వెల్లడించిన పాశ్చాత్య విద్వాంసులకు మనము కృతజ్ఞులము. పెక్కురు పూజ్యులీకార్యమును నెఱవేర్చిరి. అందీక్రిందివారు సుప్రసిద్ధులు. వీరి నిరంతర కృషివలననే చీనాసాహిత్యము యొక్కయు, ధర్మములయొక్కయు రహస్యములు బయల్వెడలినవి.

ఎబల్, రెమూసత్, జ్యూలియన్, సెమ్యూల్‌బీల్; జేమ్సులేగీ, చవన్స్, ఫిలియట్, సిల్‌బన్‌తాబీ, వర్నక్, హెన్రికోర్డియర్.

ఈవిషయమే మఱియొక వంగపండితుఁడొక పొత్తము వ్రాసెను. దానినాధారముగఁ గైకొని, కొన్నిసంగతులు వ్రాసెద.

క్రీస్తుశక ప్రథమశతాబ్దియందు చీనాదేశమున ప్రతిభాశాలియగు మంగటీనామధేయుఁడు చక్రవర్తిగ నుండెను. ఒకరేయి వీని స్వప్నమందు మేలిమిపసిండిమేనును, ఆజానుబాహులును, ౧౨ అడుగులనిడివియు, శిరముచుట్టును తేజఃపరివేషమును గల యొకదివ్యమూర్తి రాజమహాలునందున్న తనచెంతకరుదెంచినటులఁ జూచెను. మఱునాఁటి యుదయమునఁ దనమంత్రిని దీనిభావమేమని యడిగెను. "మహాశయా! భారతవర్షమునందుఁ గైవల్యజ్ఞానముగల బుద్ధభగవానుఁడు గలఁడు. ఆతని దివ్యతేజ మాకాశమునందు సంచరించునపుడు తాముదర్శించి యుందు"రని మంత్రి చెప్పెను. చక్రవర్తి యాశ్చర్యచకితుఁడై భారతవర్షమునకుఁ జని బౌద్ధధర్మముఁ నేర్చుకొనిరమ్మని పదునెనిమిదిమందిని వెంటనే పంపెను. వారీ పుణ్యభూమికి క్రీ. శ. ౬౭ సం. న నరుదెంచి ౭౫-వ వత్సరముదనుక బౌద్ధధర్మముల నభ్యసించి వెడలిరి. వారు వెడలునపుడు బౌద్ధవిగ్రహము నొకదానిని, బుద్ధుఁడు చెప్పిన రత్నసూత్రములను, కాశ్యపమాతంగ, ధర్మరక్ష యనంబఱగు నిద్దరుపండితులను దీసికొనివెళ్లిరి. కాశ్యపమాతంగుని యుపదేశమువలనఁ జక్రవర్తి నగరపశ్చిమద్వార సమీపమున నొక బౌద్ధదేవాలయము నిర్మించెను.

చీనాకు వెడలిన యార్యావర్తపండితమండలిలో కాశ్యపమాతంగుఁడు ప్రథముఁడు మగధదేశవాసి. ఇతఁడు చీనాదేశీయులు భరతవర్షమున కరుదెంచినపుడు గాంధారదేశమున నివసించుచుండెను. గాంధారమునుండి చైనాకు వెడలవలసిన మార్గమత్యంత దూరము, కష్టతరమును. తురుష్కస్థానము, గోవామరుభూములు, నిమ్నోన్నతపర్వతరాజములు, ఘోరారణ్యములు దాటవలసి యున్నవి. అయినను లెక్కచేయక యీ మాతంగపండితుఁడు కఠినతరమైన మార్గముదాఁటి చీనాకువెళ్లి బౌద్ధధర్మముల నుపదేశించెను. ఈకాలమునఁబాలించు మింగటీచక్రవర్తి బౌద్ధమతము స్వీకరించెను. ఈయన పరిపాలన కాలము క్రీ. శ. ౫౮-౭౫.

మాతంగుఁడు చీనాభాష నభ్యసించి బౌద్ధగ్రంథముల సంస్కృతభాషనుండి చీనాభాషలో వ్రాయుట ప్రారంభించెను. వీరి ప్రథమగ్రంథము ౪౨ సూత్రములు. వీరు పరమపదించిన పిమ్మట నీకార్యము విద్వాంసుడైన ధర్మరక్షకు నిమీాదఁ బడెను. ఈయన గీర్వాణమునుండి ౫ గ్రంథములు పరివర్తించెను. ఈవిధమున బౌద్ధధర్మములు, భారతనాగరికత చైనాయందు దినదినాభివృద్ధి నొందసాగినవి.

క్రీ. శ. ౭౬వ సం. న మింగటీచక్రవర్తి స్వర్గస్థుఁడయ్యెను. తరువాతి చక్రవర్తిగూడ భారతవర్షమునుండి పండితులరావించి బౌద్ధధర్మప్రచారము చేయించెను. క్రీ. శ. ౬౫ సంవత్సరమునుండి ౧౦౫౪ సం. వఱకు భారతభూమినుండి చీనాకుఁ బండితులు వెడలుచునే యుండిరి. ఈపండితసత్తము లచ్చట కేవల బౌద్ధధర్మప్రచారమేగాక భారతనాగరికతాబీజములుగూడ నాటిరి. పాశ్చాత్యపండితుల నిరంతర పరిశ్రమవలన వారిలో ౬౨ చరిత్రములు మాత్రము దెలియుచున్నవి. వారిలో నీక్రిందివా రద్వితీయ ప్రతిభాశాలురు, పండితులు, సుప్రసిద్ధ ధర్మప్రచారకులు.

౧. కాశ్యపమాతంగుఁడు ౨. ధర్మరక్షకుఁడు 3. కుమారజీవుఁడు ౪. ధర్మక్షేముడు ౫. గుణవర్మ, ౬. గుణభద్ర ౭. బుద్ధరుచి ౮. నరేంద్రయశుడు ౯. పరమార్థుడు ౧౦. జినగుప్తుడు ౧౧. అమోఘవజ్రుడు ౧౨. ధర్మదేవుడు ౧3. దానపాలుడు ౧౪. జ్ఞానశ్రీ

మొదటి యిరువురిసంగతి యిదివఱకే చెప్పఁబడినది. ఇఁక మిగిలినవారిఁగూర్చి చెప్పఁబడును. బౌద్ధధర్మముల ప్రతిభను, కీర్తిని చీనాలో వ్యాపింపఁజేసినవారిలో కుమారజీవుఁడగ్రగణ్యుఁడు. ఈయన స్వయముగ ననేక బౌద్ధ గ్రంథముల భాషాంతరీకరించెను. మతప్రచారకులఁ దయారు చేసెను. బౌద్ధభిక్షుకులను భారతవర్షమునకు మతప్రచారమునకై పంపెను. వీరికి నాయకునిగా ఫహీన్ అను ఆయనను నియమించెను. ఈయన తనధర్మము నత్యుత్సాహమున నెఱవేర్చెను.

కుమారజీవుని తండ్రి భారతవర్షమున నొక సంస్థానమున మంత్రిపదవి నలంకరించెను. అతఁడు ఈయుద్యోగమును వీడి బౌద్ధభిక్షు

కుఁడాయెను. తల్లి రాజకుమారి. తండ్రి నామము కుమార; తల్లినామము జీవ. ఇందువలననే యీయనపేరు కుమారజీవ. ఈయన క్రీ. శ. ౩౪౪ వ సంవత్సరమున జన్మించెను. తల్లి వీనిని సప్తవర్ష ప్రాయముననే బౌద్ధవిహారము నకుఁ బంపెను. అచ్చట ధర్మసూత్రములను గంఠస్థముగ నేర్చుకొనెను. ౯వ వత్సరమునఁ గాశ్మీరమున కరిగి బన్ధుదత్తాచార్యుని కడ విద్య నభ్యసించెను. ఈయన ౨౦ వత్సరముల ప్రాయమున దీక్షగైకొని కౌచదేశ విహారమున నుండ మొదలిడెను. క్రీ శ.౪౦౧ సం॥న చీనాకు వెళ్లెను. తత్కాల ప్రభువాతని సగౌరవముగఁ బూజించి బౌద్ధధర్మప్రచారము చేయఁ బ్రార్థించెను. ఆప్రార్థన నంగీకరించి కార్యభార మూనెను. ౧౨ సంవత్సరములలో ౧౦౧ బౌద్ధమత గ్రంథములను సంస్కృతమునుండి చీనాభాషకుఁ దర్జుమాచేసెను. ఈకార్యమున దనచీనా భారతీయశిష్యుల సాయమునుగూడఁ బొందెను. నేటివనుక ననేక చీనాదేశీయులు చేసిన యనువాదముల కంటె వీరియనువాదములే ప్రశంసనీయములై యున్నవి.

కాశ్మీర బ్రాహ్మణుఁడైన విమలాక్షుడు కుమారజీవుని గురువు. ఈయనకూడ బౌద్ధ భిక్షుకుఁడు. మతప్రచారమునకై చీనావెడలి శిష్యునకు భాషాంతరీకరణమునందు సాయ మొనర్చెను. శిష్యుఁడు పరలోకమున కేగిన తదుపరి కార్యభార మూనెను.

ధర్మక్షేముఁడు— ఏడు వర్షములలో (౪౧౪-౪౨౧) ననేక బౌద్ధమత సంస్కృత గ్రంథములను చీనాభాషకు మార్చెను. వీరి ఖ్యాతి చీనాయందేగాక దూరదేశములకుఁ గూడ ప్రాకెను. వీరొక ఘాతకునిచేఁ జంపఁ బడిరి. వీరి పెక్కు గ్రంథములలో నిప్పటికిని ౧౨ గ్రంథములు సురక్షితముగ నున్నవి.

గుణవర్మ—కాశ్మీరదేశవాసి ధర్మప్రచారమునందత్యంత నిపుణుఁడు. ౩౦సంవత్సరములకే బౌద్ధశాస్త్ర పండితోత్తముఁడై దీక్ష స్వీకరించెను. ఈయన రాజవంశీయుఁడు. రాజ్యమునువదలి బౌద్ధభిక్షుకుఁడాయెను. ప్ర ప్రథమమున సింహళద్వీపమునను, పిమ్మట జావా, చీనాదేశములందును బ్రచారము చేసెను. వీరు ౪౩౧సం॥న చీనాకరిగినపుడు వీరినిమిగుల సత్కరించిరి. వీరు ధర్మప్రచారము నత్యంత శ్రద్ధతో జేసి ౧౦ గ్రంథముల భాషాంతరీకరించెను. ౬౭ సం॥ర ప్రాయమున వీరు స్వర్గస్థులైరి.

గుణభద్రుఁడు—పండితుఁడు మధ్యభారతదేశవాసి ౪౩౫ సం॥న చీనావెళ్లెను. ౫ సంవత్సరములు తదేకదీక్షతో భాషాంతరీకరణమును చేసెను. వీరు రచించిన ౭ గ్రంథములలో నేటికి ౨ మాత్రముండుట విచారకరము. ౭౫ వత్సరముల ప్రాయమున మృత్యువువాతఁబడెను.

బోధిరుచి—ఉత్తర భారతవాసి క్రీ.శ. ౫౦౮వ సంవత్సరమున చీనాకరిగి ౨౭ వత్సరములు బౌద్ధమత ప్రచారము చేసెను. ౩౦ బౌద్ధ మత గ్రంథములను గీర్వాణమునుండి చైనాభాషకు తర్జుమాచేసెను.

నరేంద్రయశుడు— భారత వర్షమున, లంకాద్వీపమున బౌద్ధధర్మప్రచారముచేసెను.

౫౫౬వ వత్సరమున చీనాకు వెళ్లెను. ౧౫ పొత్తముల భాషాంతరీకరించెను. పండితోత్తముఁడును, ప్రతిభాశాలియు నగుటచే నితఁడు ప్రసిద్ధపురుషుఁ డాయెను. క్రీ. శ. ౫౮౯ సంవత్సరమున నితఁడు పరమపదించెను.

పరమార్థుఁడు—ఉజ్జయినీవాసి క్రీ. శ. ౫౪౮వ సం. న చీనాకు వెళ్లెను. అచ్చట ౨౧ సంవత్సరము లుండెను. ఈయన సంస్కృతము నుండి ౫౦ బౌద్ధమత గ్రంథములను చీనాభాషకు మార్చెను. ౭౧ వర్షముల ప్రాయమున మృతినొందెను.

జినగుప్తుఁడు—క్షత్రియ పండితుఁడు. గాంధార దేశవాసియగు వజ్రసారుని కుమారరత్నము. పాండిత్యమనీషావిశేషాదులఁ గుమారజీవసమానుఁడు. సప్తవత్సరప్రాయముననే సన్న్యసించెను. జినయశుని శిష్యుఁడు. జినయశుఁడు గురువగుటచేతనే జినగుప్తుఁడింత ప్రసిద్ధపురుషుఁడాయెను. పలుబాముల పాలైనను ౨౭ సం. ల ప్రాయముననే గురువుతోఁ గలసి క్రీ. శ. ౫౫౭వ సంవత్సరమున చీనాకు వెడలెను. ఇచ్చట ప్రసిద్ధపురుషుఁడై ధర్మప్రచారకమండలికి నాయకుఁడాయెను. తదుపరి రాజుగారికిఁగూడ గురువాయెను. రాజాజ్ఞచే భారతీయ జ్యోతిషశాస్త్రగ్రంథములను చీనాభాషకుఁ బరివర్తించెను. ౩౭ బౌద్ధమతగ్రంథముల చీనాభాషకుఁ దర్జుమాచేసెను. క్రీ. శ. ౬౦౦ సం. న ౭౮వ యేట నతఁడు పరలోకగతుఁడాయెను. ఈమహనీయుఁడు లెక్కలేని యిడుముల పాలైనను జలింపక తనధర్మము నెఱవేర్చెను.

అమోఘవజ్రుఁడు— ౮ వ శతాబ్దపు గొప్ప విద్వాంసుఁడు. ఉత్తరదేశ బ్రాహ్మణుఁడు. వజ్రబోధి శిష్యుఁడు. గురువుతోఁగలసి క్రీ. శ. ౭౧౯వ సం॥న చీనాకు వెళ్లెను. ౭౩౨ సం.న గురువు నిర్యాణ మొందెను. అవసానకాలమున గురువు భారతవర్షమునకుఁ జని బౌద్ధగ్రంథముల నిచ్చటికిఁ దెచ్చి ప్రచారము చేయుమని యాజ్ఞాపించెను. ఆయాజ్ఞ ననుసరించి యనేక లిఖితపుస్తకవ్రాతమును సంపాదించి క్రీ. శ. ౭౪౬వ సంవత్సరమున చీనాకు వెడలి ధర్మప్రచారము చేసెను. చీనాచక్రవర్తి ప్రజ్ఞానమోక్షమునకు మార్గము జూపెనని సంతసించి యీయనను మిగుల సన్మానించెను. ప్రజ లానందభరితులైరి. ఈయన ౭౭ గ్రంథము లనువదించెను. ఇందులోఁ దాంత్రికగ్రంథములుగూడఁగొన్ని గలవు. ౭౭౪ సం. న మృతినొందెను. చక్రవర్తి ఈయనయందు తనకుఁగలభక్తిచే నొకస్మారకచిహ్నమునుగూడ నిర్మించెను.

ధర్మదేవుఁడు— నలంద విశ్వవిద్యాలయమునుండి క్రీ. శ. ౯౭౩ సం.లో చీనాకు వెళ్లి ౯౮౧ సం. వరకు ౪౬ గ్రంథముల తర్జుమా చేసెను తదుపరి ధర్మప్రచారము చేసెను. చీనారాజీయనను మిగుల గౌరవించెను. ౧౦౦౧ లో స్వర్గస్థుఁడాయెను.

దానపాలుఁడు— పండితోత్తముఁడు చీనాకు ౯౮౦ సం న వెళ్లి ౧౧౧ సంస్కృత గ్రంథముల చీనాభాషకు తర్జుమా చేసెను. చీనారాజు మిగుల సత్కరించి బిరుదులగూడ నిచ్చెను.

జ్ఞానశ్రీ—౧౦౫౩ సం. లో చీనాకు వెళ్లెను. చీనాకు వెడలిన భారతీయపండితు లలో నీయనయే కడపటివాడు; ౨ గ్రంథములు మాత్రము భాషాంతరీకరించెను.

ఈభారతపండితోత్తములు చీనాయందుఁ గేవల బౌద్ధసాహిత్యమునేకాక భారతసభ్యత, సాహిత్యము, జ్ఞానము, విద్య, శిల్పము, చిత్ర కళ మొదలగువానిని గూడఁ బ్రచారము చేసిరి. వీరినిరంతరకృషివలననే భారతజాతీయత యచ్చట సువ్యక్తమయ్యెను. ఈకార్యధురంధరుల నామములు ప్రపంచేతిహాసమున సువర్ణాక్షరములతో లిఖింపనర్హములు. ఈవిద్వద్వతంసులచే సుమారు ౧౦౦౦ గ్రంథరాజములు సంస్కృతమునుండి చీనాభాష కనువదింపఁబడినవి. ఇందుఁ బెక్కులు నేఁటికినిగానరావు; కాని యనువాదములగు గీర్వాణగ్రంథము లిప్పుడు గానరావు. చీనాసాహిత్యచరిత్రపరిశీలన పూర్తిగానంతవఱకు భారత సాహిత్యేతిహాస మసంపూర్ణ మనుట సత్యమునకుఁ జేరువ. భారత సాహిత్యము టిబెట్, మంగోలియా, జపాన్, జావా, సుమత్రా, సింహళము మొదలగు దేశ ద్వీపముల సాహిత్యము కన్న మిన్నయైనది. కావున మనసాహిత్య చరితము తదేక దృష్టితో దేశీయులు పరిశీలించెదరని యాసించుచున్నాను.

---

# ఆ స్తి క త

మంత్రిప్రెగడ వెంకట హనుమంత రావు గారు

కలవనుచునిన్ను తమభావ తలమునందు
నమ్మిభజియింత్రు కొందరు నాగతల్ప!
కా వనుచు కొందరందురో దేవ! నీవు,
రెంటి మాధ్యస్థమున నూగుచుంటివయ్య!

గీ. కలవనెడువారి నేత్రయుగ్మంబు కెదుట
గట్టివేసినయట్టులు గదలకుండ,
నుండి లేవనువారల కొకపుడైన,
దోపకుండెదవట వారి దోసమేమొ?

గీ. కలడు లే డనువార లేకస్థలంబు,
నందెయుండిన నిన్మదియందు కలవ,
టంచనెడు వారికన్నుల కగపడిమెద,
వటనె లేడనువారల కగుపడకయె.

గీ. ఆత్మవిశ్వాస హీనుల కగుపడంగ,
నేలనని నీమనంబున నెంచియుందు,
వనితలంచెద నిశ్చయ మదియు భ్రమపు
మొదలె కనలేనివాడెట్లు, తుదనుగాంచు.

గీ. అక్షిగోచరమయిన పదార్థ మెద్ది
యైన, తృటికాలమున నంతమందవచ్చు
నదియెచిత్తమునందున హత్తియున్న
బాయునే జీవములు మేనుబాయుదాక.

గీ. భావమునకున్నపటిమ యప్రతిహతమగు
నదియు గావున నిన్ను దా ననవరతము
భావమున నిల్పి భజియించి భవ్యసుఖము
నందు వాడెపో సర్వసౌఖ్యాన్వితుండు.




(భారతి సంపుటము ౨, సంచిక ౬ చూచునది)

ఈరూపచిత్రము నారాయణతీర్థులవారిది. తంజావూరుసంస్థానమున నారాయణతీర్థుల వారి కాలముననే వ్రాయించి యుంచఁబడిన రూపచిత్రమునుబట్టి తంజావూరుజిల్లా వరాహూరువాస్తవ్యులగు గోపాలభాగవతులనువా రిప్పటికి నెనుబదియేండ్లకుముందు దీనిమూలమును వ్రాయించుకొనిరి. వారు చిత్రప్రతిరూపము వ్రాయించుకొనునాఁటికిం చుమించుగాఁ దొంబదియేండ్లకుఁ బూర్వము తంజావూరు రాచనగరిలో నామాతృక వ్రాయింపఁబడినదట! గోపాలభాగవతుల మనుమలగు లక్ష్మణశాస్త్రిలుగారిమూలమున మాకీ చిత్రము లభించినది.

## నారాయణతీర్థులవారు

ఆంధ్రులలో, దైవభక్తిగల ప్రాజ్ఞులలో తరంగము లనుపేరి గేయముల విననివారు, విని యానందింపనివారు, ఉండరు. శ్రీనారాయణతీర్థులవారి కృష్ణలీలాతరంగిణిలోని తరంగములు నిజముగా నమృతతరంగములే. భక్తిమాధుర్యమునందు తీర్థులవారి తరంగములయందు జయదేవుని యష్టపదులాఁగఁజాల వని నానమ్మకము. నారాయణతీర్థు లాంధ్రులు. కృష్ణాతీరమువారయి యుందురు. ముక్త్యాలసంస్థానమునఁ గృష్ణానదియొడ్డున వెలసియున్న వేదాద్రి నరసింహస్వామిని, చల్లపల్లిసంస్థానమున శ్రీకాకుళమున వెలసియున్న యాంధ్రనాయకస్వామిని, నూజివీటి సంస్థానమున ఆగిరిపల్లెదగ్గఱ వెలసియున్న (శోభనాద్రి) నృసింహస్వామిని, కృష్ణలీలాతరంగిణిలో తీర్థులవారు స్తుతించుట యీయూహకు సాధకము. తీర్థులవారు కడపటికాలమున దక్షిణదేశమున తంజావూరుజిల్లా వరాహూరిలో వసించిరి. దక్షిణదేశమున నిప్పటికిని వారిశిష్యపరంపర గలదు. ఆపరంపరవారీ యైతిహ్యమును జెప్పుచున్నారు. తీర్థులవారికి గర్భమున శూలవ్యాధి గలదఁట. దానిచే బాధపడుచు వారు సేతుస్నానార్థము దక్షిణదేశయాత్ర వెడలిరట. ఆయాత్రలో తిరుపతిలో నొకనాఁడు వేంకటేశ్వరస్వామి స్వప్నదర్శన మొసఁగి "దక్షిణదేశమున నీకు నేను వరాహరూపమున దర్శనమిచ్చి యొక గ్రామమునకుఁ ద్రోవ చూపుదును. ఆగ్రామముఁ జేరుము. అక్కడ నేనే వెలసియున్నాను. నీవ్యాధి యాపుణ్యక్షేత్రమునఁ దొలఁగి పోఁగలదు." అని చెప్పెనఁట! అది యట్లే జరిగెనఁట! ఆగ్రామమే వరాహూర్. భూపతిరాజపురమని దానిపూర్వనామము. ఆ గ్రామమువారి యభ్యర్థనముచే తీర్థులవారు జీవితశేషమెల్ల నక్కడనే గడపిరఁట. ఆగ్రామముచేరువనే వారి సమాధి యిప్పటికిని గలదఁట. కృష్ణలీలాతరంగిణిలో వరాహూరు వేంకటేశ్వరస్వామిప్రస్తుతి కూడఁ గలదు. ఆంధ్రదేశమున దేవాలయములలో జరుగువిధమున వరాహూరు వేంకటాచలపతిస్వామిదేవాలయమున పవళింపుసేవ మొదలగు నుత్సవముల నీ స్వాములవారు నెలకొల్పిరఁట. ఆయుత్సవములందుఁ బాడుటకై తెలుఁగుకీర్తనల నెన్నిటినో వారు రచించిరఁట! నేఁటికి నక్కడ నాకీర్తనములఁ బాడుచుందురఁట! తీర్థులవారికి శిష్యులై వారిచేఁ దరంగములఁ జెప్పించుకొన్న భాగవతు లెందఱో దక్షిణదేశమందుండెడివారఁట. వంజు భాగవతులనువారు వారిలో విఖ్యాతులు. వారి ప్రపౌత్రు లిప్పుడున్నారు. కృష్ణలీలాతరంగిణిగాక సంస్కృతమున హరిభక్తిసుధోదయమని గొప్పకావ్యమును, బ్రహ్మసూత్రములకు వృత్తిని, యోగసూత్రములకు వృత్తిని నారాయణతీర్థులవారు రచించిరి. ఆగ్రంథములు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నవి. మఱియు వారు తెలుఁగున "పారిజాతకథ" అని యొక యక్షగానమునుగూడ రచించిరి. అది వరాహూరు

వాస్తవ్యులయిన లక్ష్మణశాస్త్రిగారియింట గ్రంథలిపితో దొరకెను. దానిని తెలుఁగులిపిలో వ్రాయించి భారతీ కార్యాలయమునఁ గూడ నుంచితిమి. వా రింక నెన్ని గ్రంథముల రచియించిరో యెఱుఁగరాదు. కృష్ణాతీరమున నిప్పుడు తరంగముల నద్భుతముగాఁ బాడువారనేకులు గలరు. "బాలగోపాల మా ముద్ధర" అను తరంగమును వెల్లటూరు (కృష్ణాతీరము) వాస్తవ్యులు ఏలేశ్వరపు ఆంజనేయులుగారు బహురంజకముగా నిప్పుడు పాడుచున్నారు. పారిజాతకథలోని యొకపద్యము:—

క. భవభయతిమిరదివాకర
  శివరామానందతీర్థ శిష్యోత్తములౌ
  శివనారాయణతీర్థులు
  సవరణతోఁ బారిజాతచరిత రచించెన్.

నారాయణతీర్థులవారి శిష్యు లెవరో రచించిన స్తుతిశ్లోకము లివి:

శ్లో. య దంఘ్రిపంకేరుహరేణులగ్నం
  నిషేయ నీరం విమలాంతరంగః;
  జానామి తత్త్వం నిజ మాత్మరూపం
  తం నౌమి నారాయణతీర్థ మార్యమ్.

శ్లో. బోధాగాధసునిర్మలాతివిమలే
  యన్మానసాబ్ధౌ హరిః
  క్రీడ త్యుజ్జ్వలదుగ్ధసింధు రనిశం
  శాంత్యాది యూతీజనైః;
  భక్తిజ్ఞప్తి విరక్తిసంజ్ఞ మతులం
  కన్యాత్రయప్రాపకం (?)
  శ్రీనారాయణతీర్థ సద్గురు మహం
  తం నౌమి ముక్తిశ్రియై.

హరిభక్తిసుధోదయములోని రెండు శ్లోకములు:—

శ్లో. సవిూహితార్థాన్ స్వకృతాం దదాతియ
  త్కథాసుధావాగ్లహరీ సుధాపగా;
  మహాకవీనా మపి కావ్యనాయకం
  వినా కమన్యం స్పృహయే న్మదీయవాక్.

శ్లో. అనంతలీలామృతపూర్ణవారిధే
  రగణ్యవిద్యాగుణరత్నసంపదః;
  కథంను కేనాప్యతు కర్మ వర్ణ్యతే
  పరంతు భక్త్యా కిముపీహ వర్ణ్యతే.

శ్లో. అనన్యసాధారణలక్షణః పుమా
  నశేషలోకస్థితిహేతు రవ్యయః;
  అనాద్యనిర్వాచ్యవిచిత్రశక్తిమ
  త్స్వమాయయా క్రీడతి గోపబాలవత్.

## గోపాలభాగవతులు

వీరు దక్షిణదేశమున భాగవతకాలక్షేపము చేయువారిలోఁ బ్రఖ్యాతులుగా నేఁబదియేండ్లక్రిందటిదాఁక నుండిరి. నారాయణతీర్థులవారికి వీరు ప్రశిష్యులు. ఈ రూపచిత్రమును మా కొసఁగినలక్ష్మణశాస్త్రులుగారికి వీరు తాతగారు.



# శ్రీయుత డాక్టరు జయంతి చినకామేశ్వరరావుపంతులుగారు*

## యం. ఎస్. సి.; పి. హెచ్. డి.

వీరి జన్మస్థానము విజయనగరము. కలకత్తా విశ్వవిద్యాలయమువారు "డాక్టరు ఆఫ్ సైన్సు" అను బిరుదమునిచ్చి సత్కరించిరి. ప్రస్తుత మీయన మదరాస్ పచ్చయప్పకళాశాలయందు అడిషనలు ఫిజిక్సుప్రొఫెసరుగనున్నారు. కలకత్తా విశ్వవిద్యాలయమున ఎం.ఎస్.సి. పరీక్షయందు వంగరాజధానికంతకును మొదటితరగతిలో అగ్రస్థానము నలంకరించి స్వర్ణపతకమును పెక్కు గ్రంథరాజములను మన్ననగబడసిరి. అతిబాల్యమునందే ఎం.ఎస్.సి.పరీక్షయందు అత్యంతప్రతిభతో ఉత్తీర్ణులై ఆంధ్రుల ప్రతిభను ప్రతిష్ఠను, చాటిరి.

ప్రస్తుతము ఖండాంతరములందు యూరపుదేశమునకు ఆహ్వానింపబడి జగద్విఖ్యాతిగాంచిన ప్రొఫసరు సి. వి. రామనుగారిదగ్గర ఈయన నాలుగువత్సరములు సర్ టి. యన్. పాలిత్ పరిశోధక విద్యార్థిగనుండి పాండిత్యమును గడించెను.

పిదప కలకత్తా విశ్వవిద్యాలయమువారు సీమకు వాతావరణశాస్త్రమునందు ప్రత్యేక పరిశ్రమచేయుటకు బంపిరి. అచట సర్ గిల్బర్టువాకరుగారిదగ్గర ఆరుమాసములు కృషిసల్పిరి. 'హైడ్రొడైనంస్ మాలిక్యులరు ఫిజక్సు' వాతావరణశాస్త్రమును గూర్చి ఎన్నియో వ్యాసరాజములనువ్రాసిరి. ఖండాంతర యూరపియను విజ్ఞాననిధులచే పొగడ్తనుగాంచిరి. కామేశ్వరరావు పంతులుగారి స్వకపోలకల్పనసామర్థ్యమునుగనుగొని వారు అచ్చెరువొందిరి.

జలోపరిభాగమున, అలలశక్తిని విజృంభణమును గూర్చి ప్రత్యక్షప్రమాణముగను సిద్ధాంతముగను నూతన పరిశోధనను గావించిరి. దీనినే ఆంగ్లమున 'వేవుసు ఆఫ్ ఫైనిటు ఆంప్లిట్యూ' డనెదరు.

ఆదిని చిన్నతరంగముల సమస్యను(Problem of Short ripples) కెల్వినుప్రభువు కనిపెట్టెను.

పెద్ద అలలగ్రహణశక్తిని (Gravity of waves) సర్ జి. జి. స్టోక్సుగారు పరిశోధించిరి.

కామేశ్వరరావు పంతులుగారన్నదో చిన్నతరంగములు పెద్దఅలలుగ మార్పుచెందిన మార్పులన్నిటిని గ్రహించి కనిపెట్టి రెంటిని మిళితముచేసి గొప్పసమస్యను గనిపెట్టిరి.

రావుగారి అత్యద్భుతమేధాశక్తి 'అప్లయిడ్ మేథమేటిక్సు, మీటరియాలజీ, ఎక్సుపెరిమెంటలు ఫిజిక్సు' లందు గలదు.(applied mathematics, meteorology and experimental physics)

సూర్యరశ్మి, తత్కిరణములయందుగూడ(ఆప్టిక్సు) రావుగారి ప్రజ్ఞావిశేషము మించియున్నది. ఈవిషయమునుగూర్చి వ్రాసిన వ్యాసరాజమునకు ఈయనకు డాక్టరు బిరుదమును ఇచ్చిరి.

'రెలెటివిటీ' సిద్ధాంతమును మాత్రమే ఈన్ స్టీన్‌గారు కనిపెట్టిరి. కామేశ్వరరావుగారు దాని విస్తరింపజేసి క్రియారూపముగ పరిశోధించి ఋజువుచేసిరి. లండనువిశ్వవిద్యాలయమున పిజిక్సుప్రొఫెసరు ఏ. డబ్ల్యూ. పోర్టరు, సైన్సు, టెక్నాలజీ ఇంపీరియలు కళాశాలలో వాతావరణశాస్త్రజ్ఞుడుగనున్న సర్ నేపియరుషాగారును, లండను విశ్వవిద్యాలయమున రసాయన పరిశోధన కార్యాలయాధికారియగు ఎఫ్. జి. డొనవనుగారును కామేశ్వరరావుగారి ప్రతిభాతిశయములను కనుగొని అచ్చెరువొంది 'డాక్టరు ఆఫ్ సైన్సు అనుబిరుదమునకు నీవెతగుదవు, కామేశ్వరాయ' యనుచు ఎంతయు యభినందించి యుప్పొంగిరి.



* వీరిచిత్రము భారతి రెండవసంపుటము ఆఱవసంచికయందు గలదు.




## జీవితసంగ్రహము

చిత్తరంజనదాసు పురాతన వంగ కుటుంబమునందు జన్మించెను. దాసు కుటుంబీకులు కొందరు పురాతనవంగ దేశపాలకులుగ గూడ నుండిరనివిందుము. వారు ధైర్య స్వాతంత్ర్యములు గల దీరోదాత్తమహాశయు లని పేరు గాంచిరి. చిత్తరంజనదాసు తండ్రి బాబు భువనమోహనదాసు కలకత్తా హైకోర్టులో అటర్నీగా నుండెను. ఆయన వృత్తియందు వన్నెకెక్కి మంచిపేరు సంపాదించెను. కొంతకాల మాయన పత్రికాసంపాదకత్వమును గూడ వహించెను. ప్రథమమున 'బ్రామో పబ్లికు ఒపినియను' అను పత్రికకును, పిదప 'బెంగాలు పబ్లికు ఒపినియను' అను పత్రికకును సంపాదకులుగ నుండి బెంగాలులోని పత్రికాసంపాదకులలో గొప్పపేరును సంపాదించెను. ఆయనకు దేశభక్తి మెండు. జీవితమునందు పురాతన హిందూసాంప్రదాయముల ననుసరించుచు ఆయన సంపాదించిన దానినంతను బీదలగుబంధుగల పోషించుటకై వెచ్చించుచుండెను. ఆయన తనకు వచ్చెడి ఆదాయమును మించిన ఖర్చు ఇందులకు జేసెడివాడు. అందుచేత ఖర్చు ఎక్కువై అప్పులలోబడి వృత్తిని చాలించుకొనునప్పటికి దివాలాపిటిషను బెట్టి తలదాచుకొనవలసివచ్చెను.

బాబు భువను కుటుంబమునకు గల్గిన యీవిపత్తు ఒకవిధముగ మంచికే వచ్చెను. చిత్తరంజనకు చురుకు పుట్టించెను. ఆయన తన తండ్రి దివాలాతీసెనను మచ్చను తుడిచివేయగోరెను. చిత్తరంజనుడు వృత్తిలో డబ్బుసంపాదించుకొలదియు ప్రాత అప్పులను దమ్మిడీలతోగూడ దీర్పదొడగెను. ఈవిధముగ అప్పుల నెగవేయకుండ దీర్చుటతో మంచి నీతిమంతుడగు నుదాత్తపురుషు డని అందరును గౌరవించిరి. ఈదురదృష్టముచేత చిత్తరంజనునకు హృదయము పరిపక్వమై మేధాశక్తి విజృంభించి రాజకీయజీవితమునందు ప్రేమాస్పదుడయ్యెను. ఏవిషయమునైనను అందలి రహస్య మేమియో కనుగొని వానినిగూర్చి సరియైన భావములను దెలుపగల శక్తిని సంపాదించెను. అందువలన నాయన దేనిని గట్టిగ నమ్మెనో అందులకు సర్వమును త్యాగము చేయుటకు సిద్ధముగ నుండునటులగూడ శక్తిని బొందగల్గెను. ఆయన ప్రజాజీవితమునందు ప్రవేశించునప్పటికి పూర్వము రాజకీయవ్యవహారములకు ఆజీవితముతో నెక్కువ సంబంధము లేక పోవుటవలన రాజకీయరంగమున ఆయానకు విశుద్ధదృష్టి యేర్పడి నూతనోత్సాహము గల్గెను.

చిత్తరంజనుని తాతలనాటి యిల్లు తూర్పుబంగాళమున బిక్రాంపూరులో తలీర్బాగు అను నొక చిన్న గ్రామమునందు గలదు. ఆయన వైద్యకుటుంబమున నుద్భవించెను. ఆయన ముత్తాత బాబు రతన్ కృష్ణదాసు ధర్మశీలముల బేరుగాంచెను. ఆయనతాత జగద్బంధు రాజషాహిలో సీనియరు గవర్నమెంటు ప్లీడరుగ నుండెను. ఆయనబాగా డబ్బుసంపాదించెడివాడు. సంపాదించిన దంతయును బీదలకై వినియోగము చేసెడివాడు. ఇంతేకాక జగద్బంధు కవి, పండితుడు. ఈ యౌదార్యము, త్యాగము, ధర్మశీలము, కవితాశక్తి, అన్నియును తాతల నుండి చిత్తరంజనున కబ్బెను. ఇట్లే ఆయన సోదరుడగు ప్రఫుల్లరంజనదాసు (పాట్నా హైకోర్టుజడ్జి) తన తాత యొక్క కవితాధోరణిని బట్టుకొనెను.

## బాల్యము

చిత్తరంజనుడు కలకత్తాలో 1870 నవంబరు 5-వ తేదీని పుట్టెను. ఆయన తలిదండ్రులకు రెండవపుత్రుడు. ఆయన ప్రథమమున భవానీపూరులోని లండను మిషనరీ కాలేజిలో చదువు ప్రారంభించి 1886 లో మెట్రిక్యులేషను ప్యాసై కలకత్తా ప్రెసిడెన్సీ కళాశాలలో 1890లో బి. యే డిగ్రీని పుచ్చుకొనెను. ఆయన కళాశాలలో చదువుకొనుకాలమునందు అసాధారణ మగు వక్తృత్వపాండిత్యవిశేషములు చూపుచుండెడివాడు. ఈ గుణము లన్నియును నాయనజీవితములో ఫలించినవిషయ

మందరకును దెలిసినదే. పట్టభద్రుడైన పిదప ఆయన ఐ. సి. యస్. కు పోటీచేయు నుద్దేశ్యముతో ఇంగ్లాండుకు పోయెను. కాని యీ ఆకాశమునుండి ఊడిపడిన 'సర్వీసు'లో చేరుటకు వీలులేకుండ సంగతిసందర్భము లేర్పడెను. దాదాభాయి నౌరోజి ఎన్నికల ప్రచారములో ఆయన తీవ్రముగ పనిచేసెను. ఆయన ఉపన్యాసములు ఇంగ్లాండులోను ఇండియాలోనుగూడ ఎల్లర దృష్టి నాకర్షించెను. తరువాత పార్లమెంటుసభ్యుడు జాను మాక్లియను ఉపన్యాసముచేయుచు హిందువులను గూర్చియు మహమ్మదీయుల గూర్చియు, అమానుష వాక్యములు పల్కినందులకు ఆయన ప్రవర్తనము నధిక్షేపించుటకై ఇంగ్లాండులోని భారతీయుల సమావేశ మొకదానిని చిత్తరంజను డేర్పాటుచేసి తీవ్రముగ గట్టిగ నుపన్యసించి మాక్లియను క్షమాపణ గోరునట్లును, పార్లమెంటు సభ్యత్వమునకు రాజీనామా నిచ్చునట్లును, చేసెను. తరువాత కొద్దికాలమునకే ఆయన గ్లాడ్స్టనుగారి అన్యక్షతను భారతవ్యవహారములగూర్చి ఉపన్యసించెను. దానివల్లనే సివిలుసర్వీసులో స్థానము లేకుండబోయెనందురు. ఆయన పోటీపరీక్షలో జయము గాంచినను ప్రొబేషనరుల పట్టికలో ఆయనపేరులేకుండ కొట్టివేయబడెను. తుదకాయన ఇన్నరుటెంపిలులో జేరి 1890 ప్రాంతములలోనే న్యాయవాదవృత్తిలో దిగవలసివచ్చెను.

## న్యాయవాదవృత్తి

1893లో కలకత్తాకు తిరిగివచ్చి ఆయన హైకోర్టులో న్యాయవాదివృత్తి నభ్యసించెను. ఆ వృత్తియందాయన యెట్టితోడ్పాటును లేకయే గుణసంపన్నత్వముచేత పేరుగాంచెను. తండ్రి దివాలాదీయుటచేతను, ఆ అప్పులను నెత్తిన వేసికొనుటచేతను కొంతవరకు మేఘావృతముగ నుండెను. కాని నిజమైన గుణపుంజము చాలకాలము వెలుంగకమానదు. 1903లో అరవిందఘోషు మీద దెచ్చిన కుట్రకేసులో ఆయనపక్షమున దాసుగారు వాదించిన వైఖరివలన కలకత్తావకీళ్లలో ముందునకు వచ్చెను. ఆకేసులో ఆయనపడిన కష్టమునకు వచ్చిన ఫీజు చాల తక్కువయే. ఆవిచారణ దాదాపు ఆరునెలలు జరిగెను. ఆ కాలమున కుటుంబపోషణకై ఆయన చాల అప్పుచేయవలసివచ్చెను. కాని నిజమైనత్యాగ మెప్పటికిగాని వృథగాదు ఫలించియేతీరును. దానితో ఆయన కీర్తి దిగంతవిఖ్యాతి గాంచెను. వృత్తియందు మంచి సంపాదన గల్గెను. ఇంతకన్న నెక్కువ రెండు ముఖ్య ఫలితములు గల్గెను. అరవిందఘోషుయొక్క మాహాత్మ్యమును విశుద్ధత్వమునుచాటి ఆయనకును చిత్తరంజనకును యావజ్జీవమైత్రిని గలుగజేసెను.

అరవిందుని విడుదల చేసినప్పటినుండియు ఆయనకు కేసులు పెద్దపెట్టునవచ్చి రోజుకు వెయ్యిరూపాయల ఫీజుకూడ మించిపోయెను. డుమ్రానురాజా ఎస్టేటువ్యాజ్యములో ఆయన పనిచేసెను. నాగపూరులో హోంరూలు లీగు కార్యదర్శి నైద్యగారికేసులో హాజరై ఆయనను అప్పీలులో విడిపించెను. భారత సంరక్షణశాసనము క్రింద బర్మాలో డాక్టరు మెహతాను నిర్బంధించినపుడు ఆయనను బాగుగ సమర్థించెను. చిటగాంగులో ఏకాంత నిర్బంధమునం దుంచబడిన కుట్ర ఖైదీయాలు దాసును వకీలుగ పెట్టుకొనిరి. అసహాయోద్యమములో జేరి వృత్తిని విసర్జించుటకు ముందే భారతప్రభుత్వమువారు మ్యూనిషన్సు బోర్డుకేసులో నియోగించిరి.

## ఆయన ఔదార్యము

చిత్తరంజనుడు తండ్రివలెనే ఉదారభావములు గలవాడు. ఆయన అడ్వొకేటుగనుండి యెంతసంపాదించినను భవిష్యత్తునకేమియును మిగల్చలేకపోయెను. చదువుకొను బీదవిద్యార్థి ఆయనయొద్దకు ధనసహాయము గావలెనని పోవునెడల తప్పక కావలసినసహాయముచేసెడివాడు. పిదప ఆయన తాను సంపాదించిన దానినంతను దేశమునకై వినియోగించెను. ఆయన సంపాదించిన ఆస్తినంతను ఏకైకపుత్రునకు సులభముగ ఒప్పజెప్పెడివాడే కాని మంచి వేదాంతియగుటచేత రేపటిమాట లెక్కచేయకుండెను. ఏమైననుసరే కోరిన దున్నపుడు ఇయ్యకుండ ఆయన యుండజాలడు.

## మతధర్మము

చిత్తరంజనుడు వైష్ణవుడు. చైతన్య మతము. ఆయన తండ్రి బాబు భువనదాసు ఆరోజులలో ఇంగ్లీషు చదువుకొన్నవా రందరవలెను బ్రహ్మసమాజోద్యమము

నందుచేరెను. ఆయుద్యమముయొక్క ప్రచారమునకు సంపూర్ణహృదయముతో పనిచేసెను. చిత్తరంజనునకుగూడ మతవిషయమున తండ్రికిగలఅభిప్రాయము లేకొన్నిగలవు. రాజ రామమోహనరాయియన్న గౌరవముగలదు. రాజా రామమోహనుని జీవితకార్యమును ఆయన చెప్పిన దానిని బట్టియే మరల దెలిసికొని నివరించి విలువగలట్టిప్రశంసింపవలయును. రాజా రామమోహనరాయి జీవితస్వాతంత్ర్యాదర్శమును ప్రతిపాదించుటచేత దాసుగారి కాయనపై ప్రేమ జనించెను.

కాని చిత్తరంజనునకు మనవిజ్ఞానమును యూరోపియను పద్ధతులకు మరల్చుట యిష్టములేదు. మొక్కదీసి నాటుటయందుకన్న తనంతట నది పుట్టి పెరుగుటలో ఆయనకు నమ్మకము గలదు. ప్రతిదేశమును తనంతటునది యేయితరదేశములతోపాటు సమముగనుండి వ్యక్తిత్వమును గలిగియుండవలెనని ఆయన నమ్ముచున్నాడు.

చిత్తరంజనుని మనోవృత్తిగలవారెవరునుగాని భగవంతుడు విశ్వవ్యాపకుడని మనస్సులోమాత్రము భావించియూరకుండజాలరు. వారు స్వయముగ నేదో ఒకదేవతనారాధింతురు. దానికే సర్వమును జీవితమును అర్పణచేసెదరు. ఆయనస్వభావముచే భక్తుడు. బ్రహ్మసమాజము భగవంతుడన ఫలానివిధముగ నుండునని మనస్సునకేదో భావము రుచి గలుగునటులు చేయవచ్చునుగాని ప్రతివారును తన మనస్సునకు దగినవిధముగ ఒక దైవమును సృష్టించుకొని మన ఆశయములను భావములను దానికి అర్పణచేసిన గాని మనస్సు తృప్తిగాంచజాలదు. ఇటుల యిష్టాపూర్తిగ త్యాగముచేసినపుడే మనుష్యుని లోని మంచి బైటికివచ్చును. సి. ఆర్. దాసుగారివిషయము నింతియేకాని మరేమియునులేదు. జీవితకాలమంతయును సంపాదించినది యేమియు నక్కరలేదని త్యజించి రాజకీయ వ్యవహారములందు పర్వతాగ్రమున నిల్చుట మంచి శిక్షణము బొందిన భక్తునకే సాధ్యముగాగలదు. ఆయన యీ పనిజేయుటకు మీనమేషము లేమియు లెక్కింపలేదు. భారతమాతయెడల తన ధర్మమును నిర్వర్తించుటకు సిద్ధముగ నిటులుచేసెను. ఆయన యిట్లు జేయుటవలన గల ఉపద్రవము నెరిగియేయున్నాడు. ఆవరించిన కష్టములు తెలిసియేయున్నవి. చిన్నప్పటినుండియు తనతో రాజకీయరంగమున కలసియున్న మిత్రులను విడనాడవలసివచ్చెను. పోనీ నాయకుడయ్యెదనను మనశ్శాంతికొర కందుమాయన్న గాంధి సైన్యము లెప్టినెంటుగనే చేరెను. ఆయన రాజకీయరంగమున ప్రవేశించుటనుగూర్చియు, ఆయన అభిప్రాయములను గూర్చియుభేదాభిప్రాయము లుండవచ్చును. కాని ఒకటిమాత్రము నిశ్చయము. భారతదేశము కుందుమన్న రాజకీయ ఘోరములను కనుగొనుటలో కొరబడి యుండవచ్చునుగాని ఆయన యేపనిచేసినను అందుగల చిత్తశుద్ధియు ఔదార్యమును త్యాగభావమును యెవ్వరును శంకింపజాలరు.

## గ్రంథకర్త

చిత్తరంజనుడు 1894, 1895 సం॥లలో బెంగాలీ వాఙ్మయమునందు ప్రవేశించి పనిచేసెను. అప్పు డాయన 'మాలంచ' అను బెంగాలీగీతము ప్రకటించెను. దానితో బెంగాలులో గీతవాఙ్మయమునందు నూతన స్వాతంత్ర్యము ప్రవేశపెట్టబడెను. కాని యీ సారస్వతరుచుల నన్నిటిని చంపుకొని ఆయన తండ్రిపేరున వచ్చిన మచ్చను తొలగించుటకై విడుపక న్యాయవాదివృత్తినే అవలంబించవలసివచ్చెను. ఆపనితీరగనే ఆయన బెంగాలు జాతీయోద్యమమునందు మరలదిగెను. 1915లో 'నారాయణ' యను బెంగాలీ మాసపత్రికను స్థాపించెను. ఇంకను 'మాలా' 'అంతర్యామి' 'కిశోర-కిశోరి' 'సాగరసంగీత' అను నాలుగు గీతగ్రంథములను ప్రచురించెను. ఇందు మొదటి మూడింటిలోను బెంగాలు వైష్ణవమత ప్రబోధకములగు పద్యములు గలవు. ఈపద్యముల మూలమునందు మంచి నూత్న భావములును, ఆనందకరములగు నాదర్శములును గలవందురు. ఇంగ్లీషు మాథ్యూ ఆర్నాల్డుతో సమానముగ అంతపటుత్వముగ వ్రాసెననియే చెప్పవచ్చును. ఆయన సాగరసంగీతమునకు జేసిన పరివర్తనమును జదివినను, అరవిందఘోషు దానికి పద్యరూపమున వ్రాసినదానినిజూచినను యీవిమర్శనమునందలి సత్యము స్ఫురింపగలదు. ఇంతేకాక వీనివలన ఆయనకుగల వైష్ణవమతభక్తియు వెల్లడిగాగలదు. ఆయన సముద్రముయొక్క అంతరార్థమును గ్రహించెను. పాలవలెనుండు తెల్లనిసముద్రము భగవంతునకు శయ్యగానుండి ఆనందదాయకముగ నుండునటుల స్తోత్రముల జేయును.

దాసుగారు యిట్టిభక్తిగన్గి కవితాధోరణిగన్గి అనుభవించినపిదప నూత్న తేజముతో బలముతో రాజకీయరంగమున ప్రవేశించెను.

సి. ఆర్. దాసుగారు వాగ్వాదములందు మంచి సమర్థుడు. రాజకీయోపన్యాసములందు ఆయన ప్రత్యర్థులవాదములను యెదుర్కొని చక్కగ సులభముగ పటుతరమగు భావముతో నెటులవాదించునో మనకు తెలియును. స్వపరిపాలనాదర్శమును పొలిసీకోసముగాని యేదో అవసరముచేతగాని విడనాడు వారివిషయమునగూడ దాసుగారు తీవ్రముగ నుందురు. చిన్న నాయకుడుగ నున్నవానిని అందుకని అనుసరింపవలదని ఆయన హెచ్చరించును.

## అసహాయవాది

మాంటాగూ ఇంగ్లాండుకు తిరిగిపోయెను. ఈదేశములో చాలమంది నాయకులు తనరాజీని అంగీకరింతురని ఆయన నమ్మెను. సంస్కరణములబిల్లును తొందరపెట్టి అమృతసరములో కాంగ్రెసు సమావేశముసలోపల శాసనము జేయించెను. సంస్కరణములు సరిపోవని కాంగ్రెసు గట్టిగ అభిప్రాయమును దెల్పినను నాయకులు చాలమంది గాంధిగారుగూడ సంస్కరణములను పనిచేయుటలో ప్రభుత్వముతో సహకారముచేయుమనిరి. సి. ఆర్ దాసుగారు యెదుట నుంచుకొనిన ఆదర్శమునుండి వెనుదీయువాడుగాడు. సంస్కరణముల విషయమున సహకారము కూడదని నిరోధించిరి. ఈ రాజకీయము లేమిటని ఆయన తనస్వపరిపాలనాదర్శ మేమో అందేపడియుండి తనచేతనైన విధమున సంపూర్ణ స్వపరిపాలనా విధానమునకు దేశమును సిద్ధము చేసియుండెడివాడేమో కాని అటుల జరుగలేదు. ఆయన రాజకీయజీవితమునందు మరియొక అంతరము గల్గెను. అసహాయోద్యమము తలయెత్తెను. అప్పటినుండియును ఆయన అహింస, రాటము అని రెంటినే చెప్పుచుండెను.

## త్యాగము

అసహాయోద్యమమునందు చిత్తరంజను డెటుల పాల్గొనినదియు అందరకును తెలిసినదే. ఇప్పుడు దానిని గూర్చి విరివిగ వ్రాయ నక్కరలేదు. బహిష్కారోద్యమము తీవ్రముగ నున్నరోజులలో కలకత్తా పాఠశాలనుండియు విద్యార్థులను బైటకివచ్చునటులు చేయుటలో గొప్ప ప్రచారము చేసెను. ఈవిషయమునకే సరు అశుతోషుముఖర్జీ ఆక్షేపమును దెల్పెను. బెంగాలులో తిలకు స్వరాజ్యనిధిని వసూలుచేయుటకు దాసుగారే ప్రధానభూతులైరి. ఆయన న్యాయవాదవృత్తియందు అమోఘముగ సంపాదనమున్న పుడు దానిని వదలివేసిరి. తన సంపాదనమంతయును కలకత్తాలోనిజాతీయకళాశాలకు ధారబోసెను. ఆకళాశాలయందు చేరిన విద్యార్థులకు స్వరాజ్యసంపాదనకుముఖ్యమైన రాటము నేర్పబడెను. 1921 కాంగ్రెసుకు దాసుగారు అధ్యక్షుడుగ నెన్నుకొనబడిరి. ఆయనకు స్వార్థమును నదెక్కడను లేదు. ఉన్నతాదర్శములుగలవాడు. సర్వమునకు పాత్రుడైనవాడు.

## నిర్బంధము

బెంగాలులో వలంటేరు ఉద్యమము అక్రమమని ప్రకటించినవెంటనే దాసుగారి ఏకైకపుత్రుడగు చిరరంజనదాసు 6-వ తేదీ అరెస్టుచేయబడి, 9-వ తేదీని ఆరునెలలుశిక్ష విధింపబడెను. ఆరవతేదీనే సి. ఆర్. దాసుగారును, ఆయనతోబుట్టువు ఊర్మిళాదేవియు ఖద్దరమ్ముచున్న మిషతో హర్తాలు జరుపుచున్నారనియు అరెస్టు చేయబడిరి. మేజస్ట్రేటు వార్నింగుతో వారిని వదలివేసినను పిదప ఒకరీతిగ నిర్బంధములు విజృంభించెను. సి. ఆర్. దాసుగారు 9-వ తేదీని రొనాల్డుషే ప్రభువుతో సంభాషించిరని తెలిసెనుగాని తత్ఫలిత మేమియో తెలియలేదు. 11-వ తేదిని సి. ఆర్. దాసుగారినే క్రిమినలులా సవరణచట్టము సెక్షను 17. బి. క్రింద అరెస్టుచేసిరనువార్త వచ్చెను. ఈ కేసు విచారణ వాయిదాలు వేసి వేసియుంచిరి. అహమ్మదాబాదు కాంగ్రెసునాటికి దాసుగారింకను విచారణకావలసియున్న ఖైదీగనేయుండిరి. 1921 కాంగ్రెసులో ఆయన అధ్యక్షోపన్యాసము చదువబడినను నందు దెల్పినభావములు ఆయన ప్రతిభను చాటుచు యింకను ఎంత భవిష్య దభివృద్ధి కవకాశముగలదో సూచించెను.

## స్వరాజ్యపక్ష నిర్మాణము

1922 ఆగస్టులో దాసుగారు విడుదలయిరి. డిసెంబరులో గయలో జరిగిన కాంగ్రెసు కధ్యక్షులుగ

నుండిరి. అందు స్వరాజ్యపక్ష శ్రోత్రియపక్షములకు జరిగిన వివాదము లందరకును దెలిసినవే. రాజీ కుదురక పోయెను. మార్పువద్దను పక్షమే నెగ్గెను. 1923 జనవరి లో దాసుగారు స్వరాజ్యపక్షమును నిర్మించిరి. ఈ పక్షమునకు వారు నాయకులుగనుండి బెంగాలులోను దేశమంతటను గావించిన ప్రచారము వర్ణనాతీతము. దానితో వారికిగల శక్తిసామర్థ్యములు దేశమునకు బాగుగ దెలిసెను. భారతప్రభుత్వమును సవాలు చేయుటలో దేశబంధునకు అత్యంతపటుత్వముగలదు. దేశములో ప్రతిపక్షు లెంద రేర్పడినను ఒక్కఁడుగ నుండియైనను ఏ యుద్యమమునైన నడుపగల శక్తిగలవాఁడగుటచేతనే స్వరాజ్యపక్షమునకు వ్యక్తిత్వమును గలుగజేసి కాంగ్రెసులోనుండి యేమాత్రమును విడిపోక శ్రోత్రియ పక్షముతో సమాధానమును జేసికొని ప్రభుత్వము నెదుర్కొనుటలో అత్యంత సామర్థ్యమునుజూపి దాసుగారు పేరుగాంచిరి. బెంగాలులో సంస్కరణములమాట లేకుండ చేయగల్గెను. ఫరీదుపూరు ప్రసంగమునందు ప్రభుత్వముతో సహకారము చేయుట కేవో షరతులను జూపించ దాసుగారు లొంగిపోయిరని విదేశపత్రికలు సంతోషించెనుగాని అట్టిదేమియును లేదని తెల్పుటకే వెంటనే ప్రభుత్వము వారు బెంగాలులో సంస్కరణములను రద్దుచేసిరి. దాసుగారు ప్రాణములనైన నర్పించి దేశమాత సేవచేసెదనని ప్రకటించినందులకు సార్థకముగనే ఆరోగ్య మేమాత్రము సరిగ లేకున్నను లేవలేనిస్థితిలో నున్ననుగూడ బెంగాలుశాసనసభకు పోవలసియుండ బోయి, నెల క్రిందటనే ఫరీదుపురము సభాధ్యక్షతనువహించి, మహాత్ముని సంచారమునకు తన దేశమున మంచియేర్పాటులనుగావించి యింకను స్వరాజ్యసౌధమును నిర్మించునంతలో భగవంతుఁడాతని గొంపోవునని యెవ్వరును కలనైన తలంచియుండ లేదు. భగవంతుఁడు భారతదేశమునకు స్వాతంత్ర్యమును ప్రసాదింపజేసి దాసుగారి ఆత్మకు శాంతిగలుగజేయును గాక!

* * * *

శ్రీ రాజా వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాద బహద్దరు గారు

అఖిల సంపద లర్థి నర్పించినాఁడవు, భారతజనయిత్రి పాదపీఠ
అంపఁగోఁతగా వ్రయ్యలాడితివి ని,రంకుశ ప్రభుతా మహాద్రుమంబు
అన్నట్లు చేసినాఁ డన్న సంస్తుతిఁగొంటి, ద్వంద్వపాలనము విధ్వంసపఱిచి
సాత్త్వికబీజముల్ చల్లితి తీవ్ర వం,గీయయువక మనఃక్షేత్రములను
గీ. నీదునాయకత్వంబుఁ గాంక్షించి యిప్డు, డమరు లాహ్వాన మంపిరే హర్ష మలర?
దివిజనాథుని గుండియల్ దిగ్గురనఁగ, నరిగితివె చిత్తరంజనా! యమరపురికి?





కీ. శే. దేశబంధు చిత్తరంజనదాసు.

# దేశబంధు చిత్తరంజనదాసు నిర్యాణము

## తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు

సర్వస్వమును దేశజనని దాస్యముఁ బాప, ధారవోసిన మహాత్యాగమూర్తి
యెవకికేదలనెల్ల విధుల రక్షణఁజేసి, ప్రఖ్యాతిఁగాంచిన దీనబాంధవుండు
దీక్షతోడ స్వరాజ్యపక్ష సైనికకోటి, నడిపి పేర్గన్న సేనావిభుండు
ద్వంద్వప్రభుత్వపద్ధతుల నుద్ధతిమాన్పఁ, బోరి గెల్పునుఁ గొన్న వీరమాళి

గీ గణుతికెక్కిన భారతకర్మయోగి, ప్రణుతికెక్కిన మంత్రితంత్ర ప్రయోగి
అద్వితీయ స్వరాజ్య భోగానురాగి, అకట! దేహపరిత్యాగియయ్యె నెట్లు?.

సీ. పడిపోయె నేడు నా కుడిబుజంబనియెంచి, దిగులొందుచుండె గాంధిప్రభుండు
నన్నుద్ధరించు నన్దనుఁడేగె దివికంచుఁ, బలవరించుచునుండె భరతమాత
పతిపోయె మాకింక గతియెవ్వరని యేడ్వ, సాగెఁ స్వరాజ్యపక్ష ప్రజాళి
ఆత్మీయరాష్ట్ర సింహముపోయెననుచు జిం, తించుచుండిరి వంగదేశజనులు

గీ. అకట! కలియుగరాధేయుఁ డస్తమించె, ననుచు నగ్రగులెల్ల లోనడలుచుండి
రిట్టిదుస్థితి మాకంటఁ గట్టిపెట్టి, దివికిఁజనఁ జెల్లునే? నీకు దేశబంధు.

సీ. కబళించితివి జగత్కల్యాణదాయి దా, దాభాయి నానాఁడు తనివిదీర
దిగ్ర్మింగితివి మాతృదేశభక్తవతంసు, గోక్లేమహాశయుం గోర్కెదీర
మ్రింగివైచితివయో మించిపోంచి సహస్ర, పాంచాలవీరులఁ భ్రమతదీర
గుటకవైచితివిసీ కుటిలబుద్ధిని లోక, మాన్య గంగాధరున్మమతదీర

గీ. నిందరిం బలిగొనియు సంతృప్తిలేక, చిత్తరంజన మరలఁగాఁజేసినావె
కట్ట! నీకింతటిదురాశ పుట్టెనమ్మ! పూజ్యులౌ నందురే నిఁ స్వరాజ్యశక్తి!

* * * * * * * *

## జనమంచి సీతారామస్వామి గారు

* * * * * * * *

సీ. ఇమ్మన్నవానిని బొమ్మనఁజాలక, తృప్తుని జేసెడి యీవి నీది
భక్త్యమృతంబును బాగుగాఁ గురిపించి, ఖ్యాతి గడించిన కవిత నీది
న్యాయాధిపతులెల్ల నబ్బురపడునట్లు, వాదించి గెలుపొందు ప్రజ్ఞ నీది
ఆహారనిద్రాదులైన విసర్జించి, దేశంబు సేవించు దీక్ష నీది

గీ. ఇన్నిశక్తులు గలవాఁ డిఁకెవ్వఁడయ్య?, యెట్లు నీవియోగము భరియింతుమయ్య!
పావనచరిత్ర! భారతభవ్యపుత్ర!, రమ్యగుణముఖ్య! శ్రీచిత్తరంజనాఖ్య!

సీ వైసురాయినె గాక వైటుహాలునుగూడ, నెంతయో కంపమొందించినావు
వంగదేశమునందు ద్వంద్వప్రభుత్వంబు, నద్భుతప్రజ్ఞచే నడఁచినావు
అల్పకాలములోనె యధికసంఖ్యాకు లౌ, ననుచరవరులతోఁ దనరినావు
మకుటంబులేనట్టి మనుజనాథుఁడ వన్న, నిర్మల కీర్తిచే నెగడినావు

గీ. ఎంతవాఁడవో నీవు వర్ణింపఁగలమె, మృత్యువోర్వఁ జాలకనిఁ హరించెనేమొ!
యెట్టిగతి పట్టె! దేశాన కేమి దిక్కు?, రమ్యగుణముఖ్య! శ్రీచిత్తరంజనాఖ్య?

సీ. దేవతల్ హర్షింప దివికేగితివిగాని, ఆవసంతాదుఃఖ మాఱుటెట్లు?
దేవతల్ హర్షింప దివికేగితివిగాని, చిరరంజనుఁడు శాంతిఁజెందు టెట్లు?
దేవతల్ హర్షింప దివికేగితివిగాని, వంగదేశము వృద్ధిఁ బడయు టెట్లు?
దేవతల్ హర్షింప దివికేగితివిగాని, భారతీయులయార్తి వాయు టెట్లు?
గీ. న్యాయవాదివయ్యు, సురల నలరఁజేయ, నరుల నిందఁబ నేడ్పించి యరుగఁదగునె?
ఇంతకును నిన్ను నిందింప నేమిఫలము?, బ్రహ్మదేవుఁడె నీతిని వదలియుండె!
రమ్యగుణముఖ్య! శ్రీచిత్తరంజనాఖ్య!

సీ. ధీరుఁడై నీవలె దేశవిముక్తికై, ప్రాణము లర్పించువాఁడు గాఁగ
భక్తుఁడై నీవలెఁ బ్రజలు మెచ్చెడునట్లు, ప్రతికార్య మొనరించువాఁడు గాఁగ
త్యాగియై నీవలె నఖిలజనాళికిఁ, బరమోపకృతి సేయువాఁడు గాఁగ?
దక్షుఁడై నీవలెఁ దాను బూనిన కట్టి, పను లెల్ల నెఱవేర్చువాఁడు గాఁగ?
గీ. భారతీయుఁ గటాక్షించి, పరమశాంతి, నీశ్వరుండు నీయాత్మకు నిచ్చుఁగాక!
భవ్యకవిగేయ! భారతభాగధేయ!, రమ్యగుణముఖ్య! శ్రీచిత్తరంజనాఖ్య!

* * * * * * * *

## నండూరి శివరావు గారు

చ. పలువు రశర్మవర్తను లపాత్రులు దేశహితార్థఘాతుకుల్
గలుగఁగ ధాత్రికిన్ బరువుగా సుకృతాత్ముఁ బరోపకారునిన్
బొలియఁగఁ జేసెఁగా యకట! పొల్లగునే సుకృతీగతాయువన్
బలుకు లెటన్ స్వరాజ్యమతభంజన! భారతచిత్తరంజనా!

సీ. గాంధి మహాత్ముండు కాంగ్రెస్ ప్రచారార్థమై వచ్చెఁ జేరి మాట్లాడవేమి
యిఁక స్వరాజ్యపక్షము లేచుటెట్టులో మార్గదర్శివై మున్ముందు తరల వేల
యర్థార్థులకుచు విద్యార్థు లేతెంచిరి, మించి వారి బహూకరించ వేల
కర్తవ్యము నెఱుంగఁ గాచియుండిరి ప్రజల్, దేశభక్తిని బ్రబోధింపవేల
గీ. స్వార్థపరు లయి దేశమ్ముఁ బారతంత్ర్యశృంఖలాబద్ధఁ జేయ సూత్రించు ద్రోహి
సమితి మతిమార్చ దైవికశక్తిఁ బడయ, దివికిఁ బోయితె మము వీడి దేశబంధు.
గీ. చచ్చిన స్వరాజ్యమునకయి చచ్చువాఁడ, బ్రదికిన స్వరాజ్యమునకయి బ్రదుకు దనుచు
శపథమును జేసి చాటంగ సాహసించు, ధీరతము లేరు లేరిఁక దేశబంధు!

సీ. జాతీయవిద్యాప్రచార మెవ్వఁడు సల్పె, జనులకు భావదాస్యంబు తొలఁగ
గ్రామనిర్మాణాంకురముల నాటె నెవండు, హైందవాదికమహాహైన్య మెడల
తనదు సర్వస్వమ్ము ధారవోసె నెవండు, చిత్రప్రజాహితదేశసేవకొఱకు
అనుపమానప్రజ్ఞఁ గనఁజేసి యెవఁడు సంస్కారరాజాలమ్మును జక్కడంచె
గీ. దేశపరతంత్రతావిముక్తికి స్వవృత్తి, దృణముగా వీడె నెవ్వఁ డా దేశబంధు
చిత్తరంజనదాసు స్వఃపట్టణమున, కరిగె నేఁడు స్వరాజ్యాశ లడఁగ నకట!

ఉ. దేశహితమ్ముకొంటె తన దేహము నర్పణఁజేసినట్టి యా
దేశికు సచ్చరిత్రము మదిన్ స్మరియించుచు సర్వదా తదా
దేశముఁ జొప్పునన్ మెలఁగి దేశపు దాస్యవిముక్తి చేయుఁడో
దేశజులార! మీరిఁకఁ దదీయమనమ్ము ప్రశాంతి నొందఁగన్.

# కీ. శే. చిత్తరంజనదాసు నిర్యాణము

## రాజా యం. భుజంగరావు గారు

చ. గురుతర దేశబంధువు, నకుంఠితధైర్యుఁడు, వంగదేశకే
సరి, ఘనభాగ్యభోగసువిసర్జన దక్షుఁడు, న్యాయవాది యై
పరఁగుచుఁ ద్యాగశీలతఁ గృపాపరత న్నిజ సర్వదేశసో
దరపరిరక్షకుం డయిన ధన్యుని యాత్మకు శాంతి గల్గెడున్.

ఉ. సారెకు సారెకున్ మృదువచఃప్రకరంబుల ముద్దుఁ జూపుచుం
జేరుచునున్న నిన్ను మృతిజీవులఁ బుత్రులఁ జేర్చిచూడ న
య్యారె! తటస్థమయ్యె నని యాడుచుఁ గన్నుల నీరునించె నీ
భారతమాత నీ సుగుణవైభవ మెన్నుచుఁ జిత్తరంజనా!

చ. తిలకుస్మృతిం గలంగుటను దేరనిచిత్తముతోడఁ గంట నీ
రొలుకఁ దలంచుకొంచు వెతనొందు మహాత్ముఁడు గాంధి నేఁడు ని
న్బలిమి నకాలమృత్యువు గొనం దిలకించుటఁ జిత్త మెట్లుగాఁ
గలఁగి తపించెనో? తెలియఁగాఁ దరమే యికఁ జిత్తరంజనా!

ఉ. కాలము చాలదయ్యెనని కన్నుల నీరిడనట్టి మానవుల్,
పోలఁగ డార్జిలింగుమెయిలుం గని కుంది రటన్నఁ జింతచేఁ
దూలనివారు, దేశ మిఁక దుర్భరకష్టము లొందు నం చనం
జాలనివారు లేరు; భువిఁ జాటి కనుంగొనఁ జిత్తరంజనా!

చ. ఘనతరదేశభక్తిని జగంబునఁ జూపుచు రాజకీయమం
దనుపమశక్తి వ్యక్తమగునట్లు చరించుచు నింతవట్టు నీ
వనయముఁ జిత్తరంజనుఁడ వైతి వటన్నది కల్ల సేయ మా
మనముల నింపినాఁడ విఁక మాననిదుఃఖము చిత్తరంజనా!

ఉ. దార వసంత యెంత పరితాపము నొందెనో! బిడ్డ లెంతగాఁ
గారియవడ్డవారో? యెఱుఁగం దరమే! మముబోటి మిత్రులే
పారము లేని ఖేదమునఁ బల్కుదు సజ్జన చిత్తరంజనా!
హా! రతి చిత్తరంజన! యటంచుఁ బలంతురు చిత్తరంజనా!

చ. అనుపమదేశభక్త్యతిశయంబున మున్గుచుఁ గార్యశూరతం
జనె విభవంబువీడి చెఱసాలకు సంతస ముప్పతిల్లఁగా
ననునది భావికాలవిజయంబుగఁ బొంగితి; విప్పు డీ చిరం
తన పరలోకవాస చరితం బెటు లెంతువు చిత్తరంజనా!

ఉ. ఉర్విని నీగుణంబు లొకఁడొక్కఁడు వర్ణనచేసి వ్రాసినన్
గర్వము గాదు పెక్కుశతకంబు లగుం; బఠనంబు సేయఁగా
నోర్వదు పాతకప్రకర మల్లమునం దని దానిమాని, నే
సర్వగుణోన్నతుండవని సన్నుతి సేయుదుఁ జిత్తరంజనా!

## చల్లా కృష్ణమూర్తి గారు

చ. హరిహరి యెంతమాట విననయ్యె గటా! యిది సత్యమౌనె? దు
ర్భరపరదాస్యతాపజలరాశినిమగ్నసమస్తహైందవో
త్కరమునుబ్రోవ దక్షమయి క్రాలెడు నౌక మునింగిపోయెనే?
తెరువిక నేది? యోహతవిధీ! మము నింకను గష్ట పెట్టెదే?

చ. తిలకవిహీనతం దనరితింగద యంచును మొన్నదాఁక నీ
వలమటనొంది యుంది యకటా! యొకరీతిని చిత్తరంజనం
బలవడనుంటి వమ్మ యిపుడయ్యది భగ్నమునొందె మాత! యే
లలి సహియింతొ! నీదునెతలన్ హరియించుమహాత్ము బట్టుమా!

ఉ. పైతృకమౌ ఋణం బుచితభంగిని దీర్చి జగంబునందు వి
ఖ్యాతినిగాంచి కంకణముగట్టెను మాతృఋణంబు దీర్పఁగా
పాతకపూర్ణద్వంద్వపరిపాలనరూ పడచెన్ క్షణంబులో
పుత్రుడు చిత్తరంజనుడు పోయెను స్వర్గపురంబు జేరగన్.

గీ. కర్ణశూలంబు హృత్ప్రవికల్పమైన, నీమరణవార్త యొకటె విన్నాముగాని
సరిగ వినలేదు నీ శోకజబ్బ చేసె, నంచు నెంతలో నెటుమాడెనయ్య! యకట!

గీ. మా యభాగ్యత కీ వేమి చేయగలవు, తను వశాశ్వతమను మాట తథ్యమెకద!
బ్రతికినన్నాళ్లు పురుషకారంబు నెరపి, మఱుగుపడితివి మాపాట్లు మావె యింక.

గీ. బంధుదుఃఖము దీర్ప నోపగలవార, లెవ్వ రొక్కమహాత్ములకే యది తగు
కనుక నో దేశమాతరో! వనటమాని, ధైర్యము వహించి వారిపాదముల బడుము.

* * * * * * * *

## వేదము వెంకటకృష్ణశర్మ గారు

* * * * * * * *

గీ. అమితదుఃఖతమిస్రము లవని నిండ, నార్తిఁబక్షులవలెఁ బ్రజ లడలుచుండ
నేరికిని గార్య మిది నా వచింపకుండ, నకట! చిత్తరంజనరవి యస్తమించె!

సీ. తనదేశమందుండు జనములకెల్ల, జీవనము గూర్చెడి లోకబాంధవుండు
తనదేశమున నెల్లఁ దనప్రచారము మీఱ ననిశంబు వెల్గిన యట్టియినుఁడు
తనదుదేశమునందు ద్వంద్వపాలనవార్ధి వడి నింకఁ జేసిన భాస్కరుండు
తనదేశదీనవిద్యార్థిచాతకముల కడుగక కురియు సహస్రకరుఁడు

గీ. అస్తమించెను జీకటు లలముకొనియె, నెన్నిదీవియ లున్న నిఁకేమిఫలము?
గలుగునే యట్టిసూరుని కాంతిఁ జూడ, నకట! చిత్తరంజనకవి యస్తమించె!

గీ. వగవగా నేల? మరియొక జగతి నతఁడు, వెలుఁగుచున్నాఁడు! మన కింక వెలుగునీయఁ
గలఁడు మోహనచంద్రుండె గాన నతని, యడుగుజాడలఁ బట్టుఁడీ యన్నలార!




గన్నవరపు సుబ్బరామయ్య

చిత్రముయొక్క మధ్యవలయమున 'అర్హాతపరమేష్ఠి'; తదుపరిభాగమున 'సిద్ధపరమేష్ఠి;' తద్వామభాగమున 'ఓం హ్రీం నమో దంసణస్స' (దర్శనమునకు నమస్కారము) అను సూత్రము; 'అర్హాతపరమేష్ఠి'కి వామభాగమున 'ఆచార్యపరమేష్ఠి'; తదధోభాగమున 'ఓం హ్రీం నమో నాణస్స' (జ్ఞానమునకు నమస్కారము) అనుసూత్రము; 'అర్హాతపరమేష్ఠి' కధోభాగమున 'ఉపాధ్యాయపరమేష్ఠి'; తద్దక్షిణభాగమున 'ఓం హ్రీం నమో చరిత్తస్స' (చరిత్రమునకు నమస్కారము) అనుసూత్రము; 'అర్హాతపరమేష్ఠి'కి దక్షిణభాగమున 'సాధుపరమేష్ఠి'; తదుపరి భాగమున 'ఓం హ్రీం నమో తవస్స' (తపస్సునకు నమస్కారము)అను సూత్రము. ఇవి యీసిద్ధచక్రమునందలివి. ఇందలి 1. అర్హాత, 2. సిద్ధ, 3. ఆచార్య, 4. ఉపాధ్యాయ, 5. సాధుపరమేష్ఠులు; 6. దర్శన, 7. జ్ఞాన, 6. చరిత్ర, 9. తపస్సులు నను నీతొమ్మిదిటికి నవమోక్షమార్గములని నామాంతరము.

రత్నత్రయము

గాథా. సమ్మద్దంసణ ణాణం
చరణం మోక్ఖస్స కారణం జాణే;
వవహారా ణిచ్ఛయదో
తత్తియమఇఓ ణిఓ అప్పా.

గాథా. రయణత్త్రయం ణ వట్టఇ
అప్పాణం ముయతు అణ్ణదవియంహి;
తమ్హా తత్తియమఇఓ
హోది హు మోక్ఖస్స కారణం ఆదా.

వీనిలో సమ్యగ్దర్శనము, సమ్యగ్‌జ్ఞానము, సమ్యక్చరిత్రము అను నీమూటికిని రత్నత్రయమని జైనపరిభాష. ఈరత్నత్రయము మోక్షార్థి కావశ్యకము లని వ్యవహారసిద్ధము. కాని ఇవి ఆత్మ నాశ్రయించి యుండునవి. మఱి దేని నాశ్రయింపవు. కావున నీ రత్నత్రయాశ్రితమైన యాత్మయే ముక్తిని గాంచ దగినది.

సమ్యక్త్వము (సమ్యగ్దర్శనము)

గాథా. జీవాదీ సద్దహాణం
సమ్మత్తం రూవమప్పణో తం తు;

* ఈ వ్యాసము భారతి రెండవసంపుటము ఆఱవసంచికయందలి 'సిద్ధచక్రము' అను వర్ణచిత్రముయొక్క వివరమును దెలుపును.

దురభిణివేసవిముక్కం
ణాణం సమ్మం ఖు హోది సది జమ్హి.

జీవ, అజీవ, ఆస్రవ, బంధ, సంవర, నిర్జరా మోక్షాదులను నీసప్త జైనమత తత్త్వముల యందలి విశ్వాసము సమ్యక్త్వ(సమ్యగ్దర్శన) మనబడునది. సమ్యక్త్వము మోక్షసౌధమునకు ప్రథమ సోపానము. ఈ సమ్యక్త్వ ప్రాప్త్య నంతరముననే సమ్యగ్జ్ఞానసిద్ధి కలుగును. సమ్యక్త్వ ప్రాప్తిపూర్వమే ద్రవ్యస్వరూపజ్ఞానము కలుగవచ్చును. కాని యది లోపభూయిష్ఠమై యుండును. ఈలోపములు సమ్యక్త్వ ప్రాప్త్యభావముచేగలిగినవి. సమ్యక్త్వము సిద్ధించినపిదప కుదిరెడు జ్ఞానము లోపరహితమై నిర్మలమైయుండును.

సమ్యక్ జ్ఞానము

గాథా. సంసయవిమోహావిభ్భమ
వివజ్జియం అప్పపరసరూవస్స;
గహణం సమ్మంణాణం
సాయార మణేయభేయం చ.

సంశయ విమోహా విభ్రమములని త్రివిధముగ నొప్పు సమారోపదోషమువలన వివర్జితము, ఆత్మపరస్వరూపగ్రహణశీలము, నైనది సమ్యగ్జ్ఞానము. అది బహువిధము.

గాథా. జం సామణ్ణం గహణం
భావాణం ణేవ కట్టు మాయారమ్;
అవిసేసి దూణ అట్టే
దంసణ మిది భణ్ణయే సమయే.

వికల్పాది శూన్యమైన పదార్థసత్తామాత్ర గ్రహణజ్ఞానము (వస్తువునందలి విశేషాంశములను విడచి కేవల వస్తుమాత్రమునే గ్రహించుజ్ఞానము-అనగా, వస్త్రమును చూచియు దాని ఆకార, వర్ణాదికములగు వివరములను గమనింపక వస్త్రమునుమాత్ర మెఱిగి యుండుట) జైనాగమములందు దర్శన మనబడుచున్నది. త్రిరత్నములయందలిసమ్యగ్దర్శనము పదార్థవికల్పాదిజ్ఞానముతో గూడినది; అనగా సమ్యక్త్వము. ఇట పదార్థసత్తామాత్ర జ్ఞానయుతము.

సమ్యక్చరిత్రము

గాథా. అసుహాదో విణివిత్తి
సుహే పవిత్తీ య జాణ చారిత్తం;
వదసమిది గుత్తిరూవం
వవహారణయా దు జిణభణియం.

గాథా. బహిరబ్భంతరకిరియా
రోహో భవకారణప్పణాసట్టం;
ణాణిస్స జం జిణుత్తం
తం పరమం సమ్మచారిత్తం.

అశుభకార్య (దుష్కార్య) నివృత్తియు, శుభకార్య (సత్కార్య) ప్రవృత్తియు గలిగి యుండుట సమ్యక్చరిత్ర మనబడును. వ్యవహారనయ (సామాన్యలౌకిక వ్యవహార) ప్రకారము వ్రతము(అహింసా,సత్య,అస్తేయ,బ్రహ్మచర్య, అపరిగ్రహాత్మకము), సమితి (ఈర్యా, భాష, ఏషణ,ఆదాననిక్షేప,ఉత్సర్గాత్మకము), గుప్తి (కాయ,వాక్,మనోగుప్తులు) అనునీమూటియందు సక్తమైయుండుట సమ్యక్చరిత్రమని జినోక్తి. మఱియు సాంసారికోపద్రవజనకములు, పరమాత్మపరిజ్ఞాన ప్రతిపక్ష భూతములు నగు బహిర్వ్యాపార (శుభాశుభవచనకా

కాయవ్యాపార)ములయొక్కయు, అభ్యంతర వ్యాపార (శుభాశుభమనోవికల్పరూపక్రియా వ్యాపార)ములయొక్కయు,నిరోధకజ్ఞానమేజిన భగవానుడు నుడివిన ఉత్తమసమ్యక్చారిత్రము.

తపస్సు (ధ్యానము)

గాథా. దువిహంపి మోక్ఖహేఉం
ఝాణే పాఉణది జం మునీ ణియమా;
తమ్హా పయత్తచిత్తా
జూయం ఝాణం సమబ్భసహ.

గాథా. మా ముజ్ఝహ మారజ్జహ
మాదుస్సహ ఇట్ఠణిట్ఠఅత్థేసు;
థిరమిచ్ఛహ జఇ చిత్తం
విచిత్త ఝాణప్పసిద్ధీఏ.

త్రిరత్నములే మోక్షహేతుకములనుట వ్యవహారనయసిద్ధము. త్రిరత్నయుక్తాత్మయే మోక్షసాధన మనుట నిశ్చయనయ సిద్ధము. ఈద్వివిధ(జ్ఞాన)ము ధ్యాన(తపో)మూలకము. ధ్యానము ముక్తికామున కత్యంతావశ్యకము; కావున మననశీలుడు నియతమనస్కుడై ధ్యానము (తపస్సు) చేయవలెను.

ఇట్టివివిధవిధవిచిత్ర ధ్యానసిద్ధికై స్థిర చిత్తమును గోరువారు ఇష్టార్థములయెడ ననురక్తులై వంచితులు కాకుండవలయును. అనిష్టార్థములయెడ ద్వేషింపరాదు. అట్టులైన ప్రశాంతచిత్తముతో స్వాత్మయం దాత్మబుద్ధిని నిలిపి తపోనిష్ఠాగరిష్ఠు లగుదురు.

ధ్యానమంత్రము

గాథా. పణతీస సోల ఛప్పణ
చదుదుగ మేగంచజవహ ఝాఏహ;
పరమేష్ఠివాచయాణం
అణ్ణం చ గురూవఏసేణ.

పరమేష్ఠి మంత్రజపము కావించుచు ధ్యానముచేయవలయును. ముప్పదియైదు వర్ణములుగల సంపూర్ణమంత్రము

"ణమో అరిహంతాణం ణమో సిద్ధాణం ణమో ఆయరియాణం ణమో ఉవజ్ఝాయాణం ణమో లోఏ సవ్వసాహూణం" అనునది.

[అర్హంతులకు నమస్కారము; సిద్ధులకు నమస్కారము,ఆచార్యులకు నమస్కారము;ఉపాధ్యాయులకు నమస్కారము; ప్రపంచమునందలి సర్వసాధువులకు నమస్కారము అని మంత్రార్థము.]

పూజ్యులగు నీ అర్హంత, సిద్ధ, ఆచార్య, ఉపాధ్యాయ సాధువులు పంచపరమేష్ఠులు.

అర్హంత పరమేష్ఠి

గాథా. ణట్ఠచదుఘాఇకమ్మో
దంసణసుహణాణ వీరియ మఈఓ;
సుహదేహత్థో అప్పా
సుద్ధో అరిహో విచింతిజ్జో.

జ్ఞానావరణీయ, దర్శనావరణీయ, మోహనీయ,అంతరాయములనుచతుష్కర్మములు ఆత్మయొక్క సహజగుణవిశేషములను ధ్వంసముచేయునవి. కావున వీనికి ఘాతీయకర్మలని పేరు. నాలుగింటిలో క్రమముగ నొక్కొక్కటి నశింప శుద్ధజ్ఞాన, శుద్ధదర్శన, అనంతసుఖ, అనంతవీర్యము (శక్తి) లను నాలుగు ఉత్తమ గుణము లొక్కొక్కటిగా జనియించును.

ఘాతీయకర్మ చతుష్క విముక్తుడును, శుద్ధజ్ఞానాద్యనంతకర్మ చతుష్కయుక్తుడును, శుభ దేహస్థుడును నగు నాత్మ అర్హంతపరమేష్ఠి. మఱియు నాపరమేష్ఠి అష్టాదశదోషరహితు డగుటచే శుద్ధుడు. [క్షుత్తు, తృట్టు, భయము, ద్వేషము, రాగము, మోహము, చింత, వార్ధక్యము, రోగము, మృత్యువు, శ్రమము, స్వేదము, మదము, అనిష్టము, ఆశ్చర్యము, జననము, నిద్ర, దుఃఖము. ఇవి పదునెనిమిది దోషములు. ఈదోషములవలన వినిర్ముక్తుడైన వాడనుట.] ఇట్టి అర్హంతపరమేష్ఠిని ధ్యానము చేయవలెను. నిశ్చయముగ అర్హంతుడు శరీరము లేనివాడు; కాని వ్యవహారదృష్టి నతడు శరీరముగలవాడు. ఆ శరీరమునకు 'ఔదారికము' అనుపేరు. అది వేయిసూర్యుల వెలుగుకలది.

అర్హంతపరమేష్ఠి ద్వాదశ గుణయుతుడని కొండొకచో గానవచ్చెడిని. వానిలో నెనిమిది బాహ్య (ఐశ్వర్య) గుణములు. అవి ౧. అశోక వృక్షము, ౨. సురపుష్పవృష్టి, 3. దివ్యధ్వని, ౪. చామరము, ౫. సింహాసనము, ౬. భామండలము; ౭. దుందుభి, ౮. ఛత్రము అనునవి. తక్కిన నాలుగు ఆభ్యంతర గుణములు అవి ౧. అపాయాపగమాతిశయ, ౨. జ్ఞానాతిశయ, 3. పూజాతిశయ, ౪. వచనాతిశయములు.

సిద్ధపరమేష్ఠి

గాథా. ణట్ఠట్ఠ కమ్మదేహో
లోయాలోయస్సజాణఓ దట్ఠా;
పురిసాయారో అప్పా
సిద్ధో ఝాఏహ లోయసిహరత్థో.

వినష్టాష్టవిధకర్మదేహుడును, సకల విమలకేవల జ్ఞానదర్శనముల బలమున లోకాలోకగతములగు త్రికాలవర్తిసమస్తవస్తుస్వభావముల నెఱిగినవాడును, చూచినవాడును, నిశ్చయదృష్టి నతీంద్రియుడు, నిరాకారుడునైనను, వ్యవహారదృష్టిని ఛాయాప్రతిమవలె ఈషదూనచరమశరీరపురుషాకారము గలవాడును, లోకాకాశోపరిస్థితమగు, 'సిద్ధశీలస్థానము'న నుండువాడునునగు ఆత్మ సిద్ధపరమేష్ఠి. అట్టి సిద్ధపరమేష్ఠిని ధ్యానము చేయవలెను. ఈసిద్ధుడు అంజనాది విభూతిసిద్ధులగు లౌకికసిద్ధులలోనివాడు కాడు.

మఱియు నీపరమేష్ఠి అష్ట (౮) గుణయుక్తుడని కొందఱు నుడువుచున్నారు. ౧. కేవలజ్ఞాన, ౨ కేవలదర్శన, 3. అవ్యాబాధసుఖ ౪. క్షాయికసమ్యక్త్వ, ౫. అక్షయస్థితి, ౬. అరూపిత్వ, ౭. అగురులఘుత్వ, ౮. అనంత వీర్యము లనునవి ఆయెనిమిదిగుణములు.

ఆచార్యపరమేష్ఠి

గాథా. దంసణణాణ పహాణే
వీరియచారిత్తవరతవాయారే,
అప్పం పరంచ జుంజఇ
సో ఆయరియో మునీ ఝేఓ.

దర్శన, జ్ఞాన, చరిత్ర, తపో, వీర్యములను పంచాచారములను స్వయముగ నాచరించి శిష్యాదులచే నాచరింపజేయు ముని ఆచార్య పరమేష్ఠి. అట్టి ఆచార్యుని ధ్యానము చేయునది. పంచాచారములయందును దర్శనజ్ఞానాచారములు ప్రధానములు. మఱియొకరు

"ఛత్తీసగుణసమగ్గే
పంచ విహాచార కరణ సన్దరిసే;
సిస్సాణుగ్గహకుసలే
ధమ్మాయరియే సదా వందే."

[ముప్పదిఆఱుగుణములు గలవాడు, పంచవిధాచారములను తా నాచరించి ఇతరుల నాచరింపజేయువాడు, శిష్యానుగ్రహకుశలుడు నగు ధర్మాచార్యునకు ఎల్లప్పుడు నమస్కరించుచున్నాను.] అనిరి. ఇట ముప్పదిఆఱుగుణములనగా: ఇంద్రియ సంవరణములు ౫, బ్రహ్మచర్య వ్రతోపాయములు ౯, కషాయభుక్తులు ౪, మహావ్రతములు ౫, ఆచారములు ౫, సమితులు ౫, గుప్తులు ౩.

### ఉపాధ్యాయ పరమేష్ఠి

గాథా. జో రయణత్తయ జుత్తో
ణిచ్చం ధమ్మోవఏసణే ణిరదో;
సో ఉవఝ్ఝావో అప్పా
జదివరవసహో ణమో తస్స.

రత్నత్రయ (సమ్యగ్దర్శన,సమ్యజ్ఞాన, సమ్యక్చారిత్ర) యుక్తుడు, ఎల్లపుడును (జిన) ధర్మోపదేశ నిరతుడు, జినమునివరులలో నుత్తముడు నగు ఆత్మ ఉపాధ్యాయ పరమేష్ఠి. అట్టివానికి నమస్కారము. మఱియు నీఆచార్యుడు పంచవింశ (౨౫)ద్గుణ యుక్తుడని యొకరు చెప్పుచున్నారు. అంగములు౧౧, ఉపాంగములు ౧౨, చరణము ౧, కరణము (ఆచార విశేషము) ౧, ఇవి ఆ ౨౫ గుణములు.

### సాధుపరమేష్ఠి

గాథా: దంసణణాణసమగ్గం
మగ్గం మోక్ఖస్స జో హు చారిత్తం;
సాధయది ణిచ్చసుద్ధం
సాహూ స ముణీ ణమో తస్స.

సమ్యగ్దర్శన సమ్యజ్ఞానసమగ్రమును, నిత్యశుద్ధమును, బాహ్యాభ్యంతరమోక్షమార్గ సాధకమును నగు సచ్చరిత్రమును సాధించు ముని సాధుపరమేష్ఠి. ఆతనికి నమస్కారము. మఱియు సాధుపరమేష్ఠి సప్తవింశత్ (౨౭) గుణయుక్తుడు. అవి మహావ్రతములు ౫, రాత్రిభోజనత్యాగము ౧, కాయరక్షణములు ౬, పంచేంద్రియ, లోభ నిగ్రహములు ౬, క్షమ ౧, భావశుద్ధి ౧, ప్రతిలేఖనము ౧, సంయమము ౧, అవివేకత్యాగము ౧, వికథాత్యాగము ౧, [అనగా ౧. స్త్రీకథ ౨. భక్త (భోజన) కథ ౩. దేశకథ, ౪. రాజకథ ఈ నాల్గిటియొక్క త్యాగము], మనోవాక్కాయాశుభవ్యాపారత్యాగము ౧, ఖావీస పరిసహము (ఉపద్రవ) (?) ౧,—మరణాంత ఉపసర్గము ౧. అనునవి. ఇట్లొకరు చెప్పిరి.

వ్యవహారనయానుసారము పంచపరమేష్ఠిధ్యానారాధనములు విధింపబడినను నిశ్చయనయానుసారముగ నీ పంచపరమేష్ఠులకు మూలాధార మగు పరిశుద్ధాంతరాత్మయే ధ్యానముచేయవలసినది.

గాథా. జం కించివి చింతంతో
ణిరీహావిత్తీ హవే జదా సాహూ;
లద్ధూణయ ఏయత్తం
తదాహుతం తస్సణిచ్ఛయం ఝాణం.

సాధుపరమేష్ఠి నిరీహు (వాంఛారహితు)డై దేనియందేని తనచిత్తమును ఏకాగ్రముగ ననుసంధించి ధ్యానించిన నదియే నిశ్చయమగు ధ్యానము. ఐహిక దుర్విషయముల నుండి చిత్తమును మరల్చి ధ్యేయవస్తువుపై స్థిరముగ నెలకొల్పుటకు తొలుత పంచ పరమేష్ఠ్యాది ధ్యానము నభ్యసింపవలెను. స్థిర చిత్తప్రాప్త్యనంతరము శుద్ధబుద్ధైకస్వభావ నిజ శుద్ధాత్మ స్వరూపమునే ధ్యానింపవలెను. ఇట్టి యాత్మధ్యానమే నిక్కమగు ధ్యానము. ఇదియే మోక్షదాయకము.

[నేమిచంద్రకృత ద్రవ్యసంగ్రహము జైనగ్రంథమునుండి.]



# పడవ పయనము

(జీవయాత్ర)

బుక్కపట్టణము తిరుమల నరసింహాచార్యులు గారు

పడవపయనం అంటె- బ్రమసిపొయ్యాను
పానాలు పైకట్టి పరుగులెడతాయి
కెరటాల తాకిడికి
జారిపోతది తెడ్డు
పడ వేటొ వారిగొరిగి
పడి వూగుతుండాది. ప॥

నంకలో శిన్నోడి
ఝుదుపు తీరుత్తోంటె
అలల దెబ్బకి పడవ
అదిరదిరి పడతాది. ప॥

వొకకన్ను ఆ డొంక
వొకకన్ను తెడ్డొంక
మనసు నీమీదెట్టి
మునిగి లెగుతుండాను. ప॥

కిందుమీదికి సూస్తె
కిందుమీ దౌతాది
పారసూ నేతల్కి
పడవోరిగి పడతాది. ప॥

కూసింత దూరాన
గుడిగోపురా లయిగొ
పానాలు బిగబట్టి
పడవ సాగిద్దాము. ప॥

నేతుల్ని రెంటిని
శిన్నోడి మీదేసి
ముగ్గురం యీడనే
మునిగి పడ వొగ్గాలె. ప॥




## దేశబంధు చిత్తరంజనుదాసు

స్వాధీన భారత ధర్మసంరంభమునందు లోకమాన్య బాలగంగాధర తిలకు నిర్యాణముతో నారంభమైన పర్వము దేశబంధు చిత్తరంజనదాసు నిర్యాణముతో నంతము నొందినది. ధర్మము విజయమును బొంది శాంతిపర్వము సంప్రాప్తమగుట కెన్ని పర్వములు గావలయునో, యెందరు మహానుభావు లాత్మసమర్పణమును జేసి యమరత్వమును బడయవలయునో యెవ రూహింపగలరు? మహారథుడైన చిత్తరంజనదాసు నిర్యాణము భారతహృదయమునందు పరమవిషాదమును గలుగ జేసినది. చిత్తరంజనదాసు మహాయోధుడు; దానకర్ణుడు; మహాభక్తుడు; కవిశేఖరుడు; భోగి, విరాగి. దాసునందు జ్ఞానయోగము, భక్తియోగము, కర్మయోగము సమరసభావమును బొందినవి. ఆయనయందు ప్రాచ్యపాశ్చాత్యసంస్కారములు సమ్మేళనమును బొందినవి. దాసు ప్రబుద్ధభారతపుత్రుడు. వైష్ణవ భక్తుడైన చిత్తరంజనదాసు భారత సంస్కారముయొక్క మహత్త్వమును పతితస్థితిని సంభావింపగలిగెను. జన్మభూమి నుద్ధరించుట కాత్మ సమర్పణము చేసి యమరత్వమును బొందెను. దేశబంధుదాసు సజీవుడై చేయబూనిన స్వధర్మసంస్కరణమును విగతజీవుడై తన దేశీయులకు చేయగలిగెను. జీవితకాలమునంను ప్రబలిన నిందారోపణ దురభిప్రాయములను మరణము మాయముచేసి విశుద్ధవ్యక్తిత్వమును వ్యక్తముచేసినది. చిత్తరంజనుని దేశభక్తి త్యాగములు ప్రజాహృదయములందు ప్రత్యక్షములై యపారమైన దుఃఖావేశమును గలుగ జేసినవి. సకలజనులును జాతి మతాధికారాభిమానములను విసర్జించి తర్పణాంజలులను సమర్పించిరి. పితృలోకవాసియైన దేశబంధునకు భారతేతిహాసములందు స్థిరవాసము గలిగినది. స్వధర్మ నిర్వహణమునకు ప్రజలకు దాసు జీవిత మాదర్శమైనది. ప్రజాహృదయమునందు నిండియున్న దాసుజీవితము విషాదమువలె నానందమును సయితము గలుగ జేసినది. జీవితపరమార్థమైన యమరత్వము సకలజనులకును నానందప్రదము గదా!

*　　*　　*　　*

## లోకమాన్య తిలకు – దేశబంధుదాసు

భారతధర్మసంరంభమునందు తిలకు దాసు గాంధి నామములు ప్రాతస్స్మరణీయములై విలసిల్లుచున్నవి. లోకమాన్య బాలగంగాధర తిలకు సనాతనమైన భారతసంస్కార సంజాతుడు. పాశ్చాత్యవిజ్ఞానమునందు గడించినప్రావీ

# గ్రంథ విమర్శనము

## కమలాక్షి

విద్వన్మండలికిఁ గృతపరిచయులును, నెల్లూరి కళాశాలకుఁ బ్రధానోపాధ్యాయులును అగు మ-రా-శ్రీ, రాయసము వేంకటశివుఁడు, ఎం. ఏ., ఎల్. టి. గారు, తాము నూతనముగా రచించిన "కమలాక్షి" యను నవల (ఆఖ్యాయిక) అభిప్రాయార్థము నా కంపఁగా నే నది యామూలాగ్రముగాఁ జదివి సంతోషించినాను.

ప్రస్తుత హిందూదేశ ప్రజాసంఘము దెవరో యొక రాబాల్యము తనకుఁ దటస్థించిన కష్టసుఖములు చెప్పుకొనుచు వ్రాసిన స్వీయచరిత్రవలె ఈనవల గన్పట్టుచున్నది.

పల్లెలలో నుండువారి సంసార వ్యాపారములు, విద్యాపద్ధతులు, అవ్యాజమైన శైశవస్నేహములు, బాల్యక్రీడలు, బాల బాలికాప్రకృతులు—ఇవన్నియుఁ జక్కఁగా స్వభావసిద్ధముగాఁ బ్రదర్శింపఁబడినవి.

ప్రకరణములు నాతిదీర్ఘములై, విసుగుపుట్టించు నవయవ వర్ణనములును దుస్తుల వర్ణనములును లేకుండ నున్నవి.

కథానాయిక కమలాక్షి యని పుస్తకమునకుఁ బెట్టినపేరే తెల్పుచున్నది. తత్పాత్రపోషణము గ్రంథకర్తగారు బాగుగాఁ గావించినారు. ఆమె సౌజన్యము, సహనశక్తి, కష్టములో నున్న బాల్యస్నేహితులకుఁ జేదోడువాదోడై క్రియారూపమునఁ బ్రకటించు నామె విశుద్ధమైత్రీప్రేమములు, సత్పురుషుల కకారణాపకారులను నరరూప వృశ్చికములజాడలు గనిపట్టుటయందలి బుద్ధికౌశలము — ఇట్టిలక్షణము లన్నియు నిపుణముగా నిరాడంబరముగా వ్యక్తీకరింపఁబడినవి.

అన్ని పాత్రములలోను దుష్టతమమైన పాత్రము పరమయ్యపాత్రము. అట్టి పాపిలోఁ బశ్చాత్తాపముఁ గలిగించి, తద్ద్వారమున నతనిని లోకోపకర్తయగు శిష్టుని జేసినది కమలాక్షి. ఆమె, ప్రేమానందయోగినీవేషమున, మంచితనముతో, నతని దుస్స్వభావమును మార్చుట, శత్రులను మిత్రులనుగాఁ జేసికొనుటకు గాంధిమహాత్ముఁ డెల్లెడల నుపదేశించు సాత్వికసాధనములను దలఁపునకుఁ దెచ్చుచున్నది. కాని చిరపరిచయులుగూడఁ బ్రేమానంద యోగిని కమలాక్షియే యని కనుఁగొనలేకుండుట మాత్రము వింతగా నున్నది.

పుత్రికావియోగ ప్రకరణమునందు 84-వ పుటలోఁ గాలస్వభావమును గూర్చి వ్రాసినపఙ్క్తు లతిమనోజ్ఞములుగ నున్నవి.

ప్రపంచములో, లోకహితైషులగు సన్మార్గవర్తులు అసూయాగ్రస్తుల పరిహాసములకును అపనిందలకును బాలు పడుట తప్పదను సత్యము నీనవల స్పష్టీకరించుచున్నది.

దరిద్రతావతార మూర్తులగు గ్రామోపాధ్యాయుల యిక్కట్టులును, వారి విద్యావిధానములును, దండన పద్ధతులును వర్ణించుపట్టులందు మృదువైన హాస్యరసము గన్పట్టుచున్నది.

గ్రంథమునం దుపయోగింపఁబడిన భాష సులభమగు చక్కని గ్రాంథిక భాష. 'ఏమిటది తండ్రీ (18), అంత మా యిరువురికి (19), ప్రబోధనా వైదగ్ధ్యము (23), పుట్టిల్లు (41), దొరికిపోవును (63), భర్తాగ్రేసరి (89), తలయు గడ్డమును నెఱసియున్న (78)'— వీని సాధుత్వముమాత్రము చింత్యము, కాన నవి ప్రామాదికములు గావచ్చును. 6 వ ప్రకరణము చివరనున్న:— నీకీ బహుమతి యొసఁగుట, ఈయున్నతపాఠశాలలోనివిద్యార్థులలో నీవు ప్రథముఁడవుగ జయమునొందుటచే ననుట కంటె, సత్ప్రవర్తనవిషయమున వారిలో నీ వగ్రస్థానము నహించుటచేననిన నెక్కుడుసత్యము—అనువాక్యముయొక్క రచన తత్పూర్వమనోనిర్మితమైన యాంగ్లవాక్యముయొక్క యాంధ్రీకరణమునలెఁ జూపట్టుచున్నది.

మొత్తముమీఁద ఈనవల యత్యల్పదోషమునుగుణబహుళముగను నాకుఁ గన్పట్టుచున్నది.

ఉభయభాషాభిజ్ఞులును, సౌశీల్య సంపన్నులును, విపుల లోకానుభవముగలవారును అగు శ్రీ వేంకటశివుఁడు గారిట్టి నీతిదాయకములగు నవల లింకను వ్రాసి దేశభాషా పురోభివృద్ధికిఁ దోడ్పడుదురు గాక !

పిఠాపురము,
29-6-1925. } కూచి నరసింహము

న్యాము పరధర్మ వ్యామోహమునుగలుగ జేయలేదు. లోకమాన్యుడు విద్యాభ్యాసమున కింగ్లాండునకు బోలేదు. న్యాయశాస్త్రపండితుడయ్యును న్యాయవాదివృత్తినవలంబించలేదు. ఆంగ్లవిద్యాసంస్కారమును బొందియును వేషభాషలనుమార్చిస్వధర్మవిముఖతనుజూపలేదు. అపారమైనసంస్కృతపాండిత్యము, మేధాశక్తి, కార్యపరత్వము, ధైర్యోత్సాహములు, దేశభక్తి బాలగంగాధరతిలకునకు లోకమాన్య బిరుదమునుమహారాజాభిధానమునుగడించినవి. లోకమాన్యునకు దేశదాస్య విమోచనమునకు ప్రపంచప్రవృత్తికి పరిచితమైన రాజనమార్గ మనుష్ఠానయోగ్యము. గీతారహస్యమునందును లోకమాన్యుని వ్యాఖ్యానము లందును రాజనసాధన ప్రయోగము నిమిత్తముగ ను గ్రహింపబడినది. రాజనసాధనము ప్రపంచమునం దంతటను పరిపాటియైన సాధనంబైనను సర్వాంగములకును బంధనము లేర్పడిన భరతవర్షమునందు దాని సంస్మరణమె దండనార్హ మగుచున్నది. లోకమాన్యుడు స్వాతంత్ర్య సంస్మరణమున కనుభవించిన దుఃఖపరంపరలు భారతేతిహాసములందు రక్తాక్షరములలో లిఖింపబడినవి. లోకమాన్యుడు కర్మయోగి; మహాయోధుడు; మహాపండితుడు. భారతవీరులం దగ్రగణ్యుడై, స్వాతంత్ర్య సంరంభమునం దాత్మార్పణమును జేసి ధన్యతను గాంచెను.

*  *  *  *

అసహాయోద్యమపర్వము

లోకమాన్యుని నిర్యాణముతో నూతన పర్వమారంభమైనది. గాంధిమహాత్ముడు రంగమున ప్రవేశించి నూతనోత్సాహమును వికసింపజేసెను. గాంధి ప్రతిపాదించిన యసహాయోద్యమమును సార్థకముచేసిన వీరులందు దేశబంధు చిత్తరంజనదాసగ్రగణ్యుడు. దాసునందు ప్రాచ్య పాశ్చాత్య సంస్కారములు మేళగించినవి. చిత్తరంజనదాసు ఇంగ్లాండునందు న్యాయశాస్త్రము నభ్యసించి కలకత్తాయందున్యాయవాదివృత్తినిస్వీకరించి పేరుప్రతిష్ఠలను గడించెను. లక్షలకొలది ధనమునార్జించెను. మహాభోగము ననుభవించెను. స్వజాతీయవేషభాషాచారములనుమార్చెను. అమృతసరముకాంగ్రెసునకు పూర్వమున నయితము చిత్తరంజనుని వేషభాషాస్వరూపములు పాశ్చాత్య సంస్కార వ్యామోహమును బ్రకటించినను హృదయము మాత్రము గాఢమైన ప్రాచ్యసంస్కారమును విశదము చేయుచుండెను. చిత్తరంజనదాసునందు ప్రజ్ఞాప్రేమలు, భోగత్యాగములు,ధృత్యుత్సాహములు సమ్మేళనమును బొందినవి. దృఢసంకల్పము ఉదారస్వభావము సంభావనాశక్తి దాసుజీవితవిజయమునకు గారణములు. దాసు స్వశక్తియందును దేశమునందును దైవమునందును పూర్ణమైనవిశ్వాసమును గలిగియుండెను. పరాజయము భయసంభ్రమములకు గారణము గాకుండెను. అసహాయోద్యమము దాసు శీలమును వ్యక్తముచేయుట కవకాశములను గలుగజేసినది. అసహాయోద్యమవీరులందు చిత్తరంజనదాసగ్రగణ్యుడై ప్రజాదరమును బడసెను.

*  *  *  *

స్వీయాచరణము

అసహాయోద్యమవిధానమును చిత్తరంజను దాసు స్వయముగ నాచరించి గాంధిమహాత్మునకు మాననీయుడై స్వరాజ్యకాములకు స్వధర్మారాధనమును ప్రత్యక్షముచేసి ధన్యవాదములను బడయగలిగెను. న్యాయవాదివృత్తిని విసర్జించి నిరాడంబరజీవనమును స్వీకరించెను. సుందరములైన దుస్తులను విసర్జించి ఖద్దరు దుస్తులను స్వీకరించెను. భార్యాపుత్ర సహితముగను శ్రీకృష్ణజన్మస్థానవాసమును స్వీకరించెను. వేలకొలదివిద్యార్థులు విద్యాలయములను విసర్జించునటులుచేసి దేశమునందు దిగ్భ్రమను గలుగజేసెను. మాతృదేశక్షేమమునకు భాగ్యభోగములను విసర్జించి దారిద్ర్య వైరాగ్యములను స్వీకరించి స్వరాజ్యసంపాదన విధానమును నాయకులకు ప్రజలకు ప్రత్యక్షముచేసి చరితార్థుడయ్యెను. స్వరాజ్య సంపాదనమునకు సంపన్నత్వమును పరిత్యజించి సన్న్యసిత్వమును స్వీకరించిన మహనీయుడు సకల జనులకును పూజ్యుడుగదా !

* * * *

స్వరాజ్యపక్షము

స్వరాజ్యపక్షనాయకత్వము దేశబంధు దాసు ప్రతిభను ద్విగుణీకృతము చేసినది, గాంధిమహాత్మునకు, విద్యావంతులు తన సాధనములందు విశ్వాసమును జూపలేదను భావములను స్వరాజ్యపక్షము రుజువు చేయుచున్నది. ఢిల్లీలో గూడిన కాంగ్రెసుకమిటీ సమావేశమీభావమును వ్యక్తము చేసినది. మూన్జి, అభ్యంకరు, మెహత, కేల్కారు, జయకరు, గారు మొదలగువారు ధ్వజమెత్తి ప్రతిఘటనమును బయలుదీసిరి. ఆ ప్రతిఘటనమే స్వరాజ్యపక్ష స్వరూపమును దాల్చిన విధమును గతించిన రెండువర్షముల చరిత్రమును విశదము చేసినది. సప్రు శాస్త్రి చింతామణిగారులు మొదలగువారు గాంధిమహాత్ము డుపక్రమించిన యసహాయోద్యమ సిద్ధాంతమునే ప్రతిఘటించిరి. మూన్జీవర్గ మసహాయోద్యమ సాధనము నంగీకరించుచుగాంధి ప్రణాళికకు ప్రతిఘటనమును జూపెను. కాంగ్రెసునందు జేరిన విద్యావంతులయందును మహాత్మునకు ప్రతిఘటనపక్షము గలదని కాంగ్రెసువ్యవహారములు విశదము చేసినవి. ఈ పక్షమువారి ప్రతిఘటనమును సంఘటనమును జేయుటయందే గాంధిదాసుల యొడంబడిక యుపయోగపడినది. కాంగ్రెసునందుగల విద్యావంతుల నాయకత్వము స్వరాజ్యపక్ష నాయకత్వముగను బరిణమించినది. స్వరాజ్యపక్షమునకును కాంగ్రెసునకును దాసు పాశబంధముగ నేర్పడి తననాయకత్వప్రభావమును విశదముచేసెను. స్వరాజ్యపక్షనాయకత్వము దేశబంధుదాసు ప్రతిభను వృద్ధిచేసినవి. గాంధిమహాత్మునకు దేశబంధు దాసుపట్ల గల విశ్వాసము వృద్ధియైనది. మహాత్ముడు కోరిన నూలుచందా నిర్ణయమునకు దేశబంధుదా సభయహస్తమొసంగి కాంగ్రెసు ప్రతిష్ఠను గాపాడెను. అసహాయోద్యమమునకు మూలాధారమైన అహింసాధర్మమునందు దేశబంధునకు విశ్వాసముగలదని మహాత్ముడు గ్రహించెను. అహింసాధర్మాంగీకారమునూలు చందా, త్యాగమార్గము గాంధిదాసుల హృద

యానురాగమును బలపరచి స్వరాజ్యపక్షమునకును కాంగ్రెసునకును బలమును గలుగజేసినవి. దేశబంధు దాసుమరణము స్వరాజ్య ప్రణాళిక యందును కాంగ్రెసు విధానమునందును నేమి మార్పులను గలుగజేయనున్నదియును కాలము విశదముచేయగలదు. గాంధిమహాత్ముడు స్వరాజ్యపక్షమునకొసంగిన యభయహస్తము స్వరాజ్యపక్షక్షేమమును సూచించుచున్నను స్వరాజ్యపక్షనిర్వాహకులు దేశబంధుదాసు మహాత్మాగాంధియెడం బడికను గారవించి, గతించిన నాయకుని గౌరవమును గాపాడుట భావ్యము.

* * * *

స్మారకచిహ్నములు

దేశబంధు చిత్తరంజనదాసుపట్ల ప్రజలకు గల భక్తివిశ్వాసములకు దేశమునందంతటను జరిపిన స్మారకసభలు నిదర్శనములు. ఉత్తర క్రియలను జరుపుటకు లక్షలమంది ప్రజలు శ్మశానమునకు జనుదెంచిరి. షోడశాహము దినమునను దేశమునందంతటను స్మారకసభలు గూడినవి. సభావేదికలనుండి దేశబంధుని త్యాగము, గుణశీలములు, స్వరాజ్యానుతాపము దిగంతములు నిండునటులు సంకీర్తనము చేయబడినది. ద్వాంద్వప్రభుత్వమును నాశనము చేయుటకు శపథము బూనిన దేశబంధు దాసు వంగరాష్ట్రమునందు ద్వంద్వప్రభుత్వోపసంహారమును జూచి ప్రాణములను విడిచెను. సంకల్పమును నెరవేర్చగలిగిన దేశబంధు దాసు ధన్యుడు. స్వరాజ్య సంపాదనార్థము ప్రాణమానధనములను సమర్పించిన దేశబంధుదాసు స్వరాజ్యపక్షమునకును సితర భారతీయులకును చిరసంస్మరణీయుడు.

కలకత్తా నగరమునందు పదిలక్షల రూప్యములను వసూలుచేసి స్త్రీల వైద్యాశ్రమ రూపమైన స్మారక చిహ్నమును నెలకొలుపుట కేర్పాటులు జరుగుచున్నది. ఆ స్మారక చిహ్నమునందు దాసు ధర్మములందు గల రూసావీధిలోని భవనమును జేర్చుట ప్రశంసా పాత్రముగ నున్నది. ఇంతవరకును నాగృహముమీదను గల యప్పును దీర్చి గృహమును స్త్రీల వైద్యాశ్రమమునుగను మార్చుట సమంజసముగ నున్నది. ఇంతవరకును రూ 2,50,000 వసూలైనవి. శేషించిన రూ 7,50,000లను గాంధి మహాత్ముడు కోరినటులు జులై 15 తేది లోపలను సమకూర్చి వంగదేశీయులు తమకు తమనాయకుని పట్లగలభక్తి విశ్వాసములను సార్థకముచేయుదురు గాత! అఖిల భారతీయ స్మారక చిహ్నమును స్థాపించుటకు సయితము యోచనలు జరుగుచున్నటులు మహాత్ముడు విశదముచేయుచున్నాడు. ఆస్మారక చిహ్నమేరూపమును దాల్చునదియును కాలము దెలుపగలదు. ఈస్మారక చిహ్నములు మాటలతోను తీర్మానములతోను ముగియకను గాంధి

మహాత్ముని పూనికవలనను కార్యరూపమునను బరిణమించుటకు భగవదనుగ్రహముగలుగు గాక!

స్వరాజ్య సంరంభమునం దాత్మసమర్పణము చేసిన దేశబంధు దాసునకు స్వరాజ్యస్థాపనము సంతృప్తిని గలుగజేసినటులు మందిరాదులు సంతృప్తిని గలుగ జేయజాలవు. స్వరాజ్యస్థాపనమూలముననే దేశబంధుదాసునకును భారతజాతికిని నాత్మశాంతి గలుగగలదు. నిర్జీవమైన స్మారకచిహ్నములు కాలక్రమమునను శిథిలమైనను సజీవమైన స్మారకచిహ్నము శిథిలముగాకను విశ్వవ్యాపకమును గాంచగలదు. దేశబంధుదాసు పండిత మోతీలాలు నెహ్రూగారికి వ్రాసిన కడపటి లేఖయందు దేశమునకు కష్టకాల మాసన్నమైయున్నదనియును ప్రతిఘటనమునకు గట్టి ప్రయత్నములు జరుగవలయుననియును దెలియజేసెను. బర్కెనుహెడు ప్రభువుయొక్క ప్రసంగములు భారతపాశబంధములు దృఢతమములుగా నున్నవిధమును సూచించుచున్నవి. ప్రజలందరును భేదభావములను మరచి స్వరాజ్యసిద్ధికి కలిసి పనిచేయుటయే దేశబంధు దాసుగారి యంత్యసందేశమునకు ప్రయోజనము. దాసుగారి ప్రియతమమైన వాంఛను సఫలము చేయుటయే వారికి తగిన స్మారకచిహ్నము. చిత్తరంజనదాసుగారి జీవితాశయమును సఫలము చేయుటకు ప్రజలు యావచ్ఛక్తిని వినియోగించి దాసుగారి యాత్మకు శాంతిని గలుగజేసి ఋణవిముక్తులై స్వధర్మనిర్వహణమును జేసి కృతార్థులగుదురుగాత! భారతహృదయమునందు దేశబంధు చిత్తరంజన దాసుగారి నిర్యాణము ప్రతిధ్వనింపజేసిన త్యాగ దయాది శీలములు సుస్థాపితములై భారతస్వారాజ్యస్థాపనమునకు వినియోగపడి దేశబంధు చిత్తరంజన దాసుగారి యాత్మార్పణమున కన్వర్థమైనసంస్మరణచిహ్నము స్థాపితమగుటకు భగవంతు డనుగ్రహించుగాత!




Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thambu Chetty Street, G. T. Madras.